ఆయుర్వేదశిక్ష చతుర్థ స్కంధము

# 3

# వనౌషధ విజ్ఞానము

## రెండవ భాగము

---



సంపాదకులు:
ఆయుర్వేదోద్ధారక:
డా॥ భిషగ్రత్న, ఆచంట లక్ష్మీపతిగారు,
బి. ఏ., యం. బి., & సి. యం.,
బెజవాడ.

1945

ముద్రణము:
శ్రీ ధన్వంతరీ ముద్రాక్షరశాల,
ఆయుర్వేదోద్ధారక:
డా॥ భిషగ్రత్న, ఆచంట లక్ష్మీపతిగారు,
బి. ఏ., యం. బి., & సి. యం.,
బెజవాడ.

గ్రంథములకు:
సంపాదకుల పేర — సర్కసు మైదానము,
గవర్నరుపేట, బెజవాడకు వ్రాయవలెను.

చందాదార్లకు రు. 5—0—0
పోస్టేజీ సహా.

ఇతరులకు రు. 6—4—0
పోస్టేజి గాక.

వనౌషధి విజ్ఞానము

ద్వితీయ భాగము

# సంపాదకీయ ప్రస్తావన

---

మొదటిభాగమున 74 ఓషధులు మాత్రమే వివరింపబడినవి. ఈభాగమున ముఖ్యముగా నుపయోగింపబడు ఓషధులు 83 చక్రమర్దము మొదలు, మూలకము వరకును వివరింపబడినవి. ఇదిగూడ చందాదారుల సౌకర్యార్థమై రమారమి500 పుటల గ్రంథము కాగానే ఒక సంపుటముగా జేసి ప్రచురించి మీ కందజేయుచున్నాము. ఇందలి విషయ విపులీకరణాదులు గ్రంథకర్త గారగు 'శ్రీఆయుర్వేదాచార్య' ఇాదగ్రంటి వెంకటేశ్వరశర్మగారి యమూల్య కృషిని జ్ఞప్తికి దెచ్చు చున్నవి. వారికి మే మెంతయు కృతజ్ఞులము. ఇందును నా స్వానుభవము వచ్చటచ్చట పొందుపరచి యున్నాను. మిగత ఓషధులతోను, అనుబంధ యోగాదులతోడను, మూడవభాగముగూడ తమకు త్వరలో అందజేయబడును.

ఆయుర్వేద వైద్యులును, ఆయుర్వేదాభిమానులును, పూర్వము వలెనే ఈ గ్రంథము నాదరించి మమ్ము కృతార్థుల చేయుదురుగాక!

ఆయుర్వేదశిక్షా కార్యాలయం,
వర్తమ మైదానము.
గవర్నరు పేట, బెజవాడ.
10—12—45.

ఆయుర్వేదోద్ధారక : భిషగ్రత్న,
డా॥ ఆచంట లక్ష్మీపతి,
బి, ఏ., యం.బి., సి. యం.,
సంపాదకులు.

# విషయసూచిక

## ఆయుర్వేదశిక్ష—ఔషధస్థానము

## వనౌషధవిజ్ఞానము

## ద్వితీయ భాగము

విషయసూచిక సమాప్తము.

వనౌషధ విజ్ఞానమునం దుదహరింపబడిన

# గ్రంథముల పేర్లు - వాని సంకేతములు

---

శివదత్తనిఘంటు. ... ... శి.ద.
ధన్వంతరినిఘంటు. ... ... ధ.ని.
నిఘంటురత్నాకరము. ... ... ని.ర.
చరకసంహిత. ... ... చ.
వైద్యకనిఘంటు. ... ... వై.ని.
సుశ్రుతసంహిత. ... ... సు.
వాగ్భటము. ... ... వా.
భావప్రకాశ. ... ... భా.ప్ర.
చక్రదత్త. ... ... చ.ద.
గదనిగ్రహము. ... ... గ.ని.
రసరత్నాకరము. ... ... ర.ర.
బసవరాజీయము. ... ... బ.రా.
రాజనిఘంటు. ... ... రా.ని.
రాజవల్లభనిఘంటు. ... ... రా.వ.
సర్వౌషధిగుణకల్పము. ... ... స.గు.క.
హారీతసంహిత. ... ... హా.సం.
మదనపాలనిఘంటు. ... ... మ.ని.
వైద్యచింతామణి. ... ... వై.చిం.
శాలిగ్రామనిఘంటు. ... ... శా.ని.
సోఢలనిఘంటు. ... ... సో.ని.
హారీతసంహిత. ... ... హా.
బృందమాధవము. ... ... బృంద.
వైద్యమనోరమ. ... ... వై.మ.
నాడీకౌముది. ... ... నా.కౌ.
వంగసేన. ... ... వం.సే.

| | | |
|---|---|---|
| ఆత్రేయసంహిత. | ... ... | ఆ_సం. |
| భైషజ్యరత్నావళి. | ... ... | భైషజ్య. |
| శార్ఙ్గధరసంహిత. | ... ... | శార్ఙ్గ. |
| శార్ఙ్గధరసంహిత. | ... ... | శా_సం. |
| వస్తుగుణప్రదీపిక. | ... ... | వ_ప్ర. |
| క్షేమకుతూహలము. | ... ... | క్షే_కు. |
| రసేంద్రసారసంగ్రహము. | ... ... | ర_సా_సం. |
| సిద్ధయోగము. | ... ... | సి_యో. |
| ద్రవ్యగుణసంగ్రహము. | ... ... | ద్ర_గు. |
| బృందమాధవము. | ... ... | బృం. |
| రాజమార్తాండము. | ... ... | రా_మా. |
| రసరత్నాకరము. | ... ... | ర_రత్నాకర. |
| వైద్యకశబ్దసింధు. | ... ... | వై_శ_సం. |
| వనౌషధిచంద్రిక. | ... ... | వన_చ_చం. |
| నిఘంటుఆదర్శము. | ... ... | ని_ఆదర్శ. |
| వైద్యకశబ్దసింధు. | ... ... | వై_శ. |
| వైద్యామృతము. | ... ... | వై_అమృత. |
| శార్ఙ్గధరసంహిత. | ... ... | శా_ధ_సం. |
| బృహన్నిఘంటురత్నాకరము. | ... ... | బృ_ని_ర. |
| నిఘంటుఆదర్శము. | ... ... | ని_ఆ. |
| పరీక్షా పాప్రదీపిక. | ... ... | ప_ప్ర. |

# ఆయుర్వేద శిక్ష

## (A Text-book of Ayurveda)

తృతీయ సంపుటము

ఔషధస్థానము

---

## 3 వ భాగము

వనౌషధ విజ్ఞానము

---

## 75

## చక్రమర్దః – తగిరిశ చెట్టు

---

భాషాంతర నామములు

హిందీ - చకవడ్, పమాడ్, (ర్) పవాండ, మరాటి టాపిలా, టాకళా, తఖిటా, గుజరాతి - కువాడియో, కుంవాడీయా, మలయాళము - తకరం, కర్ణాటకము - తగరం, ద్రావిడము - గిలుగిలుప్పై.

నైసర్గిక స్వరూప వర్ణనము

Natural Order — Leguminosae

చిక్కుడు కుటుంబము

(23 వ పుట చూడుము).

## పర్యాయ పదములు

శ్లో॥ చక్రమర్దః ప్రపున్నాటో దద్రుఘ్నో మేషలోచనః ।
పద్మాటః స్యాదేడగజః చక్రీ ప్రపున్నాట ఇత్యపి ॥

చక్రమర్దము, ప్రపున్నాట(డ)ము, దద్రుఘ్నము, మేషలోచనము, పద్మాటము, ఏడగజము, చక్రి, పున్నాటము, అనునవి చక్రమర్ద నామములు.

## చక్రమర్ద గుణములు

శ్లో॥ చక్రమర్దో లఘుః స్వాదూ రూక్షః పిత్తానిలాపహః ।
హృద్యో హిమః కఫశ్వాసకుష్ఠ దద్రుకృమీన్ హరేత్ ॥

తగిరిశ చెట్టు మధురరసమును, లఘురూక్షగుణములను, శీతవీర్యమును గలిగి యుండును. హృదయమునకు హితమైనది. వాతపిత్తములను శమింపజేయును. కఫవికారములు, శ్వాస, కుష్ఠము, దద్రుకుష్ఠము, క్రిములు వీనిని బోగొట్టును.

## చక్రమర్దఫల గుణములు

శ్లో॥ హంత్యుష్ణం తత్ఫలం కుష్ఠకండూ దద్రువిషానిలాన్ ।
గుల్మకాస కృమిశ్వాసనాశనం కటుకం స్మృతం ॥

తగిరిశ కాయ కటురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. వాతమును శమింపజేయును కుష్ఠము, కండు, దద్రువు, విషము, గుల్మము, కాస, క్రిములు, శ్వాస, అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:— మేషలోచనము, చక్రి.

(ఖ) గుణబోధకములు:— చక్రమర్దము, దద్రుఘ్నము.

(2) శబ్దార్థములు:—

మేషలోచనము - మేకకండ్లవంటి పువ్వులను గలది. చక్రి - చక్రమువలె గుండ్రముగ నుండు బీజములను గలది. చక్రమర్దము - దద్రుఘ్నము - దద్రు(గుండ్రముగనుండు) కుష్ఠమును బోగొట్టునది.

(3) పరిచయబోధకలక్షణము:—

"చక్రమర్దః శింబిఫలః పీతపుష్పో ఽడగుల్మకః ।
వర్షాభవః పంక్తిపత్రో దద్రుఘ్నోఽతి ప్రకీర్తితః" ॥

తగిరిశచెట్టు వర్షాకాలమునం దుత్పన్నమగును. ఇది పొదవలె గుబురుగా బెరుగును. దీని యాకులు పంక్తివలె వరుసగా నుండును. పుష్పములు పసపువర్ణము గలిగి యుండును. కాయలు పొట్టుతో గూడిన బీజములను గలిగి యుండును ఇది "దద్రుఘ్నము" (దద్రుకుష్ఠమును బోగొట్టునది) అని వ్యవహరింప బడును. (శ-ద.)

(4) విశేషగుణములు:—

(క) కటురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. శరీరమునకు కాంతిని సౌకుమార్యమును గలిగించును. (ధ-ని.) మేదోవృద్ధిని, వ్రణమును బోగొట్టును. (రా-ని.) తిక్తానురసమును గలిగి యుండును. కాసనుబోగొట్టును. శ్లే-కు. వాతమును, పిత్తమును వృద్ధి బొందించును. (చ)

(ఖ) బీజ - వాతరక్తమును బోగొట్టును. (ధ-ని.)

(గ) పత్రి - ఆమ్లరసమును, లఘుగుణమును గలిగి యుండును. వాతకఫములను శమింపజేయును. కండు, కాసము- క్రిములు, శ్వాస, దద్రుకుష్ఠమును బోగొట్టును. (భా-ప్ర.) రూక్షగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. వాతపిత్తములను ప్రకోపింపజేయును. (సుశ్రుత.)

(5) ప్రయోగములు:—

1 సిధ్మకుష్ఠమునందు చక్రమర్ద ప్రయోగము

"ఏడగజః సరరసో... సిధ్మకుష్ఠానాం కాంజికయుక్తం ।
తు పృథక్ మతమిదముద్వర్తనం క్రమశోలేపః ॥"

సిధ్మకుష్ఠమునందు చక్రమర్దబీజములను, తెల్లగుగ్గిలమును ప్రత్యేకముగ చూర్ణించి కాంజికముతో జేర్చి ఉద్వర్తనమునకును, ఆలేపనములకును ఉపయోగించిన శమించును. (చ-చి-అ-7.)

2. శిరోరోగమునందు చక్రమర్ద ప్రయోగము.

"లేపేతు ప్రపున్నాటో ऽమ్లకల్కితః ॥"

తగిరిశవిత్తులను ఆమ్లరస (జంబీరాదిరస)ముతో నూరి కల్కముజేసి శిరస్సుకు లేపనము జేసిన శిరశ్శూల శమించును. (వా-ఉ-అ-24.)

3. ముఖప్రసవార్థము చక్రమర్ద ప్రయోగము.

"ప్రపున్నాటశిఫాగాఢం ఘ్రాణ్నా యోనౌ స్పృశాథవేత్ ।
ముఖినూతిడా ॥"

తగిరిశవేరును బాగుగా నలియఁగొట్టి యోనియం దుంచిన గర్భిణి సుఖముగా ప్రసవించును. (వై_మ.)

4. గండమాలయందు చక్రిమర్ద ప్రయోగము.

"చక్రిమర్దకమూలస్య కల్కం కృత్వా విపాచయేత్ ।
కేశరాజరసే తైలం కటుకం మృదునాగ్నినా ॥
పక్వావశేషే వినిక్షిప్య సిందూరమవతారయేత్ ।
ఏతత్తైలం నిహంత్యాశు గండమాలాంసుదారుణాం ॥"

తగిరిశమూలకల్కము, గుంటకలగరరసము, ఆవనూనె వీని నొకటిగ చేర్చి మృద్వగ్నితో పాకముజేసి వడియఁగట్టి అందు గంగసిందూరమును జేర్చి బాగుగా గలియఁబెట్టి గండమాలకు లేపనము జేసిన శీఘ్రముగ శమించును. (వం_సే.)

5. దద్రుకుష్ఠమునందు చక్రిమర్ద ప్రయోగము.

"చక్రిమర్దక బీజంచ మూలకాంబు ప్రపేషితం ।
దద్రుఘ్నం లేపనం కుర్యాత్ ॥"

తగిరిశవిత్తులను ముల్లంగిదుంపల రసముతో మెత్తగా నూరి లేపనము జేసిన దద్రుకుష్ఠము శమించును. (వం_సే.)

(6) యోగములు:—

1. చక్రిమర్దాదిలేపము - గ_ని_కుష్ఠ.

ఉపయోగములు:—లేపనము జేసిన కిటిభాదికుష్ఠములు శమించును.

(7) Actions and uses:—It has a great effect as an alterative in all kinds of skin diseases accompanied with induration as leprosy, cheloid, psoriasis etc. The juice of the leaves is applied to relieve cutaneous in flammation caused by Bhilamo. The seeds mixed with Karania (Pongamia glabra) tela are used locally as an application for ring worm. With sour milk it is used externally in eczema. A paste of the root with lime juice is used for ring worm, also for buboes in plague. The decoction of the leaves is aperient and given to children during teething. Locally they are used as a poultice over the boils, to hasten suppuration. Lately the seeds have been used as a substitute for coffee. R. N. Khory II. p. 202.

# 76

# చందనం—మంచిగంధపుచెట్టు (తెల్లనిది)-(క)

---

### భాషాంతర నామములు

హిందీ - చందన్, మరాఠీ - చందన, గుజరాతీ - సుఖడ, మలయాళం - చందనం, కర్ణాటకం - చందన, ద్రావిడం - చందనం.

### నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Santalaceae

మంచిగంధం కుటుంబము

మంచిగంధపుచెట్టు - **Santalum album (Eng. Sandalwood)**

ఈ కుటుంబములో చెట్లు గుబురు మొక్కలును గలవు. ఆకులు ఒంటరిచేరికగానైనను, అభిముఖ చేరికగానైననుండును. సమాంచలము కణుపుపుచ్ఛములుండవు. ఈనెలు పెద్దవిగావు. కొన్నిటి ఆకులు చిన్నవిగా పొలుసులవలెనే యుండును. కొన్నిటికి లేనేలేవు. పువ్వులు చిన్నవి. ఆకుపచ్చగానుండును. సరాళము. పుష్పనిచోళము కొన్నిటిలో ఉచ్ఛముగను కొన్నిటిలో నీచముగనున్నది. మిథున పుష్పములు ఏకలింగ పుష్పములుగూడ గలుగుచున్నవి. పుష్పనిచోళపు తమ్మెల చివరనున్నని ముల్లువంటి దొకటిగలదు. కింజల్కములు 3-6. పుష్పనిచోళము నంటికొని దానితమ్మెలకెదురుగా నుండును. పుష్పకిత్తులు రెండుగదులు. అండాశయములో నండములు రెండో మూడో వ్రేలాడుచుండును. కాయ కొన్నిటిలో పెంకుకాయ, మఱికొన్నిటిలో బిగులని యెండుకాయ.

### పర్యాయ పదములు

శ్లో॥ శ్రీఖండం చందనం నస్త్రీ భద్రశ్రీ స్తైలపర్ణికః।

గంధసారో మలయజస్తథా చంద్రద్యుతిశ్చసః॥

శ్రీఖండము, చందనము, భద్రశ్రీ, తైలపర్ణికము, గంధసారము, మలయజము, చంద్రద్యుతి అనునవి చందననామములు.

### చందన గుణములు

శ్లో॥ చందనం శీతలం రూక్షం తిక్తమాహ్లాదనం లఘు।

శ్రమశోష విషశ్లేష్మ తృష్ణా పిత్తాస్ర దాహనుత్ ॥

తెల్లగంధపుచెట్టు తిక్తరసమును, రూక్షలఘుగుణములను, శీతవీర్యమును గలిగి యుండును. మనస్సున కాహ్లాదమును గలిగించును. శ్లేష్మమును

శమింపజేయును. శ్రమను దొలగించును. శోష, విషము, తృష్ణ, రక్తపిత్తము, దాహము అను నీ వ్యాధులను బోగొట్టును.

### హరిచందనం – హరిచందనము (ఖ)

శ్లో॥ కాలీయకంతు కాలీయం పీతాభం హరిచందనం।
హరిప్రియం కాలసారం తథా కాలానుసార్యకం ॥

కాలీయకము, కాలీయము, పీతాభము, హరిచందనము, హరిప్రియము, కాలసారము, కాలానుసార్యకము అనునవి హరిచందన నామములు.

### హరిచందన గుణములు

శ్లో॥ కాలీయకం రక్తగుణం విశేషాద్వ్యంగనాశనం ॥

హరిచందనము (పసుందుచెప్పనోవు) రక్తచందనగుణములను కలిగి యుండును. విశేషముగ వ్యంగమును బోగొట్టును.

### రక్తచందనం – ఎర్రచందనము (గ)

హిందీ - లాలచందన, మరాఠీ - రక్తచందన, గుజరాతీ - రతాంజలీ, మలయాలం - చందనం, కర్ణాటకం - చందన, ద్రావిడం - చందనం.

శ్లో॥ రక్తచందనమాఖ్యాతం రక్తాంగం క్షుద్రచందనం।
తిలపర్ణం రక్తసారం తత్ప్రవాళఫలం స్మృతం ॥

రక్తచందనము, రక్తాంగము, క్షుద్రచందనము, తిలపర్ణము, రక్తసారము, ప్రవాళఫలము, అనునవి రక్తచందన నామములు.

### రక్తచందన గుణములు

శ్లో॥ రక్తం శీతం గురుస్స్వాదు ఛర్ది తృష్ణా స్రపిత్తహృత్।
తిక్తం నేత్రహితం వృష్యం జ్వరవ్రణ విషాపహం ॥

రక్తచందనము మధురరసమును, తిక్తానురసమును, గురుగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. నేత్రములకు హితమైనది. శుక్రమును వృద్ధి బొందించును. ఛర్ది, తృష్ణ, రక్తపిత్తము, జ్వరము, వ్రణము, విషము అను వ్యాధులను బోగొట్టును.

### పత్త్రాంగం (పతంగం) - చందనభేదము (ఘ)

శ్లో॥ పత్త్రాంగం రక్తసారంచ సురంగం రంజనం తథా।
పటరంజక మాఖ్యాతం పత్తూరంచ కుచందనం ॥

పత్తంగము, రక్తసారము, సురంగము, రంజనము, పటురంజకము, పత్త్రారము, కుచందనము అనునవి పత్తంగనామములు.

## పత్తంగగుణములు

శ్లో॥ పత్తంగం మధురం శీతం శ్లేష్మ పిత్త వ్రణాసృజిత్ ।
హరిచందన వద్వేద్యం విశేషా ద్దాహనాశనం ॥

పతంగమను చందనభేదము, మధురరసమును, శీతవీర్యమును గలిగి యుండును. పిత్తశ్లేష్మములను శమింపజేయును. వ్రణమును, రక్తదోషమును పోగొట్టును. విశేషముగ దాహమును పోగొట్టును. మరియు హరిచందన గుణములను గలిగి యుండును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(చందన)-తైలపర్ణికము, గంధసారము, చంద్రద్యుతి, (శ్వేతచందనం - సుగంధము, సర్పావాసము,) (హరిచందన) - పీతాభము, హరిచందనము, (మాధవప్రియము, పీతకాష్ఠము, కాలసారము, మహాగంధము). (రక్తచందనం) - రక్తచందనము, రక్తాంగము, తిలపర్ణము, రక్తసారము, ప్రవాలఫలము, (పత్రాంగము, తామ్రవృక్షము, రక్తబీజము, అర్క-చందనము), (పతంగ) సురంగము, రక్తసారము, రంజనము, పటురంజకము, (రక్తకాష్ఠము, పత్రాఢ్యము, రంగకాష్ఠము.)

(ఖ) ఉత్పత్తిబోధకములు:—(చందన) - తైలపర్ణికము, మలయజము, (గోశీర్షము). (రక్తచందన) - తిలపర్ణము, (తిలపర్ణిక). (హరిచందన)-(మలయోత్థము, దివ్యము, దివిజము, నందనజము).

(గ) గుణబోధకములు:—(చందన) - చందనము, (సుగంధము, శీతలము). (రక్తచందన) - క్షుద్రచందనము. (పతంగ) - కుచందనము.

(2) శబ్దార్థములు:—

తైలపర్ణికము - నువ్వు ఆకులవంటి యాకులను గలది. గంధసారము - తరిమిలించు సారముగలది. చంద్రద్యుతి - చంద్రునివంటి కాంతిగలది. శ్వేతచందనము - తెల్లగనుండు చందనము. సుగంధము - పరిమళించునది. సర్పావాసము - పాములకు నిలయముగా నుండునది. పీతాభము - పసుపుపచ్చని వర్ణము గలిగి యుండునది. హరిచందనము - ఇంద్రునిచే నుపయోగింపబడు

చందనము. మాధవప్రియము - విష్ణుమూర్తికి యిష్టమగునది. పీతకాష్ఠము - పచ్చని కర్రవలె నుండునది. కాలసారము - నల్లని చేవగలది మహాగంధము- శ్రేష్ఠమగు గంధముకలది. రక్తచందనము-రక్తాంగము-ఎర్రగనుండు చందనము. తిలపర్ణము - నువ్వుఆకులవంటి యాకులను గలది. రక్తసారము - ఎర్రనిసారము గలది. పత్రాంగము - మొదలు భాగమునుండి చివరవరకు ఆకులచే వ్యాప్తమై యుండునది. ప్రవాళఫలము - పగడములవంటి యెర్రని ఫలములను గలది. తామ్రవృక్షము - అర్కవృక్షము - రాగివలెను, బాలసూర్యునివలెను, ఎర్రగ నుండు వృక్షము. రక్తబీజము - ఎర్రని బీజములను గలది. సురంగము - రంజనము-ఎర్రని వర్ణమును గలిగించునది. ఎర్రని చేవగలది. పటరంజకము-వస్త్రమునకు ఎర్రని వర్ణమును గలిగించునది. రక్తకాష్ఠము - రంగకాష్ఠము-ఎర్రని కర్రవలె నుండునది. పత్రాఢ్యము - విశేషముగ నాకులచే వ్యాప్తమై యుండునది. - తైలపర్ణికము - తిలపర్ణము - తిలపర్ణిక - తిలపర్ణమనునది యొక్క యొడ్డున నుత్పన్నమగునది. మలయజము - మలయోత్థము - మలయపర్వతమునం దుత్పన్నమగునది. గోశీర్షము - గోశీర్షమను పర్వతమునం దుత్పన్నమగునది. దివ్యము - దివిజము - నందనజము - స్వర్గమునందలి నందనవనమునం దుత్పన్నమగునది. చందనము - మనస్సునకాహ్లాదమును గలిగించునది. సుగంధము - శరీరమునకు పరిమళమును గలిగించునది. శీతలము - స్పర్శకు చల్లగ నుండునది. శరీరమునకు చల్లదనమును గలిగించునది. శీతవీర్యమును గలిగి యుండునది. శ్వేతచందనము - సుచందనము - గుణములచే నితరచందనములందు తక్కువైనదిగా వ్యవహరింప బడునది.

(3) భేదములు:—

"శ్రీఖండం శంబరం పీతం పత్రాంగం రక్తచందనం।
బర్బరం హరిగంధంచ చందనం సప్తధాస్మృతం॥" (రా-ని.)

శ్రీఖండము (శ్వేత), శంబరము, పీతము, పతంగము (లేక) పత్రాంగము, రక్తచందనము, పర్వరము, (లేక) బర్బరము, హరిగంధము అని చందనమేడు విధములు. అందు,

శ్రీఖండము:—ఇది తిలపర్ణ (నువ్వుఆకులు) ములవంటి పర్ణములను, చంద్రునివంటి తెల్లని వర్ణమును, విశేషగంధమును గలిగి మలయపర్వతమునందును, గోశీర్ష పర్వతమునందును, తిలపర్ణీ నదీ ప్రాంతమునను ఉత్పన్నమగు చుండును. ఈ వృక్షము విశేషముగ సర్పంబు లాశ్రయించి యుండును

మరియు, నిది "వేట్టము, సుక్వడి" అని తిరిగి రెండు విధములుగా నుండునట్లు రాజనిఘంటుకారునిచే నిరూపింపబడి యిట్లు వర్ణింపబడినది.

"చందనం ద్వివిధం ప్రోక్తం వేట్టసుక్వడి సంజ్ఞకం।
వేట్టం తు సార్ద్రంవిచ్ఛేదం స్వయం శుష్కంతు సుక్వడి॥
మలయాద్రి సమీపస్థాః ప్రాప్తా వేట్టసంజ్ఞకాః।
తజ్జాతం చందనం యత్తువేట్ట వాచ్యం క్వచిన్మతే॥" (రా-ని.)

వేట్టమను శ్వేతచందన మెప్పుడును పచ్చిగనే యుండి పగుళ్లు గలిగి యుండును. సుక్వడియను చందనము తనంతటనే యెండిపోయినదిగ నుండును. ఇందు మొదటిది మలయపర్వతమునకు సమీపమున వేట్టములని వ్యవహరింప బడు పర్వతములం దుత్పన్నమగుటచే జేసి వేట్టచందనమని చెప్పబడుచుండును. రెండవదానికి "సుక్వడి" యను పేరెట్లు గలిగెనో దెలియకున్నది.

శంబరచందనము:—ఇది "కైరాతము, కైరాతకము, బహలగంధము, శైలగంధము, గంధకాష్ఠము" అని వ్యవహరింప బడుచున్నది. దీనిని బట్టి యీ చందనము విశేషగంధమును గలిగి కిరాతదేశములందలి పర్వతములం దుత్పన్నమగునట్లుగా దెలియగలదు

మరియు నిది కిరాతులచే విశేషముగ వాడబడుచుండునని గూడ గ్రహింపవచ్చును. ఇది కొద్దిగ పసుపుపచ్చని వర్ణము గలదియై కొంకణదేశము నందు వ్యవహారమును గలిగి యున్నట్లుగ వైద్యకశబ్ద సింధువునం దుదహరింప బడినది.

పీతచందనము:—ఇది "పీతగంధము, కాలీయము, పీతకాష్ఠము, మాధవప్రియము" అని వ్యవహరింప బడుచున్నది. దీనిని బట్టి ఇది పసుపు పచ్చగ నుండి నల్లనిచేవను గలిగి యున్నట్లును, విశేషముగ విష్ణుమూర్తికి విష్టముగ అనగా - పూజాదులందుపయోగింప బడునట్లును దెలియగలదు. ఇదియును బరిమళము గలిగి మలయ పర్వతమునందుత్పన్న మగుచుండును. ఇది ద్రావిడ దేశమునందు విశేషవ్యాప్తి గలిగియున్నట్లు వైద్యక శబ్దసింధువు నందుదహరింపబడినది.

రక్తచందనము - ఇది మంచిపరిమళమును, ఎర్రని చేవను గలిగియుండును. వస్త్రముల కెర్రని వర్ణమును గలిగించును. దీని ఫలములు పవడములవలె లేక లేజిగుళ్ళవలె నెర్రగనుండును. ఇది తిలపర్ణ నదీప్రాంతమున నుత్పన్నమై తిలపర్ణములవంటి వర్ణములను గలిగియుండును. ఇది "భాస్కరప్రియ" యని

చెప్పబడుటంజేసి సూర్యభగవానున కిష్టమైనదిగా గూడ దెలియగలదు. ఇందుచేతనే గాబోలు హిందువులు సూర్యభగవాను నర్చించునప్పుడు రక్తచందనమునే యుపయోగించుట వాడుకలోగలదు.

పతంగచందనము - ఇదిగూడ నెఱ్ఱగనేయుండును. ఈ వృక్షము విశేషముగ పత్రములచే వ్యాప్తమై యుండును. రక్తచందనమువలె నిదియు వస్త్రముల కెఱ్ఱని వర్ణమును గలిగించును.

హరిచందనము - ఇది పసపుపచ్చగ నుండును. హెచ్చుగ సుగంధమును గలిగి కొంకణ దేశమునందు ప్రచారమును గలిగియున్నట్లుగా వైద్యకశబ్దసింధువునందు జెప్పబడినది. మరియు నిది "ఇంద్ర చందనము' హరిచందనము, నందనజము" అని వ్యవహరింపబడుట వలన దీని యుత్పత్తి స్వర్గలోకమునందేగాని భూలోకమునందుండదని దెలియగలదు. ఇంతియేగాక, "పంచైతే దేవతరవః మందారః పారిజాతకః । సంతానః కల్పవృక్షశ్చ పుంసివా హరిచందనం ॥" యని యీ చందన వృక్షము నైదువిధములగు మందారాది దేవ వృక్షములలో నొకటిగా నమరసింహునిచే గూడ జెప్పబడినది. ఇందుచేతనే గాబోలు ధన్వంతరి నిఘంటుకారునిచే నిదిమానవ దుర్లభమని నిరూపింపబడియున్నట్లు దెలియగలదు.

బర్బరచందనము - ఇది సింధూత్తర దేశమునందుండు బర్బరనదియొక్క ప్రాంతమున పరిమళ శూన్యముగ తెల్లని వర్ణముగలిగి యుత్పన్నమగును. ఎరుపు, తెలుపుగలసిన మిశ్రవర్ణమును గలిగియుండునని వైద్యక శబ్దసింధువునందుదహరింపబడినది. మరియు, నిది "సురభి, సుగంధి"యని పరిమళముతో గూడియుండునట్లుగా వైద్య నిఘంటుకారునిచే నిరూపింపబడినది.

ఇటుల ధన్వంతరి రాజనిఘంట్వాదికారులచే చందన మేడువిధములుగా జెప్పబడినను భావమిశ్రునిచే శ్వేత - రక్త - హరిచందన - పత్రాంగములను నాలుగు భేదములే చెప్పబడినవి. ఒకవేళ నీ చతుర్విధ చందనములలో పైని నిరూపించిన సప్తవిధ చందనము లంతర్భూతములుగా నిరూపింపబడినవేమో? ఎలయనగా సామాన్యముగ మనకు శ్వేతరక్త పీతవర్ణములు గలిగి చందనము మూడు విధములుగా గానబడుచుండును. గ్రంధనిరూపిత చందన వర్ణములను బట్టి యాలోచింపగా నివిగూడ కొంచెము హెచ్చు తక్కువగా మొత్తముమీద పై వర్ణములకు సరిపోవుచునే యుండును. గుణములనుబట్టి జూచిన అందుగూడ విశేషభేదమున్నట్లు గానబడదు. ఎటులనగా "చందనా

నితు సర్వాణి సర్వాణి రసాదిభిః గంధేన తు విశేషోఽస్తి......॥" చందన సామాన్యమంతయు రసగుణ వీర్యాదులందు సమముగనే యుండును. కాని గంధము మాత్రము వేరు వేరుగ నుండును. అని భావమిశ్రుడును, "సర్వం స తిక్తం మధురం చందనం శిశిరం పరం॥" చందన జాతులన్నియు తిక్తరసమును, మధురాను రసమును, విశేషముగ శీతవీర్యమును గలిగియుండును అని ధన్వంతరి నిఘంటుకారుడును ఇటుల చందనజాతుల కన్యోన్యగుణ సమానత్వమును నిరూపించియున్నారు. ఇటుల జెప్పబడినను గంధమునందు భేద మున్నట్లుగనే యితర గుణములందు గూడ నొకింత భేదము లేకపోలేదు. కాని మొత్తముమీద చతుర్విధ చందనగుణములకును, వర్ణములకును మిగిలిన మూడు విధములగు చందనముల గుణవర్ణములకును వ్యత్యాసము లేదని సూక్ష్మముగ నాలోచించినచో దెలియగలదు. అనగా చతుర్విధచందన గుణవర్ణములు కొద్దిగ వేరు వేరుగ నుండుననియు, మిగిలినవాని గుణవర్ణములు పైవానితో సమాన ముగ నుండుననియును నిట దెలియవగినది. అందు,

| | | వర్ణము | గుణము |
|---|---|---|---|
| 1. | శ్వేతచందనము | శ్వేతము | తిక్త-మధురరసములు శీతవీర్యము |
| 2. | రక్తచందనము | రక్తము | తిక్త-మధురరసములు శీతవీర్యము |
| 3. | పతంగచందనము | రక్తము | మధుర-తిక్తరసములు శీతవీర్యము |
| 4. | హరిచందనము | పీతము | తిక్త-మధురరసములు శీతవీర్యము మరియురక్తచందనముతో సమముగ నుండును |
| 5. | పీతచందము | పీతము | తిక్తరసము-శీతవీర్యము |
| 6. | శింబగచందనము | ఈషత్పీతము | తిక్తరసము-శీతవీర్యము |
| 7. | బర్బరిచందనము | శ్వేతరక్తమిశ్రవర్ణము | తిక్తరసము. శీతవీర్యము మరియు రక్తచందనముతో సమముగ నుండును |

అయితే నిచటి హరిచందనము గుణవర్ణములచే నితర చందనములతో సమానముగ నున్నట్లు దోచుచున్నను ఇది ప్రత్యేకముగ భావమిశ్రునిచే వేరు భేదముగా నేల నిరూపింపబడిన దనగా, ఇది "దివ్యము, దివిజము, నందన జము" అని ధన్వంతరి నిఘంటుకారునిచే వర్ణింపబడి, మానవదుర్లభమని నిరూపింపబడుటం జేసియు, "పంచైతే దేవతరవః మందారః...హరిచందనం"

అని యమరసింహునిచే గూడ సిది దేవవృక్షములలో గణింపబడుటవలన పైన నిరూపితమగు మానవమర్గభమను విషయము స్పష్టమగుచుండుటంజేసియు నటుల భావమిడుండు దీని నొక ప్రత్యేక భేదముగా జెప్పి యుండవచ్చునని తెలియగలదు.

కావున యిటుల సూక్ష్మముగ నాలోచించినచో చందనజాతులు క్షేత్రభేదములను బట్టి యట్లు సప్తవిధములుగ నుండునట్లు దోచుచున్నను, వర గుణాదులను బట్టి మాత్రము నాలుగు విధములనియే జెప్పవచ్చును. ఇంతియే గాకుండ చికిత్సయందు శ్వేత-రక్తచందనములకే విశేష ప్రయోగము లుండుటయు, నితరముల కంతగా లేకపోవుటయు జూడ చందనభేదములు రెండై యుండునేమో యని గూడ దోపగలదు. ఇంకను విమర్శించిన గాని దీనిని సరిగా నిశ్చయించుటకు వీలుగాకున్నది

ఈ చందనజాతు లన్నియు వ్యవహారమునందు సామాన్యముగ మంగళ కార్యములలో నుపయోగింప బడుచుండును. అయితే నిందలి శ్వేతచందనము మాత్రము ఇతరములతో బాటు అట్టి కార్యములం దుపయోగింపబడుచున్నను అందు విశేషముగ పితృకార్యముల నుపయోగింపబడు చున్నది. ఇతర చందన ములు గూడ మంగళకార్యములకే గాని పితృకార్యములం దుపయోగింపబడుట గానరాదు. ఇటుల నుపయోగించుటలో గల వ్యవహారోద్దేశ్య మెట్టిదియో దెలియకున్నది.

ఇక నౌషధయోగములందు బైని జెప్పినట్లు ఇందలి శ్వేతరక్తచందనము లకే హెచ్చుగ బ్రయోగమున్నట్లు గానుపించును. మిగిలిన వేల గ్రహింపబ బడుట లేదో గూడ దెలియకున్నది. ఈ శ్వేత-రక్త చందనములలో గూడ రక్తచందనము కేవల కషాయ యోగములందును, శ్వేతచందనము మిగిలిన చూర్ణ లేహ్యాది యోగములందును గ్రహింపబడుచుండుట జూడ నిట్లు వైద్య సాంప్రదాయముగ దెలియగలదు. మరియు బజారులందు గూడ నీ శ్వేత-రక్తచందనములే విరివిగ గానుపించు చుండును. అందు శ్వేతము స్నిగ్ధము గను, పరిమళయుక్తముగను, కొద్దిగ నార్ద్రముగను నుండునది యొకటియు, రూక్షముగను శుష్కముగను నిర్గంధముగను నుండునది యొకటియు నిటుల రెండు విధములుగ గానబడుచుండును. ఇవి యొకవేళ రాజనిఘంటుకార నిరూపితములగు ద్వివిధము (వేట్ల-నుక్వడి) లగు శ్వేతచందనములై యుండునేమో యూహింపవలసి యున్నది. రక్తచందనము యెఱ్ఱని చేవరూపమున దొరకు

ముండును. కాని దీనికి గంధము మాత్రము గానుపించదు. గంధయుక్తమగు
ఎఱ్ఱని దారువు కూడ చందనమని యరుదుగ గానుపించుటయు కలదు.
కావున యోగములందు చేర్చునప్పుడు ఒకవేళ నిందలి రెండవది హెచ్చు
ఫలదు గలదనియు, బాహుళ్యముగ దొరకుచుండుటయును కాచి దీనికి బదు
లుగా మొదటిదానినే గ్రహించుచున్నారేమోయని యూహింపవలసి వచ్చు
చున్నది. కాని యిటుల నీ ద్వివిధ చందనము లనేక విధములుగా గానుపించు
చున్నను యోగము లందు చేర్చునప్పుడు మాత్రము ఆ యా యుత్తమాది
లక్షణములను బట్టి పరీక్షించి శ్రేష్ఠమగు వానినే గ్రహించిన మిగుల గుణ
దాయకములు కాగలవు.

(4) విశేషగుణములు:— గురుగుణమును కలిగి

(క) శ్రీఖండము - మధురాను రసమును,
యుండును. వెంటనే శుక్రమును గలిగించును. రక్తమును శుభ్రపరచును. క్రిము
లను పోగొట్టును. (ధ-ని.) కటుకషాయాను రసములను కలిగి యుండును.
వాంతిని, జ్వరమును, ముఖరోగములను పోగొట్టును. శరీరమునకు లేపనము
చేసుకొనిన కాంతిని, కామోద్రేకమును గలిగించును. (రా-ని.)

వేట్టచందనం (శ్రీఖండభేదము) - తిక్తరసమును, మిగుల శీతవీర్యమును
కలిగి యుండును. పిత్తమును శమింపజేయును. దాహము, జ్వరము, ఛర్ది,
మోహము, తృష్ణ, కుష్ఠము, తిమిరము, శ్వాస, రక్తదోషము వీనిని పోగొట్టును.

సుక్కడీచందనం (శ్రీఖండభేదము) - తిక్తరసమును, శీతవీర్యమును
కలిగి యుండును. మూత్రకృచ్ఛ్రమును, రక్తపిత్తమును, దాహమును
పోగొట్టును. (రా-ని.)

(ఖ) రక్తచందనము - అధికమగు పిత్తోద్రేకమును శమింపజేయును. నేత్రరోగ
రక్తదోషమును పోగొట్టును. (ధ-ని.) కఫమును శమింపజేయును.
మును, భూతవికారములను, భ్రమను, క్రిములను, కాసను పోగొట్టును. (రా-ని.)

(గ) పతంగచందనము - తిక్తానురసమును, మధురవిపాకమును కలిగి
యుండును. వ్రణరోపణము జేయును. (ధ-ని) కటురసమును, అమ్లానురస
మును, రూక్షగుణమును కలిగి యుండును. జ్వరమును, ఉన్మాదమును,
విస్ఫోటమును పోగొట్టును. (రా-ని.) మూత్రకృచ్ఛ్రమును, అశ్మరిని
పోగొట్టును. (ని-ర.)

(ఘ) హరిచందనము - పిత్తోద్రేకమును శమింపజేయును. దవథు, శ్రమ, శోష, మాంద్యము వీనిని బోగొట్టును. (ధ-ని.)

(చ) పీతచందనము - శీతవీర్యమును గలిగి యుండును. రక్తపిత్తమును బోగొట్టును. (ధ-ని.) తిక్తరసమును, శీతవీర్యమును గలిగి యుండును. కాంతిని గలిగించును. వాతశ్లేష్మములను శమింపజేయును. కుష్ఠము, కండు, విచర్చిక, దద్రు, క్రిములు వీనిని బోగొట్టును. (రా-ని.) విషమును బోగొట్టును. (ని-క.)

(ఛ) బర్బరచందనము - గురురూక్షగుణములను గలిగి యుండును. కఫమును శమింపజేయును. రక్తపిత్తమును, దాహమును, శ్రమములను బోగొట్టును. (ధ-ని.) తిక్తరసమును, శీతవీర్యమును గలిగి యుండును. త్రిదోషములను శమింపజేయును. కుష్ఠమును, కండువును, వ్రణమును బోగొట్టును. విశేషముగ రక్తదోషమును బోగొట్టును. (రా-ని.)

(జ) శంబరచందనము - తిక్తరసమును, శీతవీర్యమును గలిగియుండును. కాంతిని గలిగించును. కఫపిత్తములను శమింపజేయును. విచర్చిక, కుష్ఠము, కండు, దద్రు, విషము, రక్తపిత్తము, వ్యంగము, తృష్ణ, దాహము వీనిని బోగొట్టును. (కై-ని.)

(5) చందనములకు శ్రేష్ఠతాది లక్షణములు:—

(క) శ్వేత—

"స్వాదే తిక్తం కషే పీతం ఛేదే రక్తం తనౌ సితం।
గ్రంథికోటరసంయుక్తం చందనం శ్రేష్ఠముచ్యతే॥"

రుచియందు తిక్తరసమును, అరగదీసినప్పుడు పసుపుపచ్చని వర్ణమును, మధ్యమ గోసినపుడు రక్తవర్ణమును, పైని తెల్లని వర్ణమును, గ్రంథులను, కోటరము (తొర్రి)లను గలిగిన శ్వేతచందనము శ్రేష్ఠమైనదిగ నెంచబడును. (భా-ప్ర.) మరియు,

"శ్రేష్ఠం కోటరకర్పరోపకలితం సుగంధి సగౌరవం।
ఛేదే రక్తమయం తథా చ విమలం పీతం చ యద్ఘర్షణే॥
స్వాదుస్తిక్తకటుః సుగంధబహుళం శీతం యదల్పం గుణే।
క్షీణం చాగ్రగుణాన్వితంతు కథితం తచ్చందనం మధ్యమం॥"

విశేషముగ కోటరములను, గ్రంథులను, హృద్యగ బరువును, నరికినప్పుడు రక్తవర్ణమును, అరగదీసినప్పుడు పసుపుపచ్చని నిర్మలమగు వర్ణమును గలిగియుండిన శ్రేష్ఠమైనదిగను, స్వాదుతిక్త కటురసములను, శీతవీర్యమును,

విశేషగంధమును, గలిగి, ఇతరములగు గుణములను (కోటరాదులను) స్వల్పముగ గలిగియున్నయెడల హీనమైనదిగను, కోటరాదులను, తిక్తశీతాది గుణములను మధ్యమముగ గలిగ యున్నయెడల మధ్యమ మైనదిగను వ్యవహరింపబడును. (రా-ని.)

(ఖ) రక్త - "ఆకృష్ణముత్తమం నూనం రక్తం చేదం చ మధ్యమం, ఆరక్తమధమం విద్ధి రక్తచందనకం త్రిధా॥"

రక్తచందనము బాహ్యాభ్యంతరములందు నల్లని వర్ణమును గలిగియున్న నుత్తమమైనదిగను, కొద్దిగ, రక్తవర్ణము గూడ గలిసియున్నయెడల మధ్యమమైనదిగను, పూర్తిగ రక్తవర్ణమును గలిగియున్నయెడల నధమమైనదిగను వ్యవహరింపబడును. (భైషజ్యరత్నావళి.)

(6) శ్వేత చందనాధిక్యతా నిరూపణము:—

"చందనాంతు సర్వాణి సదృశాని రసాదిభిః ।
గంధేన తు విశేషోఽస్తి పూర్వం శ్రేష్ఠతమం గుణైః॥"

శ్వేతాదిచందనములెల్ల రసగుణాదులందు సమానముగనే యుండును. కాని పరిమళము మాత్రము భిన్నభిన్నముగ నుండును. ఇందు పరిమళము చేతను, గుణములచేతను శ్వేతచందనము ఉత్కృష్టమైనదిగ నొప్పుచుండును. (భా-ప్ర.)

(7) ప్రయోగములు:—

1. రక్తపిత్తమునందు చందన ప్రయోగము.

"ఉశీరకాలీయక...పృథక్ పృథక్ చందనతుల్యభాగికాః ।
సశర్కరా స్తండులధావనాప్లుతాః రక్తంసపిత్తం శమయంతిసద్యః॥"

వట్టివేరు మ్రానుపసపు మొదలగు ద్రవ్యములను చందనముతో సమముగ ప్రత్యేకముగ గ్రహించి మృదుచూర్ణముజేసి కొద్దిగ చక్కెర గలుపు కొని బియ్యపుకడుగుతో సేవించిన రక్తపిత్తము శీఘ్రముగ శమించును. (చ-చి-4 అ.)

2. రక్తార్శస్సులందు చందన ప్రయోగము.

"సనాగరశ్చందన రసస్స్యా॥"

చందనరసమునందు శుంఠి చూర్ణమును జేర్చి సేవించిన రక్తార్శస్సులందు రక్తము నిలుచును. (చ-చి-అ-9.)

3. హిక్కయందు చందన ప్రయోగము.

"పాయయేచ్చందనం వాపి నార్‌క్షీరేణ సంయుతం॥"

చందనమును స్తన్యముతో నూరి రసమును గ్రహించి నస్యముజేసిన హిక్క శమించును. (చ-చి-అ-21.)

4. వమనమునందు చందన ప్రయోగము.

"ధాత్రీరసేనో త్తమ చందనం వా॥"

చందనచూర్ణమును ఉసిరికపండ్లరసముతో సేవించిన వాంతులు శమించును. (చ-చి-అ-23.)

5. రక్తాతిసారమునందు చందన ప్రయోగము.

"పీత్వా సశర్కరా క్షౌద్రం చందనం తండులాంభసా।

దాహతృష్ణా ప్రమేహేభ్యో రక్తస్రావా ద్విముచ్యతే॥"

చందనచూర్ణమును చక్కెర, తేనె వీనితో గలిపి బియ్యపుకడుగుతో సేవించిన రక్తాతిసారము, దాహము, తృష్ణ, ప్రమేహము ఇవి శమించును. (చ-చి-అ-10.)

6. ప్రదరమునందు చందన ప్రయోగము.

"దుర్గంధి పూయ సంకాశే మజ్జతుల్యే తథా ర్దసే।

పిబేద్భద్రశ్రియః క్వాథం చందన క్వాథ మేవవా॥"

దుర్గంధము గలిగి పూయము, మజ్జ వీనితో సమానముగనుండు ప్రదరమునందు రక్తచందన కషాయమునుగాని, శ్వేతచందన కషాయమునుగాని సేవించిన శమించును. (సు-శా-అ-2.)

7. శుక్రమేహమునందు చందన ప్రయోగము.

"కకుభ చందన కషాయం వా॥"

మద్దిచెక్క, చందనము వీని కషాయమును సేవించిన శుక్రమేహము శమించును. (సు-చి-అ-11)

8. మంజిష్ఠామేహమునందు చందన ప్రయోగము.

"మంజిష్ఠామేహినం మంజిష్ఠా చందన కషాయం॥"

మంజిష్ఠ, చందనము వీని కషాయమును సేవించిన మంజిష్ఠామేహము శమించును. (సు-చి-అ-11.)

9. నేత్రరోగమునందు చందన ప్రయోగము.

"క్షీరం చందన సాధితం॥"

పిత్తోల్బణమగు నేత్రరోగమున చందనముతో గాచినపాలను సేవించిన శమించును. (వా-ఉ)

10. మూత్రాఘాతమునందు చందన ప్రయోగము.

"శృతశీతపయోన్నాశీ చందనంతండులాంబునా।
పిబేత్స శర్కరం శ్రీఘ్రముష్ణవాతే సశోణితే॥"

చందనచూర్ణమును చక్కెరతో జేర్చి బియ్యపుకడుగుతో పానము జేయుచు కాచి చల్లార్చిన పాలతో నాహారము సేవించుచుండిన రక్తముతో గూడిన యుష్ణవాతము శమించును. (భా-ప్ర-మూత్రాఘాత.)

11. మసూరికయందు చందన ప్రయోగము.

"శ్వేతచందన కల్కేన హిలమోచాభవం రసం।
పిబేన్మసూరికారంభే॥"

మసూరిక (మసూచిక) కలుగుటకు ముందుగ శ్వేతచందన కల్కముతో హిలమోచిక (బ్రాహ్మీభేద) రసముతో సేవించిన హితము. (వం-సే.)

12. బాలుర నాభిపాకమునందు చందన ప్రయోగము.

"నాభిపాకేఽవచూర్ణనం।
త్వక్చూర్ణైః క్షీరిణాం వాపికుర్యాచ్చందనరేణునా॥"

బాలురకు నాభిపుండైనప్పుడు క్షీరివృక్ష త్వక్చూర్ణముతో గాని, చందన చూర్ణముతో గాని యవచూర్ణనము జేసిన హితము. (వం-సే.)

13. రక్తప్రదరమునందు చందన ప్రయోగము.

"చందనం క్షీరసంయుక్తం పాయయేత్సఘృతం భిషక్।
శర్కరా మధుసంయుక్తం సృగ్దరవి మర్దనం॥"

చందనచూర్ణమును తేనె చక్కెర ఘృతములతో జేర్చి పాలతో సేవించిన అసృగ్దరము శమించును. (గ-ని.)

14. శీతపిత్తమునందు చందన ప్రయోగము.

"శీతపిత్త శమనాయ చందనం ఛిన్నరోహ రస పేషితం తథా॥"

చందనమును తిప్పతీగెరసముతో నూరి కల్కముజేసి సేవించిన శీత పిత్తము శమించును. (వై-మ.)

(8) యోగములు:—

1. మహాచందనాది తైలము - చ - జ్వర.

ఉపయోగములు:—అభ్యంగము జేసిన దాహముతో గూడిన జ్వరము శమించును.

2. చందనాది ఘృతము - వా - గ్రహణి. మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—పిత్తజగ్రహణి శమించును.

3. శ్రీ ఖండాసవము - భైషజ్య - మదాత్యయ. మాత్ర:-1 ఔన్సు.

ఉపయోగములు:—పానాత్యయము, పరమదము, పానవిభ్రమము ఇవి శమించును.

4. శ్రీ ఖండాదిచూర్ణము - భైషజ్య - తత్వోన్మాద. మాత్ర:-1 శాణము.

ఉపయోగములు:—తత్వోన్మాదము శమించును.

5. చందనాదిచూర్ణము - భైషజ్య - శుక్రమేహ. మాత్ర:-$\frac{1}{4}$ తులము.

ఉపయోగములు:—ప్రమేహము, శ్వాస, కాస, జీర్ణజ్వరము, అర్శస్సు, కామిల ఇవి శమించును.

6. చందనాసవము - భైషజ్య - శుక్రమేహ. మాత్ర:-1 ఔన్సు.

ఉపయోగములు:—శుక్రమేహము శమించును. అగ్నిదీపనము, బలము, పుష్టి యివి కలుగును. హృద్యము.

7. చందనాదితైలము - భైషజ్య - ధ్వజభంగ.

ఉపయోగములు:—అభ్యంగముచేసిన వాజీకరణమగును. వంధ్యాత్వము నశించును. రక్తపిత్తము, క్షయ, జ్వరము, దాహము, అతిస్వేదము, దౌర్గంధ్యము, కుష్ఠము, కండు ఇవి శమించును.

8. చందనాదివర్తి - భైషజ్య - నేత్రరోగ.

ఉపయోగములు:—అంజనము వేసిన తిమిరముపోవును.

9. చందనాదిచూర్ణము - భైషజ్య - ప్రదర. మాత్ర:-$\frac{1}{4}$ తులము.

ఉపయోగములు:—ప్రదరము, రక్తాతిసారము, రక్తార్శస్సు, రక్తపిత్తము ఇవి శమించును.

10 పత్రాంగాసవము - భైషజ్య - ప్రదర. మాత్ర:-1 ఔన్సు.

ఉపయోగములు:—ప్రదరము, జ్వరము, పాండు, శోఫ, అగ్నిమాంద్యము, అరోచకము ఇవి శమించును.

11. రక్తచందనాదివర్తి - గ - ని - నేత్రరోగ.

ఉపయోగములు:—అంజనము వేసిన నేత్రరోగములు శమించును.

12. చందనాదిలోహము - ర - సా - సం - జీర్ణజ్వర. మాత్ర:-10 యవలు.

ఉపయోగములు:-జీర్ణజ్వరము, సమస్త విషమజ్వరములును శమించును.

అశ్వగంధారిష్ట, అకారకరభాదివటి, అర్ధ్రఖాండావలేహ్యము, ఉశీరాదిక్వాథచూర్ణము, కర్పూరాదిచూర్ణము, జాతీఫలాదిచూర్ణము, (బృహత్) త్రిఫలాగుగ్గులు, దేవకుసుమరసాయనము, దాడిమాదిచూర్ణము, పిప్పల్యాసవము, భృంగామలక తైలము, శారిబాదిపానకము, శారిబాదిఆసవము.

(9) Actions and uses:—The wood is bitter, cooling, sedative and astringent. The oil is an astringent to the mucous membrane. It causes dryness in the fauces, great thirst, colicy pains and fulness in the loins; a paste of it is applied to the body in pains, in limbs during high fever: with rose water and camphor or with Sarcocolla, to the head in headache, to inflammatory swellings or to the skin in skin affections. The oil is astringent diuretic, expectorant and stimulant; given internally with cardamoms and bamboo-manna in gonorrhoea, bronchitis, in inflammation of the mucous membranes as cystitis, pyelitis and chronic diarrhoea. The seeds are used as pessaries by native women to procure abortion. (B. N. Khory).

## స్వానుభవము

[ చలువ జేయుటకును, మూత్రవాహి స్రోతస్సులలో దాహ ప్రశమనము గావించుటకును చందనమును హిందూ దేశస్థులు విశేషముగ నుపయోగింతురు. అనేక తైలములలోను చూర్ణములలోను ఇది చేర్చబడుచున్నది. దీనిని నీటితో జేర్చి ముద్దగ జేసి దానిలో 1/100 భాగము పచ్చకర్పూరమును జేర్చి దాహజ్వరములలో పట్టు వేసిన ఉష్ణమును, మంటలను హరించును. ముఖ్యముగా పిత్త జ్వరములలో చాల మంచిది. పెరుగు లేక మజ్జిగ లేక వెన్నతో దీనిని నూరి వ్రణములకు రాచవ్రణములకు మంచి పట్టు వేయవచ్చును.

సెగవ్యాధి. శ్వేతప్రదరము వీనిలో ఇది మిక్కిలి యుప యోగకరము. అగరువత్తులలోను స్నాన చూర్ణములలోను ఇది చేరుచున్నది. దీనిని నీటిలో ఊరవేయుగా నీటిపైన తేలిన తైలము చిరకాలమునుండి యున్న వ్రణములు సెగవ్యాధి, సవాయి వీనికి మిక్కిలి యుపయోగపడును. నీటిని జేర్చి పలు చగా జేసినది చిక్కని దానికంటె బాగుగా పనిజేయును. ఎండ కాలములో చెమటవలన ఒడలిపై గలుగు చిన్న పొక్కులకు (Prickly Heat) చందన తైలము 1 భాగము, కొబ్బరి నూనె 8 భాగములు కలిపి పూసినను, చందన గంధమును పచ్చకర్పూరము, గులాబీ పన్నీరు వీనితో జేర్చి పైనబూసినను హాయిని కలిగించి పొక్కులను పోగొట్టును. ఈ చందన తైల మును సెగవ్యాధిలో 5 చుక్కల మోతాదున పాలు,చక్కెర వీనితో జేర్చిగాని నేతితో జేర్చిగాని లోపలికిత్తురు.

రక్త స్రావమునందు చందనము, వట్టివేరు, మాని పసుపు, చక్కెర వీనిని కలిపి చూర్ణించి బియ్యపు కడుగుతో జేర్చి యిచ్చిన వెంటనే గుణమిచ్చును. ఎక్కిళ్ళలో చందన మును పాలతో జేర్చియిత్తురు. రక్త విరేచనములలో చంద నము, చక్కెర, తేనె ఇవి జేర్చి బియ్యపు కడుగుతో నీయ వచ్చును. ఆ. ల. ]

---

# 77

# చంపకః - సంపెంగ

---

## భాషాంతర నామములు

హిందీ - చంపా, మరాఠీ - సోనచాంపా, గుజరాతీ - రాయచంపో, పీలోచంపో, మలయాళం - చంపకం, కర్ణాటకం - సంపిగె, ద్రావిడం - శంపక.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Magnoliaceae

### చంపక కుటుంబము

### సంపెగ - Michelia Champaka

ఈ కుటుంబములోఁ జెట్లును గుబురు మొక్కలును గలవు. ఆకులు ఒంటరిచేరిక యునుగానుండును. సమాంచలము. లేతాకులకుఁ గణుపుపుచ్ఛములు గలవు. ఇవి ఆయాకుం పెరకు వాడిపోకుండ గాపాడుచుండును. పువ్వులు పెద్దవి. ఒక్కొకచోట నొక్కొక్కటియే యుండును. పుష్పభాగములు వలయమునకు మూడుచొప్పుననే యుండును. ఈ కుటుంబము. తిప్పతీగె, సీతాఫలము కుటుంబములను బోలియున్నది గావి ఆకులకుఁ గణుపు పుచ్ఛములు గలవు. మరియు రక్షక పత్రములును ఆకర్షణ పత్రముల వలెనుండును. ఈ కుటుంబపు పెక్కు మొక్కల పుష్పములలో వృంతాగ్రము పొడుగై దానిపై పుష్పభాగములు ఒంటరి చేరికగ, నమర్చియుండును.

చంపకవృక్షమును (సంపంగిచెట్టును) దోటలందుఁ బెంచుచున్నారు. ఈ చెట్టు విశేషముగ మైసూరు, బెంగుళూరులందును విశాఖపట్టణప్రాంతముల నున్నది. ఇవి ఆకు పచ్చని పువ్వులుఁబూసెడు గుబురు మొక్కయగు సంపంగికాదు. దీని పువ్వులు పచ్చగ నుండును. దీనినే సంపెంగయని కూడ నందురు.

సంపెంగ పువ్వులును బెరడును కషాయముగాచి యిచ్చిన మన్యపుజ్వరము తగ్గును. పువ్వుల కషాయము బలమును, అన్నహితపును బలుగఁ జేయును.

## పర్యాయ పదములు

శ్లో॥ చాంపేయశ్చంపకః ప్రోక్తో హేమపుష్పశ్చ సస్మృతః॥

చాంపేయము, చంపకము, హేమపుష్పము అనునవి చంపక నామములు,

## గంధఫలీ — సంపెంగమొగ్గ (కొద్దిగ నెదిగినది)

శ్లో॥ ఏతస్యకలికా గంధఫలీతి కథితాబుధైః ॥

సంపెగయొక్క కొద్దిగ నెదిగినట్టి మొగ్గ గంధఫలియని వ్యవహరించ బడును.

## చంపకగుణములు

శ్లో॥ చంపకః కటుకస్తిక్తః కషాయో మధురోహిమః ।
విషక్రిమిహరః కృచ్ఛ్రకఫవాతాస్రపిత్తజిత్ ॥

సంపెగపువ్వు కటురసమును, తిక్తకషాయ మధురానురసములను, శీతవీర్యమును గలిగి యుండును. కఫవాతములను శమింపజేయును. విషమును, క్రిములను, మూత్రకృచ్ఛ్రమును, రక్తపిత్తమును బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—చాంపేయము, చంపకము, హేమపుష్పము, (సురభి, షట్పదాతిథి, కుసుమాధిరాట్టు, శీతలచ్ఛద, నాగపుష్ప, దీపపుష్ప, వనదీప.)

(ఖ) గుణబోధకములు:—(కటు.)

(2) శబ్దార్థములు:—

చాంపేయము - హేమపుష్పము - బంగారువంటి వర్ణముగల పుష్పములు గలది. చంపక - పరిమళముచే దూరముగ వ్యాపించునది. సురభి - పరిమళముగలది. షట్పదాతిథి - తుమ్మెదలను అతిథిగానుండు పుష్పములు గలది. అనగా తుమ్మెదలు విశేషముగ నెల్లప్పుడీ పుష్పములచుట్టు మూగియుండును. కుసుమాధిరాట్టు - పుష్పజాతులలో నీ పుష్పము చక్రవర్తివలె నగ్రగణ్యమై యలరునది. శీతలచ్ఛద - చల్లగనుండు యాకులను గలది. నాగపుష్ప - పాముయొక్క పడగవలె ఎత్తుగా వంగియుండు దళములు (రేకలు) గల పువ్వులను గలది. దీపపుష్ప - దీపమువంటి కాంతిగల పుష్పములుగలది. వనదీప - వనములందు దీపములవలె ప్రకాశించునట్టి పువ్వులు గలది.

(3) భేదములు:—

ఇది "శ్వేతచంపకము, నాగచంపకము, సుల్తానచంపకము, నీలచంపకము, ధూమ్రచంపకము" అని యైదు విధములుగా నుండునని నిఘంటుకారు

...చే నిరూపింపబడినది. అందు శ్వేతచంపకము "శుభ్రచంపకము (పొట్టిగా నుండు వృక్షమువలె నుండునది). క్షీరవృక్షము (పాలుగల వృక్షము)" అనియు, నాగచంపకము "నాగచంపకము" నాగపుష్పము (పాముపడగవలె వంగియుండు రేకలుగల పుష్పములు గలది). నాగకేసరము (పాముకోరలవంటి కింజల్కములుగల పుష్పములు గలది.) యనియు, సుత్తానచంపకము తుంగ (మిగుల నెత్తుగ బెరుగునది). దేవవల్లభ (దేవతలకు బ్రియమైనది). నాగపుష్ప (పాముపడగవలె వంగియుండు రేకలుగల పుష్పములుగలది). రక్తకేసర (ఎఱ్ఱని కింజల్కములు గలది). రక్తపుష్ప (ఎఱ్ఱని పుష్పములను గలది). రక్తరేణు (ఎఱ్ఱని పుప్పొడి గలది), రాజచంపక చంపకజాతులలో నగ్రగణ్యముగా నుండునది. (లేక) రాజుల కిష్టమైనది" యనియు, శీలచంపకము "మధుగంధి (తేనెవంటి వాసనగల పుష్పములను గలది). మనోహార (మనస్సున కాహ్లాదమును గలిగించునట్టి పుష్పలను గలది.) యనియు, భూచంపకము "తామ్రపుష్ప (ఎఱ్ఱని పుష్పములను గలది.)" యనియు వర్ణింపబడినవి. అయితే తీగెసంపెంగ, చెట్టుసంపెంగ యని రెండు సంపెంగజాతులు మాత్రము విశేషముగా గానబడుచుండును. అందు తీగెసంపెంగ యనునది తీగెయుండుయుండ్లను, కొద్దిగ వెడల్పుగను పొడవుగను నుండు ఆకులను గలిగి భూమినుండి కొంచె మెత్తుగ బెరిగి పొదవలె చుట్టుప్రక్కలకు విస్తరించి యుండును. దీని కొమ్మలను నఱికినప్పుడు గొద్దిగా పాలు గానుపించును. దీని పుష్పములు పాముపడగవలె వంగియుండు నాలుగు (లేక) అయిదు రేకలను గలిగియుండి, ముదిరినప్పుడు ఆకుపచ్చని వర్ణము గలసిన పసుపుపచ్చని వర్ణము గలిగియుండును. లోపల నాభివంటి చిన్న కోశమును గలిగి యుండును.

ఈ తరుణమున మంచి పరిమళమును గలిగియుండి తుమ్మెదల కాకర్షణీయముగా నుండును. చెట్టు సంపెంగ యనునది యెత్తుగా పెరుగు వృక్షజాతులవంటిది. దీని పుష్పములు మూడు రేకలను గలిగియుండును. కాని పైదానివలె ఈ రేకలు వంగియుండవు. వర్ణము బంగారువలె పచ్చగ నుండును. ఇవియు మిగుల వాసనగలిగియుండును. ఇటుల రెండు విధములగు జాతులే విశేషముగా సంపెంగలుగా వ్యవహరింపబడుచున్నట్లు దెలియనగుచు. కాని పైని వివరించినట్టి భేదములెట్టివియో దెలిసికొనుటకు వీని వరించిన యితర విశేషములెందు నంతగా గానరాకుండుటచే వివరింప వీలుగాకున్నది.

ఇంతియేగాక వీనిలో "వనచంపక"మను మరియొక భేదము రాజనిఘంటుకారునిచే చెప్పబడినది. ఇది "హేమాహ్వా (బంగారువంటి వర్ణముగల పుష్పములు గలది") వనదీప (వనమునందు దీపమువలె ప్రకాశించు పుష్పములు గలది) యనియు వర్ణింపబడినది. ఇది గూడ పైవానిలో జేరిన యొక భేదమో, లేక వేరు భేదమైయుండునో గూడ జెప్పుటకు వలనుపడకున్నది.

అయితే నిందలి సుల్తాన చంపకమనునది పున్నాగవృక్షముగా నిఘంటుకారులచే నిరూపింపబడినది. మరియు నిది దక్షిణభాగమున "సురపొన్నవృక్షము"ను నామముతో వ్యవహరింపబడుచున్నట్లు వైద్యశబ్ద సింధువునం దుదహరింపబడినది. ఈ పున్నాగవృక్షముయొక్క వర్ణనమునుబట్టి జూడగా శివలింగవృక్షమై యుండునని దెలియగలదు. ఇది మిగుల నెత్తుగా బెరుగు గొప్ప వృక్షజాతులలోనిది. దీనిపుష్పము లెర్రగానుండి, శివలింగముపై నాగఫణము గప్పియుండునట్లు గోపుర వాకిలివంటి చిన్న చిన్న యనేక కోశములతో నిండియుండి పైనియొక విశాలమగు దళముతో గప్పబడియుండును. అదిగా పాముపడగవలె నెత్తుగా వంగిన దళమును గలిగియుండును. ఈదళములకు చివర పాము నాలుకలవంటి కేసరములొక పరుసదేరి యుంటియుండును. ఇవి గూడ నెర్రగనే యుండును. ఈ పుష్పములు మంచి పరిమళమును గలిగి చూచుటకు మనోహరములుగా నుండును. వీనిని గూడ తుమ్మెదలు విశేషముగా మూగి రసాస్వాదము జేయుచుండును. మొగల్ చక్రవర్తుల కిరీటములపై కొద్దిగా వంగి వేలాడుచుండు కుచ్చువలె నీ పుష్పముయొక్క పైభాగమున కేసరములతో గూడిన దళము వంగియుండుటనుబట్టి యీ సుల్తాన చంపకమని వ్యవహరింపబడుచుండవచ్చునని దెలియగలదు. కాని యిది చంపకజాతులతో నెంతవరకు సంబంధము గలిగియున్నదో వివరించుటకింతకన్న విశేషములేమియు గానరాకున్నవి. మరియు నీ పుష్పకేసరములను "పున్నాగవృక్షస్య కేసరో నాగకేసరః ।" అని శివదత్తుడు సుగంధద్రవ్యములలో గణింపబడు "నాగకేసర"యను ద్రవ్యముగా జెప్పియున్నాడు. నిఘంట్వాదర్శకారాది నిఘంటుకారులు గొందరు "తతో౽న్యో నాగ చంపకః, యత్పుష్పం నాగకింజల్కం నాగకేసర కంచతత్ ॥" అని నాగచంపక పుష్ప కేసరములను నాగకేసరమను ద్రవ్యముగా జెప్పియున్నారు. ఇటువంటి భేదమున్నట్లు దెలియుచుండుటచేతను, బజారులందు దొరకు నాగకేసర

మను ద్రవ్యము పైవానికి భిన్నముగా నుండునట్లు గానుపించుచుండుటచేతను, ఈ ద్రవ్యమునకు చంపకజాతులకును ఎంతవరకు సంబంధమున్నదో దెలియ జేయు నితరవిశేషములంతగా గానరాకుండుటచేతను ఈ గ్రంథమునందు ఇది (నాగకేసరము) ప్రత్యేకముగనే గ్రహింపబడి వ్రాయబడినది.

(4) విశేషగుణములు:—

దాహమును, కండువును, కుష్ఠమును, వ్రణమును బోగొట్టును. (రా-ని.) మధురవిపాకమును గలిగియుండును. (శో-ని.) విశదగుణమును గలిగియుండును. నేత్రములకు హితమైనది. (క్షే-కు.) శరీరమునకు పరిమళమును గలిగించును. వ్యాంగ్యము, వృష్యము, రక్తదోషమును బోగొట్టును. (ని-రా.)

(క) శ్వేత - తిక్తరసమును, కటుకషాయానురసములను, సరగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. కఫవాతములను శమింపజేయును. కుష్ఠము, కండూ, వ్రణము, శూల, ఉదరము, ఆధ్మానము వీనిని బోగొట్టును. (ని-ర.)

(ఖ) నాగచంపక - కటురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. వర్ణ్యమును గలిగించును. నేత్రములకు హితమైనది. వ్రణరోపణముజేయును. కఫవాతములను శమింపజేయును. వస్త్వస్త్రర సంయోగమువలన అగ్నిమాంద్యమును గలిగించును. (ని-ర.)

(గ) సుల్తాన చంపక (పున్నాగ) - మధురరసమును, శీతవీర్యమును గలిగియుండును. పరిమళమును గలిగియుండును. పిత్తమును శమింపజేయును. భూతవికారములను బోగొట్టును. (రా-ని.) కషాయరసమును గలిగియుండును. కఫమును శమింపజేయును. రక్తదోషమును బోగొట్టును. (రా-వ.)

(ఘ) భూమిచంపక - కటురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. శోఫ, శూల, గలగండము, వ్రణము వీనిని బోగొట్టును. (ని-ర.)

(చ) వనచంపక - కటురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. వర్ణ్యమును గలిగించును. నేత్రములకు హితమైనది. వయస్తంభనము జేయును. వ్రణరోపణము జేయును. అగ్నిమాంద్యమును గలిగించును. కఫవాతములను శమింపజేయును. (రా-ని.)

*N. B:*—ఈ వనచంపకముయొక్కయు, నాగచంపకముయొక్కయు గుణములు కొంచెము హెచ్చుతక్కువగ సమానములుగ నున్నట్లు దెలియ గలదు. దీనిబట్టి యీ రెండింటికిని భేదము లేనట్లు దెలియుచున్నది.

(5) ప్రయోగములు:—

**1.** మూత్రనిగ్రహణార్థమై చంపక ప్రయోగము.

"చంపక శిఫాకషాయః పీతో నిరుణద్ధి మూత్రమవశగతం ।
నీచతలపతితమంభశ్చతుర జనోత్పాదితో యథా సేతుః ॥"

మూత్రమధికముగ వచ్చుచున్నప్పుడు సంపెంగవేళ్ళ కషాయమును సేవించిన చెరువులో నుండు నీరు చుట్టునూ దృఢముగా నిర్మించబడిన గట్టును దాటిపోజాలనట్లు వెంటనే మూత్రవేగమడ్డుపడును. (వై-మ.)

**2.** యోనివ్యాపత్తులందు చంపక ప్రయోగము.

"సంయోజితం చంపక పల్లవేన జాతీప్రసూనైః ।
మధుకాన్వితైశ్చ సూర్యాంశుతప్తం ఘృతమంగనానాం ।
అభ్యంగతో హన్తి వరాంగ గంధం ॥"

సంపెంగచిగుళ్లు, జాజిపువ్వులు, యష్టిమధుకము వీనిని మెత్తగా నూరి ఘృతమునందు జేర్చి సూర్యతప్తముజేసి దీనితో నభ్యంగము జేసిన యోని యందు గలుగు పూతిగంధము బోవును. (గ-ని.)

(6) Medicinal uses:—A kind of camphor named champacol has been obtained by distillation from the wood,

An infusion of the flowers has been advocated as a stimulent tonic and carminative. The Bark is bitter and aromatic, and has been regarded as antiperiodic in doses of 10 to 30 grains.

Kanayalal Dey p. 190.

———

# 78

# చాంగేరీ-పులిచెంచలి

## (పులిచింతాకు)

---

### భాషాంతర నామములు

హిందీ - చూకా, తిపతియా, మరాఠి - భుయిసర్పటీ, గుజరాతి - త్రిణా, పాసలి, రూంఖడీ, రుంఖడీ, మలయాలం - పుళియారల్, కర్ణాటకం - పులుంబుశిసే, ద్రావిడం - పుళియారై.

### నైసర్గిక స్వరూప వర్ణనము

### Natural Order—Geraniaceae

బిలిబిలికాయ కుటుంబము

### పులిచెంచలి - Oxalis Corniculata

ఈ కుటుంబమునందు బిలిబిలిచెట్టు, తామర్త, పులిచింతాకు, పిరుగన్నేరు మొదలగు మొక్కలు గలవు.

ఈ కుటుంబములోఁ జాలభాగమన్నియు గుల్మములే. ఆకులకు కణుపుపుచ్ఛము లుండును. ఒంటరిచేరిక: లఘుపత్రములును మిశ్రమపత్రములును గూడగలవు. వానిపై రోమముండును. పుష్పములు సాధారణముగ సరాళముగానే యుండును. పుష్పమునందుఁ బ్రతివలయమునందును నైదేసికలవు. అయిదు రక్షకపత్రములు, అయిదు ఆకర్షణపత్రములు, వలయమున నైదు కింజల్కములచొప్పున రెండు వరుసలును అండాశయమునందు నైదుగదులు, అయిదు కీలములును గలవు. కాయ ఎండుకాయ పెక్కు వానియందు, విచ్చెడుకాయ.

పులిచింతాకు:—మొక్క పీటవార నేలమీఁదఁ బ్రాకుచుండును. అకులలో మూడేసి చిట్టియాకులున్నవి.

పులిచింత:—చుక్రిం - దగామ్లం : చాంగేరీ - వాస్తుకం - దీనిలో పలురకములు గలవు - 1. వాస్తుకః - Chenopodium Album, చాంగేరీ - Opalis corniculata. కుక్కపులిచింత - C. Lacinitum. తెల్లపులిచింత - C. Album (green) ఎర్రపులిచింత. Chenopodium Album, (Purple).

పరిచయజ్ఞాపికాపదములు : చుక్రిమను పులిచింత, ఆకులు పుల్లగానుండును. వాస్తుకమను జాతి. కూరకెక్కుడు ప్రశస్తమైనది. ఎర్రపులిచింత. ఆకు మృదువుగానుండును పత్రములయందు క్షారపదార్థము కలదు. తెల్లపులిచింత మిక్కిలి పథ్యకారి. దానిపువ్వును ఆకులునుగూడ కొంచెము తెల్లగానుండును.

మొత్తమున నీ పులిచింత జాతియంతయును, శేమగల ప్రదేశమున లేచును. ఇది భూమినుండారంగుళముల పొడవుగ పైకిలేచును. దీని మొదలునుండి వన్నవి బహాళ

ప్రకాండములు లేచును. ఒక ప్రకాండమునకు, నాలుగు లేక 5 తొడిమలును, తొడిమ దైదేని పత్రములను యుండును. కాండములు వరళములు, పత్రములు మృదులములు. ఆకులు ఒంటరిచేరిక.

## పర్యాయ పదములు

శ్లో॥ చాంగేరీ చుక్రికాదన్తశఠాంబష్ఠామ్లలోణికా।
అశ్మంతకస్తుశఫరీ కుశలాచామ్లపత్రికా॥

చాంగేరి, చుక్రిక, దన్తశఠ, అంబష్ఠ, అమ్లలోణిక, అశ్మంతకము, శఫరి, కుశల, అమ్లపత్రిక అనునవి చాంగేరీ నామములు.

## చాంగేరీ గుణములు

శ్లో॥ చాంగేరీదీపనీ రుచ్యా రూక్షోష్ణా కఫవాతనుత్।
పిత్తలామ్లా గ్రహణ్యర్శః కుష్ఠాతీసారనాశినీ॥

పులిచెంచలి అమ్లరసమును, రూక్షగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. రుచిని బుట్టించును. పిత్తమును వృద్ధిజేయును. కఫవాతములను శమింపజేయును. గ్రహణి, అర్శస్సు, కుష్ఠము, అతీసారము వీనిని బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—అమ్లపత్రిక - (క్షుద్రామ్లిక, చతుశ్ఛద).

(ఖ) గుణబోధకములు:—చుక్రిక-దన్తశఠ, (అమ్లిక).

(2) శబ్దార్థములు:—

అమ్లపత్రిక - పులుపుగనుండు ఆకులను గలది. క్షుద్రామ్లిక - పుల్లగనుండు వానిలో తక్కువైనదిగ వ్యవహరింప బడునది. చతుశ్ఛద - నాలుగుగ భిన్నమైన యాకులను గలది. చుక్రిక - రోగములను బీడించునది (పోగొట్టునది). దన్తశఠ - దన్తములను (పులుపుచే) బీడించునది. అమ్లిక - అమ్లరసమును గలది.

(3) విశేషగుణములు:—

కటురసమును, అధిక ఉష్ణవీర్యమును గలిగి యుండును. ఆమమును పాకముజేయును. (రా-ని.) కషాయరసమును, మధురామ్లరసములను గలిగి యుండును. (ద్ర-గు-సం.) లఘుగుణమును గలిగి యుండును. (మ-ని.)

(4) ప్రయోగములు:—

1. అర్శస్సులందు చాంగేరీ ప్రయోగము.

"చాంగేర్యాః చిత్రకస్య చ,
సంభృష్టం యమకేదద్యాత్ శాకందధి సరాయుతం ॥"

అర్శోవ్యాధియందు పులిచెంచలియాకును, చిత్రమూలపు ఆకును ఘృత తైలములతో భర్జనజేసి పెరుగుమీది నీళ్లతో జేర్చి సేవించిన హితము. (చ-చి-అ-9.)

2. గ్రహణియందు చాంగేరీ ప్రయోగము.

"కల్కేనమగధాజేన చాంగేరీ స్వరసేనచ,
చతుర్గుణేన దధ్నాచ ఘృతం సిద్ధం హితం భవేత్ ॥"

ఘృతము, 1 భాగము, పులిచెంచలి స్వరసము నాలుగుభాగముగములు, పెరుగు నాలుగు భాగములు, పిప్పల్యాది కల్కము ఘృతమునకు నాలవ భాగము ఇటుల నన్నిటిని కలిపి ఘృతపాకముజేసి సేవించిన గ్రహణి శమించును. (సు-ఉ-అ-40.)

3. వృశ్చిక విషమునకు చాంగేరీ ప్రయోగము.

"చాంగేరికా విమిశ్రేణ లవణేన ప్రయత్నతః,
ఘర్షయన్ ముచ్యతే దంశం భిర్జూరక విషాన్నరః ॥"

తేలుకుట్టిన చోటున పులిచెంచలిరసమునందు సైంధవలవణము చేర్చి దీనితో ప్రయత్నపూర్వకముగ రుద్దినచో విషము శమించును. (గ-చి.)

4. చాతుర్థిక జ్వరమునందు చాంగేరీ ప్రయోగము.

అమ్లోటజసమా శ్రేణ దలేనా సుకృతాం పిబేత్,
పేయాంఘృతపుతాంజంతు శ్చాతుర్థికహరాంత్ర్యహాం ॥"

నెయ్యి పులిచెంచలియాకులను గ్రహించి పేయను సిద్ధముజేసి సంస్కరించి ఘృతమిశ్రితముగ సేవించిన చాతుర్థికజ్వరము శమించును. (చ-ర.)

(5) యోగములు:—

1. చాంగేరీఘృతము - వా-అర్శ. మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—ఆనాహము, మూత్రకృచ్ఛ్రము, ప్రవాహిక, గుదభ్రంశము, అర్శస్సు, గ్రహణి ఇవి శమించును.

2. చాంగేరీఘృతము (ద్వితీయ) - చ-ద-అతిసారరోగ. మాత్ర:-1తులం.

ఉపయోగములు:—గుదభ్రంశము శమించును.

(6) Actions and uses:—It contains acid potassium oxalate cooling, refrigerent, appetizing and astringent; given in mild cases of dysentry, protapse of the ectum and vagina, and as a stomachic in fever and biliousness. The fresh juice is given as an antidote to poisioning by Dhatura. R. N. Khory II. p. 153.

The plant has an acid taste, due to the presence of acid oxalate of potassium. The leaves have long been considered cooling, refrigerant and antiscorbutic, astringent, appetising, useful in fevers and biliousness. They have been used for removing corns, warts and other excrescences on the skin The juice of the leaves with pepper powder and ghee added and mixed well is applied locally to red-spots or eruptions on the skin through biliousness. Bruised with or without water and formed into a poultice and applied over inflamed parts, the leaves relieve pain and other inflammatory symptoms. The fresh leaves made into a curry improve the appetite and digestion of dyspeptic patients The fresh juice is believed to relieve the intoxication, produced by datura; it is also believed on application, to remove fibres over the cornea or opacities of the cornea. The expressed juice of the leaves made into a sherbet with a little sugar is often prescribed in dysentery, prolapse of the rectum and also to allay thirst. The leaves boiled in butter milk given 3-3 times a day prove useful in chronic dysentery and enteritis-(Indigenous Drugs Report, Madras) Chakradatta recommends a preparation called "Changeri ghrita" which is made thus:—Take of clarified butter 4 seers, the fresh juice of Oxalis Corniculata 4 seers, curdled milk called dadhi 16 seers and the leaves of Oxalis Corniculata reduced to a paste 1 seer. Boil them together in the usual way and prepare a ghrita. This preparation is useful in diarrhoea, dysentery, prolapsus of the rectum, tympanites, piles and difficult micturition. Bhavaprakash gives the following process for preparing a compound ghrita:—Take of the fresh juice of Oxalis Corniculata, decoction of jujube fruits and ginger, alkaline water and curdled milk each 4 seers, clarified butter 4 seers and prepare a ghrita in the usual way. It is recommended for use in prolapse of the rectum. The plaint is rubbed down with water, boiled and the juice of white onions added; this mixture is applied to the head in bilious headaches. Various preparations in which this plant forms a chief ingredient are much esteemed in the treatment of fevers, dysentery and scurvy. Sorrel should not be eaten by gouty persons. Nadkarni p. 638, 639.

# 79

# చిచిండః - పొట్ల (తియ్యనిది) (క)

---

## భాషాంతర నామములు

హింది - చిచేండా, మరాఠీ - టరకాకడీ, గుజరాతీ - పండోళాం, మలయాళ - పలియపడవలం, కర్ణాటకం - సింహప్పడవల, ద్రావిడ - పడవలంగా.

## నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order—Ampelidaceae (Cucurbitaceae)**

గుమ్మడి కుటుంబము

పొట్ల - **Momordia Chrantia**

(50-వ పుట చూడుము)

## పర్యాయ పదములు

శ్లో॥ చిచిండః శ్వేతరాజీః స్యాత్సుదీర్ఘో గృహకూలకః॥

చిచిండము, శ్వేతరాజి, సుదీర్ఘము, గృహకూలకము అనునవి చిచిండ నామములు.

## చి చి ం డ గు ణ ము లు

శ్లో॥ చిచిండో వాతపిత్తఘ్నో బల్యః పథ్యారుచిప్రదః।
శోషిణోఽతి హితః కించిద్గుణైరూన్యనః పటోలతః॥

పొట్లకాయ బలమును గలిగించును. పథ్యముగా నుండును. రుచిని బుట్టించును. రాజయక్ష్మయందు మిగుల హితమైనది. వాతపిత్తములను శమింపజేయును. ఇది తిక్తపటోలముకంటె కొంచెము తక్కువగా నుండు గుణములను గలిగియుండును.

## పటోలః - చేదుపొట్ల (ఖ)

హింది - పరవల, పల్వాల, మరాఠి - పడవళ, కడూపడవల (ళ) గుజరాతి - పడవల, కడవీపడవల, మలయాళం - కైప్పన్ పటవలం, కర్ణాటకం - కహిపడవల, ద్రావిడం - పేయ్‌పాడల్.

శ్లో॥ పటోలః కులకస్తిక్తః పాండుకః కర్కశచ్ఛదః ।
రాజీఫలః పాండుఫలో రాజేయశ్చామృతాఫలం ।
బీజగర్భః ప్రతీకశ్చ కుష్ఠహా కాసభంజనః ॥ ”

పటోలము, కులకము, తిక్తము, పాండుకము, కర్కశచ్ఛదము, రాజీఫలము, పాండుఫలము, రాజేయము, అమృతాఫలము, బీజగర్భము, ప్రతీకము, కుష్ఠహా, కాసభంజనము అనునవి పటోలనామములు.

### పటోల (సమూల) గుణములు

శ్లో॥ పటోలం పాచనం హృద్యం వృష్యం లఘ్వగ్నిదీపనం ।
స్నిగ్ధోష్ణం హంతి కాసాస్రజ్వరదోషత్రయ క్రిమీన్ ॥

చేదుపొట్ల (తిక్తరసమును), లఘుస్నిగ్ధగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. అన్నమును పాకము జేయును. హృదయమునకు హితమైనది. వెంటనే శుక్రమును గలుగజేయును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. త్రిదోషములను శమింపజేయును. కాస, రక్తదోషము, జ్వరము, క్రిమి, అను వ్యాధులను బోగొట్టును.

### పటోలమూల గుణములు

శ్లో॥ పటోలస్య భవేన్మూలం విరేచనకరం సుఖాత్ ॥

చేదుపొట్లవేరు సుఖవిరేచనమును జేయును.

### పటోలనాల - పత్ర - ఫల గుణములు

శ్లో॥ నాలం శ్లేష్మహరం పత్రం పిత్తహారి ఫలం పునః ।
దోషత్రయ హరం ప్రోక్తం ॥

చేదుపొట్లకాడ (తీగె) కఫమును శమింపజేయును. ఆకుపిత్తమును శమింపజేయును. కాయత్రిదోషములను శమింపజేయును.

### పటోలపత్ర శాకగుణములు

శ్లో॥ పటోలపత్రం పిత్తఘ్నం దీపనం పాచనం లఘు ।
స్నిగ్ధం వృష్యం తథోష్ణం చ జ్వరకాస క్రిమిప్రణుత్ ॥

చేదుపొట్లాకుశాకము లఘుస్నిగ్ధగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. అన్నమును పచింపజేయును. వెంటనే శుక్రమును గలిగించును. పిత్తమును శమింపజేయును. జ్వరమును, కాసమును, క్రిములను బోగొట్టును.

## విశేషాంశములు.

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(చిచిండ) - శ్వేతరాజి, సుదీర్ఘము, (దీర్ఘఫలము, అహిఫలము) (పటోల) - పాండుఫలము, రాజీఫలము, బీజగర్భము.

(ఖ) గుణబోధకములు:—(పటోల)- తిక్తము, కర్కశచ్ఛదము, కుష్ఠఘ్న, శ్వాస భంజనము. (కచ్ఛుర, జ్వరనాశన.)

(గ) ఉత్పత్తిబోధకములు:—(చిచిండ) - గృహకూలకము.

(2) శబ్దార్థములు:—

శ్వేతరాజి - తెల్లని చారలుగల కాయలను గలది సుదీర్ఘము - దీర్ఘ ఫలము - అహిఫలము - పామువలె మిగుల దీర్ఘముగానుండు కాయలనుగలది. పాండుఫలము - తెల్లగనుండు ఫలములను గలది. రాజీఫలము - చారలతో గూడిన ఫలములను గలది. బీజగర్భము - విశేషముగ గింజలతో నిండిన కాయలను గలది. తిక్తము - తిక్తరసమును గలది. కర్కశచ్ఛదము - కర్కశ గుణము (గరకుగానుండు) గల పత్రములను గలది. కుష్ఠహ - కుష్ఠరోగమును బోగొట్టునది. శ్వాసభంజనము - శ్వాసరోగమును బోగొట్టునది. కచ్ఛుర - స్పృశించినచో దురదను బుట్టించునది. జ్వరనాశన - జ్వరమును బోగొట్టునది. గృహకూలకము - ఇంటిదొడ్లలో నుత్పత్తి యగునది.

(3) భేదములు:—

ఇది మధుర - తిక్తభేదముచే రెండు విధములుగా నుండి లతాజాతిలో నుత్పత్తి గలిగి ఫలశాకవర్గములో గణింపబడుచున్నది. అందు మొదటిది మిగుల దీర్ఘముగా నుండు గాయలతో నొప్పి యుండును. ఈ కాయలు ఆకుపచ్చని వర్ణముగలిగి సన్నముగ పొడవుగ నుండు తెల్లని చారలతో నొప్పి యుండును ఇందు తెల్లని వర్ణముగల కాయలు గూడ నచ్చటచ్చట-గానబడును. ఈ జాతిని ప్రతి యింటి దొడ్లలోను పాదులుగా బెట్టబడి పందిళ్ళపైనను కంచెలపైనను బెంచబడు చుండును. వీనినే విశేషముగా శాకములందుపయోగించు చుందురు. రెండవజాతి పైదానివలె నంతగా బెంచబడుట గానరాదు. ఇది మిగుల తెల్లని వర్ణముగలిగి పొట్టివిగానుండు గాయలతో నొప్పి యుండును. ఇది శాకములందు సామాన్యముగా నుపయోగింప బడుటలేదు గాని జ్వరాది రోగములందు ఔషధరూపముగా విశేషముగా

నుపయోగింప బడుచున్నది. ఈ రెండింటియొక్క తీగెయందును, పత్రము అందును, శేతవిగానుండు గాయలయందును సన్నని నూగు అంటియుండును. పత్రము మిగుల గరుకుగా నుండును. పుష్పములు తెల్లగా నుండును. మొత్తము మీద నీ రెండు జాతులును విశేషముగా జ్వరాది వ్యాధులలో పథ్యములుగా నుపయోగింప బడుచున్నది.

(4) విశేషగుణములు:—

(క) చిచిండ - మధురరసమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును, ఆమమును పాకము జేయును. 'జ్వరమును బోగొట్టును. (రా-ని.) లఘుస్నిగ్ధగుణములును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. కాసమును, క్రిమి అమ బోగొట్టును. (ని-ర.)

(ఖ) పత్రి - పిత్తమును శమింపజేయును. (ని-ర.)

(గ) మూల - మలశోధనము జేయును. (ని-ర.)

(ఘ) లత - కఫమును శమింపజేయును. (ని-ర)

(చ) పటోల(సమూల) - తీక్ష్ణగుణమును, కటువిపాకమును గలిగి యుండును. కండువును, దాహమును బోగొట్టును. (ధ-ని.) కటుకానురసమును గలిగి యుండును. మలభేదనము జేయును, తృష్ణను బోగొట్టును. (ని-ర.)

(ఛ) ఫల - కటురసమును, తిక్తానురసమును, లఘుగుణమును, మధుర విపాకమును గలిగి యుండును. మలమున కనులోమగతిని గలిగించును. శ్వాసను, జ్వరమును, క్రిములను బోగొట్టును. (ని-ర.)

(జ) మూల - కఫమును శమింపజేయును. (ని-ర.)

(ఝ) తైల (బీజ) - వాతకఫములను శమింపజేయును. (ని-ర.)

(5) ప్రయోగములు:—

1. రక్తపిత్తమునందు పటోల ప్రయోగము.

"హ్రీబేరమూలాని పటోలపత్రం వీతేసమస్తాః గణశః।
పృథగ్వా రక్తంస పిత్తం శమయంతి యోగాః॥"

దురువేరును, చేదుపొట్లాకును చూర్ణముగా జేసిగాని కషాయముగా జేసిగాని తేనెతో జేర్చి సేవించిన రక్తపిత్తము శమించును.

(చ-చి-అ-4).

2. మదాత్యయమునందు పటోల ప్రయోగము.

"పటోలస్యా ధవాభిషక్॥"

చేదుపొట్ల కషాయమును సేవించిన మదాత్యయము శమించును.

(చ-చి-అ-12.)

3. శోఫయందు పటోల ప్రయోగము.

"సువర్చికా గృంజనకం పటోలం।
శాకార్థినాం శాకమతి ప్రశస్తం ॥"

చేదుపొట్లాకును శాకముగా జేసి సేవించిన శోఫరోగము శమించును.

(చ-చి-అ-17.)

4. విషమునందు పటోల ప్రయోగము.

"శాకంచపటలకం హితం ॥"

విషదోషమునందు చేదుపొట్లాకును శాకముగా జేసి సేవించిన హితము.

(చ-చి-అ-25.)

5. ఊరుస్తంభమునందు పటోల ప్రయోగము.

"శాకై రలవణైరద్యాత్ జలతైలోపసాధితైః తులకాదిభిః ॥"

చేదుపొట్లాకును లవణవరితముగా జలతైలములతో శాకముగా జేసి సేవించిన యూరుస్తంభ వాతరోగము శమించును. (చ-చి-అ-27.)

6. పిత్తశ్లేష్మజ్వరమునందు పటోల ప్రయోగము.

"నింబకులకయూషస్తు పిత్తకఫాత్మకే హితః ॥"

వేప, చేదుపొట్ల వీనిని సమూలముగా గ్రహించి వీనితో సిద్ధముజేసిన యూషమును సేవించిన పిత్తకఫజజ్వరము శమించును. (చ-ద.)

7. పిత్తజ్వరమునందు పటోల ప్రయోగము.

"పటోలయవ నిఃక్వాథో మధునామధురీకృతః।
తీవ్రపిత్త జ్వరామర్దీపనాత్తృ ద్దాహనాశనః ॥"

చేదుపొట్లను సమూలముగా గ్రహించి యవలతో జేర్చి కషాయము గాచి యందు తేనెజేర్చి యిచ్చిన తీవ్రమగు పిత్తజ ఆమజ్వరమునందు గలుగు తృష్ణయు, దాహమును శమించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. (చ-ద)

8. వాతవ్యాధియందు పటోల ప్రయోగము.

పటోలఫలకైర్యూషో వృష్యో వాతహరోలఘుః ॥ "

చేదుపొట్లకాయలతో సిద్ధముజేసిన యూషమును సేవించిన వాతరోగము శమించును. (లఘుగుణమును గలిగి వృష్యముగ నుండును.)

9. మసూరికయందు పటోల ప్రయోగము.

"పటోలమూలం క్వథితం ।
ఆదావేవమసూర్యాంతు పిత్తజాయాం ప్రయోజయేత్ ॥"

చేదుపొట్లవేరు కషాయమును పిత్తజ మసూరికా పూర్వరూపమునందు సేవించిన వ్యాధి ప్రబలముగాక శీఘ్రముగా శమించును. (భా-ప్ర.)

10. శిరోరోగమునందు పటోల ప్రయోగము.

"పటోల మూలసంభూతం ఫాలస్థల విలేపనం ।
సద్యః కరోతి య స్తస్య యాతిసర్వ శిరోవ్యథా ॥"

చేదుపొట్లవేరును మెత్తగా నూరి ఫాలభాగమున లేపనము జేసిన వెంటనే శిరశ్శూల శమించును. (గ-ని.)

11. తిమిరమునందు పటోల ప్రయోగము.

పటోలముద్గామలకం యవానపి ।
నిషేవమాణస్య నరస్యయత్నతః ।
భయం సుఘోరా త్తిమిరాన్న విద్యతే ॥"

చేదుపొట్ల, పెసలు, ఉసిరకపండ్లు, యవలు వీనితో సిద్ధముజేసిన యూషమును సేవించిన అతి ఘోరమగు తిమిరముగూడ శమించును.

(సు-ఉ-అ-17.)

(6) యోగములు:—

1. పటోలమూలాదిఘృతము - చ-శ్వయథు. మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—విసర్పము, దాహము, జ్వరము, సన్నిపాతజ్వరము, తృష్ణ, విషము, శ్వయథు ఇవి శమించును.

2. పటోలాదిచూర్ణము - వా-గ్రహణి. మాత్ర:-¼ తులం.

ఉపయోగములు:—హృద్రోగము, పాండు, గ్రహణి, గుల్మము, శూల, అరుచి, జ్వరము, కామిల, ముఖరోగము ఇవి శమించును.

3. పటోలమూలాదికషాయము - వా-కుష్ఠ. మాత్ర:-1 పలం.

ఉపయోగములు:—కుష్ఠము, కిలాసము, గ్రహణి, అర్శస్సు, మూత్రకృచ్ఛ్రము, హలీమకము, వస్తిశూల, విషమజ్వరము ఇవి శమించును.

4. పటోలాదికషాయము - సు-జ్వర. మాత్ర:-1 పలం.

ఉపయోగములు:—జ్వరము, ఛర్ది, కండు ఇవి శమించును. బలమును గలిగించును.

5. పటోలాదిఘృతము - భైషజ్య-నేత్రరోగ. మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—చక్షుష్యము, శుక్రరోగము, ఘ్రాణరోగము, కర్ణరోగము, నేత్రవర్త్మగతరోగము, ముఖరోగము, కామిల, పాండు, కుష్ఠము, విసర్పము, గండమాల, వ్రణము ఇవి శమించును.

(7) Actions and uses:—(పటోలః). The fresh juice of the leaves is said to be useful when applied to the bald patches of alopecia. Patola is cholagogue, laxative and febrifuge and is useful in bilious fevers. It is generally administered in the form of a decoction of the whole plant in combination with other bitters. It is also said to have alterative properties: it purifies the blood and is a very efficacious remedy in boils and certain skin eruptions.

Vegetable drugs of India p. 203.

## స్వానుభవము

నవీనపరిశోధకులు శాకములను Acid ash అనగా అమ్లముగల క్షారములు Alkli ash క్షారక్షారములు అని శాకములను కాల్చిన బూడిదయొక్క పరిశోధననుబట్టి రెండు విధములుగ విభజించి యున్నారు. అందు అమ్ల, క్షారగుణము లచే ఆ యా శాకముల గుణములు మారునని తోచుచున్నది. ఈ గుణములయొక్క అంశాంశకల్పనచే ఆయుర్వేద శాస్త్రజ్ఞులు, ఉష్ణవీర్య శీతవీర్య గుణములను ఆ యా శాకముల యందు గుర్తించిన ట్లూహింపదగును. మధురాది రసములను బట్టియు, విపాకమునుబట్టియు వీర్యము మారుచుండుటచే నిందునుగూర్చి పరిశోధన జరుపవలసి యున్నది. మొత్తముమీా పటోలము వాత పిత్త హారమనియు బల్యమనియు చెప్పబడి యున్నది.

పొట్లకాయ పథ్యమున కుపయోగించు కూరలలో శ్రేష్ఠమైనదని వాడుక, ఇట్లే బీరకాయకూడ. ఆంధ్రదేశమున పామువలె పొడుగుగా నుండు కాయలను వాడుదురు. బంగాళా

దేశమున 'పటోల' అను పొట్లకాయలు వేరెలమ పాదుగే యుండును. దీనిని వేరునుండి యుత్పత్తిచేయుదురు.

చేదుపొట్ల జ్వరహరములగు కషాయములలో నెక్కువగ యుపయోగించుచున్నాము. ఆ. ల. ]

---

# 80

# చిత్రకః - చిత్రమూలం

---

## భాషాంతర నామములు

హింది - చిత్తా, చిత్రక్, చీతా, మరాఠి - చిత్రక, గుజరాతీ - చిత్రో, మలయాళం - కొడువేలి, కన్నడం - చిత్రమూలం, ద్రావిడం - చిత్రమూలం.

## నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order—Plumbaginaceae**

చిత్రమూల కుటుంబము

చిత్రమూలం - **Plumbago Zylanica**

( లషింగ్టన్ 1653 చూడుము ).

## పర్యాయ పదములు

శ్లో॥ చిత్రకోఽనల నామాచపాఠీవ్యాలః తథోషణః ॥

చిత్రకము, అనలము, పాఠి, వ్యాలము, ఉషణము అనునవి చిత్రక నామములు.

## చిత్రక గుణములు

శ్లో॥ చిత్రకః కటుకః పాకేవహ్ని కృత్పాచనో లఘుః ।
రూక్షోష్ణో గ్రహణీ కుష్ఠశోథార్శః కృమికాసనుత్ ॥
వాతశ్లేష్మహరో గ్రాహీ వాతార్శశ్లేష్మ పిత్తహృత్ ॥

చిత్రమూలము కటురసమును, లఘురూక్షగుణములను, ఉష్ణవీర్యమును, కటువిపాకమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమమును పాకము చేయును. మలమును నిరోధించును. గ్రహణి, కుష్ఠము, శోఫ, అర్శస్సు, క్రిములు, కాసము, వాతశ్లేష్మరోగము (ద్వంద్వ). వాతాశ్మస్సు (విశేషముగ), శ్లేష్మపిత్తరోగము (ద్వంద్వం), అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—అనలము: ఊషణము.

(ఖ) గుణబోధకములు:—అనలము.

(2) శబ్దార్థములు:—

అనలము - అగ్నితో సమానముగ నుండునది. అనగా అగ్నివలె బాహ్యాభ్యంతరములందు దహింపజేయునది. ఊషణము - కటువుగ నుండునది. అనలము—తాపమును గలిగించునది.

(3) భేదములు:—

"యథాస్వం చిత్రకం పుష్పైః జ్ఞేయః పీతసితాసితైః।
యథోత్తరం సగుణవాన్ విధినాచరసాయనం ॥"

చిత్రమూలము, తెల్లపువ్వులుగలది, ఎర్రపువ్వులుగలది, నీలవర్ణపు పువ్వులు గలది యని మూడు విధములుగ నుండును. ఇవి ఒకదానికంటె నొకటి వరుసగ గుణాధికములు. ఇందు సామాన్యముగ తెల్ల చిత్రమూలము వాడుకలో నున్నది. మిగిలినవి కృచ్ఛ్రసాధ్యములు. వీనిని విధిగా సేవించిన రసాయనమగును. (వాగ్భట-ఉ-అ-39-శ్లో-62) మరియు నివి రసవాదమున నుపయోగకరములని చెప్పుదురు.

(4) విశేషగుణములు:—

(క) రక్తచిత్రకగుణములు.

i. "కాలోవ్యాలః కాలమూలోఽతి।
దీప్యో మార్జారో అగ్నిర్దాహకః పావకశ్చ।
చిత్రాంగోవ్యా రక్తచిత్రో మహాంగః।
స్యాదుద్రావ్యా శ్చిత్రకోఽన్యో గుణాఢ్యః॥"

కాలము, వ్యాలము, కాలమూలము, అతిదీప్యము, మార్జారము, అగ్ని, దాహకము, పావకము, చిత్రాంగము, అరక్తచిత్రము, మహాంగము, రుద్రాహ్వ అనునవి రక్తచిత్రమూల నామములు. ఇది మిగుల గుణదాయకము.
(తంత్రాంతరము)

ii. "స్థూలకాయ కరో రుచ్యః కుష్ఠఘ్నో రక్తచిత్రకః।
రసేంద్రియామకః లోహవేధకశ్చ రసాయనః॥"

ఎఱ్ఱపువ్వులుగల చిత్రమూలము రుచిని బుట్టించును. శరీరమును స్థూలముగ జేయును. కుష్ఠరోగమును పోగొట్టును. పాదరసమునకు నియమన సంస్కారమును సిద్ధింపజేయును. లోహములకు వేధసంస్కారము (ఇతర లోహములను బంగారముగ జేయుట)ను జేయుట కుపయోగపడును. రసాయనము. (రా-ని.)

(ఖ) చిత్రక శ్రేష్ఠత:—

"చిత్రకమూలం దీపనీయ గుదశోథ హరాణాం॥"

చిత్రమూలము దీపనీయ ద్రవ్యములలోను, గుదశోథను హరించు ద్రవ్యములలోను శ్రేష్ఠమైనది. (చరకసంహిత.)

(5) ప్రయోగములు:—

1. అర్శోరోగమునందు చిత్రక ప్రయోగము

"త్వచం చిత్రక మూలస్య పిష్ట్వా కుంభం ప్రలేపయేత్।
తక్రం వా దధి వా తత్ర జాతమర్శోహరం పిబేత్॥"

చిత్రమూలమును కల్కముగాజేసి దానిని ఒక కుండకు లోపల బూసి అందు సిద్ధముజేసిన పెరుగును గాని మజ్జిగనుగాని యిచ్చిన అర్శస్సులు పోవును. (చ-చి-అ-౧౪.)

2. అతీసారమునందు చిత్రక ప్రయోగము.

"తక్రం పీత్వా సచిత్రకం... ముచ్యతే జఠరామయాత్॥"

చిత్రమూల కల్కమును తక్రముతో చేర్చి సేవించిన అతీసారము పోవును. (చ. చి. అ. 10.)

3. ఉదరమునందు చిత్రక ప్రయోగము.

"చతుర్గుణే జలే మూత్రే ద్విగుణే చిత్రకాత్ పలే।
కల్కసిద్ధం ఘృతప్రస్థం సక్షారం జఠరీ పిబేత్॥"

చిత్రమూల కల్కము 1 పలము, గోమూత్రము 2 పలములు, జలము 4 పలములు, నెయ్యి 1 ప్రస్థము - వీని నేకముగ చేసి, ఘృతపాకము చేసి దీనిని యవక్షారముతో చేర్చి పానముచేసిన ఉదరరోగము శమించును.

(చ. చి. అ. 18)

4. శ్వయథువునందు చిత్రక ప్రయోగము.

"క్షీరం ఘటే చిత్రక కల్కలిప్తే దధ్యాగతం సాధు విమథ్య తేచ ।
తజ్జం ఘృతం చిత్రకమూలగర్భం తక్రేణ సిద్ధం శ్వయథుఘ్న మగ్ర్యం॥
అర్శోతి సారానిల గుల్మమేహాం శ్శోథఘ్నహం త్యగ్నిబలప్రదం చ ।
తక్రేణవాద్యాత్స ఘృతేన తేన భోజ్యాని సిద్ధామథ వా యవాగూం॥"

ఒక బానపు లోన చిత్రమూల కల్కమును బూసి అందు పాలను బోసి, తోడు పెట్టి పెరుగుగా మారిన పిమ్మట దానిని బాగుగా చిలకవలెను. ఆ దూడివచ్చిన వెన్నను నేయిగా కాచి, దీనిని పైని చిలకగావచ్చినట్టి తక్రముతో చేర్చి, అందు చిత్రమూల కల్కమును గూడ చేర్చి, ఘృతపాకవిధిగ పాకముజేయవలెను. ఇది శోఫరోగమును పోగొట్టును. మరియు అర్శస్సు, అతీసారము, వాతజగుల్మము, ప్రమేహము ఈ రోగములను పోగొట్టును. ఈ ఘృతముతో చేర్చి ఆహారము భగాని యవాగునుగాని తీసికొనవలెను. ఆ దు తక్రమును అనుపానముగా సేవించవలెను. (చ. చి. అ. 17)

5. కుష్ఠమునందు చిత్రక ప్రయోగము.

"ఏవం పేయః చిత్రకః శ్లక్ష్ణ పిష్టః॥"

కుష్ఠమునందు చిత్రమూలమును మెత్తగనూరి యా కల్కమును సేవించిన హితము. (సు-చి- అ. 9)

6. శ్విత్రమునందు చిత్రక ప్రయోగము.

"మూత్రం గవ్యం చిత్రకవ్యోషయుక్తం సర్పిః
కుంభే క్షౌద్రయుక్తం స్థితం హి ।
పక్షాదూర్ధ్వం శ్విత్రిభిః పేయమేతత్
కుర్యాచ్చాస్మిన్ కుష్ఠదిష్టం విధానం ॥"

గోమూత్రము, చిత్రమూలము, త్రికటుకములు, నెయ్యి, తేనె, వీని నన్నింటిని యేకముచేసి ఒక పాత్రయందుబోసి పక్షము దినములుంచి పిమ్మట

శ్విత్రికుష్ఠమునందుపయోగించిన హితకరము. ఇందుకుష్ఠమునకు చెప్పిన పథ్య నియమము ననుసరించవలెను. (సు. చి. అ. 9)

7. సికతామేహమునందు చిత్రిక ప్రయోగము.

"సికతామేహినం చిత్రిక కషాయం పాయయేత్ ॥"

సికతామేహమునందు చిత్రమూల కషాయమును పానము చేయించిన హితము. (సు. చి. అ. 8)

8. పాండురోగమునందు చిత్రిక ప్రయోగం.

"మూలంబలా చిత్రకయోః పిబేద్వా పాండ్వామయార్తోఽ-
క్ష సమం హితాశీ। సుఖాంబు నావా......" ॥

బలామూలమును చిత్రమూలమును ఒక్కొక్క కర్షము చొప్పున కల్కముచేసి సుఖోదకముతో సేవించిన పాండురోగము శమించును. (సు. ఉ. అ. 26)

9. రసాయనమునకు చిత్రిక ప్రయోగము.

"ఛాయా శుష్కం తతోమూలం మాసం చూర్ణీకృతం లిహన్।
సర్పిషా మధుసర్పిర్భ్యాం పిబన్ వా పయసాయతిః ॥
అంభసా వా హితాన్నాశీ శతం జీవతినిరుజః।
మేధావీ బలవాన్ కాంతోవపుష్మాన్ దీప్తపావకః ॥
తైలేన లీఢోమాసేన వాతాన్ హంతి సుదుస్తరాన్।
మూత్రేణ శ్విత్రి కుష్ఠాని పీత స్తక్రేణ పాయుజాన్ ॥"

చిత్రమూలమును నీడనెండించి మెత్తగ చూర్ణించి నేయితోగాని, నేయి తేనె వీనితోగాని, పాలతోగాని లేక జలముతోగాని నియమాను సారముగ హితమగు నన్నమును భుజించుచు ఒక మాసము సేవించిన వ్యాధులు లేక నూరు వత్సరములు జీవించును. మరియు మేధాశక్తి వృద్ధిపొందును. బలము, కాంతి, మంచి శరీరము, అగ్నిదీప్తియును కలుగును. తైలముతో సేవించిన దుస్తరములగు వాత వ్యాధులు శమించును. గోమూత్రముతో సేవించిన శ్విత్రికుష్ఠమును, తక్రముతో సేవించిన అర్శోవ్యాధియును పోవును. (వాగ్భట. ఉ. అ. 39)

10. గ్రహణియందు చిత్రిక ప్రయోగము.

"చిత్రకక్వాథ కల్కాభ్యాం గ్రహణీఘ్నం శృతంహవిః।
గుల్మశోథోదర ప్లీహశూలార్శోఘ్న ప్రదీపనం ॥"

చిత్రమూలము యొక్క కల్క కషాయములతో ఘృతమును పాకముజేసి సేవించిన గ్రహణి, గుల్మము, శోఫ, ఉదరము, ప్లీహవృద్ధి, శూల, అర్శస్సు బోవును. జాఠరాగ్ని వృద్ధిపొందును (చక్రదత్త)

11. శ్లీపదమునందు చిత్రక ప్రయోగము.

"హితశ్చాలేపనే నిత్యం చిత్రకో దేవదారువా॥"

శ్లీపదమునందు చిత్రమూల కల్కమునుగాని దేవదారు కల్కమునుగాని లేపనము చేసిన హితము. (చక్రదత్త)

12. వ్రణశోథ దారణమునకు చిత్రక ప్రయోగము.

"చిత్రకో హయమారకః......దారణం॥"

చిత్రమూలమును గన్నేరు వేరును నూరి లేపనము చేసిన వ్రణశోథ పగులును. (చక్రదత్త)

13. మేహరోగమునందు చిత్రక ప్రయోగము.

"మధునా చిత్రకమూలం తథైవ హిత భోజనో భుంక్తే॥"

చిత్రమూలమును తేనెతో సేవించుచు హితాహారమును తీసుకొను చుండిన మేహోపద్రవ శమించును. (వంగసేన)

(6) యోగములు:—

1. చిత్రకాది ఘృతము – చ - శ్వయథు. మాత్ర:—1 తులం

ఉపయోగములు:—అర్శస్సు, గుల్మము, శ్వయథు ఇవి శమించును. జాఠరాగ్ని వృద్ధిబొందును.

2. చిత్రకాది గుటిక – చ-గ్రహణి. మాత్ర:-5 రతులు.

ఉపయోగములు:—గ్రహణీరోగము శమించును.

3. చిత్రకాదిలేహ్యము – చ-కాస. మాత్ర:-1 తులం

ఉపయోగములు:—కాసము, హృద్రోగము, శ్వాస, గుల్మము ఇవి శమించును.

4 చిత్రమూలాదిలేహము – నా-అర్శోరోగ. మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—అర్శస్సు, కుష్ఠము, ప్లీహాభివృద్ధి, గుల్మము, ఉదరము ఇవి శమించును. జాఠరాగ్ని వృద్ధిబొందును.

5. చిత్రకహరీతకి – భైషజ్య-నాసారోగ. మాత్ర:-1 హరీతకి.

ఉపయోగములు:—పీనసము, క్షయము, కాసము, కృమి, గుల్మము, ఉదావర్తము, అర్శస్సు, శ్వాస ఇవి శమించును. జాఠరాగ్ని వృద్ధిబొందును.

6. చిత్రకాద్యరిష్టము - గ-ని-గ్రహణి. మాత్ర:-1 ఔన్సు.

ఉపయోగములు:—గ్రహణి, పాండువు, ఉదరము, ప్లీహాభివృద్ధి, గుల్మము, శోఫ, అర్శస్సు, ఇవి శమించును. జాఠరాగ్ని వృద్ధిబొందును. రుచిబుట్టును. స్రోతశ్శుద్ధి కలుగును.

(7) Actions and uses:—Plumbago-root reduced to a paste is applied to abscesses with the object of opening them.

U C. Dutta.

"Plumbago root in very small doses acts as a powerful stimulent to the mucous membrane of the digestive tract, and after absorption as a stimulant of the excretory glandular orgons. In large doses it acts as a powerful irritant and narcotic poison . . . . . ."

Devoprasad Sanyal.

"In the Pharmacopoea of India, Dr Oswald is said to have employed Pzeylanica in the treatment of intermittants with good effct. It acts as a powerful sudorific" Dymock.

## PLUMBAGO ROSEA

Action:—Alterative, gastric stimulant; in large doses It is acro-narcotic poison. Locally it is visicant. It has a specific action on the uterus. The scraped root of P. Rosea is introduced into the mouth of the womb for the purpose of procuring abortion

Uses:—The bruised root mi ed with oil or in the form of liniment is used as a rubefacient application in rheuma s n, n enlarged glands ,buboes etc ; it cures certain cases of leucoderma.-(Dr. R. Gray). It is employed to procure criminal abortion ; it will expel the foetus from the womb whether dead or alve It is a good remely to check post partum heamorrhage.—(Dr Bhattachariee). moderate doses, is 5 to 20 minims, Externally the roo and the root-bark enter into the composition of caustic pastes and rubefacient applications The brui-sed root tempered with a little bland oil is used as an application in rheumatic and paralytic affections The root and root bark are used as a substitute for cantharides for raising blisters. The fresh root-bark is rubbed into a paste with wat and a little rice-flour it is then spread on a piece of rag applied to h surface and kept f r about half an hour and then a rice poultice is plied over the part in about 12 to 18 hours a large uniform blister will be found to hav formed. The chief objection to the use of plumbago blister is the great pain it causes hence it should only be used when other blistering agents are not at hand and a blister is an immediate necessity In rheumatism the blistering paste should be removed after 15 to 20 minutes.

## PLUMBAGO ZEYLANCIA.

Action:—Similar to that of P. Rosea. The root is said to increase the digestive power and promote the appetite.

Uses:—The root of this drug also is powerfully poisonous and its internal use is said to be attended with great danger. It enters into the composition of several Indian preparations. The root reduced

to a paste is applied to abscesses with the object of opening them. With milk, vinegar, or salt and water the paste may be applied in leprosy and other obstinate skin diseases, unhealthy ulcers, scabies etc. The milky juice is also useful application. The root is said to be useful in dyspepsia, piles, anasarca, diarrhoea, skin diseases &c. A tincture of the root-bark is employed as an antiperiodic. A favourite medicine for flatulence is a powder called Shaddharana Yoga recommended by Susruta; it is composed of equal parts of Plumbago root, Indrayava seeds, root of Stephania Hernandifolia, of Picrorrhiza Kurroa, atis, and chebulic myrobalan. The dose is about a drachm. In the Concan the following formula is used.—Chitraka root, embellic myrobalans, small black myrobalans (Bal-harataki), long pepper, long pepper root, rhubarb and rock salt. Powder and give 6 mashas (about a drachm) with hot water every night at bed time in flatulence with rheumatic pains.—(Dymock). For dyspepsia, Chakradatta recommends a powder made of equal parts of Plumbago root, rock salt, chemulic myrobalan and long-pepper; the dose is about 40 grains. The root is used generally as a stimulant adjunct to other preparations in the form of a combination called trimada consisting of Plumbago root, baberang seeds (Vidanga) and the tubers of Cyperus Rotundus (Musta). Hakims use it in rheumatism and enlargement of the spleen. The root is said to have a beneficial effect on piles; in these cases it is given in various combinations; e. g., an earthen jar or pot of which the inside is lined with a paste of the root is used for preparing curds (dahi or Kanjica) which is given to persons suffering from haemorrhoids and prurigo. The root is said to have been employed in the treatment of intermittent fevers by Dr. Oswald. It acts as a powerful sudorific—(Dymock). For chronic and muscular rheumatism and all painful affections of the joints, pills or powder called Chithra Kashi are recommended. They are prepared thus:—Take in equal parts of each of the root of P Zeylanica, the root of Pipper longum, crude sodium carbonate or Sajja Kshara, the five salts, viz.,—common salt, Saindhava, Vit salt, black salt and Kacha lavanum; dry ginger, long pepper black pepper, asafoetida, omum and Piper chaba. Powder them all and use as powder; or grind with lime juice and make pills of 5 grains each. Dose:—of the powder 15 grains or 3 pills three times a day. For epilepsy, hysteria, mania and other mental disorders a compound powder composed of Chitraka root, Brahmi and Acorus Calamus is said to be useful in doses of 10 to 30 grains three times a day.—(Indigenous Drugs Report, Madras) For paraplegia, pills popularly known as Yogarai Guggula are recommended, They are composed of.—roots of P. Zeylanicum and Piper Longum, seeds of Ptychotis Ajowan, Nigella Sativum, Embelia ribes, Chidium diffusum and Cuminum, Pinus deodara, Piper Chaba, Cardamoms, Saindhava salt, Aplotaxis auriculata, Vanda Roxburghii, Tribulus terrestris, Coriander seeds, the three myrobalans, tubers of Cyperus Rotundus, the three acrids, Cinnamomum Zeylanicum, roots of Andropogon Muricatus, Carbonate of potash, Abies Webbiana and leaves of Cinnamomum Tamala, all in equal parts; pound and mix them together. Take also purified Balsa-

modendron Mukul equal to the combined measure of all the above ingredients. First pound it with ghee and add powders previously made and pound them again with ghee and convert into pills of 6 grains each. Dose is 1 to 4 pills. As alterative and tonic useful in nervous and rheumatic affections and in reducing obesity, a compound pill of Bdellium, Plumbaga zeylanicum, Trikatu and Triphala, and known as Dasanga Guggula is recommended. Dose is 1 to 4 pills of 6 grains each, three times a day.

Nadkarini p. 694—698.

## స్వానుభవము

[ దీనిని ప్రత్యేకముగా ఉపయోగించుట అరుదు అనేకమాత్రలలోను, ఇతరౌషధములలోను జేరుచున్నది. ఉదా. చిత్రకాదివటి నంజు వ్యాధిలో దీనియాకును గూడ గలిజేరువలనే ఉపయోగించిన మంచి పనిజేయునని చెప్పబడి యున్నది. లేపనముగా నుపయోగించిన దీని వేరు చర్మమును పొక్కునట్లు జేయును. చర్మమున కుద్రేకము గలిగించును. ఎర్రపూవులు ప్రాయు చిత్రమూలము ఇతరములైన వాని కంటె శ్రేష్ఠము.

చిన్న మోతాదులలో పాచనముగాను దీపనముగాను ఉపయోగించును. హెచ్చు మోతాదులలో మిక్కిలి యుద్రేకమును గలిగించును.

ఆలోపతీయ ఔషధములలో ఇది విషమని మాత్రము జెప్పబడినది. ఆయుర్వేదములో దీని యుపయోగ మనేక రోగములలో జెప్పబడినది. కొంతమంది అజీర్ణరోగులకు ఇతర ఔషధి ద్రవ్యములన్నియు పనిజేయక లేక పోయినప్పుడు ఇది బాగుగ పనిజేయుచున్నది. సుప్రసిద్ధ పాచనౌషధమగు పంచ కోలములలో నిది యొక ద్రవ్యము. సన్నిపాత భైరవము

మొదలయిన ఔషధములలో దీనిని జేర్చుదురు. ఇది జ్వరమును గలిగించు విషమును, క్రిములను పోగొట్టునని చెప్పెదరు. మూలవ్యాధిలో ఇది పరమౌషధమని మజ్జిగ మున్నగు వానితో గలిపి యిత్తురు. దీనిని పాలలోవేసి కాచి దానిలో నుండి తీసినవెన్నను చిరకాలగతమగు వ్రణములకు నాడుల వ్రణములకు ఉపయోగింతురు. ఇది పైకిని లోపలకును ఏలాగు నిచ్చినను గర్భస్రావమును గలుగజేయును. తెలియక ఉప యోగించిన ఇది అపాయమును గలిగించును గాన దీనిని జాగ్రత్తగా జూచి ఉపయోగించవలెను.

సూతికాజ్వరమునందు సూతికాభరణమునకు అనుపాన ముగను వాతవ్యాధులయందు యోగరాజగుగ్గులుకు అనుపాన ముగను, పంచకోలచూర్ణమును నేను ధారాళముగ నుపయోగి మంచిగుణమును కనిపెట్టియున్నాను. కాని యిది యెట్లు పని చేయునో ఆరహస్యము తెలిసికోనవలసియున్నది. ఆ. ల.]

---

# 81

# చుక్రికా - చుక్కకూర

---

## భాషాంతర నామములు

హిందీ - చుకాకీ, మరాఠి - చుకా. గుజరాతి - చుకో, మలయాళం_ కోంగ్ పుళి, కర్ణాటకం - హులిశీసే, ద్రావిడం - పుళియమరం.

## నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order—Polygonaceae, (Crusiaceae)**

శేవలచిన్ని కుటుంబము

చుక్కకూర - Rumex Vesicarius

**(Eng. Bladder dock or country sorrel.)**

## పర్యాయ పదములు

శ్లో॥ చుక్రికా స్యాత్తు పత్రామ్లా రోచనీ శతవేధనీ ॥

చుక్రిక, పత్రామ్ల, రోచని, శతవేధని అనునవి చుక్రికా నామములు.

## చుక్రికా గుణములు

శ్లో॥ చుక్రాత్యమ్లతరా స్వాద్వీ వాతఘ్నీ కఫపిత్తకృత్ ।
రుచ్యా లఘుతరా పాకే వృంతాక వాతిరోచనీ ॥

చుక్కకూర విశేషముగ ఆమ్లరసమును, కొద్దిగ మధురానురసమును గలిగి యుండును. తేలికగ జీర్ణమగును. రుచి పుట్టించును. కఫపిత్తములను వృద్ధిబొందించును. వాతమును శమింపజేయును కందతో గలిపి యూడను శాకముగా జేసిన మిగుల రుచికరముగ నుండును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:— పత్రామ్లా.

(ఖ) గుణబోధకములు:— చక్రిక, రోచని, శతవేధని.

(గ) ఉత్పత్తిబోధకములు:— (అమ్లవాస్తుకము.)

(2) శబ్దార్థములు:—

పత్రామ్ల - పుల్లగానుండు పత్రములను గలది. చక్రిక - వ్యాధులను పీడించునది (పోగొట్టునది). రోచని - రుచిని బుట్టించునది. శతవేధని-అనేక విధములుగ దోషములను (లేక) వ్యాధులను ఛేధించి పోగొట్టునది. అమ్ల వాస్తుకము - గృహారామములందు పెరుగు పుల్లనిశాకము.

(3) విశేషగుణములు:—

లఘుగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును, కొద్దిగ పథ్యముగ నుండును. జాఠరాగ్నిని వృద్ధిపొందించును. గుల్మమును పోగొట్టును. (రా-ని.) గురుగుణమును గలిగి యుండును. కష్టముగ జీర్ణమగును. మలభేదమును గలిగించును. (చ-ద.) శూల, అగ్నిమాంద్యము, హృత్పీడ, మలబంధము, ఆమవాతము, తృష్ణ, ఛర్ది, ముఖవైరస్యము వీనిని పోగొట్టును. (ని-ర.)

(4) ప్రయోగములు:—

1. కర్ణశూలయందు చక్రికా ప్రయోగము.

"కర్ణే కోష్ణేన చక్రేణ పూరియేత్ కర్ణశూలినః ॥"

కర్ణములందు చుక్కకూరరసమును కొద్దిగ వెచ్చజేసి పూరణము జేసిన శూల శమించును. (చ-ద.)

2. రక్తార్శోరోగమునందు చక్రికా ప్రయోగము.

"క్షీరిణ్యాః చక్రికాయాశ్చ ।
దధ్నసరేణ సిద్ధాన్ దద్యాద్రక్తే ప్రవృత్తేఽతి ॥"

రక్తార్శస్సులందు రక్తము అధికముగా స్రవించుచుండిన మనుబాలను చుక్కకూరను పెరుగుమీది నీళ్ళతో శాకముగా జేసి సేవించిన రక్తస్రావము శమించును. (చ-చి-అ-9.)

3. రాజయక్ష్మయందు చక్రికా ప్రయోగము.

"చాంగేర్యా శ్చక్రికాయాశ్చ దుగ్ధికాయాశ్చ కారయేత్ ।
ఖండాన్ దధిసమోపేతాన్ ససర్పిష్కాన్ సదాడిమాన్ ॥"

యక్ష్మరోగమునందు అతీసారము గలిగెనేని పులిచెంచలము, చుక్కకూర, మనుబాల వీనిని ముక్కలు ముక్కలుగా నరకి పెరుగుమీది నీళ్ళతోను దాడిమ స్వరసముతోను శాకముగా పాకముజేసి ఘృతముతో సంస్కరించి సేవించిన అతీసారము శమించును. (చ-చి-అ-8.)

## స్వా ను భ వ ము

[ ఆకుకూరలలో పుల్లనిదియగుటచే ప్రత్యేకమైన రుచి గలది. తోటకూర చప్పగ నుండును. ప్రతిదినము తినవలెనంటే విసుగు పుట్టవచ్చును. చుక్కకూర కొంచెముష్ణ వీర్యమైనను అగ్నివర్ధకమై, అరోచకమును తొలగించునదగుటచే నెక్కువగా శ్లాఘింపదగియున్నది. పిత్తప్రకోపముచే గలుగు రక్తార్శస్సునందు, చుక్కకూరను, మజ్జిగతోను, ఇతరములగు నాకు కూరలకలయికతోను వండి తినినయెడల మిక్కిలి యుపయోగకరమని శ్లాఘింపబడియున్నది. వైద్యులును, గృహస్థులును చుక్కకూర నెక్కువగా నుపయోగించుట మంచిది. బీదవారలకు గూడ సులభముగ లభ్యమగునది. ఆధునిక వైద్యులు ఇందు యేదో వైటమిన్ ఉన్నదని చెప్పవచ్చును.
ఆ. ల. ]

# 82

# జటామాంసి - జటామాంసి

## భాషాంతర నామములు

హింది - జటామాంసీ, మరాఠి - జటామాంసీ, గుజరాతి - బాలఛడ, మలయాలం - జతామాంజీ, కర్ణాటకం - జటామాంస్, ద్రావిడం - జటామాంజీల్.

## నైసర్గిక స్వరూప వర్ణనము.

## Natural Order — Valarianeae

జటామాంసి - Nardostachys Jatamonsi (Eng. Spikeward)

## పర్యాయ పదములు

శ్లో॥జటామాంసీ భూతజటాజటిలాచ తపస్వినీ ॥

జటామాంసి, భూతజట, జటిల, తపస్విని అనునవి జటామాంసి నామములు.

## జటామాంసీ గుణములు

శ్లో॥ మాంసీతిక్తా కషాయాచ మేధ్యాకాంతి బలప్రదా ।
స్వాద్వీ హిమాత్రిదోషాస్ర దాహ వీసర్పకుష్ఠనుత్ ॥

జటామాంసి తిక్తరసమును, కషాయమధురానురసములను, శీతవీర్యమును గలిగి యుండును. మేధాశక్తిని, కాంతిని, బలమును గలిగించును. త్రిదోషములను శమింపజేయును. రక్తదోషమును, దాహమును, విసర్పమును, కుష్ఠమును బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

పరిచయబోధకములు:—జటామాంసి, భూతజట, జటిల, తపస్విని, (కృష్ణజట, పిశిత, లోమశ, వహ్నిని.)

(2) శబ్దార్థములు:—

జటామాంసి - జడలుగల మాంసపేశివలె నుండునది. భూతజట-భూతముల జడలవంటి జడలను గలది. జటిల - తపస్విని - మునీశ్వరుని జడలవంటి

జడలుగలది. కృష్ణజట _ నల్లని జడలను గలది. పిశిత _ మాంసపేశివలె నుండు నది. లోమశ _ రోమములను గలది. వహ్నిని _ అగ్నిశిఖలవంటి రోమములను గలది.

(3) భేదములు:—

ఇది సుగంధద్రవ్యములలో గణింపబడి 'సాధారణజటామాంసి, సుగంధ జటామాంసి, ఆకాశజటామాంసి (లేక) సూక్ష్మజటామాంసి' యని మూడు విధములుగా నుండునట్లు వర్ణింపబడినది.

ఇందు రెండవది "గంధమాంసి(పరిమళముగల మాంసపేశివలె నుండునది), కేశి (దీర్ఘములగు రోమములనుగలది), శ్వేతకేశి (తెల్లని రోమములనుగలది.)" అను మొదలగు నామములచేతను, మూడవది "నిరాలంబ'(మూలమునకు ఆధారము లేకుండ బెరుగునది), సూక్ష్మపత్రి (చిన్నవియగు పత్రములనుగలది). గౌరి (గౌరవర్ణమును గలది) పర్వతవాసిని (పర్వతములందుత్పత్తియై బెరుగుచుండునది)" అను మొదలగు నామములచేతను వ్యవహరింపబడు చున్నవి. ఇందువలన మొదటి రెండింటికంటె మూడవది చిన్నదిగ నుండునట్లును, అందు మొదటిది నల్లగను, రెండవది తెల్లగను, మూడవది గౌరవర్ణముగను నుండు నట్లును దెలియగలదు. అయితే మనకు బజారులందు నల్లని జటామాంసియే విశేషముగ దొరకుచుండును. మిగిలినవి దొరకకుండుటకు కారణము దెలియ కున్నది. ఇవి మొత్తముమీద నన్నియు సుగంధమును గలిగియే యుండునని గూడ దెలియగలదు. కాని దీనిని గురించిన విశేషము లంతగా గానరాకుండు టచే నింకను విమర్శించిన గాని యీ భేదముల స్వరూపాదులను స్పష్టపరుప వీలుగాకున్నది. మరియు "కృష్ణాసుగంధమాంసీతు" అని నిఘంటురత్నాకరమున జెప్పబడి యుండుటవలన పైని వివరించిన వానిలో రెండవది నల్లగ నుండు ననియు, ఇదియే విశేషముగ గంధమును గలిగి యుండుననియు, ఇది సుగంధ ద్రవ్యములలో గణింపబడు చుండుటచే నిదియే గ్రాహ్యమనియు, నందు చేతనే మిగిలిన వానికంటె ఈ నల్లని జటామాంసి విశేషముగ నొకవేళ బజారులందు ప్రచారము గలియున్నదేమోయని గూడ దెలియగలదు.

(4) విశేషగుణములు:—

(క) సాధారణ _ కటుతిక్తానురసములను గలిగి యుండును. త్రిదోష మును, భూతవికారములను, జ్వరమును, విషమును బోగొట్టును. (ని_ర.)

(ఖ) సుగంధమాంసి - తిక్తరసమును, శీతవీర్యమును గలిగి యుండును. పరిమళముతో గూడి యుండును. కేశములకు హితమైనది. వర్ణమును గలిగించును. త్రిదోషములను శమింపజేయును. గలరోగము, భూతవికారములు, గ్రహదోషములు, రక్తపిత్తము, జ్వరము, విషము వీనిని బోగొట్టును. పైని జెప్పిన యితర సాధారణ మాంసీగుణములను గూడ గలిగి యుండును. (ని-ర.) కేవల కఫజరోగములను బోగొట్టును. (రా-ని.) లేపనము జేయుటవలన జ్వరమును, శరీరరౌక్ష్యమును బోగొట్టును. (రా-వ.)

(గ) ఆకాశమాంసి - శీతవీర్యమును గలిగి యుండును. వర్ణమును గలిగించును. శోఫ, వ్రణము, నాడీవ్రణము, లూతావిషము, జాలగర్దభము వీనిని బోగొట్టును. (రా-ని.) విస్ఫోటము, మసూరిక, విసర్పము వీనిని బోగొట్టును. (ని-ర.)

(5) ప్రయోగములు:—

1. వ్రణమునందు జటామాంసీ ప్రయోగము.

"వచాం వయఃస్థాం గోలోమీం జటిలాం చాపి శిరసా
ధారయేత్ ॥"

వ్రణమునకు శస్త్రకర్మ జేసిన పిమ్మట రోగియొక్క తలపైని వస, సిరికపప్పు, తెల్లవస, జటామాంసి యీ ద్రవ్యములను రక్షోగ్రహ నివారణార్థమై ధరింపజేయవలెను. (సు. సూ.)

(6) యోగములు:—

1. జటిలాది మహా పైశాచిక ఘృతము - చ - ఉన్మాద. మాత్ర:- 1 తులము.

ఉపయోగములు:—చాతుర్థికజ్వరము, ఉన్మాదము, గ్రహదోషము, అపస్మారము ఇవి శమించును. బుద్ధి, స్మృతియు గలుగును.

2. మాంస్యాది ఘృతము - వై - చిం - అండవృద్ధి. మాత్ర:-1 తులము

ఉపయోగములు:—కటీశూల, పృష్ఠశూల, మేఢ్రశూల, వస్తిశూల, వృషణశూల, ఆంత్రవృద్ధి ఇవి శమించును.

3. జటామాంస్యాది గణము- రా. ని. సుగంధవర్గ, కఫరోగ.

ఉపయోగములు:—లేపనము జేసిన శరీరదౌర్గంధ్యము బోవును. కఫజ వికారములు శమించును.

(7) Medicinal uses:—The drug is regarded as a tonic, nervous stimulant, and antispasmodic. It is little used in India at the present time, but has been advocated as efficient representative of valerian in hysteria epilepsy and similar nervous and convulsive affections. The doze is 30 to 40 grains in powder. A fluid extract prepared with an ammoncial menstruum would probably be the most suitable preparation. The oil is administered in epilepsy in dozes of 2 to 5 minims. Jatamámsi is chiefly used in India as an agent in perfumery and as an ingredient in medicinal oils. It is popularly believed to increase the growth and blackness of the hair. (Kanayalal Dey)

Action:—Aromatic, tonic, nerve stimulant, carminative, antispasmodic, deobstruent, diuretic, and emmenagogue; sedative to the spinal cord. It promotes appetite and digestion.

Uses:—Jatamansi is generally used as an aromatic adjunct in the preparation of medicinal oils and in perfumery. Jatamanci is a good substitute for the official Valetiae, It is employed in the treatment of hysterical affections, especially palpitation of the heart, nervous headache, chorea, flatulence, etc, It is said to be useful also in menopause disturbances, hystero-epilepsy and similar nervous and convulsive ailments. Tho dose is 30 to 40 grains in powder. It may be usefully combined with a few grains of camphor and cinnamon, Susruta recommends the following decoction in ehilepsy.—Take of the pulse of Phaseelus Roxburghii, Barley, Jujube fruit, seeds of Crotolaria juncea, Bdellium, Jatamansi root, the ten drugs collectively called dasamula and chebulic myrabalan, equal parts and prepare a decoction in the usual way. This decoction is to be administered with the addition of clarified butter and goat's urine. The volatile oil from the rhizome can be used in these diseases. It is used in very many diseases of the digestive and respiratory organs, and in jaundice. It is said to be useful also in leprosy. It is also employed mixed with sesamum oil for rubbing on the head as a nerve sedative. It is said to promote the growth and blackness of hair.

Nadkarni p. 586, 587.

## స్వానుభవము

[సౌగంధ్యకరము; అపతంత్రకవాతము అపస్మారము మున్నగు వ్యాధులలో శోభను, ఉద్రేకమును హరించునని చెప్పబడియున్నది.

ఈద్రవ్యమును ప్రత్యేకముగా నేనుపయోగించలేదు. పై వ్యాధులలో ఇతర ద్రవ్యములతో కలిపి ఉపయోగించితిని.

ఇది వృష్యమైయుండి బుద్ధిని, మేధను వృద్ధి బొందించునని తోచుచున్నది. అల్లోపతీయ ద్రవ్యములతో ఇది వేలెరియన్ అను ద్రవ్యమువలె పనిజేయునని జెప్పబడియున్నది దేసిలో శుభ్రమైనది దొరకుట కష్టము. ఆ. ల.]

---

# 83

## జపా—మందారము (దాసాని) (క)

---

### భాషాంతర నామములు

హింది - జౌడహుత్, గుడహర్. (ల్), గఢల్, జివాపూల, మరాఠి - జాసవంద, జాస్వంద, గుజరాతి - జాసువు, (ద) జాసుస, మలయాలం - చంబరత్తి, కర్ణాటకం - ద్రావిడం - చంబరత్తి.

### నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order—Malvaceae**

బెండ కుటుంబము

తెల్లమందారము - **Hibiscus Rosa Sinensis (Eng. Shoe flower).**

(354 వ పుట చూడుము)

### పర్యాయ పదములు

**శ్లో॥ జీండ్రపుష్పం జపాచాథ ॥**

**జీండ్రపుష్పము, జపయనునవి శ్వేతమందార నామములు.**

### శ్వేతజపాపుష్ప గుణములు

**శ్లో॥ జపా సంగ్రాహిణీ కేశ్యా ॥**

**తెల్ల మందారపుష్పము మలాదులను నిరోధించును. కేశములకు హితమైనది.**

## రక్తజపా-ఎఱ్ఱమందారము (దాసాని) (ఖ)

శ్లో॥ త్రిసంధ్యా చారుణా మతా ॥

త్రిసంధ్య, అరుణ యనునవి రక్తమందార నామములు.

## రక్తజపా పుష్పగుణములు

శ్లో॥ త్రిసంధ్యా కఫవాతహృత్ ॥

ఎఱ్ఱమందార పుష్పము కఫవాతములను శమింపజేయును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

పరిచయబోధకములు:—రక్త - త్రిసంధ్య, అరుణ, (అర్కప్రియా, రాగపుష్పి, హరివల్లభ.)

(2) శబ్దార్థములు:—

త్రిసంధ్య - మూడు సంధ్యాకాలములందు వికసించునది (లేక) మూడు సంధ్యలయందు సూర్యుని పూజించుటకు యోగ్యమైనది. అరుణ - రాగపుష్పి- ఎఱ్ఱగానుండు పుష్పములను గలది. అర్కప్రియ - సూర్యభగవానునకు ప్రియమైనది. హరివల్లభ - విష్ణుమూర్తి కిష్టమగునది.

(3) భేదములు:—

ఇది శ్వేత - రక్త - పీతాదివర్ణభేదముచే ననేక విధములుగా నుండునట్లు గానవచ్చును. కాని శ్వేత - రక్త భేదములు రెండే నిఘంటుకారులచే నిరూపింపబడినవి. మరియు నింకొక యెఱ్ఱమందార ముద్దగానుండు పుష్పములను గలది. రేకగానుండు పుష్పములు గలది. ఇట్లు రెండు విధములుగా కూడ గానబడును. ఈ వృక్షము నెత్తుగా గుబురుగా పెరుగును. ఆకులు గుండ్రముగను చివర మొనదేలియు నుండును. ఇవి చుట్టు కోతలుగలిగి మెఱుపుగ నుండును. పువ్వు ముద్దవలె నుండునది యనేక రేకలను, మధ్యనాళమును, దీనికి చివర సూక్ష్మకేసరములను గలిగి యుండును. రేకమందారలో రెండు మూడు రేకలుండి వెనుకకు వంగియుండును. అందలి మధ్యనాళమతి దీర్ఘముగా నుండి పైన నివత్తై కేసరములను గలిగి యుండును. ఈ పువ్వులను గోసినప్పుడు వృంతమునుండి జిగురుగ స్రావ మేర్పడును. వీని వృంతనాళము మిక్కిలి దీర్ఘముగను, గరుకుగను నుండును. దీనిని నేత్రవర్త్మాది రోగములందు లేఖనశస్త్రముగా నుపయోగించుదురు. ఈ వృక్షము లెల్ల ప్రదేశములం దుత్పత్తి

యగుచుండును. మరియు నిది "పంచైతే దేవతరవః మందారః పారిజాతకః" అని యమరసింహునిచే గణింపబడిన దేవవృక్షములలో నొకటిగా దెలియ గలదు.

(4) విశేషగుణములు:—

(క) పుష్ప - కటురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. వాంతులను క్రిములను గలిగించును. ఇంద్రలుప్తమును బోగొట్టును. (రా_ని.) మలమూత్రములకు వర్ణమును గలిగించును. (రా_వ.) పుష్పలను ఘృతముతో భర్జనజేసి సేవించిన స్త్రీల కార్తవ ప్రవృత్తి గలుగును. (చ_ద.) తిక్తరసమును, లఘుగుణమును గలిగి యుండును. (ని_ర.)

(ఖ) వృక్ష - మధురరసమును, స్నిగ్ధగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. పుష్టిని జేయును. మలాదులను నిరోధించును. కేశములను వృద్ధిబొందించును. ఛర్ది, క్రిములు వీనిని గలిగించును. గర్భమును వృద్ధిబొందించును. దాహము, ప్రమేహము, అర్శస్సు, ప్రదరము, ఇంద్రలుప్తము, ధాతువికారములు వీనిని బోగొట్టును. (ని_ర.)

(5) ప్రయోగములు:—

1. అదృష్టార్తవము నందుజపా ప్రయోగము.

"సకాంజికం జపాపుష్పం...ప్రాశ్య వనితా త్వార్తవం లభేత్"

బుతుప్రవృత్తి లేనట్టి స్త్రీకి మందారపువ్వుల కల్కమును కాంజికముతో నిచ్చిన ప్రవృత్తి గలుగును. (చ_ద.)

2. కేశకృష్ణీకరణమునకు జపా ప్రయోగము.

"భృంగపుష్పం జపాపుష్పం మేషీదుగ్ధప్రపేషితం।
తైలేనాలోడితం లోహపాత్రస్థం భూమ్యధః కృతం॥
సప్తాహాదుద్ధృతం పశ్చాత్ భృంగరాజరసేనతు।
ఆలోడ్యాభ్యజ్య చ శిరోవేష్టయిత్వా వసేన్నిశాం॥
ప్రాతస్తు క్షాళనం కార్యం ఏవం స్యాన్మూర్ధరంజనం॥"

గుంటకలగరపువ్వులను, మందారపువ్వులను గొర్రెపాలతో మెత్తగా నూరి యొక లోహపాత్రయం దుంచి అందు తిరిగి గొర్రెపాలను బోసి బాగుగా కలిపి పైని మూతవేసి సంధిబంధనము జేసి యీ భాండమును భూమిలో పాతిబెట్టవలెను. ఏడు రోజులైనపిమ్మట దాని గ్రహించి తిరిగి గుంటకలగరాకు రసము జేర్చి బాగుగా కలిపి శిరస్సున కభ్యంగముజేసి

రాత్రిళ్లు పైని వస్త్రముతో గప్పుకొని యుండవలెను. తెల్లవారినపిమ్మట బాగుగా గడుగుచుండవలెను. ఈ విధముగా ప్రతి నిత్యమును జేయుచుండిన కేశములకు చక్కని కృష్ణవర్ణము గలుగును. (చ-ద.)

3. ఇంద్రిలుప్తమునందు జపా ప్రయోగము.

"కృష్ణగవీమూత్రయుతైః పిష్టై రాలేపితైః జపాకుసుమైః ।

శతమఖిలుప్తం నశ్యతి భవంతి కేశాశ్చ తత్ర ఘనాః ॥"

కృష్ణగోమూత్రముతో మందారపుష్పములను మెత్తగా నూరి యింద్రిలుప్తము (బట్టతల) నకు లేపనము జేసిన వ్యాధి శమించి అందు దట్టముగ కేశములు బుట్టును. (రా-మా.)

4. ప్రదరముసందు జపా ప్రయోగము.

"కలికాః క్షీరసంపిష్టా జపావిటపజాః పిబేత్ ॥

దశద్వాదశవా నారీ ప్రదరార్తా పయోశినీ ॥"

మందారమొగ్గలను పదిగాని, పదిరెండుగాని గ్రహించి పాలతో మెత్తగా నూరి ప్రతిరోజునను సేవింపుము, పాలతో జేర్చి యాహారమును భుజించుచుండిన ప్రదరరోగము శీఘ్రముగా శమించును. (గ-ని.)

(6) యోగములు:—

1. బృహన్మందారతైలము - భైషజ్య-వృద్ధి. మాత్ర:-½ తులము.

ఉపయోగములు:—పానము జేసిన మొదల ఆంత్రవృద్ధి శమించును.

N. B:—ఈ ప్రయోగభేదమునుబట్టి యీ తైలము పైద్రవ్యమునకు భిన్నమగు మరియొక మందారనామక ద్రవ్యముతో సిద్ధము జేయబడు నట్లు దోచగలదు.

(7) Actions and uses:—The petals are demulcent and emolient. As a refrigerent drink its infusion is given in fevers, as a demulcent in cough and cystitis; combined with milk, sugar and cumin, it is given in gonorrhoea. In menorrhágia, combined with lotus root, the bark of Erisdendron Anfractuosum, it is of benefit.

R. N. Khory II. p. 98.

## 84

# జంబీరః - నిమ్మ (క)

### భాషాంతర నామములు

హింది - కాగజీనీంబూ, మరాఠి - లఘు ఈడనింబు, గుజరాతి - కాగదీనింబు మలయాళం - చెరునారజ, కర్ణాటకం - నింబెహణ్ణు, ద్రావిడం - ఎలిముచ్చ.

### నైసర్గిక స్వరూప వర్ణనము

### Natural Order—Rutaceae

నారింజ కుటుంబము

నిమ్మ - Citrus acida or Lemonum acidum (Eng. Lemon)

(268 వ పుట చూడుము).

### పర్యాయ పదములు

శ్లో॥ స్యాజ్జంబీరో దన్తశఠో జంభజంభీరజంభలాః ॥

జంబీరము, దన్తశఠము, జంభ, జంభీర, జంభల యనునవి జంబీర నామములు.

### జంబీర గుణములు

శ్లో॥ జంబీరముష్ణం గుర్వమ్లం వాతశ్లేష్మ విబంధనుత్।
శూల కాస కఫోత్క్లేశ ఛర్ది తృష్ణామదోషజిత్ ॥
ఆస్యవైరస్య హృత్పీడా వహ్నిమాంద్య కృమీన్ హరేత్ ॥

నిమ్మపండు అమ్లరసమును, గురుగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. వాతశ్లేష్మములను శమింపజేయును. విబంధము, శూల, కాస, కఫోత్క్లేశము, ఛర్ది, తృష్ణ, ఆమదోషము, ఆస్య వైరస్యము, హృత్పీడ, అగ్నిమాంద్యము, క్రిములు అను నీ వ్యాధులను బోగొట్టును.

## క్షుద్ర జంబీర గుణములు.

శ్లో॥ స్వల్పజంబీరికా తద్వ త్తృష్ణాచ్ఛర్దినివారిణీ॥

చిన్నజాతి నిమ్మపండు పైని జెప్పిన గుణములనే గలిగి యుండును. విశేషముగా తృష్ణను, ఛర్దిని బోగొట్టును.

## నింబూకం — పుల్లనినిమ్మ (ఖ)

శ్లో॥ నింబూః (స్త్రీ) నింబుకం క్లీబే నింబూక మపి కీర్తితం॥

నింబు, నింబుకము, నింబూకము అనునవి నింబూక నామములు.

## నింబూక గుణములు

శ్లో॥ నింబూక మమ్లం వాతఘ్నం దీపనం పాచనం లఘు॥

పుల్లనిమ్మపండు అమ్లరసమును, లఘుగుణమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమమును పాకముజేయును. వాతమును శమింపజేయును.

## మిష్టనింబూక గుణములు

శ్లో॥ మిష్టనింబూఫలం స్వాదు గురు మారుతపిత్తనుత్।
గలరోగ విషధ్వంసి కఫోత్క్లేశి చ రక్తహృత్॥
శోషారుచి తృషాచ్ఛర్ది హారం బల్యం చ బృంహణం॥

తియ్యనిమ్మపండు మధురరసమును, గురుగుణమును గలిగి యుండును. బలమును గలిగించును. బృంహణము, కఫమును ఉత్క్లేశింపజేయును. వాతపిత్తములను శమింపజేయును. గలరోగము, విషము, రక్తదోషము, శోష, అరుచి, తృష్ణ, ఛర్ది అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(I) ప్రసిద్ధనామములు:—

గుణబోధకములు:—(జంబీర) - దన్తశఠము, (వక్త్రశోధి, రోచనకము, జాడ్యారి,) (నింబూక)-(అమ్లజంబీరము, దన్తఘాతము, శోధనము, జంతుమారి, రోచనము.)

(2) శబ్దార్థములు:—

దన్తశఠము - దన్తఘాతము - దన్తములను బీడించునది. వక్త్రశోధి - ముఖమును శోధించునది. రోచనకము - రోచనము - రుచిని బుట్టించునది.

జాడ్యారి - జడత్వమును బోగొట్టునది. అమ్లజంబీరము - విశేషముగ నమ్ల రసముగలది. శోధనము - దోషములను శోధించునది. జంతుమారి - క్రిములను బోగొట్టునది.

(3) భేదములు:—

ఇది సాధారణజంబీరము, అమ్లజంబీరము, మధురజంబీరము అని మూడు విధములుగా నుండి యెత్తుగా బెరుగు వృక్షజాతులలో నుత్పత్తి గలిగి అమ్ల రస ఫలవర్గములో శ్రేష్ఠమైనదిగా గణింపబడుచున్నది. ఇందలి సాధారణ జంబీరము పెద్ద-చిన్న భేదముచే రెండు విధములుగా నుండును. అయితే జంబీరమునందలి జాతులన్నియు మొత్తముమీద పెద్ద-చిన్న భేదముచే రెండు విధములుగా నుండుననియు వాటి వాటి యవస్థా పరిణామములందు గలుగు రసభేదములను బట్టి పైవిధముగా భేదము లేర్పడి యుండవచ్చుననియు దెలియ గలదు. ఈ జంబీరజాతులు బజారులందు విరివిగా లభించును. వీనిని వ్యవ హారమునందు ప్రతినిత్య ముపయోగింపబడు ఆహారమునందు లేహ్య - పానాది రూపముగను, సంవత్సరము కాలదియు నిలువయుంచబడును ఊరుగాయల రూపముగను ఇటుల ననేక విధములుగ నుపయోగించుచురు. ఈ యూరు గాయను పథ్యముగా ననేక వ్యాధులం దుపయోగించుదురు. వైద్యమునందు గూడ నివి యనేక విధములుగా నుపయోగింప బడుచున్నవి. మరియు నివి ఔషధముల శోధనభావనల కుపయోగింప బడుచున్నది.

(4) విశేషగుణములు:—

(క) జంబీరఫల (బాల) - అమ్లరసమును మధురానురసమును గలిగి యుండును. హితమైనది. ఆమమును పాకము జేయును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. రుచిని బుట్టించును. బలమును గలిగించును. పిత్తమును వృద్ధి బొందించును, వాతమును శమింపజేయును. (రా-ని.)

(ఖ) పక్వఫల - పిత్తమును వృద్ధిబొందించును. శ్వాసను బోగొట్టును. (ధ-ని.) తీక్ష్ణగుణమును, పరిమిళమును గలిగి యుండును జాఠరాగ్నిని వృద్ధి బొందించును. ఆమమును పాకముజేయును. రుచిని బుట్టించును. ముఖమును శోధించును. పిత్తమును వృద్ధిబొందించును. పార్శ్వశూలను, దౌర్గంధ్యమును బోగొట్టును. (సు-సూ-అ-46.) మధురానురసమును గలిగి యుండును. వర్ణ

మును వీర్యమును, పుష్టిని, తృప్తిని గలిగించును. కఫపిత్తములను శమింపజేయును. రక్తదోషమును బోగొట్టును. (రా-ని.) కష్టముగ జీర్ణమగును. (రా-వ.)

(గ) నింబూక (బాల) - అమ్లరసమును, కటుకాను రసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిపొందించును. నేత్రములకు హితమైనది. కంఠశోధనము జేయును, కఫమును శమింపజేయును. గుల్మమును ఆమవాతమును, కాసను బోగొట్టును. (రా-ని.)

(ఘ) పక్వనింబూక - మిగుల రుచిని బుట్టించును. (రా-ని.) తీక్ష్ణగుణమును గలిగియుండును. త్రిదోషజశూల, ఉదరము, గ్రహదోషము, అరుచి, అగ్నిమాంద్యము, క్రిములు, వాతరోగము, విషము, బద్ధగుదము, విషూచికయను నీ వ్యాధులను బోగొట్టును. (ఆ-సం.)

(చ) మిష్టనింబూకఫల - శీతవీర్యమును గలిగియుండును. తృప్తిని గలిగించును. వెంటనే శుక్రమును గలుగజేయును. పుష్టిని గలిగించును. కఫపిత్తములను శమింపజేయును. శ్రమను, అర్శస్సును బోగొట్టును. (ధ-ని.)

(5) ప్రయోగములు:—

1. అమ్లపిత్తమునందు జంబీర ప్రయోగము.

"జంబీరస్వరసః పీతః సాయం హన్త్యమ్లపిత్తకం ॥"

నిమ్మపండ్లరసమును ప్రతిరోజున సాయంకాలము పానముజేయుచుండిన అమ్లపిత్తము శమించును. (చ-ద.)

2. ఘృతము జీర్ణించుటకు జంబీర ప్రయోగము

"ఘృతస్య పరిపాకాయ జంబీరస్య రసోహితః ॥"

నిమ్మపండ్లరసమును సేవించిన అధికముగా పానముజేయబడిన ఘృతము వెంటనే జీర్ణమగును. (భా-ప్ర.)

3. మసూరికా ప్రాదుర్భావమునందు జంబీర ప్రయోగము.

"జంబీర నీరపరిపీతగుడం నరాణాం ।
ఆరంభకాలసమయేషు మసూరికాసు ।
సద్యః శమం నయతి గోపయసా ప్రభాతే॥"

నిమ్మపండ్లరసమునందు బెల్లమును గలిపి ప్రభాతకాలమున ఆవుపాలతో జేర్చి మసూచికయారంభించగనే పానముజేసిన అది వృద్ధిబొందక వెంటనే శమించును. (వై-మ.)

4. కర్ణశూలయందు జంబీర ప్రయోగము.

"జంబీరనీర శృతతైలమపి ప్రశస్తం ।
కర్ణే సశూలిని రహస్యపరాజ్ముఖేచ ॥"

నిమ్మపండ్లరసమునందు తైలమును జేర్చి పక్వముజేసి ఉదయసాయం త్రములందు కర్ణపూరణజేసిన కర్ణశూల శమించును. (వై-మ.)

(6) యోగములు:—

1. జంబీరాదిపానకము - అనుభూతము. మాత్ర:-1 పలము.

ఉపయోగములు:—అరుచి, అగ్నిమాంద్యము, ఛర్ది, జ్వరము, శూల, తృష్ణ యివి శమించును.

Action:—The fruit is refrigerant; its juice is antisordutic. The juice taken internally enters the blood as alkaline citrates, potassium salts and phosphoric acid, The citrates are partly oxidised into carbonic acid and water. The potassium salts and phosphoric acid act upon the red corpuscles. They precipitate uric acid and thus promote the formation of calculi. If long continued the juice or citric acid impairs digestions and impoverishes the blood. It is supposed to dissolve organic matters in the system; hence used in the treatment of atheroma.

Uses:—The juice of the fruit in doses of four to six drachms with 8 tims the quantity of water is employed as a very useful refrigerant drink in small-pox, measles, scarlation and other forms of fever where there is a very hot dry skin and much thirst. It is also useful in rheumatism, The juice of half a lemon in a little water, taken in cases of heartburn relieves it. Lime juice is most useful in dysentery with sloughing of the mucous membranes. Diluted lime-juice is found useful in cholera and in cases of typhoid fever as a mild germicide. The fruit eaten daily with salt is said to be a remedy of great value in enlargement of the spleen. In poisoning with croton-oil seeds, castor-oil seeds, the physic nut etc, a drink of lime juice 4 or 5 ounces at a time diluted with an equal quantity of congi or plain water gives immediate relief to the purging, vomiting and other urgent symptoms. Lemon juice, ginger juice, rock-salt, black salt and sonchal salt in equal parts mixed together and warmed, is used as a snuff (Nasya) for promoting discharge of phlegm in fevers complicated with pain in the head, throat and chest Applied to the surface at nights before going to bed it is believed also to afford protection from the attacks of mosquitoes. For pains such as neuralgia, backache etc, the parts are rubbed, with a portion of cut lemon. Rubbed on the scalp it is said to remove dandruff. A local application made of lime juice 5, javakhara (impure carbonate of potash) 4, copper sulphate 3 and borax 4 parts. is useful for warts and tumours.

Nadkarini Page. 212.

## స్వానుభవము

[నిమ్మకాయను పానీయముగాను, ఔషధముగాను నేను తరుచుగా నుపయోగించు చున్నాను. ఒకభాగము రసమునకు 8 భాగములు జలముచేర్చి తగుమాత్రము చక్కెర చేర్చి పానీయముగా నిచ్చుటచే మూత్రము వృద్ధియై జ్వరము తగ్గును. తాపము, దప్పి శమించును. జంబీర రసాయనము నందు నిమ్మపండ్ల రసముతో పాటు అల్లపురసము చక్కెరచేరి యున్నవి. విరేచినౌషధముల వేడితగ్గించుటకును వాటి రుచిని హెచ్చించుటకును జంబీర రసాయనమును చేర్చుట కలదు. నవీన పరిశోధకులు ఇందు వైటమిన్ 'C' అను జీవనీయ ద్రవ్యముగలదని చెప్పుచున్నారు. ఆ. ల.]

---

# 85

# జంబూః (మహా) - పెద్ద నేరేడుచెట్టు (క)

---

## భాషాంతర నామములు

హిందీ - జామ(ము)న్, మరాఠీ - జాంబూళ్, గుజరాతీ - జాంబు, మలయాళం - ఞావల్ కర్ణాటకం - నేరిలు ద్రావిడం - నావల్.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Myrtaceaaee

### నేరేడు కుటుంబము

### పెద్ద నేరేడుచెట్టు - Eugenia Jambolana

ఈ కుటుంబమునందు గులాబిజామ, లవంగంచెట్లు, జామచెట్లు దానిమ్మచెట్లు, కంబిచెట్లు, యూకాలిప్టసు మొదలగునవి చేరియున్నవి.

నేరేడుచెట్టు పెద్దది. అడవిచాలచోట్లనే పెరుగుచున్నది.

ఆకులు:—అభిముఖచేరిక, లఘుపత్రములు. తొడిమకలవు. కణుపు పుచ్ఛములు లేవు. విడివిచౌకపాకారము. సమాంచలము సన్నగాను దట్టముగాను నుండును. కొనయందు చిన్నవాలముగలదు అంచుచుట్టు ఈనెగలదు.

పుష్పమంజరి:—కణుపు సందులనుండి రెమ్మగెలలు, పుష్పములు సరాళము సంపూర్ణము.

పుష్పకోశము:—చిన్న చిన్న రక్షకపత్రములు. ఇవి ఒక్కొక్కప్పుడు అడుగున కలిసి యుండును. ఉచ్ఛము.

దళవలయము:—అసంయుక్తము ఆకర్షణపత్రములు నాలుగుచిన్నవి. గుండ్రము గాను ఆకుపచ్చగాను నుండును. పుష్పకోశము వంటియున్నవి.

కింజల్కములు:—అసంఖ్యములు. మొగ్గలో కాడలు మందునకు వంగియుండును పుప్పొడితిత్తులు రెండు గదులు.

అండకోశము:—అండాశయము నీచము. రెండు గదులు కీలము ఒకటి కీలాగ్రము చిన్నది. కండకాయ 1 గింజ.

ఈ కుటుంబములో, పెద్దచెట్లును గుబురు చెట్లును గలవు. అభిముఖచేరిక, సమాంచలము, లఘుపత్రములు వీనిలోను నారింజ ఆకులలోవలె గ్రంధికణములు గలవు. పుష్పములు సరాళములు. ఆకర్షణపత్రములు నాలుగో అయిదో యుండును. అవి త్వరగా రాలిపోవును. కింజల్కములుచాలగలవు. వానికాడలకుకూడ రంగుండు చుండును. అండాశయము నీచము. ఫలము కండకాయ.

నేరేదుచెట్లు నదీతీరము లందెక్కువగాఁ బెరుగుచున్నవి. వీనిలో చాలరకములు గలవు. మంచివానిని తోటలందు పైరు చేయుచున్నారు. వీని పండ్లను పులియఁ బెట్టి ఒకవిధమగు సారాయిని దీయుచున్నారు. దీనికలపయు బాగుగనే యుండును. ఇంటిపనులకును, నాగళ్ళు మొదలగునవి చేయుటకును, నూతిపనులకును బనికివచ్చుచున్నది. ఇది నీళ్ళలో త్వరగ జీకిపోదు. దీనియాకులను ఒకవిధమగు పట్టుపురుగు దినును. బౌద్ధులకు నీ చెట్లు పవిత్రములైనవి.

## పర్యాయ పదములు

శ్లో॥ ఫలేంద్రా కథితా నందో రాజజంబూ ర్మహాఫలా ।
తథా సురభిపత్రా చ మహాజంబూ రపి స్మృతా ॥

ఫలేంద్ర, నంద, రాజజంబు, మహాఫల, సురభిపత్ర, మహాజంబు అనునవి మహాజంబూ నామములు.

## మహాజంబూ గుణములు

శ్లో॥ రాజజంబూఫలం స్వాదు విష్టంభి గురు రోచనం ॥

పెద్దనేరేడుపండు మధురరసమును, గురుగుణమును గలిగి యుండును. రుచిని బుట్టించును. మలశోధమును గలిగించును.

## జలజజంబూః - నీటినేరేడుచెట్టు (ఖ)

శ్లో॥ క్షుద్రజంబూః సూక్ష్మపత్రా నాదేయీ జలజంబుకా ॥

క్షుద్రజంబు, సూక్ష్మపత్ర, నాదేయి, జలజంబుక అనునవి జలజజంబూ నామములు.

## జలజజంబూ గుణములు

శ్లో॥ జంబూః సంగ్రాహిణీ రూక్షా కఫపిత్తాస్రదాహజిత్ ॥

నీటి నేరేడుపండు రూక్షగుణమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. కఫమును శమింపజేయును. రక్తపిత్తమును, దాహమును బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(మహా) - ఫలేంద్ర, రాజజంబు, మహాఫల, సురభిపత్ర, (శుకప్రియ, కోకిలేష్ట, మహానీల, నీలఫల, మహాస్కంధ.) (జలజ) - క్షుద్రజంబు, సూక్ష్మపత్ర, (హ్రస్వఫల, భృంగవల్లభ, హ్రస్వా, పికభక్ష్య, కాష్ఠజంబు.)

(ఖ) ఉత్పత్తిబోధకములు:—(జలజ) - నాదేయి, (భూమిజంబు.)

(2) శబ్దార్థములు:—

ఫలేంద్ర - ఫలములలో శ్రేష్ఠమైనదిగ నుండునది. రాజజంబు-రాజులచే నుపయోగింపబడినది (ఇష్టమగునది.) మహాఫల - పెద్దవిగనుండు ఫలములుగలది. సురభిపత్ర - పరిమళించెడి యాకులను గలది. శుకప్రియ - చిలుకల కిష్టమగునది. కోకిలేష్ట - కోవెలల కిష్టమగునది. మహానీల - నీలఫల - మిగుల నల్లనివియగు పండ్లనుగలది. మహాస్కంధ - మిగుల లావుగను ఎత్తుగను పెరుగునది. క్షుద్రజంబు - హ్రస్వ - పొట్టిగా పెరుగునది. సూక్ష్మపత్ర- చిన్నవియగు పత్రములను గలది. హ్రస్వఫల - చిన్నవియగు ఫలములనుగలది. భృంగవల్లభ - తుమ్మెదల కిష్టమగు పుష్పములనుగలది. పికభక్ష - కోవెలల కిష్టమగు పండ్లనుగలది. కాష్ఠజంబు - మ్రానునే యంటియుండు ఫలములను గలది. నాదేయి - భూమిజంబు - నదియొడ్డున నుత్పత్తి యగునది.

(3) భేదములు:—

ఇది స్థలజ - జలజభేదముచే రెండు విధములుగా నుండును. అందు స్థలజము "మహాజంబు (లేక) రాజజంబు" అని వ్యవహరింప బడుచుండును. ఇది పై పదప్రయోగముచే రాజుల కిష్టమైనది యని తెలియగలదు. ఈ వృక్షము మిగుల లావుగను ఎత్తుగను పెరుగును. దీని యాకులు విశాలముగ నుండి పరిమళముతో గూడి యుండును. పండ్లు చిన్న చిన్న గుత్తులవంటి గుంపులుగను కొంచెము కోలగను (కొంచెము హెచ్చు తక్కువగ సీమరేగు కాయవలె) నుండును. మరియు నివి మిక్కిలి నల్లగా నుండి మధురముగా నుండును. ఈ వృక్షములు తక్కిన వానివలె నంత విశేషముగా నెల్ల చోటులను పెరుగవు.

జలజము క్షుద్రమహాభేదముచే తిరిగి రెండు విధములుగా నుండునట్లు తెలియగలదు. ఇవి వరుసగా జలజంబు (లేక) భూమిజంబు (నదులయొడ్డున నుత్పన్నమగునది) యనియు, కాకజంబు అనియును వ్యవహరింప బడుచున్నవి. ఇందు జలజంబు అనునది నదులయొడ్డున నుత్పన్నమై భూమివంటి పొట్టిగా పెరుగును. దీని యాకులును పండ్లును మిగుల చిన్నవిగ నుండును. ఈ పండ్లు ఇతరవృక్షముల పండ్లవలె గాక "కాష్ఠఫల" యని చెప్పుటచే నాకుల మొదటి భాగమున రెమ్మలవంటి యుండునట్లుగ తెలియగలదు. మరియు మాఘాది కావ్యములందు "జంబూలతే నుకవితే వసుకోమలాసి పాంథప్రియాసి రసి

కేవ మనోహరాసి యస్యా స్తటాశ్రియవశాచ్చ సమున్నతాసి తాం త్వం కృతజ్ఞ జనసేవన దీం నతాసి" యనియు, "ఫలభర పరిణామ శ్యామజంబూని కుంజ స్ఖలనముఖర భూరిస్రోతసో నిర్ఝరిణ్యః" అనియును వర్ణింపబడుటను బట్టి యిది యొక లతవలె నుండుననియు, నదులయందలి నీటికి మిగుల సమీపమున నుత్పత్తియై పండ్లభారముచే నీటిపై వంగి యుండుననియును దెలియగలదు.

కాకజంబు అనునది విశేషముగ నదులయొడ్డున నుత్పత్తియగును. ఇంతియేగాక నదులకు దూరమున నుండు ప్రదేశములందు గూడ విశేషముగ నుత్పత్తియగుచుండును. ఇదియు మహాజంబువలెనే యెత్తుగ బెరుగును. దీని యాకులు అంత పెద్దవిని చిన్నవిగాక మధ్యరకముగ గొద్దిగ వెడల్పును పొడవును గలిగి యుండును. ఇవి పరిమళమును గూడ గలిగియుండును. పండ్లు గుండ్రముగా గచ్చకాయలంతయుండి గుత్తులు గుత్తులుగా నుత్పత్తియగును. ఇవి బాగుగా పండినప్పుడు నల్లగ నుండును. మధురముగను వగరుగను గూడ నుండును. విశేషముగా కాకులు వీనిని భక్షించుచుండును. దీని పువ్వులను తుమ్మెదలు విశేషముగా నాశ్రయించియుండును. ఇటుల నేరేడు మూడువిధములుగ నున్నవని యితర నిఘంటువులవలన దెలియుచున్నను భావమిశ్రుడు రాజ - జలజంబువులను రెండు భేదములనే చేర్చియుండెను. పైవానిలో మూడవభేదమగు కాకజంబుగూడ "నాదేయి" యని చెప్పబడుటచే నిది గూడ నదులయొడ్డుననే యుత్పన్నమగుటంబట్టి యీ జలజంబు - కాకజంబువుల నొకేభేదముగా గ్రహింపబడి మొత్తము మీద రెండు భేదములుగా భావమిశ్రునిచే జెప్పబడినట్లు దెలియగలదు. అయితే నీకాకజంబు అనునది నదులయొడ్డుల నుత్పన్నమైనను జలజంబుకంటె మిగుల నెత్తుగ బెరిగి పెద్దవియగు ఫలములను గలిగియుండును. మరియు నీరెంటికిని గుణభేదము గూడ గానబడును. కేవలము నదులయొడ్డుననే గాక యితర ప్రాంతములందు గూడ నుత్పత్తియగుచుండును. కావున కాకజంబు గూడ ప్రత్యేకభేదమనియు, మొత్తముమీద జంబువులు మూడువిధములుగా నుండు ననియు దెలియగలదు.

(4) విశేషగుణములు:—

(క) రాజజంబు - విశేషముగ వాతమును వృద్ధి బొందించును. కఫపిత్తములను శమింపజేయును. చ-సూ-అ-27.) అమ్లానురసమును గలి

యుండును. (ధ-ని.) కషాయానురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. స్వరమును గలిగించును. ఆమమును పాకముజేయును. శ్రమ, శోష, అతిసారము, శ్వాస, కఫజకాస, దాహము, కంఠరోగము, క్రిమిరోగము వీనిని బోగొట్టును. (రా-ని.)

(ఖ) కాకజంబు - కషాయరసమును, ఆమ్లానురసమును, గురుగుణమును, మధురవిపాకమును గలిగియుండును. వీర్యమును, పుష్టిని, బలమును గలిగించును. దాహమును, శ్రమను, అతీసారమును బోగొట్టును. (రా-ని.) శీతవీర్యమును గలిగియుండును. మలాదులను నిరోధించును. కఫపిత్తములను శమింపజేయును. రక్తదోషమును, వ్రణమును బోగొట్టును. (ని-ర.)

(గ) జలజంబు (లేక) భూమిజంబు - కషాయరసమును గలిగియుండును. హృదయమునందును, కంఠమునందును రూక్షత్వమును గలిగించును. (ధ-ని.) మధురానురసమును గలిగియుండును. హృద్యము, కంఠదోషమును బోగొట్టును. వీర్యము, పుష్టిని గలిగించును. (రా-ని.)

(ఘ) జంబూవృక్షగుణములు:— కషాయరసమును, మధురానురసమును గలిగి యుండును. రుచిని బుట్టించును. ఆమమును పాకముజేయును. మలబంధమును గలిగించును. పిత్తమును శమింపజేయును. శ్రమను, దాహమును, కంఠరోగమును, శోషను, క్రిములను, శ్వాసను, అతీసారమును, కఫకాసను బోగొట్టును. (రా-ని.)

(చ) జంబూబీజగుణములు:— కషాయరసమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. విశేషముగ మధుమేహమును బోగొట్టును. (ని-ర.)

(ఛ) అంకురగుణములు:— నేరేడు మొలకలు రూక్షగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. ఆధ్మానమును గలిగించును. (ని-ర.)

(5) ప్రయోగములు:—

1. వ్రణమునందు జంబూప్రయోగము.

"లోధ్రజాంబవకట్ఫలైః ।
త్వచ మాశ్వేవ గృహ్ణంతి త్వక్చూర్ణైశ్చూర్ణితా వ్రణాః" ॥

లొద్దుగపట్ట, నేరేడుపట్ట, కాయఫలచెక్క- వీనిని మెత్తగాచూర్ణించి వ్రణములపై నవచూర్ణనముజేసిన శీఘ్రముగా రోపణమగును. (చ-చి-అ-13.)

2. వమనమునందు జంబూ ప్రయోగము.

"జంబ్వామ్రయోః పల్లవజం కషాయం ।
పిబేత్ సుశీతం మధుసంయుతం వా ॥ "

నేరేడుచిగుళ్లు, మామిడిచిగుళ్లు వీనితో కషాయముగాచి, చల్లార్చి యందు తేనె చేర్చి పానము జేసిన పిత్తజవమనము శమించును. (చ-చి-అ-23.)

3. కుకూణకమునందు జంబూ ప్రయోగము.

"జంబ్వామ్రధా త్ర్యణుదలైః పరిభావనార్థం ।
కార్యం కషాయ మవసేచన మేవ చాపి " ॥

బాలురకు వచ్చు కుకూణకమను వర్త్మరోగమునందు నేరేడుచిగుళ్ళు, మామిడిచిగుళ్ళు, ఉసిరికచిగుళ్లు వీనితో కషాయము గాచి క్షాళన-సేకములు జేసిన శమించును. (సు-ఉ-అ-19.)

4. రక్తపిత్తమునందు జంబూ ప్రయోగము.

"పిబేచ్ఛీతకషాయంవా జంబ్వామ్రార్జునసంభవం ॥ "

నేరేడుపట్ట, మామిడిపట్ట, మద్దిపట్ట వీనియొక్క శీతకషాయమును సేవించిన రక్తపిత్తము శమించును. (సు-ఉ-అ-45.)

5. క్రిమికర్ణమునందు జంబూ ప్రయోగము.

"జంబూపక్వం ఫలం పక్వం తద్రసేనాతిపూరితాత్ ।
పతంతి క్రిమయః కర్ణా ద్బుర్ణితా ఇవాపది ॥ "

పండిన నేరేడుపండ్లను పండ్లను మెత్తగా నలియగొట్టి రసమును గ్రహించి దీనితో క్రిమికర్ణమునందు కర్ణపూరణము జేసిన క్రిములు పడిపోవును. (గ-ని.)

6. ప్రదరమునందు జంబూ ప్రయోగము.

"కాకజంబూకమూలం వా ।
పాండుప్రదగశాంత్యర్థం పాయయే త్తండులాంబునా " ॥

కాకి నేరేడుమూల కల్కమును బియ్యపుకడుగుతో సేవించిన శ్వేత ప్రదరము శమించును. (గ-ని.)

7. బాలగ్రహణియందు జంబూ ప్రయోగము.

"తద్వదజాక్షీరసమో జంబూత్వగుద్భవోరసః " ॥

బాలురకు గలుగు గ్రహణీరోగమునందు నేరేడు పెక్క రసమును సమాంశముగ మేకపాలతో జేర్చి యిచ్చిన శమించును. (చ-ద.)

8. రక్తాతిసారమునందు జంబూ ప్రయోగము.

"శల్లకీ బదరీ జంబూ త్వచః॥ ।

పీతాః క్షీరేణ మధ్వాఢ్యాః పృథక్ శోణితనాశనాః " ॥

అందుగుచెక్క, రేగుచెక్క, నేరేడుచెక్క వీనిలో నేయొకదాని నైన కల్కముగా నూరి తేనెగలిపి పాలతో సేవించిన రక్తాతిసారమునందు రక్తస్రావము శమించును. (చ-ద.)

(6) యోగములు:—

1. జంబ్వాదికషాయము - వా-ఛర్ది. మాత్ర:-1 పలం.

ఉపయోగము:—ఛర్ది, జ్వరము, అతీసారము, మూర్ఛ, తృష్ణ ఇవి శమించును.

2. జంబ్వాదితైలము - భైషజ్య-కర్ణరోగ.

ఉపయోగములు:—కర్ణపూరణముజేసిన కర్ణస్రావము శంమించును.

3. జంబ్వాది ఘృతము - బ-రా-అసృగ్దర. మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—రక్తపిత్తము, రక్తాతీసారము, అసృగ్దరము, యోని దోషము, రక్తార్శస్సు ఇవి శమించును.

(7) Actions and uses:—(రాజజంబూ - మహాజంబూ) The juice of the ripe fruit or syrup is stomachic, astringent and diuretic and given in scanty urine. The decoction of the bark is astringent and used in diarrhoea of children, in chronic dysentery; as a gargle mixed with Dhumaso for the relief of spongy gums, and sore, cracked or irritable tongue. A paste of the leaves is used to promote healthy discharges from indolent sores or from unhealthy ulcers. The extract of the powdered seeds and dried fruits is used in diabetes. It checks diastatic conversion of starch into sugar in cases depending on increased production of glucose. R. N. Khory II. p. 269.

## స్వానుభవము

[నేరేడుపట్ట కషాయము సంగ్రాహిగా నతిసారము నందును, ఉత్తరవస్తియందు ప్రక్షాళన కషాయముగను నేను ఉపయోగించుచున్నాను. నేరేడుగింజల కషాయమును ప్రమేహమునం దుపయోగించు నౌషధముల కనుపానముగా నుపయోగించుట కలదు. నేరేడుపండ్లనుండి తయారుచేసిన షర్బతు రుచిగా నుండును. ఆ. ల.]

# 86

# జాతిః - జాజిమల్లి (తెల్లది) (క)

---

## భాషాంతర నామములు

హిందీ - జాతి, మలయాళం - పిచ్చకం, మాలతి, కర్ణాటకం - జాజిమల్లె, ద్రావిడం - జాజిమల్లె.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Oleaceae

మల్లి కుటుంబము

జాజిమల్లి - **Gasminum grandiflorum (Eng. Spanish Jasmine)**

మల్లితీగె పందిళ్ళమీదను చెట్లుమీదను ప్రాకునుగాని దానికి నులితీగెలుండవు. కొమ్మలను చిక్కుడు తీగెవలె చుట్టుకొనవు.

ఆకులు:—అభిముఖచేరిక, లఘుపత్రములు కుఱుచతొడిమ అండాకారము. సమాంచలము, విషమరేఖపత్రము కొనగుండ్రము. రెండువైపుల నున్నగా నుండును.

పుష్పమంజరి:—కొమ్మల చివరలనుండి గుత్తులు పువ్వులు తెలుపు. సరాళము. మంచివాసనవేయును.

పుష్పకోశము:—సంయుక్తము గిన్నెవలెనుండు అంచున చాల సన్నని తమ్మెలు అయిదు మొదలు తొమ్మిదివరకునుండును. ఆకుపచ్చని రంగు నిడుపు.

దళవలయము:—సంయుక్తము, ఛత్రాకారము, అడుగున గొట్టము వలెనుండి, చివర పెద్దతమ్మెలుండును. తెలుపు.

కింజల్కములు:—రెండు, కాడలులేవు. పుప్పొడితిత్తులు మాత్రము దళవలయమునంటికొని రెండుగలవు. అవి దళవలయపు తమ్మెలును గొట్టమును గలియుచోటనున్నవి. రెండేసిగదులు.

అండకోశము:—అండాశయము ఉచ్చము రెండుగదులు కీలము లావుగనుండును.

ఫలము:—రెండు కండకాయలు గాయును.

సాధారణముగ మనదొడ్లలో పెరుగువానిని కొమ్మలు నాటిపెంచుచు వచ్చుటవలన వానికి కాయలు గాయుశక్తి తగ్గిపోయినది.

చిన్నచెట్లును చిగురుమొక్కలు ఈకుటుంబమున గలవు. కొన్ని తీగెలవలె నెగబ్రాకును గాని వానికి నులితీగెలుగాని ముళ్ళుగాని యుండవు ఆకులు లఘుపత్రములుగను మిశ్రమపత్రములుగను గూడ నున్నవి. వీనికి గణుపుపుచ్ఛము లుండవు. పుష్పమంజరులు సాధారణముగ త్రివృంత మధ్యారంభమంజరులు మిథునపుష్పములు ఏకలింగ పుష్పములును గలవు పోతుమొక్కలు ఆడుమొక్కలు కొన్నిటిలో నున్నవి. పుష్పకోశము, దళవలయము సంయుక్తము నాలుగు మొదలు తొమ్మిదివరకు తమ్మెలుండును. అవి మొగ్గలో నల్లుకొనియుండును. కింజల్కములు రెండు కాడలుపొట్టి. అండాశయము ఉచ్చము. రెండుగదులు.

## పర్యాయ పదములు

శ్లో॥ జాతి ర్జాతీచ సుమనా మాలతీ రాజపుత్రికా।
చేతకీ హృద్యగంధా చ ॥

జాతి, జాతీ, సుమన, మాలతి, రాజపుత్రిక, చేతకీ, హృద్యగంధ యనునవి శ్వేతజాతి నామములు.

## స్వర్ణ జాతిః — పచ్చజాజిమల్లి (ఖ)

శ్లో॥ సా పీతా స్వర్ణ జాతికా ॥

స్వర్ణ జాతిక యనునది స్వర్ణ జాతి నామము.

## జాతిద్వయ గుణములు

శ్లో॥ జాతీయుగం తిక్తముష్ణం తువరం లఘుదోషజిత్ ।
శిరోఽక్షిముఖదంతార్తి విషకుష్ఠవ్రణాస్రజిత్ ॥

రెండు విధములగు జాజిమల్లెలు తిక్తరసమును, కషాయానురసమును, లఘుగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. త్రిదోషములను శమింప జేయును. శిరశ్శూల, నేత్రశూల, ముఖశూల, దంతశూల, విషము, కుష్ఠము, వ్రణము, రక్తదోషము అను నీ వ్యాధులను బోగొట్టును.

## వి శే షాం శ ము లు

(1) ప్రసిద్ధనామములు:—

పరిచయబోధకములు:—(శ్వేతజాతి) - హృద్యగంధ, రాజపుత్రిక, సంధ్యాపుష్పి, వర్షాభవ, (స్వర్ణ జాతి) - స్వర్ణ జాతిక.

(2) శబ్దార్థములు:—

హృద్యగంధ - మనోహరమైన పరిమళముగలది. రాజపుత్రిక - రాజగృహములందు పుత్రికలతో సమముగ పెంచబడు నట్టిది. సంధ్యా పుష్పి - సంధ్యాకాలమున పుష్పించునట్టిది. వర్షాభవ - వర్షర్తువునందు పుష్పించునది. స్వర్ణ జాతిక - బంగారువలె పచ్చని పూవులను గలది.

(3) భేదములు:—

ఇది తెలుపు పసుపు భేదముచే రెండు విధములుగా నుండి భూమిపై నెత్తుగ పొదవలె బెరుగు క్షుపజాతులలో నుత్పత్తి గలిగి పుష్పవర్గములో గణింపబడు చున్నది. వీనిలో తెల్ల పుష్పములు గలదే విశేషముగా లభింప గలదు. ఇది ప్రతి గృహారామమునందును బెంచబడు చుండును. ఈ పుష్ప

ములు మిక్కిలి సువాసనగలిగి యుండును. మొగ్గలు సాయంకాల మగుసరికి వికసించు చుండును. స్త్రీలు విశేషముగా నీ పుష్పములను ప్రేమించి తమ శిరస్సుల నలంకరించుకొందురు. కన్ను ఎర్రబడి మంట, సోవముతో గూడి యున్నప్పుడు ఈ పుష్పములను కంటిపైనుంచి కట్టు కట్టినచో బాధ శమించును. మరియు దీని యాకులు వ్రణములం దుపయోగింప బడినట్లును తెలియగలదు.

(4) విశేషగుణములు:—

(క) శ్వేతజాతీపుష్ప - కఫవాతములను శమింపజేయును. (ధ-ని.) తిక్తరసమును, శీతవీర్యమును గలిగి యుండును. కఫమును శమింపజేయును. ముఖపాకమును బోగొట్టును. (రా-ని.) కఫపిత్తములను శమింపజేయును. (ని-ర)

(ఖ) శ్వేతజాతీముకుల - నేత్రములకు హితమైనది. (ధ-ని.) నేత్రరోగమును, వ్రణమును, విస్ఫోటమును, కుష్ఠమును బోగొట్టును. (రా-ని.)

(గ) స్వర్ణజాతీపుష్ప - దన్తశూలను. రక్తదోషమును, కర్ణపూయమును, కర్ణశూలను బోగొట్టును. (ని-ర.)

(5) ప్రయోగములు:—

1. పూతికర్ణము నందు జాతిప్రయోగము.

"జాతీపత్రరసే తైలం విపక్వం పూతికర్ణజిత్ ॥"

జాజియాకుల స్వరసముతో తైలపాకము జేసి కర్ణపూరణము జేసిన పూతికర్ణము శమించును. (భా-ప్ర.)

2. మూత్రరోగమునందు జాతి ప్రయోగము.

"అజాక్షీరేణ సంమిశ్రం జాతీమూలం ప్రపేషితం ।
పిబే త్స్యదాహమూత్రార్తిష్ణ వేదనాశమనం యతః ॥"

జాజివేరును మేకపాలతో నూరి సేవించిన దాహము, ఉష్ణము, వేదన వీనితో గూడిన మూత్రరోగము శమించును. (హా-సం.)

3. కర్ణశూలయందు జాతి ప్రయోగము.

"జాతీపత్రయుతం పక్వం గోమూత్రం వస్త్రగాలితం ।
ఈషదుష్ణం భృతం కర్ణే శూలపూతివినాశనం ॥"

జాజియాకులను గోమూత్రములో వేసి కాచి వడియకట్టిన దానిని గోరువెచ్చగా కర్ణపూరణము జేసిన కర్ణశూల, కర్ణపూయము శమించును. (గ-ని.

4. ముఖపాకమునందు జాతి ప్రయోగము.

"కార్శ్యంచ బహుధా నిత్యం జాతిపత్రస్య చర్వణం॥"

జాజి యాకులను నిత్యము నమలు చుండినచో ముఖపాకము శమించును. (భా-ప్ర.)

(6) యోగములు:—

• జాత్యాదిఘృతము-వా-ఉ-వ్రణ.

ఉపయోగములు:—అభ్యంగము జేసిన దుష్టవ్రణము, నాడీవ్రణము శమించును వ్రణశోధనము రోపణము నగును.

2. మాలత్యాది గంధరాజతైలము - భైషజ్య-గదోద్వేగ.

ఉపయోగములు:—పానాభ్యంగములుగా నుపయోగించిన వాత రోగము, కార్శ్యము, అగ్నిమాంద్యము, క్లైబ్యము, శుక్రమేహము, స్నాయు రోగము ఇవి శమించును. గర్భస్థాపన మగును. బాలురకు పుష్టి కలుగును.

3. మాలత్యాదిఘృతము - భైషజ్య - ముఖరోగ.

ఉపయోగములు:—అభ్యంగము జేసిన ముఖరోగము శమించును.

4. మాలత్యాదితైలము - భైషజ్య - క్షుద్రరోగ.

ఉపయోగములు:—అభ్యంగము జేసిన ఇంద్రలుప్తము, దారుణము ఇవి శమించును.

The leaves contain a resin, salicylic acid, an alkaloid named iasminine and an astringent principle. The leaves are astringent in action. The whole plant is considered to be anthelmintic, deobstruenr, diuretic and emmenagogue. From the flwers a perumed oil or otto is prepared, which is greatly esteemed as cooling and used by the rich for anointing their bodies before bathing, also used as a perfume. It is cooling when applied externally, in skin diseases, headache and weak eyes. According to Bhavaprakash the leaves are chewed in aphthae and ulcers in the mouth and the leaf-juice. The oil obtained from it is dropped into the ear according to Chakradatta, in cases of otorrhoea etc, and the fresh juice of the leaves is a ualuble application for so t corns between the toes. Nadkarni p. 480.

స్వానుభవము.

[వసంత కుసుమాకరమునందు మాలతీపూల రసముతో మర్దన ముఖ్యముగా చేయుచున్నారు. బసవరాజీయము (9) మేహ ప్రకరణము చూడుము. ఆ. ల.]

# 87

# జాతీఫలం - జాజికాయ (క)

## భాషాంతర నామములు

హిందీ - జాయఫల్, మరాఠీ - జాయఫళ, గుజరాతీ - జాయఫళ, మలయాళం-జాతిక్కా, కర్ణాటక -జాయికాయ్, ద్రావిడం-జాతిక్కాయ్.

## Natural Order—Myristiceae.

జాజికుటుంబము

### జాజికాయ - Myristica fragrans (Nut meg)

జాజిచెట్టు ముప్పది నలుబది యడుగు లెత్తు పెరుగును. ఇది ఏకలింగ వృక్షము.

ఆకులు—ఒంటరిచేరిక. లఘుపత్రము చిన్నవి. సమాంచలము సమగోళాకారము. విషమరేఖపత్రము. ఆకు బిరుసుగా నుండును. కొనవాలముగలదు.

పుష్పమంజరి—మగపుష్పములు గెలలు. ఏకలింగపుష్పములు చిన్నవి అసంపూర్ణము. స్త్రీపుష్పమొక కణుపునందున నొకటియే. ప్రతిపువ్వువద్ద చేటికగలదు.

పురుషపుష్పము—

పుష్పనికోశము—సంయుక్తము 3 చిన్నతమ్మెలు. నీచము.

కింజల్కములు—తొమ్మిది మొదలు పందెండువఱకు అన్నియుగలసి యున్నవి. పుప్పొడితిత్తులు రెండుగదులు.

స్త్రీపుష్పము—

పుష్పనికోశము—పైదానివలె నుండును.

అండకోశ ముచ్ఛము ఒకటియే స్త్రీపత్రము, అండము ఒకటి గింజకు బీజపుచ్ఛము గలదు. కీలము లేదు కీలాగ్రములు రెండు.

ఇదియొక చిన్నకుటుంబము. దీనిలో చిన్నచిన్న మొక్కలు లేవు. ఆకులు ఒంటరిచేరిక. సమాంచలము చిన్నఏక లింగపుష్పములు. అండాశయమునందొక గదియు నందొక గింజయు నున్నవి.

జాజిచెట్లు ఒండ్రుమట్టినేలలో బాగుగ బెరుగును వీనికి ఇసుక నేలలు పనికిరావు. శీతల ప్రదేశములనుగూడవు. గింజలను బాతినచే మొక్కలు మొలచును. ఈచిన్న మొక్కలకనుదినము నీరు పోయుచుండవలెను. అవి రెండుమూడడుగులెత్తు పెరిగిన తరువాతదీసి 25. 30 అడుగులదూరములో బాతవలెను. వీనికంతగా నెండతగులనీయ కూడదు. తఱుచుగా నీరు పోయుచుండ వలెను. చెట్లు పెద్దవై పుష్పించుట కారంభింపగానె, అవి ఆడచెట్లో పోతుచెట్లో తెలిసికొని. పదిపండెండు ఆడచెట్ల కొక మగచెట్టు చొప్పుననుంచి మిగిలిన మగచెట్లను గొట్టివేయవచ్చును. వీనినుండి పుప్పొడి ఆడచెట్లను సులభముగా జేరుట కీమగ చెట్లను గాలివచ్చెడు మార్గమందుంచ వలెను. ఏడవ యేడునుండియు గాయలు కాయుటకారం

తంభించి ఏబదిఏండ్ల వరకుఁ కాయుచుండును. ఒక్కొకచెట్టునుండి బాగుగ కాయలు గాచు చుండినపుడు 200 కాయలవఱకు వచ్చును.

కాయలు రాలగనే ఏటి తొక్కవలచి నిప్పుపైఁబెట్టి కొంచెము వెచ్చబెట్టుదురు. తఱువాత పురుగులు బటకుండా వానిని కొంచెము సున్నముతో రాచెదరు.

కాయలు పైచర్మమె జాపత్రి. దీవినాలవగనే ఎండలోఁబెట్టుదురు.

జాజికాయలనుండియు జాపత్రినుండియుగూడ చమురుతీసి దానిని సుగంధద్రవ్యములలో వాడుచున్నారు. దీనినిమనము తఱచుగా తాంబూలమునందు వాడుచున్నాము. వీనిని నౌషధములలో గూడ వాడుచున్నారు.

## పర్యాయ పదములు

శ్లో॥ జాతీఫలం జాతికోశం మాలతీఫల మిత్యపి ॥

జాతీఫలము, జాతికోశము, మాలతీఫలము అనునవి జాతీఫలనామములు.

## జాతీఫల గుణములు

శ్లో॥ జాతీఫలం రసేతిక్తం తీక్ష్ణోష్ణం రోచనం లఘు ।
కటుకం దీపనం గ్రాహి స్వర్యం శ్లేష్మానిలాపహం ॥
నిహంతి ముఖవైరస్యం మలదౌర్గంధ్యకృష్ణతాః ।
కృమి కాస వమి శ్వాస శోష పీనస హృద్రుజః ॥

జాజికాయ తిక్తరసము, కటుకానురసమును, తీక్ష్ణలఘుగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. మలాదులను నిరోధించును. మంచి స్వరమును గలిగించును. కఫవాతములను శమింపజేయును. ముఖవైరస్యము, మలదౌర్గంధ్యము, మల కృష్ణత్వము, క్రిమిరోగము, కాస, ఛర్ది, శ్వాస, శోష, పీనసము, హృద్రోగము వీనిని బోగొట్టును.

## జాతిపత్రి — జాపత్రి (ఖ)

## భాషాంతర నామములు

హింది - జావత్రి, మరాఠి, జాయపత్రి, గుజరాతి - జావంత్రి, మల యాలం - జాతిపత్రి, కర్ణాటకం - పత్రె, ద్రావిడం - జాతిపత్రి.

## పర్యాయ పదములు

శ్లో॥ జాతీఫలస్య త్వక్ప్రోక్తా జాతిపత్రీ భిషగ్వరైః ॥

జాజికాయకు పైనుండు త్వక్కు (తోలు) జాతిపత్రియని జెప్పబడును.

## జాతిపత్రి గుణములు

శ్లో॥ జాతిపత్రి లఘుః స్వాదుః కటూష్ణా రుచివర్ణకృత్ ।
కఫకాసవమిశ్వాస తృష్ణాకృమివిషాపహా ॥

జాపత్రి మధురరసమును, కటుకొనురసమును, లఘుగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. రుచిని, వర్ణమును గలిగించును. కఫమును శమింపజేయును. కాస, ఛర్ది, శ్వాస, తృష్ణ, కృమి, విషము వీనిని బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(జాతిఫల)-జాతీఫలము, జాతికోశము, (రాజభోగ్యము, శాలూకము, మజ్జసారము, పుట), (జాతిపత్రి) -జాతిపత్రి, (జాతీకోశ, పత్రిక.)

(ఖ) గుణబోధకములు:—(ఫల) - (మదశౌండ).

(2) శబ్దార్థములు:—

జాతీఫలము - జాతిచెట్టుయొక్క ఫలము. జాతికోశము - జాపత్రి యను పైకప్పుతో గూడిన ఫలము. రాజభోగ్యము - రాజులచే సేవింపదగినది. శాలూకము - పైని కప్పుతో గూడియుండునది. మజ్జసారము - బీజమునందు సారము (గుణము) గలది. పుట - లోహాదులపుట సంస్కారమున నుపయోగించు శరావసంపుటమువంటి పైకప్పు గలది. జాతిపత్రి - జాజికాయను పైన పత్రమువలె గప్పి యుండునది. జాతికోశము - జాతీఫలమునకు పైన కోశాకారముగ గప్పి యుండునది. పత్రిక - పత్రమువలె నుండునది. మదశౌండ - మద్యమువలె మత్తును గలిగించునది.

N. B.—ఇది జాజియను చెట్టునుండి యుత్పత్తి యగును. నారికేల ఫలమువలె నొక విధమగు పసపు ఎరుపు గలసిన వర్ణముగల పత్రమువంటి ద్రవ్యముతో గప్పబడి (తేలికగ వలుచుటకు వీలగునట్లు), లోపల నండమువలె నుండును. ఇట్టి కాయకు పైనుండి వొలుపు గుద్దునకుండు పై కపాలమువలె గట్టిగా నుండును. ఈ వొలుపును పగులగొట్టిన లోపల నండాకారముగ బీజముండును. ఇట్టి బీజమే జాజికాయగా గ్రహింప బడుచుండును. దీనికి పైని గప్పియుండు యొక విధమగు వర్ణముతో గూడిన పత్రమే జాపత్రి యని వ్యవహరింప బడుచున్నది. ఇటుల జాపత్రి చే గప్పబడి యుండు బీజమునకు

పెంకువంటి పదార్థముచే గూడ పైనికప్పబడియుండి యితరవృక్షముల కాయలవలెనే యిదియు గానుపించును. కాయలు పక్వమైనప్పుడు గోసి యెండ బెట్టుదురు. అప్పుడు వానిని పగులగొట్టగా పైవిధముగా పత్రిముచే గప్పబడి యుండు బీజము గానుపించును. ఇవిరెండును స్నైగ్ధ్యమును గలిగియుండును. సుగంధమును గలిగి యుండును. ఇందుచేతనే ఇవి సుగంధద్రవ్యములలో గణింపబడుచున్నవి. పైని జెప్పినట్లు రాజభోగ్యములే గాకుండ సామాన్యముగ నెల్లరిచే నివి రెండును తాంబూలసేవనయందు దుపయోగింపబడు చుండును. ఇవి సుమిత్రి - సింహళము, పినాంగు మొదలగు ప్రాంతములందుత్పత్తి యగు చుండునని శాలిగ్రామ నిఘంటుకారునిచే జెప్పబడినది.

(3) విశేషగుణములు:—

(క) ఫల - కషాయరసమును గలిగి యుండును. వెంటనే శుక్రమును గలిగించును. అతీసారమును, ప్రమేహమును, కంఠరోగమును బోగొట్టును. (రా-ని.) తృష్ణను, శూలను బోగొట్టును (రా-వ.)

(ఖ) జాతీఫల తైలగుణములు:— ఉత్తేజమును గలిగించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. బలమును గలిగించును. పక్వాతిసారము, ఆధ్మానము, ఆక్షేపకవాతము, శూల, ఆమవాతము, దన్తవేష్టజప్రణము వీనిని బోగొట్టును. (ఆ-సం.)

(గ) జాతిపత్రి - కటురసమును, తిక్తానురసమును గలిగి యుండును. ముఖమునకు వైశద్యమును గలిగించును. ముఖజాడ్యమును బోగొట్టును.(రా-ని.) శరీరదౌర్గంధ్యమును ముఖదౌర్గంధ్యమును బోగొట్టును. (రా-వ.)

(4) జాతీఫల శ్రేష్ఠతాది లక్షణములు:—

జాతీఫలం సశబ్దంచ స్నిగ్ధం గురుచ శస్యతే।
లఘుకం శబ్దహీనం చ రూక్షాంగ మతినిందితం "॥

జాజికాయ, లోపల శబ్దము గలదిగను, స్నిగ్ధముగను, బరువుగను నుండిన శ్రేష్ఠమైనదిగ నెంచబడును, తేలికగను, శబ్దము లేనిదిగను, రూక్షముగను నుండిన హీనమైనదిగ జెప్పబడును. (భైషజ్య-ర.)

(5) ప్రయోగములు:—

1. పిపాసోత్క్లేశమునందు జాతీఫల ప్రయోగము.

"పిపాసాయా మథోత్క్లేశే...జాతీఫలస్యవా శీతం "॥

జాతీఫలముతో జేసిన శీతకషాయమును పానము జేసిన తృష్ణయు, ఉత్క్లేశము (ఓకరింత)ను శమించును. (చ-ద.)

2. వ్యంగాదులందు జాతీఫల ప్రయోగము.

"జాతీఫలస్య లేపస్తు హన్యాద్ వ్యంగం చ నీలికాం" ||

జాజికాయను మెత్తగా నూరి లేపనము జేసిన వ్యంగము, నీలిక యివి శమించును. (భా-ప్ర.)

3. విపాదికయందు జాతీఫల ప్రయోగము.

"పిష్ట్వా జాతీఫలం లేపాత్ వినిహంతి విపాదికాం" ||

జాజికాయను నీళ్ళతో మెత్తగా నూరి లేపనము జేసిన విపాదిక శమించును.

(6) యోగములు:—

1. జాతీఫలరసము - భైషజ్య-అతీసార. మాత్ర:-1 గుంజ.

ఉపయోగములు:—జాఠరాగ్ని వృద్ధిబొందును. అతీసారము, రక్తజ గ్రహణి యివి శమించును.

2. జాతీఫలాదిచూర్ణము (బృహత్) - భైషజ్య-గ్రహణి. మాత్ర:- 10 యవలు.

ఉపయోగములు:—గ్రహణి, అతీసారము, కాస, శ్వాస, క్షయము, అగ్నిమాంద్యము, పీనసము, ప్రతిశ్యాయము ఇవి శమించును.

3. జాతీఫలాదివటి - ర-సా-సం-అజీర్ణ. మాత్ర:-2 రక్తికలు.

ఉపయోగములు:—అజీర్ణము, అతిసారము, ప్రవాహిక, గ్రహణి, శ్వాస, కాస, కంఠరోగము ఇవి శమించును.

4. జాతీఫలాద్యవటిక - ర-సా-సం-గ్రహణి. మాత్ర:-3 యవలు.

ఉపయోగములు:—గ్రహణి, అతీసారము, ప్రవాహిక, అగ్నిమాంద్యము, శ్వాస, కాస, క్షయము ఇవి శమించును. శుక్రస్తంభనము జేయును.

5. జాతీఫలాదిలేపము - వై-చిం-క్షుద్రరోగ.

ఉపయోగములు:—లేపనము జేసిన ముఖదూషిక యను యౌవనపిటక లుశమించును.

(7) Actions and uses:—Aromatic, stomachic and stimulant. In small dozes it stimulates digestion, increases appetite, relieves flatulence, dyspepsia and colic. In large dozes it causes stupor and delirium. As a carminative, anodyne and astringent it is given in diarrhoea and dysentery, to allay nausea and vommitting; small dozes frequently given, relieve strangury. A paste of it is used as an external application to the head in headache, palsy, cramps etc. The wood is used as an astringent to check diarrhoea. The oil is stimulent and carminative; in large dozes narcotic and is given in atonic dyspepsia, diarrhoea and as an adjunct to other stimulent medicines. Locally, diluted with bland oil it is applied in rheumatism, paralysis, sprains etc. Butter of nutmeg is externally applied in rheumatism, contusions, sprains etc. Mace is used for the same purpose as kernal.

R. N. Khory II p. 524.

## స్వానుభవము

[మోతాదు:—5 మొదలు 15 వడ్ల గింజలయెత్తు చూర్ణము తేనెతో తీసికొనునది.

గుణము:—గ్రాహి, సుగంధి, పాచనీయము, ఉత్తేజకము, వృష్యము.

ఉపయోగములు:—చిన్న మోతాదులలో నిది జీర్ణశక్తి నభివృద్ధి జేయును, అన్నరుచిని ఎక్కువ జేయును; ఆంత్రములయందలి ఆటోపమును తగ్గించును; అజీర్ణమును, పేగులలో శూలలను పోగొట్టును. హెచ్చు మోతాదులలో నిది ప్రలాపమును మోహమును కలిగించును. పాచనము, శూలహరము గ్రాహియగుటచే అతిసారములోను, ప్రవాహికలోను, ఓకరింతలోను, వాంతులలోను ఈయబడుచున్నది. దీనిని చిన్న మోతాదులతో మూత్రకృచ్ఛ్రములో నిత్తురు. తలనొప్పి యున్నప్పుడు దీనిగంధమును తలకు పట్టు వేయుదురు. దీనిలోనుండి తీసిన తైలమును మందాగ్ని (Atonic dyspepsia) లోను, అతిసారములోను ఇత్తురు. ఇతరములైన మందు

లలో గూడ జేర్చుదురు. నూనెతో ఈ తైలమును కలిపి ఆమవాతపు నొప్పులకుపైన పూయుదురు. ముఖములో వర్ణ ముచెడి మచ్చలు మొదలయినవి యున్నప్పుడు దీనిగంధమును పూయవచ్చునని భావ ప్రకాశలో జెప్పపడి యున్నది. వంగ శేనుడు ఈ గంధమునే చర్మమునందుంచు కుష్ఠ గ్రంధులకు పూయవలెనని జెప్పియున్నాడు. దీనిని తాంబూలములో నుప యోగించిన వృష్యమును, పాచనీయమును. ఆ. ల.]

---

# 88

# జీరకం - (శుక్ల) తెల్లజీలకర్ర (క)

---

## భాషాంతర నామములు

హింది - జీరా, మరాఠి - జీరెం, పాంఢరేం, గుజరాతీ - జేరుం, ధోళుం జేరుం; మలయాళం - జీరకం, కన్నడం - జీరిగె, ద్రావిడం - వెల్లసీరగం.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Umbelliferae

కొత్తిమీర కుటుంబము

తెల్లజీలకర్ర - Cuminum Cyminum (Cumin seed)

కొత్తిమెరి మొక్క చాలచోట్లనే పెరగుచున్నది.

ప్రకాండము. గుల్మము, ఏకవార్షికము.

ఆకులు—ఒంటరిచేరిక, పత్రములు చీలియుండును. కొన్ని కొన్ని రఘుపత్రి ములు. తొడిమ ప్రకాండము నావరించియున్నది, సువాననగలదు. రెండువైపుల నున్నగా నుండును.

పుష్పమంజరి—గుత్తి. వృంతముక్రింద చేటికలన్నియు గలసి గిన్నెవలె, నేర్పడు చున్నది. పుష్పులు చిన్నవి. ఉపవృంతముల వద్దను చేటికలుగలవు.

పుష్పకోశము—పంయుక్తము. 5 దంతములున్నవి. అండాశయము పంటుకొని యుండును. ఉచ్చము.

దళవలయము—అసంయుక్తము 5 ఆకర్షణ పత్రములు. అండాశయము పంటి యుండును. ఇవి మొగ్గలో అల్లుకొనియున్నవి.

కింజల్కములు—5 కాడలుచిన్నవి. ఇవియు అండాశయము పంటియున్నవి. పుప్పొడి తిత్తులు రెండుగదులు.

అండకోశము—అండాశయము నీచము 2 గదులు. ఒక్కొకదానిలో నొక్కొక గింజకలదు. కీలములు రెండు. కాయవిభజన ఫలము.

ఈ కుటుంబములోని మొక్క లన్నియు నేకవార్షికములే. అవి ఏడాది లోపుగనే పుష్పించి చచ్చిపోవును. పత్రములు చీలియుండును. వానిమీఁద రోమములులేవు. పుష్ప మంజరులు గుత్తులు. పుష్పకోశమునకు దంతములుగలవు. అవియన్నియు సమముగాలేవు. పువ్వులు సరాశములుగావు. కాయలపైన చారలున్నవి.

## పర్యాయ పదములు

శ్లో॥ జీరకో జరణో ఽజాజీ కణాస్యా ద్దీర్ఘజీరకః ॥

జీరకము, జరణము, అజాజీ, కణ. దీర్ఘజీరకము అనునవి శుక్లజీరక నామములు.

## కృష్ణజీరకం — నల్లజీలకర్ర (ఖ)

### భాషాంతర నామములు

హిందీ - కాలాజీరా, స్థాహజీరా, మరాఠి - శహాజీరేం, గుజరాతి - కాజీరుం, శాహజీరుం, మలయాళం, కన్నడం, ద్రావిడం - కరుపుజీరకం.

### పర్యాయ పదములు

శ్లో॥ కృష్ణజీరః సుగంధిశ్చ తథైవోద్గారశోధనః ।
కాలాజాజీ తు సుషవీ కాలికా చోపకాలికా ॥

కృష్ణజీరము, సుగంధి, ఉద్గారశోధనము, కాలాజాజి, సుషవి, కాలిక, ఉపకాలిక అనునవి కృష్ణజీరక నామములు.

## ఉపకుంచీ — (స్థూల) పెద్దజీలకర్ర (గ)

### భాషాంతర నామములు

హిందీ - మగరేలా, మరాఠి - కలౌంజీజేరుం, గుజరాతి-కలౌజీజిరుం మలయాళం, కన్నడం, ద్రావిడం - పెరిజీరగం.

## పర్యాయ పదములు

శ్లో॥ పృథ్వీకా కారవీ పృథ్వీ పృథుః కృష్ణోపకుంచికా।
ఉపకుంచీ చ కుంచీ చ బృహజ్జీరక మిత్యపి॥

పృథ్వీక, కారవి, పృథ్వీ, పృథు, కృష్ణ, ఉపకుంచిక, ఉపకుంచి, కుంచి, బృహజ్జీరకము అనునవి ఉపకుంచీ నామములు.

## జీరకత్రియ గుణములు

శ్లో॥ జీరకత్రితయం రూక్షం కటూష్ణం దీపనం లఘు।
సంగ్రాహి పిత్తలం మేధ్యం గర్భాశయవిశుద్ధికృత్॥
జ్వరఘ్నం పాచనం వృష్యం బల్యం రుచ్యం కఫాపహం।
చక్షుష్యం పవనాధ్మానగుల్మచ్ఛర్ద్యతిసారహృత్॥

తెల్లజీలకర్ర, నల్లజీలకర్ర, పెద్దజీలకర్ర అను నీ మూడును కటురసమును, రూక్షలఘుగుణములను, ఉష్ణవీర్యమును కలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధి పొందించును. మలమును నిరోధించును మేధాశక్తిని గలిగించును. ఆమమును పాకముజేయును. వెంటనే శుక్రమును వృద్ధి బొందించును. బలమును కలిగించును. రుచిని బుట్టించును. నేత్రములకు హితమైనవి, పిత్తమును వృద్ధి పొందించును. గర్భాశయమును శుభ్రపరచును కఫమును శమింపజేయును. జ్వరము, వాతవికారములు, ఆధ్మానము, గుల్మము, ఛర్ది, అతీసారము అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(శుక్ల) - దీర్ఘజీరకము, కణ. (కృష్ణ) - కృష్ణజీరకము, సుగంధి, కాలాజాజి, (స్థూల) - పృథ్వీ, బృహజ్జీరకము

(ఖ) గుణబోధకములు:—(శుక్ల) - జీరకము, జరణము, అజాజి. (కృష్ణ) - ఉదారశోధనము, సుషవి. (స్థూల) ఉపకుంచిక, పృథ్వీక.

(2) శబ్దార్థములు:—

దీర్ఘజీరకము - పొడవుగనుండు జీలకర్ర. కణ - సూక్ష్మమగు అవయవములను గలది. కృష్ణజీరము - నల్లగనుండు జీలకర్ర. సుగంధి - సువాసన గలది. కాలాజాజి - నల్లగనుండు జీలకర్ర. పృథ్వీ - బృహజ్జీరకము - పెద్దదిగనుండు జీలకర్ర. జీరకము - ఆహారమును జీర్ణింపజేయునది, జరణము -

జఠరశక్తిని బుట్టించునది. అజాజి - అగ్నిమాంద్యమును బోగొట్టునది. ఉద్గార శోధనము - ఉద్గారము (త్రేపు)ను శుభ్రపరచునది. సుషవి - జాఠరాగ్నిని వృద్ధిబొందించునది. ఉపకుంచిక - ప్రవృద్ధదోషములను సమావసకు దీసుకువచ్చునది. పృథ్వీక - ఉత్కృష్టములగు క్రియలను చేయునది.

(3) భేదములు:—

జీరకము "శ్వేత-పీత-కృష్ణ-సూక్ష్మ-స్థూల-వనజ భేదముచే నారు విధములుగా నుండును. వీనిలో శ్వేత-కృష్ణ-స్థూలజీరకములు విశేష ప్రచారమును గలిగి యున్నవి. మిగిలిన పీత-సూక్ష్మ-వన్యజీరకముల కంతగా ప్రచారము గానరాదు. అందు "పీతజీరకము" పీతాభము - (పసుపుపచ్చని వర్ణము గలది), రుచ్యము - రుచికరముగ నుండునది), దీప్యము - (జాఠరాగ్నిని వృద్ధి బొందించునది.) అను నీ నామములతో వ్యవహరింపబడు చున్నది. "సూక్ష్మ జీరకము" (మిగుల చిన్నదిగనుండు జీలకర్ర)నను నామాంతరములు గాని, గుణాదులు గాని గానరావు. "వనజజీరకము" వనజీరకము - (వనమునం దుత్పత్తియగు జీలకర్ర) యను నామములతో వ్యవహరింపబడు చున్నది. మరియు "బృహత్పాలీ క్షుద్రపత్రో ఉగన్యాజీరకిణా తథా" వనజీరకము పెద్దదియగు పాయను గలిగి యుండును. చిన్నవియగు పత్రములను గలిగి యుండును. అని రాజఘంటువునందు వర్ణింపబడినది.

(4) విశేషగుణములు:—

శ్వేత - మధురానురసమును, శీతవీర్యమును గలిగి యుండును. క్రిమి రోగమును బోగొట్టును. (ధ-ని.) తిక్తానురసమును, కొద్దిగ నుష్ణవీర్యమును గలిగి యుండును. పరిమళమును గలిగించును. క్షయము, కుష్ఠము, అరోచకము, రక్తదోషము అను వ్యాధులను బోగొట్టును. పిత్తమును శమింప చేయును. (ని-ర.) కటువిపాకమును గలిగి యుండును. జీర్ణజ్వరమును, వ్రణములను బోగొట్టును. (రా-ని.) మధురరసమును, తీక్ష్ణగుణమును, కటువిపాకమును గలిగి యుండును. (రా-వ.)

(ఖ) పీత - కటురసమును, రూక్షగుణమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. వాతమును శమింపజేయును. గుల్మము, ఆధ్మానము, అతీసారము, గ్రహణి, క్రిమిరోగము అను నీ వ్యాధులను బోగొట్టును. (ధ-ని.) తీక్ష్ణగుణమును, ఉష్ణవీర్యమును, కటువిపాకమును, గంధబహులమును

గలిగి యుండును. రుచిని బుట్టించును. పిత్తమును వృద్ధి బొందించును. వాత శ్లేష్మములను శమింప జేయును. (సు-సూ-అ-46.)

(గ) కృష్ణ - శోఫను, జీర్ణ జ్వరమును బోగొట్టును. (ధ-ని.) సుగంధ మును గలిగి యుండును. శిరోరోగమును, చప్రమును బోగొట్టును. (వై-ని.)

(ఘ) స్థూల - తిక్తానురసమును గలిగి యుండును క్రిమిరోగమును బోగొట్టును. (రా-ని.) పిత్తమును శమింపజేయును. రక్తపిత్తమును శూలను బోగొట్టును. (ని-ర.) తీక్ష్ణగుణమును, కటువిపాకమును గలిగి యుండును. (సు-సూ-అ-46.)

(చ) వనజ - కటురసమును, శీతవీర్యమును గలిగి యుండును. అధ్మాన మును, వ్రణములను బోగొట్టును. (రా-ని.) కషాయరసమును, కటుకానురస మును, ఉష్ణవీర్యమును గలిగియుండును. వాతకఫములను శమింపజేయును. (ని-ర.)

(5) ప్రయోగములు:—

(క) శుక్ల—

1. విషమజ్వరమునందు జీరక ప్రయోగము.

"అజాజీగుడసంయుక్తా విషమజ్వరనాశినీ ।
అగ్నిసాదం జయేత్సమ్యగ్వాతరోగాంశ్చ నాశయేత్ "

తెల్లజీలకర్రను గుడముతో జేర్చి సేవించిన విషమ జ్వరము శమించును. మరియు ఈ ప్రయోగమువలన నగ్నిమాంద్యమును, వాతరోగములును గూడ శమించును. (చ-ద-జ్వర.)

2. వృశ్చికదంశమునందు జీరక ప్రయోగము.

"జీరకస్య కృతః కల్కో ఘృతసైంధవసంయుతః ।
సుఖోష్ణో వృశ్చికార్తానాం సుఖాలేపో వ్యథాపహః" ॥

తేలుకుట్టినప్పుడు జీలకర్ర, సైంధవలవణము మెత్తగా నూరి అందు కొద్దిగ నెయ్యిజేర్చి వెచ్చజెట్టి కుట్టినచోటున సుఖోష్ణముగ నీ కల్కముతో లేపనము జేసిన బాధ శమించును. (చ-ద-విష.)

3. వాతశ్లేష్మ జ్వరమున జీరక ప్రయోగము.

"అజాజీం సగుడాం ఖాదేత్ కల్కం వా మధునా లిహేత్ ।...
తక్రం చానుపిబే జ్జ్వరీ తత్పీత్వా ॥
వాతపే లిప్త్వేత్ యావత్స్వేదాగమో భవేత్ ।
కఫమారుతజిత్ క్షిప్రం జ్వరాదేవం ప్రముచ్యతే" ॥

కఫవాతజ్వరమునందు జీలకర్రను బెల్లముతో జేర్చిగాని జీరకకల్కమును తేనెతో జేర్చిగాని సేవించి తక్రమును అనుపానముగ తీసికొని చెమట బట్టువరకు నెండలో కూర్చొనవలెను. అటుల చెమట బట్టినవెంటనే జ్వరము శమించును. (గ-ని-జ్వర.)

4. అమ్లపిత్తమునందు జీరక ప్రయోగము.

"పిష్ట్వాజాజీం సధాన్యాకాం ఘృతప్రస్థం విపాచయేత్ ।
కఫపిత్తారుచిహరం మందానలవమిం జయేత్ "॥

జీలకర్ర, ధనియాలు వీని కషాయము 4 ప్రస్థములు, నెయ్యి, ప్రస్థము ఇటుల గ్రహించి ఘృతపాకము జేసి సేవించిన అమ్లపిత్తము, కఫపిత్తములచే గలుగు నరుచి, అగ్నిమాంద్యము, ఛర్ది, ఇవి శమించును.

(బృంద-అమ్లపిత్త.)

(ఖ) కృష్ణ—

1. విషమజ్వరమునందు కృష్ణజీరక ప్రయోగము.

"కాలాజాజీతు సగుడా విషమజ్వరనాశినీ "॥

విషమజ్వరమునందు నల్లజీలకర్రను బెల్లముతో జేర్చి సేవించినహితము.

(భా-ప్ర-జ్వర.)

2. ప్రతిశ్యాయమున కృష్ణజీరక ప్రయోగము.

"ప్రతిశ్యాయే ఘ్రేయంవా కృష్ణజీరకం "॥

పడిశము పట్టినప్పుడు నల్లజీలకర్రను గుడ్డలో మూటగట్టి వాసనచూచు చుండిన పడిశము శమించును. (వం-సే-నాసారోగ.)

(గ) స్థూల—

1. రక్తపిత్తమునందు పృథ్వీకా ప్రయోగము.

"లోహగంధిని నిశ్వాసే ఉద్గారే రక్తగంధిని ।
పృథ్వీకాం శాణమాత్రాం తు ఖాదేద్ద్విగుణశర్కరాం "॥

రక్తపిత్తమునందు శ్వాస లోహగంధము గలిగి యున్నప్పుడును, త్రేణుపు రక్తగంధమును గలిగి యున్నప్పుడును ఒక శాణప్రమాణము పెద్దజీలకర్రను ద్విగుణముగ చక్కెరతో జేర్చి సేవించిన హితము. (గ-ని-రక్తపిత్త.)

(6) యోగములు:—

(క) శుక్ల—

1. జీరకాద్యంచూర్ణం - భైషజ్య-గ్రహణి. మాత్ర:-20 యువలు.

ఉపయోగములు:—గ్రహణి, అతీసారము, కామిల, పాండు, అగ్ని మాంద్యము ఇవి శమించును.

2. జీరకాది మోదకము - బృహజ్జీరకాది మోదకము:- భైషజ్య-గ్రహణి. మాత్ర:-1 కర్షము.

ఉపయోగములు:—గ్రహణి, ఆమదోషము, అగ్నిమాంద్యము, రక్తాతిసారము, అతీసారము, విషమజ్వరము, అమ్లపిత్తము, ఉదరము, శూల, అరోచకము, వాతరోగము, అర్శస్సు, జీర్ణజ్వరము, ప్రదరము, దాహము, ఇవి శమించును.

3. జీరకఘృతము - భైషజ్య - సద్యోవ్రణ.

ఉపయోగములు:—దీనిని పైకి అభ్యంగమున నుపయోగింపవలెను. అగ్నిదగ్ధవ్రణము శమించును.

4. జీరకాద్యరిష్టము - భైషజ్య-సూతికారోగ. మాత్ర:-1 ఔన్సు.

ఉపయోగములు:—సూతికారోగము, గ్రహణి, అతీసారము, విషమాగ్ని ఇవి శమించును. గర్భాశయమును శోధించును.

(ఖ) మూలి—

1. కాగవ్యాదికషాయము - భైషజ్య-జ్వర. మాత్ర:-1 పలము.

ఉపయోగములు:-స్రోతశ్శుద్ధి యగును. అభిన్యాసజ్వరము శమించును.

## జీరకముగల కొన్ని యోగములు

అగ్నితుండివటి, అశోకఘృతము, అశోకారిష్ట, అశ్వగంధాది చూర్ణము, అశ్వగంధాది లేహ్యము, కపిత్థాష్టకచూర్ణము, కూష్మాండలేహ్యము, చిత్రకాదివటి, జాతీఫలాదిచూర్ణము, (లఘు) దాడిమాష్టకచూర్ణము, పంచతిక్తగుగ్గులు, ఘృతము, బిల్వాదిలేహ్యము, భాస్కరలవణచూర్ణము, భృంగరాజతైలము, భృంగామలక తైలము, యోగరాజగుగ్గులు, రసోత్తమాదిలేప చూర్ణము, రసోత్తమాది లేపము, హింగ్వష్టకచూర్ణము.

(7) Actions and uses:—(ఉపకుంచికా) Anthelmintic, diuretic, galactagogue, emmengogue and carminative. It is an aromatic adjunct to purgative and bitter remedis. A decoction of the seed just after delivery is given to stimulate the uterus to contraction and to increase the secretiom of milk also in worms. As a carminative and stomachic with plumbago root it is given in dyspepsia, loss of oppetite, diarrhoea and intermittent fever. As an emmengogue it is used in amenorrhoea and in dysmenorrhoea. In large doses it causes abortion. Locally it is largely used brayed in water to remove painful swellings of hands and feet. The seeds are scattered between woolen shawls and clothes as a protection against insects.

R. N. Khory II. p. 17.

## స్వానుభవము

[మోతాదు:—5 మొదలు 60 వడ్లగింజలు యెత్తు చూర్ణము తేనెతో గాని అనుపానాంతరములతో గాని తీసికొనునది.

లేదా తేనెతోనైనను బెల్లముతోనైనను నూరి ముద్ద జేసి నోటిలోనుంచుకొని రసమునుమాత్రము మ్రింగుచుండవలెను.

లేదా 1 మొదలు 4 భాగములు నీటిని జేర్చి తేనె లేక పంచదారకలిపిగాని లేదా ప్రత్యేకముగా గాని ఉపయోగింపవచ్చును.

లేదా కషాయమునుగాచి ఉపయోగించునది.

గుణము:—శీతలము, పాచనీయము, దీపనీయము, సుగంధి, గర్భాశయోత్తేజకము.

ఉపయోగములు:—పిత్త వికారములలో ఇది మిక్కిలి శ్రేష్ఠమని పొగడ్తగని యున్నది. జీర్ణశక్తి నభివృద్ధిజేసి రుచిని పుట్టించును. ప్రవాహికలోను, అతిసారములోను, ఇది మిక్కిలి ఉపయుక్తము. పిత్తశాంతి కొరకు తలనూనెలలో దీనిని కల్ప-

ముగా జేర్చుచున్నారు. గర్భాశయమునకు చురుకును ఉద్రేకమును గలిగించి గర్భమును వెలువడునట్లు జేయును. మరియు వాతవ్యాధులు, పక్షవాతము మున్నగువానిలో నరములకు చురుకును, శక్తినిక్కలిగించి ఆవ్యాధులను బోగొట్టును. బెల్లము లేక తేనె నుగలపి ముద్దజేసి ఎక్కిళ్లు వచ్చినప్పుడిచ్చిన మంచిది. ఆ. ల.]

# 89

## జీవకః - జీవకము (క)

### భాషాంతర నామములు

హిందీ - జీవక, మరాఠీ - జీవక, గుజరాతీ - జీవక, మలయాళం - జీవకం, కర్ణాటకం - జివకం, ద్రావిడం - జీవకం.

### పర్యాయ పదములు

శ్లో॥ జీవకో మధురః శృంగీ హ్రస్వాంగో కూర్చశీర్షకః ॥

జీవకము, మధురము, శృంగి, హ్రస్వాంగము, కూర్చశీర్షకము అనునవి జీవకనామములు.

## ఋషభకః — ఋషభకము (ఖ)

### భాషాంతర నామములు

హిందీ - ఋషభక, మరాఠీ - ఋషభక, గుజరాతీ - ఋషభక, మలయాళం - ఋషభకం, కర్ణాటకం - ఋషభకం, ద్రావిడం - ఋషభకం.

## పర్యాయ పదములు

శ్లో॥ ఋషభో వృషభో ధీరో విషాణీ ద్రాక్ష ఇత్యపి ॥

ఋషభము, వృషభము, ధీర, విషాణి, ద్రాక్ష యనునవి ఋషభ నామములు.

## జీవక ఋషభక — గుణములు

శ్లో॥ జీవకర్షభకౌ బల్యౌ శీతౌ శుక్రకఫప్రదౌ।
మధురౌ పిత్తదాహాస్ర కార్శ్యవాతక్షయాపహౌ॥

జీవకము, ఋషభకము అనునవి మధురరసమును, శీతవీర్యమును గలిగి యుండును. బలమును, శుక్రమును గలిగించును. కఫమును వృద్ధిపొందించును. వాతపిత్తములను శమింపజేయును. దాహము, రక్తదోషము, కార్శ్యము, క్షయము వీనిని పోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(జీవక) శృంగి, హ్రస్వాంగము, కూర్చ శీర్షకము. (వృషభక) - వృషభము, విషాణి, (ఋషిప్రియ.)

(ఖ) గుణబోధకములు:—(జీవక) - జీవకము, మధురము, (దీర్ఘాయువు, వృద్ధిద, బలద.) (ఋషభక). వృషభము, (మధురము, శీతలము, కాముదము).

(2) శబ్దార్థములు:—

శృంగి - శృంగము (కొమ్ము) వంటికందమును గలది. (లేక) వ్యాధు లను హింసించి పోగొట్టునది. హ్రస్వాంగము - భూమిపైకి పొట్టిగా దుబ్బు వలె పెరుగునది. కూర్చశీర్షము - కూర్చము (కుచ్చు) వంటిశిరస్సు (మూల భాగము లేక మొక్క చివరభాగము)ను గలది. వృషభము - విషాణి - ఎద్దుకొమ్ములవంటి కందములతో నొప్పునది. ఋషిప్రియము - ఋషుల కిష్ట మగునది. జీవకము - జీవమును గలిగించునది. మధురము - మధురరసమును గలిగి యుండునది. దీర్ఘాయువు - ఆయువును వృద్ధిపొందించునది. వృద్ధిద ధాతువులను వృద్ధిపొందించునది. బలద - బలమును గలిగించునది. వృషభము వాజీకరణద్రవ్యములలో శ్రేష్ఠమైనది, (లేక) క్షీణించిన ధాతువులను వృద్ధి

రసముచే తడుపునది. శీతలము - అత్యంతము శీతవీర్యమును గలిగి యుండునది. కామదము - కామమును గలిగించునది.

(3) పరిచయ-ఉత్పత్తిబోధక లక్షణములు:—

"జీవన్తీసదృశైః పత్రైః జీవకో గుల్మకః స్మృతః ।
కంటకీ క్షీరీ తథానూపే భవతీత్యుచ్యతే సూరిభిః" ॥

జీవకము పొదవలె గుబురుగా నానూపదేశమునం దుత్పన్నమగును. దీని యాకులు జీవన్తీపత్రములతో సమానముగ నుండును. దీనికి చిన్న చిన్న ముండ్లుండును. కాండము పాలను గలిగియుండును. కై-దే. మరియు, "జీవకో హ్రస్వవిటపః కూర్చశీర్షశ్చ దక్షిణే। దేశే సంజాయతే కందో నిస్సారః సూక్ష్మపత్రకః (శుష్క-పత్రకః)" ॥

జీవకము దక్షిణదేశమున చిన్న మొక్క రూపమున నుత్పన్నమగును. దీని శిరోభాగము కూర్చము (కుంచె) వలె నుండును. మూలమున కంద ముండును. దీని యాకులు సారములేనివియై సూక్ష్మముగ (లేక) ఎండిపోయి నట్లుగ నుండును. (శి ద.)

"జీవకర్షభకౌ జ్ఞేయౌ హిమాద్రిశిఖరోద్భవౌ ।
రసోనకందవత్కందౌ నిస్సారౌ సూక్ష్మపత్రకౌ" ॥

జీవకము, ఋషభకము అనునవి హిమవత్పర్వత శిఖరమునం దుత్పన్నమగును. వీని కందములు వెల్లుల్లిగడ్డవలె నుండును. ఆకులు సారములేనివియై సూక్ష్మముగ నుండును. (భా-ప్ర.)

N, B:—ఈ రెండు ద్రవ్యములును ధాతుపోషకములగు నష్టవర్గద్రవ్యములలోను, జీవనీయ ద్రవ్యములలోను గణింపబడినవి. ఇవి మిగుల రసాయన వాజీకరణ యోగ్యములైనను దుర్లభములని జెప్పబడుచున్నవి. ఇందుచేతనే వీని ప్రయోగములందు * ప్రతినిధి ద్రవ్యములను జేర్చుచుందురు.

(4) విశేషగుణములు:—

జీవక - జ్వరమును, రక్తపిత్తమును బోగొట్టును. (ని-గ.) ఋషభక- వెంటనే శుక్రమును గలిగించును. ధాతుపోషణము జేయును. గర్భస్థాపనము జేయును. రక్తాతిసారమును, జ్వరమును బోగొట్టును. (ని-ర.)

* అభావప్రతినిధి పరిభాషను జూడుడు.
జీవకమునకు తిప్పతీగె, ఋషభకమునకు నేలగుమ్మడిగడ్డ.

(5) యోగములు:—

1. జీవకాదిగణము - చ-సూ-అ-4. మాత్ర:-యథాయోగము.

ఉపయోగములు:—కషాయ-క్షీర-మార్గ-లేహ్యాది కల్పనల జేసి ఉపయోగించిన మిగుల శుక్రవృద్ధియు, బలమును, గర్భస్థాపనమును నగును.

2. జీవకాదిఘృతము - వా-కాస. మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—పిత్తజకాసము శమించును.

3 జీవకర్షభకాది వృష్యఘృతము - చ-వాజీకరణ. మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—వృష్యము, బల్యము, వర్ణ్యము, కంఠ్యము, బృంహణము.

4. జీవకర్షభకఘృతము - భైషజ్య - నేత్రరోగ. మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—సమస్త నేత్రరోగములు శమించును.

5. బృహజ్జీవకాది తైలము - నై-చిం-శిరోరోగ.

ఉపయోగములు:—నస్యముజేసిన అర్ధావభేదకము, బాధిర్యము, కర్ణశూల, శిరోరోగము, తిమిరము, గలగండ, దంతశూల, శిరఃకంపము ఇవి శమించును.

---

# 90

# జీవన్తి - పాలకూర (లేక) పాలగడ్డ

---

## భాషాంతర నామములు

హింది - డోడీ, మరాఠి - డోడీ, గుజరాతి - దోడీ, మలయాళం - అటపతియన్, కర్ణాటకం - కిరియహాలే, ద్రావిడం - అడపుకొడియంకీరంను.

## నైసర్గిక స్వరూప వర్ణనము.

## Natural Order — Asclepiadaceae

జిల్లేడు కుటుంబము

పాలగడ్డ - Leptadania raticulata,

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయ బోధకములు:—మధు. స్రవ. (మధుస్రవ). శాకశ్రేష్ఠ పయస్విని. (రక్తాంగి. సుపింగల. శృంగాటి.)

(ఖ) గుణబోధకములు:—జీవన్తి, జీవనీయ, (జీవద, సుఖంకరి, పుత్రభద్ర.)

(2) శబ్దార్థములు:—

మధు - తేనెవలె తియ్యగ నుండునది. స్రవ - పాలవంటి స్రావమును స్రవించునది. మధుస్రవ - తియ్యని స్రావమును గలిగియుండునది. శాకశ్రేష్ఠ - శాకములలో శ్రేష్ఠమైనది. పయస్విని - పాలనుగలది. రక్తాంగి - ఎఱ్ఱని లతాకాండమును గలిగి యుండునది. సుపింగల - పింగలవర్ణమును గలిగి యుండునది. శృంగాటి - గజశృంగములవంటి కందముతో నొప్పునది. జీవన్తి - జీవనీయ - ప్రాణములను ధరింపజేయునది. జీవద - ప్రాణముల నొసంగునది. సుఖంకరి - సౌఖ్యమును గలిగించునది. పుత్రభద్ర - గర్భమును సుఖముగ వృద్ధిబొందించునది. (సుఖము సర్వాంగావయవములతో వృద్ధిబొందిన పుత్రులను కలిగించునది).

(3) భేదములు:—

ఇది లతాజాతులలో నుత్పత్తి గలిగి కంద శాకవర్గములో గణింపబడినది. దీని లతాకాండ మెఱ్ఱగనుండును. ఆకులు తమలపాకులవలె నుండును గాని దీర్ఘ చిన్నవిగ నుండి పెళుసుగ నుండును. విరచినపాలను స్రవించును. విశేష మధుర రసమును గలిగియుండును.

ఇందు హ్రస్వజీవన్తి-బృహజ్జీవన్తియని రెండు భేదములు గలవు. ఈ రెండు సమాన గుణములనే గలిగి యున్నట్లు గానబడును. కాని "చక్షుష్యా సర్వదోషఘ్నీ... స్యాత్ ద్వితీయా కించదేవతు ॥" (అ. ని. సూ. 37.) అని చెప్పుటవలన వీనిలో నొకదానికి త్రిదోషహరత్వాది గుణములు తక్కువగా నుండుననియు, నందుచే నిది హీనమైనదనియు దెలియుచున్నది. ఇదియేగాక స్వర్ణజీవన్తియను మరియొక భేదమున్నట్లు కూడ రాజనిఘంటువుని భూషణమును బట్టి దెలియగలదు. ఇది హేమపూర్ణ (నిండు బంగారు వర్ణమును గలిగి యుండునది), హేమక్షీరి (బంగారువంటి వర్ణముగల పాలతో గూడియుండునది), హేమపత్రీ (పచ్చని వర్ణముగల తీగెగా నుత్పత్తి నొందునది),

హిమాలశ్రీయ (హిమాలయ పర్వతమునందుత్పత్తి యగునది) యను మొదలగు నామములతో వ్యవహరింప బడుచున్నది. కాని వాగ్భట నిరూపణమును బట్టి హీనమైనదిగ నెంచబడునది పైన వివరించిన హ్రస్వ-బృహజ్జీవంతులలో నొకటియో (లేక) యీస్వర్ణ జీవంతియో (లేక) బృహజ్జీవంతి క్షుద్రసనియామక, అనుగుణ నిరూపణమువలన నిది విశేషముగ రస (పాదరస) బంధనాది కర్మలకు మాత్రము ప్రయుక్తమగుననియు, త్రిదోష హరత్వాది గుణములు తక్కువగాగలిగి యుండుననియు నందుచే నీబృహజ్జీవంతియే హీనమైనదిగనుండి, స్వర్ణజీవంతి యనునది వర్ణభేదముచే వీనిలో నొక ప్రత్యేకభేదమై యుండునని వివరింప వీలగుచున్నది. ఏదియెటులున్నను "శాకాశాకేషు జీవన్తీ" (వా-సూ-అ 6.) అని వాగ్భట నిరూపణమునుబట్టి యిది శాకములలో శ్రేష్ఠమైనదిగ దెలియగలదు. మరియు నిది జీవనీయ గణములో జేర్చబడియుండుటవలన విశేషముగా ధాతుపోషకత్వాదిగుణములను గలిగియున్నట్లు గూడ దెలియగలదు.

(4) విశేషగుణములు:—

(క) శాకములలో శ్రేష్ఠమైనది. (వా-సూ-అ-6.) వీర్యమును, కఫమును వృద్ధిబొందించును. జ్వరమును బోగొట్టును. (రా-ని.) శ్వాసను, కాసను బోగొట్టును. (రా-వ.)

(ఖ) బృహజ్జీవన్తి - పై గుణములను తక్కువగా గలిగి యుండును. (ద-ని.) భూతగ్రహదోషములను బోగొట్టును. పాదరసమునకు నియామక సంస్కారమును గలుగజేయును. (రా-ని.)

(గ) స్వర్ణజీవన్తి - మధురరసమును, శీతవీర్యమును గలిగి యుండును. నేత్రములకు హితమైనది. వెంటనే శుక్రమును గలిగించును. బలమును వృద్ధిబొందించును. వాతమును శమింపజేయును. రక్తపిత్తమును, దాహమును బోగొట్టును. (రా. ని.)

(ఘ) జీవన్తీఫల - మధురరసమును, గురుగుణమును గలిగి యుండును. ధాతువులను వృద్ధిబొందించును. (శా. ని.)

N. B:—ఈ లతకు ఫలోత్పత్తి యుండదని జెప్పుదురు. ఈ ఫలగుణనిరూపణ మిందుకు విరుద్ధముగా గానబడు చున్నది.

(5) ప్రయోగములు:—

1. అతీసారమునందు జీవన్తి ప్రయోగము.

"జీవన్త్యాః చిర్భటస్యవా శుష్కశాకేన వా పునః ।
దధిదాడిమసిద్ధేన బహుస్నేహేన భోజయేత్ ॥"

జీవన్తిని శుష్కముగ గాని, పెరుగుదాడిమ స్వరసము వీనితో కలిపి గాని పక్వముజేసి అధికముగ ఘృతమును జేర్చి యీ శాకముతో నాహారమును సేవించిన అతీసారము శమించును. (చ-చి-అ-10.)

2. విషమునందు జీవన్తీ ప్రయోగము.

"తండులీయక జీవన్తీ వార్తాకీ సునిషణ్ణకాః ।
శాకంచ ఫలకం హితం" ॥

చిర్రికూర, జీవంతి మొదలగువాని శాకములతో భుజించిన విషదోషము శమించును. (చ-విషచికిత్స.)

3. నక్తాన్ధ్యమునందు జీవన్తీ ప్రయోగము.

"ఘృతే సిద్ధాని జీవన్త్యాః పల్లవాని చ భక్షయేత్" ॥

జీవన్తీపల్లవముల (చిగుళ్ల)ను ఘృతముతో భర్జనజేసి సేవించిన నక్తాన్ధ్యము శమించును. (వా-ఉ-అ.)

4. ముఖరోగమునందు జీవన్తీ ప్రయోగము.

"జీవన్తీకల్కం పయసా సమాంశం తైలం విపక్వంమధునావిమిశ్రం,
ఓష్ఠాస్యయోః సర్జరసాష్టభాగం వ్రణాన్నిహన్యాత్ సకృదేవలేపాత్" ॥

తైలము ఒక భాగము, పాలు ఒక భాగము, జీవన్తీకల్కము నాల్గవ భాగము ఇటుల గ్రహించి తైలపాకము జేసి అందు సర్జరసము ఎనిదవ భాగమును, తేనెను గలిపి యోష్ఠముఖజ వ్రణములకు లేపనము జేసిన శమించును. (వం-సే.)

5. జ్వరదాహమునందు జీవన్తీ ప్రయోగము.

"జీవన్తీమూలనిర్యూహో సఘృతో దాహజాత్రిజిత్" ॥

జీవన్తీకంద కషాయమునందు ఘృతమును జేర్చి సేవించిన జ్వరమునందు బుట్టు దాహము శమించును. (వై-మ.)

6 వ్రణమునందు జీవన్తీ ప్రయోగము.

"జీవన్తీకల్కస్య సారం సంపేష్య లేపయేత్ త్రిదినం ।
పిచ్ఛిలభావాత్ గూఢం సంపీడ్య శమయే ద్వ్రణం నియతం" ॥

జీవన్తీకందమును మెత్తగా నూరి స్వరసమును గ్రహించి వ్రణమునకు మూడు దినములు లేపనము జేసిన ఇది పిచ్చిలక్షారమును గూడగుటచే కట్టిగ బిగబట్టి దోషమును బయటకు వెలిబరచి శమింపజేయును. (వై-సు.)

7. పార్శ్వశూలయందు జీవన్తీ ప్రయోగము.

"జీవన్తీమూలకల్కం వా సతైలం పార్శ్వశూలహా" ॥

జీవన్తీమూలకల్కమును తైలముతో జేర్చి సేవించిన పార్శ్వశూల శమించును. (గ-ని.)

(6) యోగములు:—

1. జీవన్త్యాదిఘృతము - వా-రాజయక్ష్మ. మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—రాజయక్ష్మ శమించును.

2. జీవన్త్యాదిచూర్ణము - వా-శ్వాసహిక్క. మాత్ర:-$\frac{1}{4}$ తులం.

ఉపయోగములు:—హిక్క, శ్వాస, కాస, పార్శ్వశూల, జ్వరము ఇవి శమించును.

3. జీవన్త్యాదిచూర్ణము - గ-ని-రాజయక్ష్మ.

ఉపయోగములు:—ఉత్పాదకము జేసిన రాజయక్ష్మరోగికి శరీరపుష్టి, బలము, వర్ణమును గలుగును.

(7) Uses:—The plant is the Jivanti of the Sanskrit writers. It must not be confounded with Jivaka one of the astavarga which is a drug unknown to the Modern Hindus. D. Macraei does not appear to have been noticed by any of the European writers upon Indian Meteria Medica.

# 91

# జ్యోతిష్మతీ - మాల్కంగుని (లేక) వెన్నుడుతీగె (క)

## భాషాంతర నామములు

హింది - మాలకంగనీ, మాలకాంగనీ, మరాటి - మాలకాంగోణీ, గుజరాతి - మాలకాంగణీ, మలయాళం - చెరుపున్నరి, కన్నడం - జ్యోతిష్మతి, ద్రావిడం - వాలుఘువై.

# Natural Order—Celastrineae

## మాల్కంగుని కుటుంబము

### వెక్కుడుతీగె - Celastrus paniculata (Eng. Staff tree)

ఈ చిన్నకుటుంబములోఁ జెట్లుగుబురు మొక్కలు గలవు. ఆకులు ఒంటరి చేరికగానైనను, అభిముఖ చేరికగానైన నుండును. అవిమృత్తియాకులవలె బిరుసుగానున్నవి. పుష్పములలో మిధున పుష్పములు, ఏకలింగపుష్పములు కూడఁగలుగుచున్నవి పుష్పకోశముచిన్నది. నాలుగైదు తమ్మెలు అల్లుకొని యుండును. కాయ నంటుకొని పుష్పకోశము స్థిరముగా నుండును. ఆకర్షణపత్రములును నాలుగో అయిదో యుండును, కొన్నిటిలో లేక పోవుటయుఁ గలదు ఇవియు నల్లుకొనియే యుండును: కొన్నిటిలోఁ బల్లెరము నంటియున్నవి. కింజల్కములు 3 మొ. 5. దాడులు వెడల్పుగా నుండును. అండాశయములో గదులు 3 మొ. 5. వఱకుఁగలవు. ఒక్కొక దానిలో రెండేసి అండములుండును. కీలము పొట్టిగానుండును. గొన్నిటిలోఁ లేనే లేదు. కీలాగ్రము త్రిభుజాకారము.

## పర్యాయ పదములు

శ్లో॥ జ్యోతిష్మతీస్యాత్కటభీ జ్యోతిష్కా కంగుణీతిచ ।
పారావతపదీ పణ్యా లతా ప్రోక్తా సుపింగలా ॥

జ్యోతిష్మతి, కటభి, జ్యోతిష్క, కంగుణి, పారావతపది, పణ్య, లత, సుపింగల అనునవి జ్యోతిష్మతి నామములు.

## జ్యోతిష్మతీగుణములు.

శ్లో॥ జ్యోతిష్మతీ కటు స్తిక్తా సరా కఫసమీరజిత్ ।
అత్యుష్ణా వామనీ తీక్ష్ణా వహ్నిబుద్ధిస్మృతిప్రదా ॥

మాల్కంగుని కటురసమును, తిక్తరసమును, సారతీక్ష్ణగుణములను, అత్యుష్ణవీర్యమును గలిగి యుండును. వాంతిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధిఁబొందించును. బుద్ధిని వికసింపజేయును. స్మరణశక్తిని గలిగించును. కఫవాతములను శమింపజేయును.

## తేజవతీ - జ్యోతిష్మతీ భేదము (?)

శ్లో॥ తేజస్వినీ తేజవతీ తేజోహ్వా తేజనీతిచ ॥

తేజస్విని, తేజవతి, తేజోహ్వ, తేజని అనునవి తేజవతీ నామములు.

## తేజవతీ గుణములు

శ్లో॥ తేజస్వినీ కఫశ్వాసకాసాస్యామయవాతహృత్ ।
పాచన్యుష్ణా కటు స్తిక్తా రుచివహ్నిప్రదీపనీ ॥

తేజవతియును జ్యోతిష్మతీభేదము కటురసమును, తిక్తానురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును ఆమమును బచింపజేయును. రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. కఫవాతములను శమింపజేయును. శ్వాస, కాసము, ముఖరోగము అను నీ వ్యాధులను బోగొట్టును.

## వి శే షాం శ ము లు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(జ్యోతిష్మతి) - పారావతపది, జ్యోతిష్మతి, సుపింగల, కటభి, (తేజవతి) - తేజస్విని.

(ఖ) గుణబోధకములు - (జ్యోతిష్మతి) - జ్యోతిష్క.

(2) శబ్దార్థములు:—

పారావతపది - పావురపుపిట్టయొక్క పాదమువంటి వర్ణము (లేక) యాకృతిగల పత్రములను గలది. జ్యోతిష్మతి - మెరుపుతీగవలె ప్రకాశమును గల పుష్పములను గలది. సుపింగల - పింగలవర్ణముగల బీజములను గలది. కటభి - వ్యాపించునది (లత). తేజస్విని - ప్రకాశించు స్వభావము గలది. జ్యోతిష్క - ఉష్ణమును గలుగజేయునది.

(3) పరిచయబోధక లక్షణము:—

జ్యోతిష్మతి—

"పక్వారక్తఫలా గుచ్ఛా పీతతైలా చవర్తులా ।
పంక్తిపత్రా రక్తబీజా అణుపుష్పా వనజా స్మృతా" ॥

జ్యోతిష్మతిలత పండినప్పుడు ఎర్రగనుండు ఫలములను, గుత్తులు గుత్తులుగనుండు ఫలములను గలిగి యుండును. ఫలములు గుండ్రముగ నుండును. ఆకులు వరుసగ (అనగా నొకదానిసంటి మరియొకటి యిటుల వరుసగ) నుండును బీజములు ఎర్రగను, పుష్పములు మిగుల సూక్ష్మముగను నుండును. ఇది యడవులయందు ఉత్పత్తి యగుచుండును. (శి-ద.)

మరియు—

"జ్యోతిష్మతీ వర్తులపక్వరక్తఫలా పీతతైల ।
కాకుమారరికేతి లోకేప్రసిద్ధా" ॥

జ్యోతిష్మతిలత గుండ్రముగను, పండినప్పుడు ఎర్రగను నుండు ఫలము లను గలిగి యుండును. దీని బీజములను నుండి తీసిన తైలము పసుపుపచ్చగ

నుండును. దీని ఫలములను దినినచో కాకులు మరణించును. అందుచే నిది కాకమర్దనిక యని లోకమున వ్యవహరింపబడును. (సుశ్రుతడల్హణవ్యాఖ్యాన)

(4) భేదములు:—

జ్యోతిష్మతీలత చిన్న పెద్ద భేదముచే రెండు విధములుగా నుండును. ఇందు పెద్దది చిన్నదానికంటె హెచ్చు గుణములను గలిగి యుండును. విశేషించి మేధాశక్తిని, స్మరణశక్తిని బుట్టించును. మరియు నీ లత యమావాస్యయం దుత్పన్నమై రాత్రులయందు ఇతరయోషధులను జూపించుటకు తైలములేని దీపమువలె వాని మధ్య ప్రకాశించుచుండునదిగ రఘువంశాది గ్రంథకర్తలచే వర్ణింపబడినది. దీనిని బట్టి రాత్రులయందు ఈ లతను గుర్తింపవచ్చునని తెలియ గలదు. ఇందు తేజవతి యనునది జ్యోతిష్మతియందొక భేదముగా తెలియ గలదు. దీనిని గురించిన యితరయంశము లంతగా గానరావు.

(5) విశేషగుణములు:—

(క) మేధాశక్తిని, వర్ణమును గలిగించును. మలమును శోధించును. వ్రణములను, ఉదరమును బోగొట్టును. (ధ-ని.) తిక్తరసమును, రూక్షగుణమును గలిగి యుండును. దాహమును గలిగించును. (రా-ని.) కషాయానురసమును గలిగి యుండును. కాంతిని కలుగజేయును. పాండువును, విసర్పమును బోగొట్టును. (గుణ ని.) విస్ఫోటమును బోగొట్టును. (రా-వ.)

(ఖ) తేజోవతి-హృద్రోగము, ముఖరోగము, దంతరోగము, హిక్క, అర్శస్సు, కంఠరోగము వీనిని బోగొట్టును (గు ని) విషమును బోగొట్టును. (వై-ర.) శూలను, ఆమవాతమును బోగొట్టును. (మ.ని.)

(గ) జ్యోతిష్మతీ (బీజ) తైలగుణములు:—కటురసమును, తిక్తానురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. మేధాశక్తిని, స్మరణశక్తిని వృద్ధి పొందించును. పిత్తమును వృద్ధిజేయును. వాతమును శమింపజేయును. (రా-ని.)

(6) ప్రయోగములు:—

1. ఉదరమునందు జ్యోతిష్మతీ ప్రయోగము.

“జ్యోతిష్క-ఫలతైలం వా క్షీరేణ స్వర్జికాహింగు మిశ్రం పిబేత్”

ఉదర రోగమునందు జ్యోతిష్మతీ బీజములనుండి తీసిన తైలమును, స్వర్జక్షారమును, ఇంగువను పాలతో జేర్చి పానము జేసిన శమించును.

(సు-చి-అ 14.)

2. ఆర్తవ రోధమునందు జ్యోతిష్మతీ ప్రయోగము.

"సకాంజికం...భృష్టం జ్యోతిష్మతీదలం పార్శ్వ
వనితా త్వార్తవం లభతే॥"

వేయించిన జ్యోతిష్మతి ఆకులను చూర్ణించి పులికడుగుతో సే[illegible]
సేవించిన ఆర్తవరోధము బోవును. (చ-సి.)

3. ఉదరమునందు జ్యోతిష్మతి ప్రయోగము.

"జ్యోతిష్మత్యాః పిబేత్తైలం పయసా వా దినాష్టకం॥"

జ్యోతిష్మతీ బీజతైలమును పాలతో జేర్చి యెనిమిదినములు సేవించిన
సన్నిపాతోదరము శమించును. వం.సే (ఉదర-చికిత్స.)

(7) యోగములు:—

1. జ్యోతిష్మత్యాది తైలము - వా - ఉ - భగందర.

ఉపయోగములు:— అభ్యంగము జేసిన భగందరము శమించును.

Action:—The oil is rubefacient. The seeds are alterative, stimulant and nervine; they are supposed to stimulet the intellect and sharpen the memory. The oil has also the same effect.

Preparations:—Decoction of seeds and Pomatum or Pomade.

Uses:—The oil with benzoin, cloves, nutmeg and mace added is said to be a sovereign remedy in Beri-beri and a powerful stimulant; dose 10 to 15 minims. Decoction of seeds (1 in 10) with or without the addition of aromatics is given in rheumatism, gout, paralysis and leprosy. The oil is used as pomade for relieving rheumatic pains of a malarious character and in paralysis. It is also used in the form of pomatum made by mixing one part of the oil in 8 parts of butter for application to head. It is known as Magzsudhi (Brain clearer) and believed to promote intelligence. (Nadkarni. P. 187

# 92

# తగరం - గ్రంధి తగరం (క)

## భాషాంతర నామములు

హిందీ - తగర్, మరాఠీ - గంఠేంతగర, గుజరాతీ - త[illegible];
మలయాళం - తగరం, కన్నడం - తగర, ద్రావిడం - తగరై.

## నైసర్గిక స్వరూప వర్ణనము
## Natural Order — Valerianeae
### గ్రంధితగరము - Valeriana Harduickii

### పర్యాయ పదములు

శ్లో॥ కాలానుసార్యం తగరం కుటిలం నహుషం నతం॥

కాలానుసార్యము, తగరము, కుటిలము, నహుషము, నతము అనునవి ... నామములు.

పిండతగరం - పిండతగరము (గ్రంధితగరభేదము) (ఇ)

### భాషాంతర నామములు

ద్రావిడం - కిదంతి తగరం; కన్నడం - దొడ్డతగరం: హిందూస్థాని - పిండతగరం.

### పర్యాయ పదములు

శ్లో॥ అపగం పిండతగరం దండహస్తం చ బర్హిణం॥

పిండతగరము, దండహస్తము, బర్హిణము అనునవి పిండతగర నామములు.

### తగరద్వయగుణములు.

శ్లో॥ తగరద్వయ ముష్ణంస్యా త్స్వాదుస్నిగ్ధం లఘుస్మృతం,
విషాపస్మారశూలాక్షి రోగదోషత్రయాపహం॥

గ్రంధితగరము, పిండతగరము మధురరసమును, స్నిగ్ధలఘు గుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. త్రిదోషములను శమింపజేయును. విషము, అపస్మారము, శూల, నేత్రరోగము వీనిని బోగొట్టును.

### విశేషాంశములు.

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:— (తగర) - కాలానుసార్యము, కుటిలము, నతము, (మహారోగమూ.)

(పిండతగర) - దండహస్తము, బర్హిణము, పిండతగరము.

(ఖ) గుణబోధకములు:— తగర - (దీపనము).

(2) శబ్దార్థములు:—

కాలానుసార్యము - కాలమునకుదగినట్లు అనుసరింప దగినది. (లేక) నల్లని వర్ణమును గలిగియుండునది. కుటిలము - వంకరగనుండునది. నతము - వంగియుండునది. మహోరగము - సర్పముయొక్కతల (పడగ) వలెనుండు పుష్పములుగలది. దండహస్తము - దండము చేతియందున్నప్పుడెట్లుల హస్తము మూయబడి యుండునో యట్లులనే మొదటిభాగమున వంగియుండి క్రిందికి దండమువలె వ్రేలాడు వ్రేళ్ళనుగలది. బర్హిణము - నెమలిపించమువంటి కేసరములనుగలది. పిండతగరము - ముద్దవలె నుండునది. దీపనము - అగ్నిదీపనమును గలిగించునది.

(3) భేదములు:—

ఇది "వంకరగనుండునది" మొదలైనట్లుండునది, యని రెండువిధములుగా నుండునట్లు తెలియగలదు. నీటియొడ్డున నుత్పత్తియగు క్షుపముయొక్క పుష్పములు నైవ్యకశబ్ద సింధువునందు గ్రహింపబడినది. అందు పిండతగరమను నది కోంకణ దేశమునందు ప్రచారముగలిగి యున్నట్లు వైద్యగ్రంథములనందే చెప్పబడినది. అయితే నందలిగ్రంథి తగరము బజారునందు మూలరూపముననే లభించుచుండును. ఔషధయోగములందుగూడ మూలమే గ్రహింపబడుచున్నది. ఇది మూలభాగమున ముడివేసినట్లు చిన్న చిన్న వ్రేళ్ళతో కూడుకొనబడి క్రిందికి వ్రేలాడుచుండు కొన్ని వ్రేళ్ళు గలదిగా గానబడుచుండును. ఇందుచేతనే యిది గ్రంథితగరము అని వ్యవహరింపబడుచున్నట్లు తెలియగలదు. నైవ్యకశబ్ద సింధువునందు పుష్పముగా చెప్పబడినదో తెలియకున్నది. ఈ తగర ద్వయమును గురించిన విశేషములంతగా గానరాకుండుటచే నింకనువిమర్శించినగాని నిశ్చయింప వీలుగాకున్నది.

(4) విశేషగుణములు:—

తగర - తీక్ష్ణగుణమును, శీతవీర్యమును గలిగియుండును. భూతోన్మాదమును బోగొట్టును. (రా-ని) విషప్రముఖము బోగొట్టును (శో-ని) కటురసమును, కషాయానురసమును, కటువిపాకమును గలిగియుండును. శిరోరోగమును, రక్తదోషమును బోగొట్టును. (ని-ర.)

(5) ప్రయోగములు:—

1. సంధిక వాతమునందు తగర ప్రయోగము.

"తక్రేణ పిష్టం తగరస్యమూల మార్ద్రం నిపీతం వినిహంతి।
శీఘ్రం...నృణాం సంధిక వాతరోగం॥".

గ్రంధి తగరపుమూలమును పచ్చిది గ్రహించి మజ్జిగతో నూరి సేవించిన సంధికవాత రోగము శీఘ్రముగ శమించును. (రా-మా.)

2. పిల్లమను నేత్రవ్యాధియందు తగర ప్రయోగము.

"అథయారసపిష్టం వా తగరం పిల నాశనం"

గ్రంథితగరమును బీరకకాయ రసముతో నూరి లేపనముజేసిన పిల్లమను నేత్రరోగము శమించును. (రా-మా.)

(6) యోగములు:—

1. తగరాది తైలము - గదనిగ్రహ - యోనిరోగ.

ఉపయోగములు:—తైలపిచు ధారణముచే యోనిశూల శమించును.

—

# 93

# తాలః - తాటిచెట్టు

—

## భాషాంతర నామములు

హింది - తాల, మలయాళం - కరింపన, కర్ణాటకం - తాళెమర, ద్రావిడం - పనైమరం.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Palmeae

కొబ్బరికుటుంబము.

తాడిచెట్టు - Borassus flabelliter

ప్రకాండము 80 అడుగుల యెత్తువఱకు పెరుగుచుగాని కొమ్మలుండవు. పైభాగము దట్టముగాను-నిడుపుగాను, పసుపు, పసుపుగాను నుండును. దీనిపై రాలిపోయిన యాకుల యానవాళ్ళు గలవు. ప్రకాండము మొదట కొంచెమెక్కువలావుగ నుండును. గాని, అది పైన చివరవఱకు నొక్కటియేలావు. మామిడి మఱ్ఱి మొదలగు ద్విదళబీజకపు వృక్షములవలె నిది పొడుగెదుగు చుండినను లావుకాలేదు.

పత్రికాండమున కడుగున చాలవేళ్ళుగలవు. ఇవి కొంచెమెత్తుగను చిటికినవేలి లావుగను నుండును. ఈ యుపవంశపుచెట్ల తల్లివేరు చిన్నదిగా నున్నప్పుడే చచ్చిపోవుట చేత పత్రికాండమడుగునుండి ఇన్నివేళ్ళు పుట్టుచున్నవి.

ఆకులు చెట్టుచివర దగ్గిర దగ్గిరగా నుండును. ఇవిమిక్కిలి పెద్దవి. మిశ్రమపత్రములు. వత్రవైఖరి. చిట్టియాకులు పొడుగుగానేయుండును. సమరేఖపత్రము. సమాంచలము. దట్టముగను బిరుసుగను నుండును.

పుష్పమంజరి రెమ్మకంకి. లేత రెమ్మకంకులను గప్పుచు పిరుసగు పిరుచేటిక గలదు. పువ్వులు చిన్నవి. సరాళము. ఏకలింగపుష్పములు.

పురుషపుష్పము.

పుష్పకోశము. అసంయుక్తము. రక్షకపత్రములు 3 ఒకదానినొకటి తాకుచు నుండును. మిక్కిలి బిరుసుగ, చక్రమునవలె నుండును. నీచము.

దళవలయము. అసంయుక్తము. ఆకర్షణపత్రములు 3. వీనికి, మంచిరంగుగాని, వాసనగానిలేదు. మిక్కిలి బిరుసుగానుండును.

కింజల్కములు, 6 3 దళవలయమున కెదురుగను, 3 పుష్పకోశమున కెదురుగ నుండును. పుప్పొడితిత్తులు సన్నము.

పుష్పకోశము. గొడ్డువైయున్నది.

స్త్రీపుష్పములు. పురుషపుష్పములకంటె, పెద్దవి.

పుష్పకోశము,—దళవలయము పైదానియందు వలెనేయుండును.

కింజల్కములు. లేవు.

అండకోశము. అండాశయముచ్ఛము, 3 గదులు. కాని ఒకగదియే పెద్దదగును. కాయలోనున్న తెల్లని కొబ్బరి విత్తనము పెరుగుటకు నిలువచేసికొనిన పదార్థము. కొబ్బరి పీచు లోపలనుండు పెంకుకూడ కాయలోని భాగమేకాని గింజకాదు. ఒలచిన కొబ్బరికాయ కొకవైపున మూడు రంధ్రములున్నట్లు కనబడును ఒకదానిద్వార సులభముగ పొడవ వచ్చును గాని, మిగిలిన రెండును మూసికొని పోయినవి. ఈ రంధ్రములద్వార కాయ పెరుగుటకు నాహారపదార్థములు వచ్చినవి. లేతపిందెలోనున్న మూడుగదులలోను రెండు పెరుగక పోవుటచే రెండురంధ్రములు మూసికొని పోయినవి.

## పర్యాయ పదములు

శ్లో॥ తాలస్తు లేఖపత్రః స్యాత్ తృణరాజో మహోన్నతః ॥

తాలము, లేఖపత్రము, తృణరాజము, మహోన్నతము అనునవి తాలనామములు.

## తాటిఫల గుణములు

శ్లో॥ పక్వం తాలఫలం పిత్తరక్తశ్లేష్మవివర్ధనం।
దుర్జరం బహుమూత్రం చ తంద్రాభిష్యందశుక్రదం ॥

తాటిపండు కష్టముగ జీర్ణమగును. అతిమూత్రమును, తంద్రను, అభిష్యందమును, శుక్రమును గలిగించును. పిత్తమును, రక్తమును, కఫమును వృద్ధిపొందించును.

## విశేషాంశములు

**(1)** ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—లేఖపత్రి, తృణరాజ, మహోన్నత, ఆసవద్రుమ, చిరాయు.

(ఖ) గుణబోధకములు:—మధురస, మదాఢ్య.

**(2)** శబ్దార్థములు:—

లేఖపత్రి - వ్రాయుటకు అనువైన పత్రములు గలది. తృణరాజ-తృణజాతులలో శ్రేష్ఠమైనదిగా నెన్నబడునది. మహోన్నత - మిక్కిలి ఎత్తుగా పెరుగునది. ఆసవద్రుమ - మద్యమునిచ్చునట్టి వృక్షము, చిరాయు - చాలా కాలము జీవించునట్టిది. మధురస - మధురరసముగల ఫలములును, ఆసవమును గలది. మదాఢ్య - విశేషమైన మత్తును గలిగించునట్టి మద్యమును గలది.

**(3)** భేదములు:—

ఇది తాలము, హింతాలము అని రెండు విధములుగా నుండి తృణజాతులలో నుత్పత్తి గలిగి మదకారక మద్యమిచ్చు ద్రవ్యములలో నొకటిగా జేర్కొనబడు చున్నది. వీనిలో తాలవృక్షము ప్రతిచోట నుత్పన్నమగును. వీని ఫలములను కర్షకులు తిందురు. వీని బీజములు (టెంకలు) భూమిమీద పడి తమంతట నవియే మొలక లెత్తును. ఈ మొలకలను గూడ భక్షించుదురు. ఈ వృక్షములు చిన్నవిగా నున్నప్పుడు వీని లేతయాకులను గోసి విసనకర్రలను గట్టుదురు. ఈ యాకులు విశాలములుగా నుండును. ముదిరిన యాకులను మొదలంట నరికి యందలి మట్టల మొదటి భాగమును వేరుచేయుదురు. ఇటుల చేయబడిన భాగములను రాతిపై నలియగొట్టుదురు. అప్పుడందుండి సన్నని నార బయలువెడలును. దీని బాగుజేసి యారబెట్టి దీనితో త్రాళ్ళు అల్లుదురు. ఇవి మిగుల గట్టిగా నుండును. ఈ త్రాళ్ళను పడవలు, ఓడలు మొదలగు వాని కుపయోగించుదురు. ఇటుల నారకై విడదీయగా మిగిలిన పత్రభాగములను దీసికొని యందలి యాకులను ఛేదించి జాగ్రత్తపెట్టబడిన మట్టలు గరికమ్మలని చెప్పబడును. వీని రెండువైపుల యంచులు రంపపుపండ్లవలె నతి తీక్ష్ణముగా నుండును. ఈ కమ్మలను కర్షకులు తమ యిండ్లచుట్టునుండు ఆవరణ గోడలకు మదుళ్ళకై యుపయోగించుదురు. మరియు వీనిని వంటచెరకుగా గూడ నుపయోగించుటయు గలదు. పెద్దచెట్టు యొక్క ఆకులను కోసి ఆరబెట్టి వానిని పల్లెటూళ్లలోని యిండ్లకప్పులకై

యుపయోగింతురు. మరియు ముదురాకులను గోసి వానిని ఎండబెట్టి జాగ్రత్తగా చీరి వీనితో బుట్టలు, చాపలు, చదగలు మొదలగునవి. యల్లుదురు. ఈ యాకుల మధ్యభాగము ఒక అర్ధగజము నిడుపుండునట్లు చూచి మిగిలిన ఆద్యంత భాగములను వేరు పరచుదురు. పిమ్మట వానిని కట్టలుగా కట్టి జాగ్రత్త పెడుదురు. ఈ యాకులపై గంటములతో వ్రాయుదురు. ఇందుకనియే వీనికి లేఖ్యపత్రములని ప్రసిద్ధి కలిగెను. కాగితములు వచ్చుటకుముందు ప్రతి వ్యవహారమును ఈ తాటియాకుల పైననే జరిగెను. మన పూర్వులు ఈ యాకులపై నెన్నియో గ్రంథములు వ్రాసి యున్నారు. ఇటుల వ్రాసి జాగ్రత్త పెట్టబడిన గ్రంథములలో నిప్పటికిని కొన్ని కాగితములపై అచ్చుపడక అట్లే యున్నవి. అనగా అంతములేనన్ని గ్రంథములు ఈ తాటియాకులపై వ్రాయబడి యున్నవని భావము. ఇటుల తాటియాకులు పూర్వకాలమున వ్యవహారమునం దెంతయో ప్రయోజనమును గలిగి యిప్పటికిని మిగుల ప్రసిద్ధి బడసియున్నవి. ఈ తాటిచెట్లలో కొన్ని చేవగలిగి యుండును. అట్టి చెట్లను ఇండ్ల వాసములకై ఉపయోగింతురు. ఇవి మిక్కిలి గట్టితనమును గలిగి చాలాకాలము చెడక యుండును. మరియు నిటువంటి చెట్లను కర్షకులు తమ వ్యవసాయపు పనులలో ననేక విధములుగా నుపయోగించు చుందురు. ఒక కర్షకునకు ఒక తాటితోట యున్నచో నతడొక ధనవంతుడనియే పల్లెల యందు ప్రసిద్ధి.

ఈ వృక్షములలో పురుషజాతి, స్త్రీజాతియని వేరువేరుగా నుండును. అందలి పురుషజాతి వృక్షములు కేవలము పుష్పములను మాత్రము పూయును. ఈ పుష్పములు దీర్ఘముగను, గుత్తులుగను నుండు నాళములవంటి చిన్నవిగా నుండును. ఈ నాళములు వృద్ధియైనకొలదియు పుష్పములు నశించును. ఈ నాళములే గులకలని వ్యవహరింపబడును. ఇవి క్షారముతో గూడియుండును. వీనినిగాల్చి యందుండి క్షారమును గ్రహించి వైద్యమునందు మూత్రజ వ్యాధులలో నుపయోగింప బడుచుండును. స్త్రీజాతి వృక్షములు కాయలుకాచును. ఈ వృక్షములే మద్యము నిచ్చును. ఇది మిక్కిలి మదకరమైనది. ఈ కాయలు లేతవిగానున్నప్పుడు కర్షకులు వీనిని గోసి తిందురు. ఇవి మిగుల మధురముగను, రుచ్యముగను నుండును. ఈ తాలమద్యముతో వైద్యమునందు కొన్ని యాసవములు చేయబడును. ఇట్టివి విషూచి, అతీసారము మొదలగు వ్యాధులందుపయోగింప బడుచున్నవి. తాటికల్లును తక్కువజాతివారు పానము చేయు

మురు. హింతాలమనునది తాలవృక్షమంత ఎత్తుగా పెరుగదు. కాని దానియొక్క తాలకంటె హింతాల పత్రములు మిక్కిలి విశాలములుగా నుండును. నిఘంటుకారుల నిరూపణమునుబట్టి ఇది దక్షిణ భారతమున విశేషముగా నుండునని తెలియగలదు. దీని యుపయోగములెట్టివో యింకా తెలియకున్నవి.

(4) విశేషగుణము:—

(క) తాలఫల - మధురరసమును, గురుస్నిగ్ధగుణములను, శీతవీర్యమును గలిగియుండును. బలమును గలిగించును. వాతపిత్తములను శమింపజేయును. రక్తదోషమును, క్షతమును, దాహమును, క్షయను పోగొట్టును. (రా-ని) తిక్తకషాయాను రసములను గలిగియుండును. మూత్రరోగమును పోగొట్టును. (రా-వ).

(ఖ) తాలమజ్జ (ముంజి) - మధురరసమును లఘుస్నిగ్ధ సరగుణములను గలిగియుండును. కొద్దిగా మత్తుగలిగించును. కఫమును వృద్ధిపొందించును. వాతపిత్తములను శమింపజేయును. (భా-ప్ర).

(గ) తాలప్రలంబ (గులకలు) - రూక్షగుణమును గలిగియుండును. క్షతరోగమును పోగొట్టును. (రా-ని.)

(ఘ) అస్థిమజ్జ - (బుర్రగుంజు) - మధురరసమును, గురుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. మూత్రమును వృద్ధిజేయును. (రా-ని).

(చ) తాలమద్య (తరుణ) - హెచ్చుగ మత్తును గలిగించును. (భా-ప్ర).

(ఛ) అగ్నిధూత తాలమజ్జ - (పులిసినకల్లు) - పిత్తమును వృద్ధిపొందించును. వాతమును శమింపజేయును.

(జ) తాలమస్తక - (మువ్వ) - మధురరసమును, తిక్తకషాయాను రసములను గలిగియుండును. బలమును, శుక్రమును వృద్ధిపొందించును, మూత్రజరోగములను పోగొట్టును. (రా-వ).

(ఝ) తాలవృన్త (తాటియాకు విసనకర్ర) - లఘుగుణమును గలిగియుండును. త్రిదోషములను శమింపజేయును. (రా-వ).

(ట) హింతాలఫల - మధురరసమును, అమ్లానురసమును, శీతవీర్యమును గలిగియుండును. కఫమును వృద్ధిపొందించును. వాతపిత్తములను శమింపజేయును. దాహమును, శ్రమను, తృష్ణను పోగొట్టును. (రా-ని).

(5) ప్రయోగములు:—

1. మూత్రకృచ్ఛ్రమునందు తాలప్రయోగము.

"తాలశస్యాస్థికాశ్రుతం
శృతం పయశ్చ మూత్రస్య వైవర్ణ్యే కృచ్ఛ్రవివచః॥"

తాటివేళ్ళకషాయ కల్కములతో గాచిన పాలనుగాని, ఘృతమునుగాని సేవించిన మూత్రవైవర్ణ్యమును, మూత్రకృచ్ఛ్రమును శమించును.

(చ-చి-అ 22).

2. మూత్రాఘాతమునందు తాలప్రయోగము.

"పిష్ట్వాథ వం సుశీతేన శాలితండుల వారిణా,
తాలస్య తరుణం మూలం॥" ...

తాటివేళ్లను లేతవిగా నుంచు వానిని గ్రహించి మిక్కిలి శీతలముగా నుంచు శాలిబియ్యపు కడుగుతో నూరి సేవించిన మూత్రాఘాతము శమించును.

(సు-ఉ-అ 58).

3. ఉన్మాదమునందు తాలప్రయోగము.

"ఉన్మాదే సమధుః పేయః శుద్ధో వా తాలశాఖజః రసః॥"

ఉన్మాదరోగికి శోధనము జేసిన పిమ్మట తాటిమట్టలరసమునందు తేనె గలిపి యిచ్చిన ఉన్మాదము శమించును.

(చ-ద).

4. ప్లీహోదరమునందు తాలప్రయోగము

"తాలపుష్పభవః క్షారః సగుడః ప్లీహనాశనః॥"

తాటిపువ్వుల క్షారమును బెల్లముతో జేర్చి సేవించిన ప్లీహోదరము శమించును

(చ-ద).

5. విషూచికయందు తాలప్రయోగము.

"తండులోదకపిష్టేన తాలమూలేన లేపనం।
నాభౌ ప్రకల్పితం సద్యో జయత్యేవ విషూచికాం॥"

తాటివేళ్లను బియ్యపుకడుగుతో నూరి బొడ్డుకు పట్టువేసినయెడల వెంటనే విషూచిక శమించును.

(వై-స).

(6) యోగములు:—

1. తాలజటాద్యంజనము - భైషజ్య నేత్రరోగ - ఉపయోగములు:— కంటికి అంజనమువేసిన శుక్రరోగము శమించును.

(7) Medicinal uses:-The saccharine juice obtained by excision of the spadix is cooling, sweet and useful in inflammatory dropsy

The sediment of the toddy forms a yeast which is very largely used in breadmaking. Sugar is manufactured from it in Madras, Burma and Ceylon. Sugar obtained from this palm is imported into culcutta from Ceylon. The yellow pulp surroumding the ripe nuts is sweet, heavy and indigestible. It is made into cakes with flour and other ingredients. The young seeds contain a clear watery fluid which is very refreshing and cooling. The kernal of the seeds after the seedlings have germinalid is eaten. The terminal buds of the tall tree are regarded as nutrative, diuretic and tonic. The ashes of the flowering stalk are said to be useful in enlarged spleen. The 'toddy Poultice' is a valuable stimulent application to gangrenous ulcerations, carbuncle, and in dolent ulcers. The sugar cundy produced in the manufacture of sugar from this palm is used in coughs and pulmonary affections.

(Indigenous drugs of India.)

---

# 94
# తాలీసపత్రం - తాలీసపత్రి (త్రము)

---

## భాషాంతర నామములు

హిందీ - తాలీసపత్ర, మరాఠీ - లఘుతాలీసపత్ర, గుజరాతీ - తాలీసపత్ర, మలయాళం - తాలీసపత్రి, కర్ణాటకం - తాలీసపత్ర, ద్రావిడం - తాలీసపత్రి.

## నైసర్గిక స్వరూప వర్ణనము
## Natural Order—Conifereae
దేవదారు కుటుంబము

తాలీసపత్రి - Abies Webbiana

దేవదారుచెట్టను. ఇట్టి యితరచెట్లును మనదేశములో నంతగాఁ బెరుగుటలేదు. ఆ పెరుగునవి కొన్నియు పర్వతములమీఁదఁ బెరుగుచున్నవి. అవి శీతలప్రదేశములలోఁ గాని వర్ధిల్లఁజాలవు. పూర్వకాలమునందీచెట్లే ప్రపంచము నందంతటను నెక్కువగా నుండెను. వానితో కొన్నికుటుంబము లిప్పుడు పూర్తిగా నంతరించి పోయినవి. మరికొన్ని ఒకింత తక్కువగనున్నవి.

## పర్యాయ పదములు

శ్లో॥ తాలీసముక్తం పత్రాఖ్యం ధాత్రీపత్రం చ తత్స్మృతం ॥

తాలీసపత్రము, పత్రాఖ్యము, ధాత్రీపత్రము అనునవి తాలీసపత్ర నామములు.

## తాలీసపత్రి గుణములు

శ్లో॥ తాలీసం లఘుతీక్ష్ణోష్ణం శ్వాసకాసకఫానిలాన్ ।
నిహన్త్యరుచిగుల్మామ వహ్నిమాంద్యక్షయామయాన్ ॥

తాలిసపత్రి లఘుతీక్ష్ణగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. కఫవాతములను శమింపజేయును. శ్వాస, కాస, అరుచి, గుల్మము, ఆమము, అగ్నిమాంద్యము, క్షయము అను నీ వ్యాధులను పోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:-పత్రాఖ్యము, ధాత్రీపత్రము. (ఘనచ్ఛద.)

(ఖ) గుణబోధకములు:—(ముఖరోగహరము, హృద్యము.)

(2) శబ్దార్థములు:—

పత్రాఖ్యము - విశేషముగ పత్రములతో గూడి యుండునది. ధాత్రీపత్రము - ఉసిరికాయాకులవంటి యాకులను గలది. ఘనచ్ఛద - దళసరిగ నుండు పత్రములను గలది. ముఖరోగహరము - ముఖరోగములను పోగొట్టునది. హృద్యము - హృదయమునకు హితమైనది.

N. B:—ఇది యెత్తుగా పెరుగు వృక్షజాతులలో నుత్పత్తి గలిగి సుగంధ ద్రవ్యములందును, కఫహరద్రవ్యములందును గణింపబడు చున్నది. ఈ పత్రము మిగుల ఘాటుగా నుండును. ఎండిన పత్రము విశేషముగా బజారులందు లభ్యమగును. ఇది పెద్దయుసిరిక యాకును బోలి కొద్దిగ దళసరిగ నుండును. వైద్యమందు విశేషముగా కాస శ్వాసలందుపయోగింపబడుచున్నది.

(3) విశేషగుణములు:—

జఠరాగ్నిని వృద్ధి పొందించును. హృదయమునకు హితమైనది. కఫమును శమింపజేయును. ముఖరోగములను పోగొట్టును. (ధ-ని.) తిక్తరసమును, మధురానురసమును గలిగి యుండును. హిక్కను, ఛర్దిని పోగొట్టును. (రా-ని.) స్వరమును గలిగించును. రక్తదోషమును పోగొట్టును. (ని-ర.)

4) ప్రయోగములు:—

1. అరుచియందు తాలీసపత్రి ప్రయోగము.

"తాలీసచూర్ణ వటకాః సకర్పూరసితోపలాః ।
రుచికరాః భృశం" ॥

తాలిసపత్రి, కర్పూరము, చక్కెర వీనిని వటకములుగా జేసి సేవించిన రుచి గలుగును. (వా-చి-అ-5.)

2. రక్తపిత్తమునందు తాలీసపత్రి ప్రయోగము.

"తాలీసచూర్ణ సంయుక్తః క్షేయః క్షౌద్రేణ వాసకస్వరసః ।
కఫపిత్తతమకశ్వాస స్వరభేదరక్తపిత్తహరః" ॥

తాలిసపత్రి చూర్ణమును అడ్డసరపు రసమునందు జేర్చి తేనె గలిపి సేవించిన రక్తపిత్తము, తమకశ్వాస, స్వరభేదము ఇవి శమించును. కఫపిత్తములు శమించును. (చ-ద.)

5) యోగములు:—

1. తాలీసాదిచూర్ణము - వా-రాజయక్ష్మ. మాత్ర:-½ తులం.

ఉపయోగములు:—క్షయ, కాస, శ్వాస, అరుచి, ఛర్ది, ప్లీహ, పార్శ్వశూల, పాండు, జ్వరము, అతీసారము ఇవి శమించును. మూఢవాతమున కనులోమగతి గలుగును.

2. తాలీసాదివటకము - వా-గ్రహణి. మాత్ర:-3 యవలు.

ఉపయోగములు:—ఛర్ది, గ్రహణి, పార్శ్వశూల, హృచ్ఛూల, జ్వరము, ఆమాంధ్యము, పాండు, గుల్మము, మదాత్యయము, ప్రసేకము, పీనసము, శ్వాస, కాసము ఇవి శమించును.

3. తాలీసాదిఘృతము - వై-చిం-శ్వాస. మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—సమస్త శ్వాసలు శమించును.

4. తాలీసాదితైలము - సు-సద్యోవ్రణ.

ఉపయోగములు:—అభ్యంగము జేసిన సద్యోవ్రణము శీఘ్రముగ శోషణ గును.

5. తాలీసాదిమోదకము - చ-ద-యక్ష్మరోగ. మాత్ర:-3 యవలు.

ఉపయోగములు:—రాజయక్ష్మ శమించును.

## స్వానుభవము

[తాళీసపత్రిని నేను తాళీసాది చూర్ణరూపముగ ననుదిన ముపయోగించి కఫహరముగను దీపనీయముగ నున్నదని తలచుచున్నాను.

ఉపయోగములు:—దీనికొక విధమగు సుగంధ ముండుటచే పుప్ఫుసములలోని భాగములకు శక్తిని, చురుకును కలిగించును. క్షయలోను, చిరకాలగతమగు దగ్గులోను ఇది పరమౌషధము. తాళీసాది చూర్ణము చిన్నదగ్గులు రొంప మొదలగువానికి మంచి యౌషధము. ఇది రుచిని, హితవును బుట్టించును. ఓకరను పోగొట్టును. రక్తపిత్తములో దీని చూర్ణమును అడ్డరసపు రసముతోను తేనెతోను తీసికొనవలయునని చక్రదత్తుడు చెప్పుచున్నాడు. ఆ. ల.]

---

# 95

# తాంబూలవల్లీ - తమలపాకులతీగె

---

## భాషాంతర నామములు

హింది - పాన్, మరాఠి - పానవేల్య, గుజరాతి - పాన్, మలయాళం - రొడ్డి, కర్ణాటకం - వీళ్యదెలెబళ్ళి, ద్రావిడం - వెత్తిలెక్కొడి.

## నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order—Piperaceae**

మిరియపు కుటుంబము

తమలపాకులతీగె - **Piper Betel (Eng. Betel leaf.)**

మిరియపుతీగె మలబారు దేశమునందెక్కువగాఁ బెరగుచున్నది. ఇది అగంతుక వేరులమూలమునఁ బ్రాకును.

ఆకులు—ఒంటరిచేరిక. తీఁగెకు రెండువైపులనే యుండును. హృదయాకారము. తొంచెము వంకిరగానుండును, అయిదారు ఈనెలుండును. కొనవాలముగలదు రెండువైపుల సన్నగనుండును.

పుష్పమంజరి—కంకి. ఏకలింగపుష్పములు; కొన్ని ఆడకంకులలోఁ గొన్ని పుష్పములును గలవు. ఆడుతీగెలు పోతు తీగెలు వేఱువేఱుగఁ గూడ గలవు.

పుష్పకోశము—లేదు.

దళవలయము—లేదు.

కంకిపైకొన్ని పొలుసులవంటి చేటికలుమాత్రమున్నవి. వానిమధ్యనేమిగిలిన పుష్పభాగములుండును. స్త్రీపుష్పమువద్దనున్న కమటిచే లన్నియుఁగలసి గిన్నెవలె నేర్పడియున్నవి.

మగకంకి కింజల్కములు—మూడు కాడలు పొట్టిగను లావుగను నున్నవి.

అండకోశము—కొన్నిటియందు గొడ్డై యుండినట్లుఁ గనఁబడును. మఱికొన్నిటియందు నదియులేదు.

ఆఁడుకంకి కింజల్కములు—కొన్నిపుష్పములందు మాత్రము రెండు కింజల్కములున్నవి. కొన్నిటియందు పుప్పొడితిత్తులు లేక గొడ్డులైనవి యున్నవి. కీలములేదు. కీలాగ్రములు మూడు. కండకాయ.

ఈకుటుంబమునందు గుల్మములును గుబురు మొక్కలును గలవు. ఆకులు ఒంటరి చేరికగా నైనను, అభిముఖ చేరికగా నైనను, కిరణప్రసారముగా నైన నుండును. కొన్నిటికిఁ గణుపు పుష్పములు గలవు సమాంచలము పుష్పములుచిన్నవి. మిధునపుష్పములు ఏకలింగ పుష్పములును గలవు. పుష్పకోశముగాని దళవలయముగాని లేదు. కింజల్కములు రెండు మొదలు ఆఱువరకు నుండును. మూడుగాని, అంతకు నెక్కువగాని స్త్రీపత్రములుండును. కొన్నిటిలో నవికలసియున్నవి, కొన్నిటిలో విడిప్పడిగానేయున్నవి.

## పర్యాయ పదములు

శ్లో॥ తాంబూలవల్లీ తాంబూలీ నాగినీ నాగవల్లరీ ॥

తాంబూలవల్లి, తాంబూలి, నాగిని, నాగవల్లరి యనునవి తాంబూలవల్లీ నామములు.

## తాంబూల గుణములు

శ్లో॥ తాంబూలం విశదం రుచ్యం తీక్ష్ణోష్ణం తువరం సరం,
వశ్యం తిక్తం కటుక్షారం రక్తపిత్తకరం లఘు
బల్యం శ్లేష్మాస్యదౌర్గంధ్య మలవాతశ్రమాపహం,
ముఖవైశద్యసౌగంధ కాంతిసౌష్ఠవకారకం ॥
హనువ న్తమలధ్వంసి జిహ్వేంద్రియవిశోధనం ॥

తమలపాకు కషాయరసమును, తిక్తకటుకాను రసములను, విశదతీక్ష్ణసరలఘుగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. క్షారముతో గూడి యుండును. ఎదుటివానిని తనకు వశమగునట్లు జేయును. రుచిని బుట్టించును. బలమును గలిగించును. ముఖమునకు వైశద్యము (శుభ్రము)ను, పరిమళమును, కాంతిని, సౌష్ఠవమును గలిగించును. నాలుకను శోధించును. రక్తమును దూషింపజేయును. పిత్తమును వృద్ధి బొందించును. కఫవాతములను శమింపజేయును. ముఖదౌర్గంధ్యమును, ముఖమలమును, క్రిమును, హానుమలమును, దంతమలమును పోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

పరిచయబోధకములు:— నాగవల్లరి, సప్తశిర, భక్ష్యపత్రి.

(2) శబ్దార్థములు:—

నాగవల్లరి - పాముపడగవలె నుండు పత్రములతో గూడిన లత (ఐరావతముయొక్క కట్టురాటయందు బుట్టినది. నాగలోకమునుండి తీసుకొని రాబడినట్టి లత అని అమరకోశము). సప్తశిర - ఏడు ఈనెలు గలిగినట్టి పత్రములను గలది. భక్ష్యపత్ర-తినుటకు యోగ్యమైన పత్రములతో గూడినట్టిది.

(3) భేదములు:—

ఇది కృష్ణశుభ్ర భేదముచే రెండు విధములుగా నుండి లతాజాతులలో నుత్పత్తి గలిగి కఫహరద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగా నెంచబడుచున్నది ఈ ద్వివిధమగు తాంబూలీలత దేశభేదముచే తిరిగి యనేక విధములుగా నుండును. అందు శ్రీవాటి, అమ్లవాటి, సాతసి, సప్తశిర, అమ్లసార, పటులిక, హేసవీయ యను మొదలగు జాతులు దేశభేదమునుబట్టి యేర్పడును. ఈ తమలపాకుల లతలు వానికి యనుకూలమైన మన్ను నీళ్లు గల ప్రదేశములందే వృద్ధి బొందును. ఈ లతలను సన్నని వెదురుకర్రలను ఒక్కొక్క లత దగ్గర పాతి వానిపై పాకింపుదురు. ఈ తోటలు చూచుటకు మిక్కిలి ఆహ్లాదకరముగా నుండును. ఈ యాకులు వెడల్పుగను [illegible]గను నుండి పాముపడగవలె లతలనుండి వంగియుండును. అందుకనే యివి నాగదళములని వ్యవహరింపబడుచున్నవి. ఇవి యేదేశమునం దుత్పన్నమైనను వీనిలో కొన్ని కషాయరస ప్రధానముగను, కొన్ని కటురస ప్రధానముగను నుండును. మరియు వీనిలో కొన్ని జాతుల యాకులు చిన్నవిగను, కొన్ని జాతుల

యాకులు విశాలముగను పెద్దవిగను నుండును. పాగాకుతో జేర్చి తాంబూలమును సేవించువారు కటురస ప్రధానమైన యాకులను, ఇతరులు కషాయరస ప్రధానమైన వానిని ఉపయోగింతురు. ఈ తమలపాకులు భారతీయులకు నిత్య ముపయోగించు ద్రవ్యములలో నొకటిగా నున్నది. ప్రతి గృహస్థుడును భుజించిన వెంటనే ఈ యాకులను పోకచెక్కలను, కొంచెము సున్నమును ఒకటిగా జేర్చి తాంబూలమును సేవించు చుండును.

ఇటుల నిది ప్రతిభారతీయునిచే ప్రతినిత్య ముపయోగింపబడునది యగుటచే నితర ద్రవ్యములవలె వర్తకరూపమున ఎగుమతి దిగుమతులను బొందు చుండును. ఇందుచే వీనిని కృషికులు తోటలరూపమున పెంచుచుందురు. అయితే ఇది యితర ద్రవ్యములవంటిదిగాక ఆరోగ్యసంరక్షణార్థమై ఉపయోగింపదగునని "కర్పూరజాతీకక్కోల లవంగకటుకాహ్వయైః । సచూర్ణపూగైః సహితం పత్రం తాంబూలజం శుభం ॥ ముఖవైశద్యసౌగంధ్య కాంతిసౌష్ఠవకారకం । హనుదన్తస్వరమల జిహ్వేంద్రియవిశోధనం ॥ ప్రసేకశమనం హృద్యం గలామయవినాశనం ॥ పథ్యం సుప్తోత్థితే భుక్తే స్నాతే వాంతే చ మానవే ॥" (సు-చి-అ 24.) సుశ్రుతుడిట్లు విధించియుండెను. అందుచే తాంబూలపత్రములను, పచ్చకర్పూరమును, జాజికాయను, తక్కోలములను, లవంగములను, తోకమిరియాలను, సున్నమును, పోకచెక్కలను కలిపి తాంబూలమును పరుండి లేచినప్పుడును, భుజించిన పిమ్మటను, స్నానముచేసిన పిమ్మటను, వాంతియైన పిమ్మటను సేవించినచో ముఖవైశద్య సౌగంధ్యాదులును, హనుదంతాదిమలాది శోధనమును ఏర్పడును. నోటినుండి నీరూరుట, కంఠరోగమును శమించును. హృదయమునకు హితమగును. మరియు "పథ్యం సుప్తోత్థితే స్నాతే భుక్తే వాంతే చ సంగరే, సభాయాం విదుషాం రాజ్ఞాం కుర్యాత్తాంబూలచర్వణం ॥" (భా-ప్ర.) ఇట్లు తాంబూలమును పరుండి లేచినప్పుడు మొదలగు కాలములందే గాకుండ యుద్ధమునందును, పండితులు రాజుల పరిషత్తులందును సేవించుట హితమని దెలియ గలదు. దీనినిబట్టి యిది యుత్తేజకమగుటచే ప్రతివ్యాపారములకు తొలుత తాంబూలమును సేవించుట కొన్ని కొన్ని దేశములందు ఆచరణలో గలదు. మరియు నిది యెదుటివానిని తన వశముచేసుకొనుటకు సాధనమైనదగుటచే అందును ముఖ్యముగ స్త్రీలు తమ భర్తలు తమ వశమగుటకై తాంబూలము నత్యంతము ప్రేమింతురు. ఇది స్త్రీలముఖముల కలంకారమువంటిది.

అయితే తాంబూలము "రక్తపిత్తక్షతక్షీణ తృష్ణామూర్ఛాపరీతినాం । రూక్ష దుర్బలమర్త్యానాం నహితం చాస్యశోషిణాం॥" (సు-చి-అ 24.) రూక్షము గను, దుర్బలముగనుండు వారలకును, రక్తపిత్తాది వ్యాధిపీడితులకును అహితమైన దగుటచే దీనిని తదితరులే సేవింపదగియుందురు. మరియు "న నేత్రరోగే నచ రక్తపిత్తే క్షతే నవాతే నవిషే నశోషే । మదాత్యయే నాపిచ మోహ మూర్ఛాశ్వాసేషు తాంబూల ముశంతి వైద్యాః॥" (సుషేణ) అని చెప్ప బడుటచే, పైవానితో బాటు నేత్రరోగము, విషము, మోహము, శ్వాస వీనిచే పీడింపబడు వారలును తాంబూలమును సేవింపకూడదు. తమలపాకులు లోకము నందు ప్రతి శుభకార్యమునందును మిక్కిలి యుపయోగకారి. ఇది లక్ష్మీ ప్రదమైనదని హిందువుల సమ్మతము. అందుచే తమలపాకులు లేనిదే ఏ హైందవుని గృహమునందును ఏ శుభకార్యమును జరుగనేరదు. దానము చేయు వస్తువును దీనియందుంచి దానము చేయుచుందురు. దీనినిబట్టి ఇతరులను గౌరవింప వలెనన్న అందుకు తాంబూలమే మనకు ఉపకరణముగా ఏర్పడినది. తమల పాకులు కటురసము గలవగుటచే వీనిరసమును చంటిపిల్లలు కఫజవ్యాధులచే బాధపడుచున్నప్పుడు తేనెతో గలిపి నాకింతురు. శరీరమునందు ఉష్ణము తగ్గి పోయినప్పుడు వీనిరసమునందు కొద్దిగా కస్తూరిని గలిపి యిచ్చిన వెంటనే ఉష్ణము గలుగును. ఇటులనే పెద్దపెద్ద వ్యాధులలో గూడనిది యనుపానము ముగా పనిచేయును. ఉపకరిుంలగు ఔషధములను ఈనాగవల్లీస్వరసముతో భావనచేయవలసినదిగా శాస్త్రములందు విధింపబడినది. ఇటుకోలుత నుండి హరింపబడిన భిన్నదేశజములగు శ్రీవాటి మొదలగు నాగవల్లీ జాతులను గురించిన విశేషములు గానరావున్నవి. అందు అమ్లసారయనునది మాళవదేశము నందును, పటులిక, హైసనియనునవి యాంధ్రదేశమునందును ఉత్పన్నము లగునవి యని వైద్యశబ్దసింధువునుబట్టి తెలియగలదు.

(4) విశేషగుణములు:—

(క) తాంబూలపత్రసామాన్య - కామమును వృద్ధిపరచును. కృములను పోగొట్టును. (ధ-ని.) కటురసమును, కటువిపాకమును గలిగియుండును. ముఖ స్వాదమును గలిగించును. మలసంగ్రహము జేయును. జాఠరాగ్నిని వృద్ధిపొందించును. (సు-సూ. అ 46.,) దాహమును గలిగించును. పీనసమును పోగొట్టును. (రా-ని.) వస్తి శోధించును. (రా-వ.)

(ఖ) సద్యస్త్రోటిత తాంబూలపత్రి (అప్పుడే త్రుంచినయాకు) - ముఖరోగము, దాహము, అరుచి, అధికమలము, విష్టంభము, వాంతి అను ఈ రోగములను గలిగించును. రక్తమును దూషింప జేయును. (రా-ని.)

(గ) చిరత్రోటిత తాంబూలపత్రి (చాలాకాలమైన తుంచిన ఆకు) - ఇది జలమునందు తడిపియుంచిన, రుచిని బుట్టించును, బలమును గలిగించును. (రా-ని.)

(ఘ) నవతాంబూలపత్రి - మధురరసమును, కషాయానురసమును, గురుగుణమును గలిగియుండును. కఫమును వృద్ధిబొందించును. (భా-ప్ర.)

(చ) పురాణతాంబూలపత్రి (పండినయాకు) - ఇది విశేషమైన గుణములను గలిగియుండును. (భా-ప్ర.)

(ఛ) తాంబూలఫల - పరిమళమును గలిగియుండును. హృదయమునకు హితమైనది. కఫవాతములను శమింపజేయును. (ఆత్రేయ.)

(జ) తాంబూలమూల - రూక్షతీక్ష్ణరసగుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. బలమును గలిగించును. పుష్టినిజేయును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. కఫవాతములను శమింపజేయును. (భా-ప్ర.)

(ఝ) కృష్ణతాంబూలపత్రి - తిక్తరసమును, కషాయానురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. దాహమును, వక్త్రజడత్వమును, ఆస్యమలమును గలిగించును. (ధ-ని.)

(ట) శుభ్రతాంబూలపత్రి (తెల్లనిది) - రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమమును పచింపజేయును. హితమైనది. కఫవాతములను శమింపజేయును. (ధ-ని.)

(ఠ) శ్రీవాటీతాంబూలపత్రి - ఇది విశేషముగ స్వరసమును గలిగియుండును. మధురరసమును, తీక్ష్ణగుణమును, శీతవీర్యమును గలిగియుండును. రుచిని బుట్టించును. త్రిదోషములను శమింపజేయును. (రా-ని.)

(డ) అమ్లవాటీతాంబూలపత్రి - కటురసమును, అమ్లతిక్తానురసములను, తీక్ష్ణగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. నోటియందు పుండును గలిగించును. దాహమును, విష్టంభమును గలిగించును. రక్తమును దూషింప జేయును. పిత్తమును వృద్ధిబొందించును. వాతమును శమింపజేయును. (రా-ని.)

(ఢ) సాతసీతాంబూలపత్రి - మధురరసమును, కటుకానురసమును, తీక్ష్ణగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. ఆమమును పచింపజేయును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. రుచిని బుట్టించును. గుల్మమును, ఉదరమును, ఆనాహమును బోగొట్టును. (రా.ని)

(ణ) సప్తశిరాతాంబూలపత్రి - మధురరసమును, తీక్ష్ణగుణమును గలిగియుండును. రుచిని బుట్టించును. పరిమళమును గలిగియుండును. హృదయమునకు హితమైనది. బలమును, పుంస్త్వమును గలిగించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. (రా.ని.)

(త) అమ్లసరాతాంబూలపత్రి - మధురరసమును, అధికతీక్ష్ణగుణమును శీతవీర్యమును గలిగియుండును. రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. బలమును గలిగించును. ముఖమును పరిమళింపజేయును. మత్తును గలిగించును స్త్రీ సౌభాగ్యమును వృద్ధిబొందించును. పిత్తమును శమింపజేయును. దాహమును, గుల్మమును, ఆధ్మానమును, విబంధమును బోగొట్టును. (రా.ని.)

(థ) పటులికాతాంబూలపత్రి - కషాయరసమును, కటుకానురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. పిత్తమును వృద్ధిబొందించును. వాతమును శమింపజేయును. కంఠమలమును బోగొట్టును. (రా.ని.)

(ద) హేసనీయాతాంబూలపత్రి - కటురసమును, తీక్ష్ణగుణమును గలిగియుండును. హృదయమునకు హితమైనది. రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమమును పచింపజేయును. కఫవాతములను శమింపజేయును. (రా.ని.)

(5) ప్రయోగములు:—

1. నవనేత్రకోపమునందు తాంబూలపత్రి ప్రయోగము.

"తాంబూలశిగ్రు కరవీరశిరీష నీ ।
...ప్రత్యేకశో మధుయుతః స్వరసోఽంజనేన ।
కోపం నవం నయనయోః సహసైవ హన్తి॥"

తాంబూలపత్రి స్వరసమునందు తేనె గలిపి నేత్రములకంజనము వేసిన అప్పుడే వచ్చిన నేత్రప్రకోపము శమించును. (గ.ని.)

2. శ్లీపదమునందు తాంబూలపత్ర ప్రయోగము.

"సప్తతాంబూలపత్రాణాం కల్కం తప్తేన వారిణా ।
సంసృష్టలవణోపేతం శ్లీపదం హన్తి సేవనాత్॥"

తమలపాకుల నేడింటిని గ్రహించి కల్కముగా నూరి అందు సైంధవ లవణము జేర్చి వేడినీళ్లతో సేవించిన శ్లీపదము శమించును. (వం_సే.)

(6) యోగములు:—

1. నాగవల్ల్యాదిచూర్ణము - భైషజ్య - వీర్యస్తంభ. మాత్ర:- ¼ తు॥

ఉపయోగములు:—వీర్యస్తంభనము జేయును. వృష్యము. రసాయనము.

(7) Action and uses:—Of late years the medicinal propertsie of betel leaves have been investigated in Europe. Dr. Kleinsteick of Zwatzen, near Jena has found that the essential oil is of much use in catarrhal affections, inflammations of the throat, larynx and bronchi; it has an antiseptic action. He has used it in diphtheria as a gargle and by inhalation. The dose is one drop in hundred gramms of water. In India the juice of the leaves may be used similarly diluted.

(Dymock III P 116.)

Stimulent, carminative and antiseptic; given in flatulence, foetor of the mouth, dyspepsia, colic etc; mostly used as a masticatory by the natives of India. Chavicoal is a Powerful antiseptic, five times stronger than carbolic and and twice as strong as engenol. The juice is also antiseptic and used in catarrhal affections and inflammations of the throat and bronchi in diphtheria etc.

(R. N. Khory Part II P. 516.)

[ ఒక్కచుక్క తమలపాకు రసమునందెంతో వైటమిన్ (జీవనీయపదార్థము) యున్నదని నవీనశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఆ. ల. ]

# 96

# త్రిపుసం - దోస (క)

## భాషాంతర నామములు

హిందీ - ఖీరా, మరాఠీ - తవసేం, గుజరాతి - అనియుం, మలయాళం - వలియకొట్టువెళ్ళరి, కర్ణాటకం - హిరియహానుక్కె, ద్రావిడం - వరికుమ్మట్టులు.

## నైసర్గిక స్వరూప వర్ణనము

Natural Order—Cucrubi taceae

గుమ్మడి కుటుంబము

దోస - Cucumis Sativus.

(56-వ పుట చూడుము)

## పర్యాయ పదములు

శ్లో॥ త్రిపుసం కంటకిఫలం సుధావాసం సుశీతలం॥

త్రిపుసము, కంటకిఫలము, సుధావాసము, సుశీతలము అనునవి త్రిపుసనామములు.

## ఆమత్రిపుస గుణములు

శ్లో॥ త్రపుసం లఘుశీతంచ నసం తృట్క్లమదాహజిత్ ।
స్వాదుపిత్తాపహం శీతం తిక్తం కృచ్ఛహరం పరం ॥

పచ్చిదోసకాయ మధురరసమును, తిక్తానురసమును, లఘుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. పిత్తమును శమింపజేయును. తృష్ణ, క్లమ, దాహము, మూత్రకృచ్ఛ్రము అను నీవ్యాధులను బోగొట్టును.

## పక్వ త్రిపుస గుణములు.

శ్లో «తత్పక్వ మమ్లముష్ణంస్యాత్ పిత్తలం కఫవాతనుత్ »

దోసపండు అమ్లరసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. పిత్తమును వృద్ధిబొందించును. కఫవాతములను శమింపజేయును.

## కర్కటీ - నక్కదోస. (ఖ)

శ్లో॥ ఏర్వారుః కర్కటీ ప్రోక్తా కథ్యంతే తద్గుణా అథ॥

ఏర్వారు, కర్కటి యనునవి కర్కటీనామములు.

### ఆమకర్కటీగుణములు.

శ్లో॥ కర్కటీ శీతలా రూక్షా గ్రాహిణీ మధురా గురుః।
రుచ్యా పిత్తహరా సామా॥

పచ్చి నక్కదోసకాయ మధురరసమును- రూక్షగురుగుణములను, శీత వీర్యమును గలిగియుండును. మలాదులను నిరోధించును. రుచిబుట్టించును. పిత్తమును శమింపజేయును.

### పక్వకర్కటీగుణములు.

శ్లో॥ పక్వా తూష్ణాగ్నిపిత్తకృత్॥

నక్కదోసపండు ఉష్ణవీర్యమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధి జేయును. పిత్తమును వృద్ధిబొందించును.

## ఖర్బూజం - ఖర్బూజాదోస. (గ)

శ్లో॥ దశాంగులంతు ఖర్బూజం కథ్యంతే తద్గుణా అథ॥

దశాంగులము, ఖర్బూజము అనునవి ఖర్బూజ నామములు.

### ఖర్బూజగుణములు.

శ్లో॥ ఖర్బూజం మూత్రలం బల్యం కోష్ఠశుద్ధికరం గురు।
స్నిగ్ధం స్వాదుతరం శీతం వృష్యం పిత్తానిలాపహం॥

ఖర్బూజాదోసపండు మిగుల మధురరసమును, గురుస్నిగ్ధగుణములను, శీతవీర్యమును గలిగియుండును. మూత్రమును వృద్ధిజేయును. బలమును గలి గించును. కోష్ఠశుద్ధినిజేయును. వెంటనే శుక్రమును గలిగించును. పిత్తవాత ములను శమింపజేయును.

## కాలిందం - పుచ్చ. (ఘ)

శ్లో॥ కాలిందం కృష్ణబీజం స్యాత్కాలింగం చ సువర్తులం॥

కాలిందము, కృష్ణబీజము, కాలింగము, సువర్తులము అనునవి కాలింద నామములు.

## ఆమకాలిందగుణములు.

శ్లో॥ కాలిందం గ్రాహి దృక్పిత్త శుక్రహృ చ్ఛీతలం గురు॥

పుచ్చకాయ గురుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. మలాదులను నిరోధించును. దృష్టిని, శుక్రమును క్షీణింపజేయును. పిత్తమును శమింపజేయును.

## పక్వకాలిందగుణములు.

శ్లో॥ పక్వంతు సోష్ణం సక్షారం పిత్తలం కఫవాతజిత్॥

పుచ్చపండు ఉష్ణవీర్యమును, క్షారమును గలిగియుండును. పిత్తమును వృద్ధిబొందించును. కఫవాతములను శమింపజేయును.

## చిర్భటం - బుడమ. (చ)

శ్లో॥ చిర్భటం ధేనుదుగ్ధం చ తథా గోరక్షకర్కటీ॥

చిర్భటము, ధేనుదుగ్ధము, గోరక్ష కర్కటియనునవి చిర్భటనామములు.

## బాలచిర్భట గుణములు.

శ్లో॥ చిర్భటం మధురం రూక్షం గురు పిత్తకఫాపహం।
అనుష్ణం గ్రాహి విష్టంభి బాలం॥

లేతబుడమకాయ మధురరసమును, రూక్షగురుగుణములను, కొద్దిగ నుష్ణవీర్యమును గలిగియుండును. మలాదులను నిరోధించును. మలబంధమును జేయును. పిత్తకఫములను శమింపజేయును.

## పక్వచిర్భటగుణములు.

శ్లో॥ పక్వం తూష్ణం చ పిత్తలం॥

ముదిరిన బుడమకాయ ఉష్ణవీర్యమును గలిగియుండును. పిత్తమును వృద్ధిబొందించును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయ బోధకములు:—(త్రపుస) - కంటకిఫలము. సుధావాసము. (పీతపుష్ప. బహుఫల. కంటకిలత.) (కర్కటి) - (హస్తిపర్ణి. లోమశకాండ. హస్తిదన్తఫల. స్థూల.) (ఖర్బూజ) - దశాంగులము. (షడ్రేఖ.) (కాలింద) - కృష్ణబీజము. సువర్తులము. (చిర్భట) - (చిత్రఫల. పాండుఫల.)

(ఖ) గుణబోధకములు:-(త్రపుస) - సుశీతలము. (కర్కటి) - (కటుఫల. మూత్రల.) (ఖర్బూజ) - (మధుఫల.) (చిర్భట) - (పథ్య. రోచనఫల.)

(2) శబ్దార్థములు:—

కంటకిఫలము - చిన్నముండ్లతో గూడినట్టిఫలము. సుధావాసము - అమృతమువంటి రసమునకు నిలయమైనట్టిది. పీతపుష్ప - పసుపుపచ్చని పుష్పములనుగలది. బహుఫల - విశేషముగ ఫలించునది. కంటకిలత - ముండ్లతో గూడినలతనుండి యుత్పన్నమగునది. హస్తిపర్ణ - ఏనుగుచెవులవంటి యాకులనుగలది. లోమశకాండ - నూగుతో గూడిన కాండమునుగలది. హస్తిదన్తఫల - ఏనుగు దంతములవంటి యాకృతిగల ఫలము. స్థూల - లావుగా నుండునట్టిఫలము. దశాంగులము - పదియంగుళములు పొడవుగా నుండునట్టిఫలము. షడ్రేఖ - ఆరురేఖలతో గూడినట్టిఫలము. కృష్ణబీజము - నల్లని బీజములతో గూడినట్టి ఫలము. సువర్తులము - గుండ్రముగా నుండునట్టి ఫలము. చిత్రఫల - అనేకవర్ణములతో గూడినట్టిఫలము. పాండుఫల - తెల్లనివర్ణము గలిగినట్టిఫలము. సుశీతలము - మిగుల శీతవీర్యముగలది. కటుదల - ఆకులందు కటురసమునుగలది. మూత్రల - మూత్రమును వృద్ధిపొందించునది. మధుఫల - మధురరసమును గలది. పథ్య - వ్యాధులందు హితమైనదిగ నుండునది. రోచనఫల - రుచిని బుట్టించునది.

(3) పరిచయబోధకలక్షణము:—

(కర్కటి) "కర్కటీ లోమశీ వ్యాలపత్త్రిర్వారు బృహత్ఫలా॥"

నక్కదోస ముండ్లవంటి నూగును, గజకర్ణములవంటి పత్రములను గలిగి యుండును. ఫలము పెద్దదిగా నుండును. (మ - ని.)

(4) భేదములు:—

ఇది సామాన్యత్రపుస, కర్కటి, చీనాకర్కటి, గోపాలకర్కటి, వాలుక, ఖర్బూజ, కాలింద, చిర్భటములని తొమ్మిది విధములుగానుండి, లతాజాతులలో నుత్పత్తిగలిగి ఫల శాకవర్గములో గణింపబడుచున్నది. ఇవి వరుసగా దోస (లేక) ములుదోస, నక్కదోస, తియ్యదోస, (లేక) చారలదోస, అడవిదోస, నూగుదోస, ఖర్బూజదోస, పుచ్చ, బుడమయని వ్యవహరింపబడుచున్నవి. ఇంతియేగాక ఇందుమరికొన్ని భేదములున్నట్లు వ్యవహారమందు గానుపించును. కాని వీనికితగిన లక్షణగుణాదులు తెలియకున్నవి. ఇందలి కర్కటి యనునది దీర్ఘ - హ్రస్వభేదముచే రెండువిధములుగను, చిర్భటము

అనునది శ్వేత - చిత్రవర్ణ భేదముచే రెండు విధములుగాను నుండునట్లు దెలియ గలదు. శ్వేత చిర్భటము బుడమయనియు, చిత్రవర్ణ చిర్భటము పాపట బుడమయనియు వ్యవహరింప బడుచున్నవి. అడవిదోస కూడ మిగుల చిన్న దిగా నుండునట్లు వర్ణింపబడినది. ఈ దోసజాతులనెల్ల వ్యవసాయదార్లు పాదుగాపెట్టి పెంచి ఫలవంతములుగాజేసి విక్రయించుదురు. వీని నెలవారును ఆహారమునందనేక విధములుగా గల్పించి భుజించుదురు. అయితే నిందలి కొన్నిజాతులు తియ్యగను, గొన్నిజాతులు చేదుగను నుండును. చేదుగా నుండువానిని చిన్న చిన్న ముక్కలుగాగోసి యెండించి తైలమునందుగాని, ఘృతమునందుగాని భర్జనజేసి భుజించుదురు. ఖర్బూజాదోసనుండి స్వరసమును మాత్రము గ్రహించి వేసవికాలమునందు తృష్ణాశమనమునకై పానముజేయుదురు. కాని దీనిని యాహారమునందు జేర్చి భుజించుట వాడుకలో నున్నట్లు గానుపించదు. ఈ జాతులన్నింటియొక్క తీగెలును నూగుతోకూడి గరకుగానుండును. ఆకులు ఒకేవిధముగా నుండును. పువ్వులు పచ్చగానుండును. వైద్యమునందీ దోసగింజలు మాత్రము విశేషముగా మూత్రలములుగా నుపయోగింప బడుచున్నవి. ఇచట జేర్కొనబడిన భేదము లన్నియు సరియైనవియో లేవో వివరించుటకు తగినసంత యాధారము గానుపింప కుండుటచే విమర్శపై నిశ్చయింప వలసియున్నది.

(5) విశేషగుణములు: —

(క) ఆపత్రపుస - గురుగుణమును గలిగియుండును. బహుమూత్రమును గలిగించును. భ్రమను బోగొట్టును. (రా-ని.) తిక్తరసమును గలిగి యుండును. వాంతిని గలుగజేయును. కఫపిత్తములను శమింపజేయును. (శో-ని.) కటురసమును, కటువిపాకమును గలిగియుండును. ఆధ్మానమును, అష్ఠీలను బోగొట్టును. (ని-ర.) రూక్షగుణమును గలిగియుండును. విష్టంభమును గలిగించును.
(చ-సూ. అ 27.)

(ఖ) త్రపుసబీజ - రూక్షగుణమును, శీతవీర్యమును గలిగియుండును. మూత్రమును వృద్ధిబొందించును. పిత్తమును శమింపజేయును. రక్తదోషమును మూత్రకృచ్ఛ్రమును బోగొట్టును.
(భా-ప్ర.)

(గ) త్రపుసతైల - గురుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. శుక్రములను వృద్ధిజేయును. శ్లేష్మమును వృద్ధిబొందించును. వాతపిత్తములను శమింపజేయును.
(వా-టీక.)

(ఘ) కర్కటి (అమ) - తిక్తరసమును, మధురానురసమును, లఘు గుణమును గలిగియుండును. మిగుల మూత్రమును వృద్ధిబొందించును. రక్తపిత్తమును, మూత్రకృచ్ఛ్రమును, రక్తదోషమును బోగొట్టును. (వై-ని.) కొద్దిగ తిక్తానురసమును గలిగియుండును. కఫమును శమింపజేయును. (రా-ని.) అజీర్ణమును గలిగించును. (రా-వ.) విశేషముగ దినిన వాతప్రకోపము గలుగును. (ద-ని.)

(చ) పక్వకర్కటి - బలమును గలిగించును, రక్తదోషమును గలిగించును. (వై-ని.) లఘుగుణమును గలిగియుండును. రుచిని బుట్టించును. బహు మూత్రమును గలిగించును. కఫపిత్తములను శమింపజేయును. మూత్రరోధమును, మూత్రకృచ్ఛ్రమును, అశ్మరిని, వాంతిని, శ్రమను, దాహమును బోగొట్టును. (రా-ని.)

(ఛ) శుష్కకర్కటి - ఉష్ణవీర్యమును గలిగియుండును. పిత్తమును వృద్ధిబొందించును. కఫవాతములను శమింపజేయును. (వై-ని.)

(జ) కర్కటీతైల - గురుగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. కేశములను వృద్ధి బొందించును. శ్లేష్మమును వృద్ధి బొందించును. వాతపిత్తములను శమింపజేయును. (వా-టీక.)

(ఝ) హ్రస్వ(క్షుద్ర)కర్కటి - మధురరసమును, గురుగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. రుచిని బుట్టించును, మూత్రమును వృద్ధిజేయును కఫవాతములను వృద్ధి బొందించును. పిత్తమును శమింపజేయును. దాహమును, వాంతిని, భ్రమను, మూత్రకృచ్ఛ్రమును, అశ్మరిని బోగొట్టును. సగము పండిన దానిని భక్షించినచో పీనసము గలుగును. (వై-ని.)

(ట) చీనాకర్కటి - మధురరసమును, శీతవీర్యమును గలిగియుండును. రుచిని బుట్టించును. తృప్తిని గలిగించును. హృదయమునకు హితమైనది. పిత్తమును శమింపజేయును. దాహమును, శోషను బోగొట్టును. (కా-ని.)

(ఠ) అరణ్యకర్కటి (లేక, గోపాలకర్కటి - మధురరసమును, శీతవీర్యమును గలిగి యుండును. పిత్తమును శమింపజేయును. మూత్రకృచ్ఛ్రమును, అశ్మరిని, ప్రమేహమును, దాహమును, శోషను బోగొట్టును. (రా-ని)

(డ) వాలుక (అమఫల) - మధురరసమును, గురుగుణమును శీతవీర్యమును గలిగి యుండును. రక్తపిత్తమును బోగొట్టును. (స-గు-క.)

(ఢ) వాలుక (పక్వఫల) - లఘుగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. మలభేదనము జేయును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. (స-గు-క.)

(ణ) ఖర్బూజ-మధ్యమఫల-తిక్తరసమును గలిగి యుండును. (రా-ని.)

(త) ఖర్బూజ - మధ్యమఫల - మధురరసమును, కొద్దిగ నమ్లవిపాకమును గలిగి యుండును. (రా-ని.)

(థ) పక్వఖర్బూజ - తృప్తిని, వీర్యమును, పుష్టిని గలిగించును. కఫమును వృద్ధి బొందించును. ఉన్మాదమును, దాహమును, శ్రమను బోగొట్టును. (రా-ని.)

(ద) అమ్లమధురఖర్బూజ - మధురరసమును, అమ్లానురసమును, క్షారమును గలిగి యుండును. రక్తపిత్తమును, మూత్రకృచ్ఛ్రమును బోగొట్టును. (భా-ప్ర.)

(ధ) కాలింద (అమఫల) - మధురరసమును, మధురవిపాకమును గలిగి యుండును. విష్టంభిమును గలిగించును. (మ-ని.)

(న) కాలిందపత్ర - తిక్తరసమును గలిగియుండును. రక్తమును స్తంభింప జేయును. (భా-ప్ర.)

(ప) చిర్భట (బాలఫల) - తిక్తరసమును, కొద్దిగ నమ్లానురసమును గలిగియుండును. (రా-ని.)

(ఫ) చిర్భట (పక్వఫల) - జాఠరాగ్నిని వృద్ధిబొందించును. (రా-ని.)

(బ) శుష్క-చిర్భటఫల - రూక్షగుణమును గలిగియుండును. కఫవాతములను శమింపజేయును. జడత్వమును, అరుచిని బోగొట్టును. (రా-ని.)

(భ) చిర్భటపుష్ప - త్రిదోషములను వృద్ధిబొందించును. (అ-సం.)

(మ) శీర్ణవృన్తఫల - మధురరసమును, లఘుగుణమును గలిగియుండును. క్షారముతో గూడియుండును. కఫమును వృద్ధి బొందించును. (రా-వ.,) ఉష్ణవీర్యమును గలిగియుండును. మలభేదనము జేయును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. పిత్తమును వృద్ధిజేయును. (స-గు-క.)

(6) ప్రయోగములు:—

(క) త్రపుస.

1. అశ్మరీశర్కరలయందు త్రపుస ప్రయోగము.

"ఖాదేదిక్షుం విదారీం త్రపుషాణి చైవ॥"

చెరకును, నేలగుమ్మడిగడ్డను, దోసకాయలను భక్షించిన అశ్మరియు, శర్కరయును శమించును. చ. చి-అ 26.

(ఖ) కర్కటి.

2. అశ్మరి - శర్కర - మూత్రకృచ్ఛ్రములందు కర్కటీప్రయోగము.

"ఏర్వారుబీజం... ద్రాక్షారసేనాశ్మరీశర్క-
రాసు సర్వేషు కృచ్ఛ్రేషు ప్రశస్త ఏషః॥"

నక్కదోసగింజల చూర్ణమును ద్రాక్ష పండ్లరసముతో సేవించిన అశ్మరియు, శర్కరయు, సమస్త మూత్ర కృచ్ఛ్రములును శమించును. (చ-చి-అ 26.)

3. మూత్రరోధజమగు నుదావర్తమునందు కర్కటీప్రయోగము.

"ఏర్వారుబీజతోయేన పిబేద్వా లవణీకృతం॥"

నక్కదోసగింజల కషాయమునందు సైంధవ లవణమును జేర్చి పానము జేసిన మూత్రరోధమువలన గలిగిన ఉదావర్తము శమించును. (సు-ఉ-అ 55.)

4. మూత్రాఘాతమునందు కర్కటీ ప్రయోగము.

"కల్కమేర్వారుబీజానా మక్షమాత్రం ససైంధవం।
ధాన్యామ్లయుక్తం పీత్వైవ మూత్రకృచ్ఛ్రాత్ ప్రముచ్యతే॥"

నక్కదోసగింజల కల్కమును అక్షప్రమాణము గ్రహించి అందు సైంధవ లవణమును జేర్చి ధాన్యామ్లముతో సేవించిన మూత్రాఘాతము శమించును. (సు-ఉ-అ 58.)

5. శూలయందు కర్కటీప్రయోగము.

"కర్కటీమూలసంసిద్ధం క్షీరం శూలహరం పరం॥"

నక్కదోసవేరుతో గాచినపాలను సేవించిన శూల శమించును. (వై-మ.)

(7) యోగములు:—

1. త్రపుసాది తైలము - సు- భగ్న.

ఉపయోగములు:—పానాభ్యంజనాది రూపముగ నుపయోగించిన భగ్న ప్రసాధనమగును.

2. త్రపుస బీజాది చూర్ణము - గ - ని - మూత్రాఘాత. మాత్ర:—1తులము.

ఉపయోగములు:—మూత్రాఘాతము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, శర్కర, వస్తిశూల యివి శమించును.

స్వానుభవము.

[దొంసవిత్తులు చూర్ణమును, లేహ్యమును విరేచనకారిగను, ముఖ్యముగా క్రిమిహరముగను యూనాని వైద్యమునం దెక్కువగ నుపయోగించుచున్నారు. ఆ. ల.]

---

# 97

# త్రాయమాణా - కలుకొనుగ

---

## భాషాంతర నామములు

హిందీ - త్రాయమాణా, త్రాయమాన్, మరాఠీ - త్రాయమాణా, గుజరాతీ - త్రాయమాణా, మలయాళం - బ్రాహ్మి, కర్ణాటకం - బ్రహ్మి, ద్రావిడం - బ్రాహ్మి.

## నైసర్గిక స్వరూప వర్ణనము

Natural Order —Ranunculaceae

నాభి కుటుంబము

(31-వ పట చూడుము.)

కలుకొనుగ - Delphinium Saniculae folium

## పర్యాయ పదములు

శ్లో॥ బలభద్రా త్రాయమాణా త్రాయంతీ గిరిసానుజా ॥

బలభద్రి, త్రాయమాణ, త్రాయంతి, గిరిసానుజ యనునవి త్రాయమాణా నామములు.

## త్రాయమాణా గుణములు

శ్లో॥ త్రాయంతీ తువరా తిక్తా సరా పిత్తకఫాపహా,
జ్వరహృద్రోగగుల్మార్శో భ్రమశూలవిషప్రణుత్ ॥

కలుకొనుగ కషాయరసమును, తిక్తానురసమును, సరగుణమును గలిగి యుండును. పిత్తకఫములను శమింపజేయును. జ్వరము, హృద్రోగము, గుల్మము, అర్శస్సు, భ్రమ, శూల, విషము వీనిని బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(వార్షిక).

(ఖ) ఉత్పత్తిబోధకములు:—గిరిసానుజ.

(గ) గుణబోధకములు:—త్రాయమాణ, త్రాయంతి, (భయనాశిని.)

(2) శబ్దార్థములు:—

వార్షిక - వర్షాకాలమునందు బుట్టునది. గిరిసానుజ - పర్వతచరియలం దుత్పన్నమగునది. త్రాయమాణ - త్రాయంతి - వ్యాధులనుండి రక్షించునది. భయనాశిని - వ్యాధులవలన భయములేకుండ జేయునది.

N. B:—ఇది హిమవత్పర్వతమునం దుత్పన్నమగు నొక మహాక్షుపమని వైద్యకశబ్ద సింధువునందు జెప్పబడినది. దీనిని బట్టి యిది క్షుపజాతిలో నొక పెద్ద మొక్కయని దెలియగలదు. అయితే దీని స్వరూప మెటులుండునదియు వివరించుట కట్టి యాధారములును గావరావు. ఇది "కలుకొనుగ" యని యాంధ్రమున వ్యవహరింప బడుచున్నది. ఇందలి కొనుగ పదముచే నిది కరంజభేదమై యుండునేమో యని జెప్పుదమన్నను కరంజభేదనిరూపణ ప్రసంగమునం దే నిఘంటుకారులచేతను చేర్పఁబడకుండుటచే నటుల దీని జెప్పుటకు వీలుగాకున్నది. విపులముగ విమర్శించిన గాని దీని స్వరూప మెట్టిదియో వివరింప శక్యము గాకున్నది.

(3) విశేషగుణములు:—

కటురసమును, కషాయానురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. రక్తపిత్తము, నాభిశూల, ఛర్ది వీనిని బోగొట్టును. (ధ-ని.) మధురరసమును, శీతవీర్యమును గలిగి యుండును. రక్తదోషము, క్షయము, తృష్ణ - వీనిని బోగొట్టును. (రా-ని.) త్రిదోషములను శమింపజేయును. (ని-ర.)

(4) ప్రయోగములు:—

1. జ్వరమునందు త్రాయమాణా ప్రయోగము.

"త్రాయమాణాం వా పయసా జ్వరితః పిబేత్ ॥"

కలుకొనుగ కల్కమును పాలతో జేర్చి సేవించిన జ్వరము శమించును. (చ-చి-అ-3.)

2 రక్తపిత్తమునందు త్రాయమాణా ప్రయోగము.

"త్రాయమాణాగవాక్షోర్వ్యా మూలం ।
విరేచనం ప్రయుంజీత ప్రభూతమధుశర్కరం" ॥

ఊర్ధ్వగ రక్తపిత్తమునందు కలుకొరినుగ మూలమును, చేదుపుచ్చ మూలమును కల్కముగా జేసి యందు అధికముగ తేనెను, చక్కెరను జేర్చి విరేచనార్థమై యిచ్చిన హితము. (చ-చి-అ.4.)

3. గుల్మమునందు త్రాయమాణా ప్రయోగము.

"ద్విపలం త్రాయమాణాయాః జలద్విప్రససాధితం ।
అష్టభాగస్థితం పూతం కోష్ణం క్షీరసమం పిబేత్ ॥
పిబేదుపరి తస్యోష్ణం క్షీరమేవ యథాబలం ।
తేనాస్యనిర్హృతే దోషే గుల్మః శామ్యతి పైత్తికః" ॥

కలుకొరినుగ రెండు పలములను గ్రహించి నలియగొట్టి రెండు ప్రస్థముల జలమునందు వేసి యెనిమిదవ భాగము మిగులు వరకును కాచి వడియగట్టి గోరువెచ్చగ నున్నప్పుడు సమముగ పాలను జేర్చి సేవించవలెను. పిమ్మట బలము ననుసరించి వేడిపాలనే త్రాగుచుండవలెను. ఇటుల జేసిన యెడల పిత్తగుల్మమునందలి దోషమునకు శోధన మగును. క్రమముగా గుల్మము శమించును. (చ-చి-అ-5.)

4. పిత్తజాతిసారమునందు త్రాయమాణా ప్రయోగము.

"పలాశవత్ప్రయోజ్యావా త్రాయమాణా విశోధినీ" ॥

పిత్తజాతిసారమునందు కలుకొరినుగను పలాశమువలెనే సేవించిన యనగా కలుకొరినుగ కషాయమును సమముగ పాలతో జేర్చి సేవించి పిమ్మట యథాబలముగ కోష్ణక్షీరమును పానము జేసిన దోషశోధనమగును. (చ-చి-అ-19.)

5. విసర్పమునందు త్రాయమాణా ప్రయోగము.

"త్రాయమాణాశృతం వాపి పయో దద్యాద్విరేచనం" ॥

విసర్పరోగమునందు కలుకొరినుగతో గాచిన పాలను సేవించిన దోషశోధన మగును. (చ-చి-అ-11.)

(5) యోగములు:—

1. త్రాయమాణాదిఘృతము-చ-గుల్మ. మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—పిత్తజగుల్మము, రక్తజగుల్మము, విసర్పము, పిత్తజ జ్వరము, హృద్రోగము, కామిల, కుష్ఠము ఇవి శమించును.

2. త్రాయంత్యాదికషాయము-వా-విద్రధి. మాత్ర:-1 పలము.

ఉపయోగములు:-విద్రధి, గుల్మము, విసర్పము, దాహము, మోహము, మదము, జ్వరము, తృష్ణ, మూర్ఛ, ఛర్ది, హృద్రోగము, రక్తపిత్తము, కుష్ఠము, కామిల ఇవి శమించును.

3. త్రాయమాణాఘృతము-వా-విద్రధి మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—విద్రధి, గుల్మము మొదలగునవి శమించును.

4. త్రాయమాణాదిగణక్వాథము-చ-ద-జ్వర. మాత్ర:-1 పలం

ఉపయోగములు:—పిత్తజజ్వరము శమించును.

---

# 98

# తినిశః - నెమ్మిచెట్టు

---

## భాషాంతర నామములు

హింది - తినసునా, తిరచ్ఛ. మరాఠి - తివస, స్యందన. గుజరాతి - కాళో, తణఛ. మలయాళం - తోడుకార. కర్ణాటకం - స్యందన. ద్రావిడ - తిరివిమరం.

## నైసర్గిక స్వరూప వర్ణనము.

## Natural Order—Leguminosae

చిక్కుడు కుటుంబము.

(23 పుట చూడుము)

నెమ్మిచెట్టు Ougeinia dalbergioides.

## పర్యాయ పదములు

శ్లో॥ తినిశః స్యందనో నేమీ రథద్రు ర్వంజుల స్తథా॥

తినిశము, స్యందనము, నేమి, రథద్రువు, వంజులము, అనునవి తినిశ నామములు.

## తినిశ గుణములు.

శ్లో॥ తినిశః శ్లేష్మపిత్తాస్ర మేదఃకుష్ఠ ప్రమేహజిత్।
తువరః శ్విత్రదాహఘ్నో వ్రణపాండుక్రిమిప్రణుత్॥

నెమ్మిచెట్టు కషాయరసమును గలిగియుండును. కఫ పిత్తములను శమింపజేయును. రక్తదోషము, మేదోవృద్ధి, కుష్ఠము, ప్రమేహము, శ్విత్ర కుష్ఠము, దాహము, వ్రణము, పాండువు, క్రిములు అను నీవ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

పరిచయబోధకములు:- స్యందనము, రథద్రువు, వంజులము, అతిముక్తకము, చిత్రకృత్తు.

(2) శబ్దార్థములు:—

స్యందనము - స్రవించుచుండునది. రథద్రువు - రథములకు చక్రములుచేయుటకై యుపయోగింపబడునది, వంజులము - ఎల్లరచే గౌరవింపబడునది (లేక) చూచుట కందముగ నుండునది, అతిముక్తము - చుట్టుప్రక్కలకు విశాలముగ వ్యాపించి వృద్ధి బొందునది. చిత్రకృత్తు - లావుగ నుండినను తేలికగనుండునది యగుటచే ననేకవిధములగు బొమ్మలను చెక్కుటకుపయోగించు మ్రానుగలది అనగా దీని మ్రానుతో ననేక విధములగు బొమ్మలను చెక్కుదురనిభావము.

N. B. ఇది మిగులలావుగలిగి విశాలముగను, ఎత్తుగను బెరుగు వృక్షజాతులలో పరిగణింపబడినది. పైపదములనుబట్టి దీనిమ్రానును బండిచక్రములను జేయుటకును, బొమ్మలను చెక్కుటకు నుపయోగింతురని దెలియగలదు. ఇది "సర్వసార" యని చెప్పుటచే దీని ప్రతియంగమును వైద్యము నందుపయోగింతురని గూడ దెలియుచున్నది. అయితే దీని నిజస్వరూప మెట్లుండునదియు దెలియజేయు విశేషము లెచ్చటను గానరాకున్నవి, కాని శాలిగ్రామనిఘంటు కారకుడు దీని స్వరూపము చందనవృక్షమువలె నుండునని చెప్పియున్నాడు. మరియు వైద్యక శబ్దసింధువునందు ఇది మహారాష్ట్ర - కర్ణాటక - అనూప దేశములందువిశేషముగా బెరుగునని చెప్పబడియున్నది.

(3) విశేషగుణములు:—

ఉష్ణవీర్యమును గలిగియుండును. మలాదులను నిరోధించును. దాహమును గలిగించును. వాతరోగములలో హితమైనది. రక్తాతిసారమును బోగొట్టును, (రా-ని.;) రక్తపిత్తమును బోగొట్టును. (ని-ర.)

(4) ప్రయోగములు:—

1. కుష్ఠమునందు తినిశ ప్రయోగము.

"ఇతిషట్కషాయయోగాః నిర్దిష్టాః
సప్తమశ్చ తినిశశ్చ స్నానేపానేచ మతాః
ఆలేపనం ప్రఘర్షణ మవచూర్ణన మేతఏవచ
కషాయాః తైలఘృతపానయోగే చేష్యంతే కుష్ఠశాంత్యర్థం॥"

నెమ్మిచెట్టు కషాయమును కుష్ఠమునందు స్నానపానముల నుపయోగించిన హితము. దీని కల్కచూర్ణములను లేపనమునకును, ప్రఘర్షణమునకు (రుద్దుట) ను, అవచూర్ణనము (పైనచల్లుట) కును నుపయోగించిన హితము. మరియు దీనికషాయముతో తైల - ఘృతపాకములనుజేసి పానముసేసిన హితమగును. (చ-చి-అ 7.)

2. రక్తాతిసారమునందు తినిశ ప్రయోగము.

"శల్లకీ తినిశత్వచః క్షీరే విమృదితాః పీతాః
సక్షౌద్రా రక్తనాశనాః॥"

నెమ్మిపట్ట, అందుగుపట్ట వీనిని పాలతోనూరి తేనెజేర్చి సేవించిన రక్తాతిసారము శమించును. (సు-ఉ-అ 40.)

(5) యోగములు:—

1. తినిశాదిచూర్ణము - ను - ఉ.-హిక్క.

మాత్ర—$\frac{1}{4}$ తులం.

ఉపయోగములు:—హిక్క, కాస, శ్వాస [illegible] శమించును.

# 99

# తిలః - నువ్వుచెట్టు

---

## భాషాంతర నామములు

హిందీ - తిల, మరాఠీ - తిల, గుజరాతీ - తల, మలయాళం - ఎళ్ళు, కర్ణాటకం - ఎళ్ళు, ద్రావిడం - ఎళ్ళు.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Pedalineae

నువ్వు కుటుంబము

**నువ్వుచెట్టు - Sesamum Indicum (Eng. Sesamum)**

ఈ కుటుంబములో గుల్మములు, చిన్నగుబురు మొక్కలేగాని పెద్దచెట్లులేవు. ఆకులు ఒంటరిచేరిక, కొన్ని సమాంచలములు కొన్నిటియంచున ఱంపపుపండ్లున్నవి. కొన్ని తమ్మెలుగా చీలియున్నవి. పువ్వులొక్కొక్క కణుపునందున నొక్కొక్కటి యున్నది. అసరాళము. పుష్పకోశము సంయుక్తము, నాలుగో, అయిదో, తమ్మెలుగలవు. దళవలయము గొట్టమువలె నున్నది. దీనితమ్మెలు మొగ్గలో అల్లుకొనియుండును. కింజల్కములు నాలుగు. రెండుపెద్దవి. రెండుచిన్నవి. అండాశయము ఉచ్చము రెండుగదులు గలవు. కీలాగ్రము నకు రెండుతమ్మెలుగలవు.

## పర్యాయ పదములు

శ్లో॥ తిలస్తు హోమధాన్యం స్యాత్పవిత్రః పితృతర్పణః ।
పాపఘ్నం పూతధాన్యం చ జటిల స్స్నేహబీజకః ॥

తిల, హోమధాన్యము, పవిత్రము, పితృతర్పణము, పాపఘ్నము, పూతధాన్యము, జటిలము, స్నేహబీజకము అనునవి తిలనామములు.

## తిలగుణములు

శ్లో॥ తిలో రసే కటు స్తిక్తో మధుర స్తువరో గురుః ।
విపాకే కటుక స్స్వాదుః స్నిగ్ధోష్ణః కఫపిత్తకృత్ ॥
బల్యః కేశ్యః హిమస్పర్శః త్వచ్యః స్తన్యో వ్రణేహితః ।
దన్త్యో అల్పమూత్రకృ ద్గ్రాహీ వాతఘ్నోఽగ్నిమతిప్రదః ॥

నువ్వులు కటురసమును, తిక్తమధుర కషాయామ్లరసములను, గురు స్నిగ్ధగుణములను, ఉష్ణవీర్యమును, కటువిపాకమును గలిగి యుండును. రుచి

కారముగ నుండును. బలమును గలిగించును. కేశములను వృద్ధి పొందించును. చర్మమునకు హితమైనది. స్తన్యమును వృద్ధిచేయును. దన్తములకు హితమైనది. మూత్రమును తగ్గించును. జాఠరాగ్నిని వృద్ధిజేయును, బుద్ధిని వికసింపజేయును. శీతలస్పర్శ గలిగి యుండును. మలాదులను శోధించును. కఫపిత్తములను వృద్ధి పొందించును. వాతమును శమింపజేయును. వ్రణమును బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—హేమధాన్యము, పితృతర్పణ, పూతధాన్య, జటిల, స్నేహబీజక.

(ఖ) గుణబోధకములు:—పాపఘ్న.

(2) శబ్దార్థములు:—

హేమధాన్య - పచ్చని వర్ణముగలిగిన బీజములతో గూడినది. పితృతర్పణ - పితృదేవతలకు తర్పణములకై ఉపయోగింపబడు బీజములను గలది. పూతధాన్య - పవిత్రమైన ధాన్యములుగా నెంచబడు బీజములను గలది. జటిల - జడలవలె నల్లబడినట్లు వరుసలుగా నేర్పడు బీజములను గలది. స్నేహబీజక - తైలముతో గూడిన బీజములను గలది. పాపఘ్న - పాపమును బోగొట్టునది.

(3) భేదములు:—

ఇది గ్రామ్య - వన్యభేదముచే రెండు విధములుగా నుండి ధాన్యజాతులలో నుత్పత్తి గలిగి తైలబీజములలో శ్రేష్ఠమైనదిగా నెంచబడుచున్నది. అందు గ్రామ్యము కృష్ణ, శ్వేత, రక్త, భేదముచే మూడు విధములుగా నుండును. వీనిలో "కృష్ణశ్శ్రేష్ఠతమ స్తేషు శుక్లోవై మధ్యమః స్మృతః, అన్యే హీనతరః ప్రోక్తః తజ్ఞైః రక్తాదయ స్తిలాః" ॥ అని భావమిశ్ర నిర్వచనముచే కృష్ణతిలలే శ్రేష్ఠములైనట్లు దెలియగలదు. ఇందువలన నిరంతరముగా వ్యవసాయదారులు ఈ కృష్ణతిలలనే పైరు చేయుటయు, ఇవియే బజారులలో విశేషముగా లభించుటయు వ్యవహారమునందు గలదు. ఇవి తైలబీజములు. వీని ప్రయోజనము వ్యవహారమునందును, వైద్యమునందును విశేషముగా గలదు. ఈ బీజముల నుండి తైలము తీయుదురు. ఈ తైలము నువ్వులనూనె, లేక మంచినూనె యని వాడబడును ఈ నూనెను ప్రతి గృహస్థుడును నిత్యము భుజించు తన యాహారమునందు చేర్చుకొనబడు శాకాదుల

సంస్కారణమునకై ఉపయోగించుచుండును. మరియు పిండివంటలు (భక్ష్యములు) ఈ తైలముతోనే జేయబడుచుండును. ఇది మనము భుజించు ఆహార పదార్థములలో నేయొకదానియందైనను ప్రతి నిత్య ముపయోగింపబడక యుండదు.

ఇటులనే ప్రతి మనుజునియొక్క నిత్యాహారములో నొకవస్తువుగా నిది విశేషప్రచారమును గలిగియున్నది. వైద్యమునందు గూడనిది బాహ్యముగను, అభ్యంతరముగను ఉపయోగమును గలిగియున్నది. ఇది శరీరమునకు మిక్కిలి మృదుత్వమును గలిగించు స్వభావమును గలిగియున్నది. మరియు శరీరములోని సూక్ష్మస్రోతస్సులను వికసింప జేయునట్టి స్వభావమును గూడ గలిగియున్నది. దీనికున్నంత సూక్ష్మగుణము, సరగుణమును మిగిలిన ఘృతాది స్నేహద్రవ్యములకులేవు. అందుకని వైద్యశాస్త్రజ్ఞులు శరీరమునకు స్నిగ్ధత్వముగలిగించునట్టి స్నేహద్రవ్యములను నిరూపించునప్పుడు "సర్వేభ్యస్త్విహ తైలేభ్య స్తిలతైలం విశిష్యతే। పరిషేకాభ్యంగావగాహాదిషు తిలతైలం ప్రశస్యతే తద్వస్తిషు చ పానేషు నస్యే కర్ణాక్షిపూరణే అన్నపానవిధౌ చాపి ప్రయోజ్యం వాతశాంతయే॥" సు-సూ. అ 4) "స్థావరేభ్య స్తిలతైలం ప్రధానం॥" సు-చి-అ 31. అను మొదలగు సూత్రములనుబట్టి యీ తిలతైలమును ప్రధానమైన దానినిగా నిరూపించినట్లు తెలియగలదు. అందును వాతపిత్త కఫ దోషములలో వాతదోషమునకు ఇది ప్రధాన చికిత్సితముగా గ్రహింపబడినది. ఈతైలము అనేక విధములగు సంస్కారములతో బాహ్యాభ్యంతరోప యోగములకై అనేక విధములుగా గల్పింపబడినది. ఈ కల్పనా విశేషములను సుశ్రుతాది గ్రంథములందలి యాప్రసంగములనుబట్టి గ్రహింపవలెను. నువ్వులుగూడ పైని జెప్పబడినట్లుగా నానావిధములగు ప్రయోజనములను గలిగియున్నవి. నువ్వులను శాకములలోను భక్ష్యములలోను జేర్చుకొనుదురు. వీనిని విశేషముగా దినినచో కోష్ఠమునందు క్రిములు జనించును. మరియు గృహస్థులు తమవైదిక కర్మలందు బాహ్యశుచికై తరచు ఈ బీజముల నుపయోగించుచుందురు. పర్వదినములందు ఈ బీజములతో తర్పణము లాచరించుదురు. నవగ్రహములలోని శనిగ్రహదోష నివృత్తికై తిలబీజములను దానమొసంగుదురు. ఇక వైద్యమునందు గూడ పలువిధములగు ఉపయోగములను గలిగియున్నవి ఈ బీజములు గర్భాశయమును శోధించును. దీనికిట్టి గుణమున్నదని తెలిసియో తెలియకయో ప్రతి భారతీయుని యింటి

యందురు ఈ బీజములను మెత్తగా నలియగొట్టి అందు బెల్లము చేర్చి (ఇదియే చిమ్మిలి యనబడును) తరుణబాలికలు రజస్వలలయిన వెంటనే తినిపించుట ఇప్పటికిని వాడుకలో నున్నది. ఇందువల్ల గర్భాశయమునుండి ఆర్తవము ఏవిధమగు ప్రతిబంధకము లేక నియమిత కాలము బయటకు స్రవించును. ఇందువల్ల స్త్రీలు ఋతుకాలమున ఆరోగ్యవతులుగా నుందురని ఆశయము. ఇంతియే గాకుండ గర్భాశయవ్యాధుల, ఆర్తవక్షయము మొదలగు స్త్రీవ్యాధులలో నీబీజములను కషాయముగా గాచి పానము జేయించిన అట్టివ్యాధులనుండి విముక్తలగుదురు. మరియు నీ బీజకల్కము వ్రణములందును, భగ్నములందును విశేషముగా ప్రయోగింపబడును. వీనికి శోధనరోపణ సంధాన గుణములుండుటచేత నవి వ్రణాదుల కౌషధ ద్రవ్యముగా గ్రహింపబడినవి "కల్కః సంరోహణః కార్య స్తిలజః మనుసంయుతః సమాధుర్యాత్తథోష్ణ్యాచ్చ స్నేహచ్చానిలనాశనః కషాయభావాన్మాధుర్యాత్తిక్తత్వాచ్చాపి పిత్తహృత్ జౌష్ణ్యాత్ కషాయభావాచ్చ తిక్తత్వాచ్చ కఫే హితః॥" సు-చి-అ 1- ఇట్లు వ్రణములందుపయోగించుటకు తిలకల్కమునకు త్రిదోష హరత్వము నిరూపింపబడినది. ఇంతియేగాకుండ వ్రణశోధనశస్త్ర కర్మ చేసిన పిదప శీఘ్రము నా వ్రణముయొక్క శోధనరోపణములకై యీ తిలకల్కము అట్టివ్రణములపై కప్పవలసినదిగా శస్త్రసాంప్రదాయకులచే నిరూపింపబడినది. అనగా నిది ఆన్‌టిసెప్టిక్‌గా అప్పటికాలమున గ్రహింపబడినదని భావము.

మరియు నీ బీజములనుండి దీసిన చక్రతైలము (దిగుడాయిలూనె) భగ్నవ్రణములందు శూలాదిశమనముకై బహిష్కార్యముపయోగింపబడును. భగ్నవ్రణసంధానముకై "రాత్రౌ రాత్రౌ తిలాన్ కృష్ణాన్ వాసయేదస్థిరే జలే దివాదివా శోషయిత్వా గవాం క్షీరేణ భావయేత్॥... శలిష్ఠస్వాన్నచూర్ణ్య తిలచూర్ణేన యోజయేత్। పీడనార్థం చ కర్తవ్యం సర్వగంధశృతం పయః। చతుర్గుణేన పయసా తత్తైలం విపచేత్ భిషక్।......ఏతత్తైలం సదా పథ్యం భగ్నానాం సర్వకర్మసు" సు-చి-అ-3. ఇట్లు అనేకవిధములుగా తిలతైలము కల్పింపబడినది. మరియు "న తైలసదృశః స్నేహో మారుతస్య నివర్హణః। నహి వాయుశ్చ తైలంచ చిరంగాత్రేషు తిష్ఠతః" వాతహర తైలములలో తిలతైలమునకు మించినది మరియొకటి లేకనియు, తిలతైలము శరీరములో నున్నంతకాలము ఎట్టి వాతవ్యాధియు కలుగనేరదనియు

శోధలవాక్యమునుండి దెలియగలదు. ఈ బీజములనుండి తైలమును గ్రహింపగా మిగిలిన పిష్టము పిణ్యాకము (తెలకపిండి) అని వ్యవహరింపబడును. ఇది స్తన్యవర్ధకము. బాలింతరాండ్రకు దీనితో శాకముజేసి ఆహారమునందు గలిపి యిచ్చెదరు. ఇట్లుపయోగించువారు దీనిని వాతహరముగా నిచ్చెదమని జెప్పెదరు. కాని వాస్తవముగా దీనికి స్తన్యవర్ధకగుణము హెచ్చుగా నుండుటచే నట్లు విశేషప్రచారమును గలిగి యున్నది. మరియు పశువులకు గూడ విశేషముగా దీనిని ఆహారముగా నిచ్చెదరు. ఇందువల్ల నవి యెక్కువ పాలను ఇచ్చును. ఈ తెలకపిండిని నీళ్ళలో ఊరబెట్టి కొన్ని వ్రణశోథలకు కట్లు గట్టుటకూడ ప్రచారమునందు గలదు. ఇందువలన శోథ శీఘ్రముగా నెదిగి మృదుత్వమును బొందును. ఇటుల కృష్ణతిలము వ్యవహారమునందును, వైద్యమునందును అనేక ప్రయోజనములను గలిగి యున్నది. మిగిలిన రక్త శ్వేత వన్యతిలములు అశ్రేష్ఠము లగుటచే నవి యగ్రాహ్యములుగా దెలియవగును.

(4) విశేషగుణములు:—

(క) కృష్ణతిల - మధురవిపాకమును గలిగి యుండును. (ఆత్రేయ)

(ఖ) తిలశాక కటురసమును, తిక్తామ్లానురసములను గలిగి యుండును. మలమూత్రములను శోధించును. వాతమును వృద్ధిబొందించును. (చ-సూ-అ-27.)

(గ) తిలతైల - మధురరసమును, కషాయతిక్తానురసములను, గురుసర వికాశి విశదసూక్ష్మవ్యవాయి గుణములను, ఉష్ణవీర్యమును, మధురవిపాకమును, శీతస్పర్శను గలిగి యుండును. ధైర్యమును, బలమును, వర్ణమును, [illegible] గలుగజేయును. బృంహణముగను, లేఖనముగను, మేధ్యముగను ఉండును. మలమూత్రబంధము జేయును. గర్భాశయమును శోధించును. జాఠరాగ్నిని వృద్ధిజేయును. బుద్ధిని వికసింపజేయును. శరీరలాఘవమును గలిగించును. చర్మమునకు మృదుత్వమును గలిగించును. కేశములను వృద్ధిబొందించును. నేత్రములకు హితమైనది. రక్తమును పిత్తమును దూషింపజేయును. వాతకఫములను శమింపజేయును. వ్రణమును, ప్రమేహమును, కర్ణములు, యోని, శిరస్సు వీనియందు గలుగు శూలలను బోగొట్టును, మరియు ఛిన్నము, భిన్నము, చ్యుతము, ఉత్పిష్టము, మథితము, క్షతము, పిచ్ఛితము, భగ్నము, స్ఫుటితము, విద్ధము, అగ్నిదగ్ధము, విశ్లిష్టము, దారితము, అభిహతము, నిర్భగ్నము, మృగవ్యాఘ్రాది విక్షతము అను నీ సద్యోవ్రణములందు

అభ్యంగభోజనములకును, వస్తి, పానము, అన్నసంస్కారము, నస్యము, కర్ణపూరణము, నేత్రపూరణము, సేకము, అభ్యంగము, అవగాహము అను నీ కర్మలకును హితమైనది. (భా-ప్ర.) క్రిములను పోగొట్టును. (వా-సూ అ 6.) తీక్ష్ణగుణమును గలిగి యుండును. కండూవును పోగొట్టును. (రా-ని.) కుష్ఠమును, విషమును పోగొట్టును. (ఆత్రేయ.)

(ఘ) తిలపిణ్యాక (తెలకపిండి) - రూక్షగుణము గలిగియుండును. గ్లానిని, విష్టంభమును గలిగించును. నేత్రరోగములను గలిగించును. వా-సూ-అ 6

(5) ప్రయోగములు:—

1. అర్శోరోగమునందు తిలప్రయోగము.

"తిలకల్కైః సుఖోష్ణైః స్నేహసంయుతైః।
స్వేదయేత్ పోట్టలీకృతైః॥"

నువ్వుల కల్కమునందు తైలమును గలిపి గుడ్డలో మూటగట్టి వెచ్చచేసి స్వేదము జేసిన అర్శోరోగికి శూల శమించును. చ-చి-అ 9.

2. రక్తార్శస్సునందు తిలప్రయోగము.

"నవనీతతిలాభ్యాసాత్ ...అర్శాంసి అపయాంతి రక్తా॥"

నువ్వుల చూర్ణమునందు వెన్న గలిపి సేవించిన రక్తార్శస్సులు శమించును, చ-చి-అ 9.

3. ప్రవాహికయందు తిలప్రయోగము.

"కల్కః స్యాద్బాలబిల్వానాం తిలకల్కశ్చ తత్సమః దధ్నః
సరోఽమ్లః స్నేహాఢ్యః ఖడో హన్యాత్ ప్రవాహికాం॥"

లేత మారేడుకాయల కల్కమును, నువ్వుల కల్కమును సమముగా కలిపి పుల్లని పెరుగుమీది నీళ్ళను, తైలమును జేర్చి ఖడముగా సాధించి సేవించిన ప్రవాహిక శమించును. చ-చి-అ 10.

4. వ్రణమునందు తిలప్రయోగము.

"సతిలాః...దధ్యమ్లాః శక్తుపిండికా శస్తా స్యాదుపనాహనే॥"

నువ్వుల చూర్ణమును, బియ్యపుపిండిని పుల్లని పెరుగుతో గలిపి యుండే కించి దీనితో ఉపనాహస్వేదము జేసిన వ్రణము శమించును. చ-చి-అ 13.

5. వాతరక్తమునందు తిలప్రయోగము.

"లేపః పిష్టాస్తిలాః తద్వత్ భృష్టాః పయసి నిర్వృతాః॥"

నువ్వులను వేయించి పాలలో వేసి మెత్తగానూరి లేపనము జేసిన వాత రక్తము శమించును.
వా-చి-అ 22.

6. శరీరపుష్టికిని, దంతదార్ఢ్యమునకు తిలప్రయోగము.

"దినే దినే కృష్ణతిలప్రకుంచం సమశ్నతాం శీతజలానుపానం
పోషః శరీరస్య భవత్యనల్పో దృఢీభవంత్యామరణాచ్చ దన్తాః॥"

నల్లనువ్వులను ప్రతిదినము అర్ధపలము చొ॥న తినుచు శీతలజలమును పానము జేయుచుండిన శరీరమునకు పుష్టియు దంతదార్ఢ్యమును గలుగును.
వా-ఉ-అ 39.

7. తృష్ణయందు తిలప్రయోగము.

"సర్వాణ్యంగాని లింపేచ్చ తిలపిణ్యాకకాంజికైః॥"

తెలకపిండిని కాంజికముతో నూరి శరీరమున కంతటను లేపనము జేసిన తృష్ణ శమించును.
వా-చి-అ 3.

8. మూత్రరోధమునందు తిలప్రయోగము.

"యస్తిలకాండజక్షారం దధిమస్తుసమ్మిశ్రితం పిబేత్॥
సనరశ్చ మూత్రరోధం హత్వా సద్యః సుఖమాప్నోతి॥"

నువ్వుచెట్లను గాల్చిన మసిని పెరుగుమీది నీళ్లతో గలిపి సేవించిన మూత్రరోధము వెంటనే శమించును.
హా-సం.

9. అశ్మరియందు తిలప్రయోగము.

"తద్వస్మధు మృగయుక్తా త్రిరాత్రం తిలనాలభూతిశ్చ॥"

నువ్వుచెట్లను గాల్చినమసిని తియ్యనిపెరుగుతో గలిపి సేవించిన మూడు దినములలో నశ్మరి శమించును.
హా-డ.

10. ఆమవాతమునందు తిలప్రయోగము.

కల్కముద్వాద్వా తిలవిశ్వయోః॥"

నువ్వులు, శుంఠి వీనికల్కమును సేవించిన ఆమవాతము శమించును.
భా-సం.

11. వ్రణశోధన రోపణములకు తిలప్రయోగము.

"వర్తి స్తిలానాం కల్కోవా శోధయేత్ రోపయేత్ వ్రణం॥"

నువ్వుల కల్కమును వర్తిగాజేసి వ్రణమునందుంచిన శోధనరోపణములగును.
భా-సం.

12. సూర్యావర్తమునందు తిల ప్రయోగము.

క్షీరపిష్టై స్తిలైః స్వేదః" ॥

నువ్వులను పాలతో నూరి యుడికించి శిరస్సునకు స్వేదముజేసిన సూర్యావర్తమును శిరశ్శూలను శమించును. (భా-ప్ర.)

మాంసభక్షణా జాజీర్ణమునందు తిల ప్రయోగము.

"మాంసాని సర్వాణ్యపి యాంతి పాకం।
క్షారేణ సద్యః తిలనాలజేన" ॥

నువ్వుచెట్లను గాల్చిన మసిని పానము జేసిన మాంసభక్షణాచే గలిగిన యజీర్ణము వెంటనే శమించును. (భా-ప్ర.)

14 ఇంద్రలుప్తమునందు తిల ప్రయోగము.

"గోక్షుర స్తిలపుష్పాణి తుల్యాంచ మధుసర్పిషీ।
శిరఃప్రలేపితం తేన కేశైః సముపచీయతే" ॥

పల్లేరుకాయలు, నువ్వుపువ్వులు, తేనె, నెయ్యి వీనిని సమభాగములుగా గ్రహించి మెత్తగా నూరి బట్టతలకు లేపనము జేసిన తిరిగి కేశములు వృద్ధిబొందును. (భా-శ్రీ.)

15. రక్తాతిసారమునందు తిల ప్రయోగము.

"బదరీమూలకల్కంతు తిలకల్కం తథైవచ।
సంగృహ్య స్వరసం తేషాం అజాక్షీరేణ యోజయేత్" ॥

రేగువేళ్లను, నువ్వులను మెత్తగా నూరి అందుండి స్వరసమును దీసి యందు మేకపాలను గలిపి పానముజేసిన రక్తాతిసారము శమించును. (వం-సే.)

16. నేత్రరోగమునందు తిల ప్రయోగము.

"స్నానం కృష్ణతిలై శ్చాపి చక్షుష్యం తిమిరాపహం" ॥

నల్లనువ్వులను కషాయముగా కాచి యా జలముతో స్నానము జేసిన నేత్రములకు హితమగును. తిమిరము శమించును. (వం-సే.)

17. పాదతోదమునందు తిల ప్రయోగము.

"దీర్ఘమార్గగమనేన పాదయోః తోదమస్తి యది తైలపూరణం।
కోష్ణతోయపరిషేచనం నిశి హారిస్నతాంఘ్రిశయనంచ శస్యతే" ॥

ఎక్కువదూరము నడచుటచే గలిగిన పాదతోదమునందు తిలతైలమును

కాళ్ళకు మర్దించి గోరువెచ్చని నీళ్ళతో సేచనము జేసి కాళ్లు ఎత్తుగా కట్టి రాత్రి పరున్నచో తోదము శమించును. (వై_మ.)

18. అతిసూలమునందు తిల ప్రయోగము.

"అతిస్థూలశరీరో యః తిలతైలంప్రగే పిబేత్" ||

ప్రతి యుదయమున తిలతైలమును పానము జేయుచుండిన అతిస్థూలము శమించును. (వై_మ.)

19 అస్థిభగ్నమునందు తిల ప్రయోగము.

"భగ్నే నమేత్రి జాతరేవాస్థిని సమ్యక్ ।
సాసేసానే సన్నిబేశ్యాంబరేణ ।
తైలాక్తేనోద్బధ్య తైలైః సుఖోష్ణైః ।
సించేచ్ఛైవం వాతభైషజ్యవచ్చ" ||

ఎముకలు విరిగినప్పుడుగాని, వంగినప్పుడు గాని వానిని సరియైన స్థానములందుంచి తిలతైలమునందు తడిపిన గుడ్డలతో గట్టిగా బంధించి వాటిపైని తిలతైలమును గోరువెచ్చజేసి సేచనము జేయుచు వాతహరద్రవ్యములతో నుపచరింపుచుండిన శీఘ్రముగా భగ్నాదులు శమించును. (వై_మ.)

20. భల్లాతకశోథయుధువునందు తిల ప్రయోగము.

"హయంగవీనం మహిషీసముత్థం ।
పయఃప్రపిష్టైః సహితం తిలైర్యత్ ।
అభ్యంగయోగేన తదాశు నంతి ।
భల్లాతకోత్థశ్వయథుం నిహన్తి" ||

అప్పుడే కాచిన గేదెనెయ్యి యందు పాలతో నూరిన తిలకల్కమును జేర్చి శరీరమునకు అభ్యంగము జేసిన నల్లజీడిగింజల పొగచే గలిగిన శోథ శమించును. (రా_మా.)

21. వాతరోగమునందు తిల ప్రయోగము.

"బృంహణార్థం తిలా ముఖ్యాః వాతరోగవినాశనాః ।
గుడమిశ్రాన్ తిలాన్ ఖాదేత్" ||

నువ్వులను బెల్లముతో జేర్చి సేవించిన శరీరమునకు బృంహణము గలిగి వాతరోగములు శమించును. (గ_ని.)

(6) యోగములు:—

1. తిలాది కషాయము వా-ఉ-మూషికాదివిష. మాత్ర:-1 పలము.
ఉపయోగములు:—అలర్క-విషము శమించును.

2. తిలాష్టకలేపము - భైషజ్య - వ్రణ.
ఉపయోగములు:-లేపనము జేసిన వ్రణశోఫ శమించును.

3 తిలాదిలేహ్యము - బ - రా. శ్లేష్మరోగ. మాత్ర:- 1 తులము.
ఉపయోగములు:-అర్శస్సు, శ్వాస, కాస, ప్లీహ, పాండు ఇవి శమించును.

4. తిలమూలాది చూర్ణము - వై - చిం. గుల్మ, మాత్ర:-¼ తులము.
ఉపయోగములు:-వాతగుల్మము, ఆర్తవరోధమును శమించును.

## స్వానుభవము

[(1) నువ్వులు, నువ్వులనూనె ఆహారముగను, ఔషధమునకు ఎక్కువగా నుపయోగింపదగినవి. నువ్వులను శుభ్రపరచి పావుతులము నోట్లోవేసుకొని నవిలి నవిలి యుమ్మివేయవలెను. దీనికి తైలగండూషమని పేరు. దీనివలన దంతమాంసము గట్టిపడును. దంతవ్యాధులు నశించును. ప్రతిదినము ఒకటి రెండుసార్లు చేయవచ్చును.

(2) తెలకపిండి కూరను నంజువ్యాధులలో నెక్కువగా నుపయోగించుటకలదు.

(3) నువ్వులు, బెల్లముకలిపి తొక్కినచిమ్మిరి, నవీనముగా ఋతుమతులైన కన్యలకిచ్చెదరు. దీని యుపయోగమును పరిశోధించవలెను. బహుమూత్రవ్యాధిగల రోగులు చిమ్మిరిని పథ్యముగా నుపయోగింతురు. బలవర్ధక మనుటకు సందేహములేదు.

(4) భల్లాతకముపయోగించునపుడు నేను నువ్వులతో కలిపి తొక్కి యుపయోగించుచున్నాను. తిలభల్లాతకము, సంప్రదాయ సిద్ధము. ఈ సంయోగమునుగూర్చి పరిశోధించవలెను.

(5) అనేక తైలములయందు. తిలతైలము ప్రశస్తముగ నెంచబడుచున్నది. ఆ. ల.]

---

# 100

## తింత్రిడీ - చింతచెట్టు (క)

### భాషాంతర నామములు

హింది - మరాఠి - గుజరాతి - మలయాళం - కర్ణాటకం-ద్రావిడం-

### నైసర్గిక స్వరూప వర్ణనము

### Natural Order— Leguminosae

చిక్కుడు కుటుంబము

(23-వ ఫుట చూడుము.)

చింతచెట్టు - Tamarindus indicus (Eng- Tamarind tree)

### పర్యాయ పదములు

శ్లో॥ అమ్లికా చుక్రికా౽మ్లీచ చుక్రా దంతశఠాపిచ।
అమ్లాచ చించికా చించా తింతిడీకాచ తింతిడీ॥

అమ్లిక, చుక్రిక, అమ్లి, చుక్ర, దంతశఠ, అమ్ల, చించిక, చించ, తింతిడీక, తింతిడియనునవి తింతిడీ నామములు.

## ఆమతింతిడీఫల గుణములు

శ్లో॥ అమ్లికామ్లాగురు ర్వాతహారీ పిత్తకఫాస్రకృత్ ।

పచ్చిచింతకాయ అమ్లరసమును, గురుగుణమును గలిగి యుండును. రక్తమును దూషింపజేయును. కఫపిత్తములను వృద్ధి బొందించును. వాతమును శమింపజేయును.

## పక్వతింత్రిడీఫల గుణములు

శ్లో॥ పక్వాతు దీపనీ రూక్షా సరోష్ణా కఫవాతనుత్ ॥

చింతపండు రూక్షసరగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. కఫవాతములను శమింపజేయును.

## వృక్షామ్లం — సీమచింతచెట్టు (ఖ) ?

## భాషాంతర నామములు

హింది - మరాఠి - గుజరాతి - మలయాళం - పుళి, కర్ణాటకం - హుళి, ద్రావిడం - పుళి.

## పర్యాయ పదములు

శ్లో॥ వృక్షామ్లం తింతిడీకంచ చుక్రింస్యా దమ్లవృక్షకం ॥

వృక్షామ్లము, తింతిడీకము, చుక్రము, అమ్లవృక్షకము అనునవి వృక్షామ్ల నామములు.

## ఆమవృక్షామ్ల ఫల గుణములు

శ్లో॥ వృక్షామ్ల మామ మమ్లోష్ణం వాతఘ్నం కఫపిత్తలం ॥

పచ్చిసీమచింతకాయ అమ్లరసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. కఫపిత్తములను వృద్ధి బొందించును. వాతమును శమింపజేయును.

## పక్వవృక్షామ్లఫల గుణములు

శ్లో॥ పక్వంతు గురు సంగ్రాహి కటుకంతువరం లఘు ।
అమ్లోష్ణం రోచనం రూక్షం దీపనం కఫవాతహృత్ ॥
తృష్ణార్శోగ్రహణీగుల్మ శూలహృద్రోగ జంతుజిత్ ॥

సీమచింతపండు కటురసమును, కషాయామ్లాను రసములను, గురులఘు రూక్షగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. మలాదులను నిరోధించును. రుచిని బుట్టించును. కఫవాతములను

శమింపజేయును. తృష్ణ, అర్శస్సు, గ్రహణి, గుల్మము, శూల, హృద్రోగము, క్రిములు వీనిని పోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—తింతిడీక, తింతిడి, (పంక్తిపత్ర, భుక్త, చారిత్ర.) (వృక్షామ్ల) - తింతిడీకము, (రక్తచూడము.)

(ఖ) గుణబోధకములు:—అమ్లిక, చుక్రిక, దంతశఠ, (గురుపత్రి, పిచ్ఛిల, సర్వామ్ల) (వృక్షామ్ల) - చుక్రిము, అమ్లవృక్షకము.

(2) శబ్దార్థములు:—

తింతిడీక - తింతిడి - ఎల్లప్పుడును తడిగానుండు ఫలములను గలది. పంక్తిపత్రి - వరుసగా నాళము నంటియుండు పత్రములను గలది. భుక్త - ఆహారమునం దుపయోగింప బడునట్టి పండ్లను గలది. చారిత్ర - ఆహారద్రవ్యము లలో నిది యొకటిగా లోకులచే వ్యవహరింప బడునట్టి పండ్లను గలది. తింతిడీకము - ఎల్లప్పుడును తడిగానుండు పండ్లనుగలది. రక్తచూడము - ఎర్రని శిఖలవంటి యగ్రభాగములు (చిగుళ్ళు) గలది (లేక) ఎర్రని శిఖలవంటి కేసరములతో గూడిన పుష్పములను గలది. (లేక) బాహువులందు ధరింపబడు గుండ్రని యాభరణములవలె గుండ్రము (చక్రాకృతి) గ నుండు ఎర్రని ఫలములను గలది. అమ్లిక - సర్వామ్ల - సర్వాంగములందును అమ్లరసమును గలది. చుక్రిక - చుక్రిము - వ్యాధులను పోగొట్టునది. దంతశఠ - దంతములకు పీడను గలిగించునట్టి ఫలములను గలది. గురుపత్రి - గురుగుణముగల పత్రములను గలది. పిచ్ఛిల - పిచ్ఛిలగుణముగల ఫలములను గలది. అమ్లవృక్షము - పుల్లగనుండునట్టి వృక్షము.

(3) భేదములు:—

ఇది సామాన్యచింత - సీమచింత యని రెండు విధములుగ వ్యవహారమునం దున్నట్లు తెలియగలదు. ఇవి పెద్ద వృక్షములలో గణింపబడు చున్నవి. ఎల్లచోటులను నుత్పత్తి యగుచున్నను. ఇందు మొదటిదియే వ్యవహారమునందును. వైద్యమునందును విశేష ప్రయోగము గలదిగా నున్నది. చింతచెట్టు యొక్క చిగురు, పువ్వు, కాయ, పండువానినెల్ల నిత్యమును జనులు తమ యాహారమునం దుపయోగించు చుందురు. అందు విశేషముగ చింతపండు

ఎక్కువ యుపయోగము గలదు. ఇది లేని దేయాహారమునకు రుచి గలుగ నేరదు. ఇదే విధముగ వైద్యమునందు గూడ చింతపట్ట, ఆకు, పండు వీనికి వాతజాతి వ్యాధులందు ప్రయోగము గలదు.

సీమచింతయనునది తెల్లగనుండు వృక్షము. ఇది పైదానివలె నంత ఎత్తుగ పెరుగదు. దీనికి చిన్నచిన్న ముండ్లుండును. దీనికాయలు బాగుగా పండినప్పుడెఱ్ఱని వర్ణముగలిగి చక్రమువలె గుండ్రముగా చుట్టుకొనియుండును. లోన బీజములు నల్లగనుండును. ఈపళ్లు పైవానివలె నంతపుల్లగనుండక వగరుగను, కొంచెము పుల్లగనుండును. వీనిని విశేషముగా జనులు తినుచుందురు. ఈచెట్టును విశేషముగా నల్లచీమ లాశ్రయించియుండును. అయితే నిచ్చట చెప్పబడిన వృక్షామ్లమనునది యమ్లరసముగల వృక్షమగుటచే నైవిధముగా చింతజాతిలో జెప్పబడినదిగాని దీనికినిజముగా సీమచింతయని వ్యవహారము గలిగి యున్నట్లు దగినయాధారములు గానరావు. "సీమచింతకు ముండ్లుండును దీనిని నల్లచీమలు ఆశ్రయించి యుండును." అను మొదలగు పరిచయబోధక శబ్దములు దీనికి చెప్పబడియున్నట్లు గానరావు. మరియు సీమచింత కంతగా వైద్యమునందుగాని వ్యవహారము నందుగాని యుపయోగ మున్నట్లుగూడ దెలియరాదు. అయితే వృక్షామ్లము ఎట్టిస్వరూపమును గలిగి యుండునదియు గూడ దెలియకున్నది. అమ్లత్వాది లక్షణములచే నిది చింతజాతిలోనిదై యుండవచ్చునని జెప్పుట కొకింత యవకాశము గలదుగాని దీని నిజస్వరూప మెటులుండునదియు నిశ్చయించుట విమర్శపైగాని వీలుగా నేరదు.

(4) విశేషగుణములు:—

(క) తింతిడి (ఆమఫల) - లఘుగుణమును గలిగియుండును. వస్తిని శోధించును. ధ - ని., ఉష్ణవీర్యమును గలిగియుండును. మలాదులను నిరోధించును జాఠరాగ్నిని వృద్ధిబొందించును: (ని_ర.)

(ఖ) పక్వఫల - అమ్లరసమును, మధురానురసమును గలిగియుండును. మలమును భేదించును స్రోతోబంధమును గలిగించును. ధ_ని., హృదయమునకు హితమైనది. రుచిని బుట్టించును వస్తిని శోధించును. క్రిములను, వ్రణమును బోగొట్టును. (ని_గ.)

(గ) శుష్కఫల - లఘుగుణమును గలిగియుండును. హృదయమునకు హితమైనది. భ్రమ, తృష్ణ, శ్రమ, క్లమ, క్రిములు వీనిని బోగొట్టును. (ని_ర.)

(ఘ) నూతనఫల - వాతికఫములను వృద్ధిబొందించును. (ని_ర.)

(చ) వార్షికఫల (ఒకసంవత్సరము నిలువయుండినది) - వాతపిత్తము లను శమింపజేయును. (ని-ర.)

(ఛ) పక్వఫలరస - మధురరసమును, అమ్లానురసమును గలిగియుండును. రుచినిబుట్టించును లేపనము జేసినయెడల వ్రణశోథకు పాకము బొందించును. వ్రణదోషమును బోగొట్టును. (రా-ని.)

(జ) ఫలపానకము - వాతమును శమింపజేయును. (భా-ప్ర.)

(ఝ) పుష్ప - కషాయరసమును, మధురామ్లానురసములను, లఘువిశద గుణములను గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. రుచిని బుట్టించును. వాతకఫములను శమింపజేయును. ప్రమేహమును బోగొట్టును. (ని-ర.)

(ట) పత్రి - శోథను, రక్తదోషమును, వాతజన్యధను బోగొట్టును. (రా-ని.)

(ఠ) చించాత్వక్క్షార - కషాయరసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. కఫవాతములను శమింపజేయును. ధ-ని., అగ్నిమాంద్యమును, శూలను బోగొట్టును. (రా-ని.)

(డ) చించాబీజతైల - కషాయరసమును, కొంచెగ శీతవీర్యమును, కటువిపాకమును గలిగియుండును. లేఖనము. రుచినిబుట్టించును. వాతకఫములను శమింపజేయును. (రా-ని.)

(ఢ) వృక్షామ్ల (పక్వఫల) - ఉదరమును, అతీసారమును, వ్రణమును బోగొట్టును. (రా-ని.)

## (5) ప్రయోగములు:—

(క) 1. అర్శోరోగమునందు తింత్రిడీ ప్రయోగము.

"తన్నామ్లికాం...శాకం దధిదాడిమసిద్ధాని భృష్టాని।
యమకేఒపిచ ధాన్యనాగరయుక్తాని శాకాన్యేతాని దాపయేత్।।"

చింతాకును పెరుగుతోను, దానిమ్మపండ్ల రసముతోను పాకముజేసి అందు ధనియాలు, శుంఠి వీని చూర్ణమునుజేర్చి యమకస్నేహముతో భర్జనజేసి యిట్లు సిద్ధముజేసిన శాకమును అర్శోరోగికి యిచ్చిన హితము. (చ-చిఅ-9.)

2. అరుచియందు తింత్రిడీ ప్రయోగము.

"అమ్లికాగుడతోయంచ త్వగేలామరిచాన్వితం।
అభక్తచ్ఛందరోగేషు శస్తం కబళధారణం।।"

చింతపండురసము బెల్లపునీళ్లు వీని నొకటిగాగలిపి అందు లవంగపట్ట, ఏలకులు, మిరియములు వీని చూర్ణమునుజేర్చి బాగుగాకలిపి యిట్టిద్రవముతో గబళ ధారణముజేసిన అరుచి శమించును. (చ-ద.)

3. ప్రతిశ్యాయమునందు తింతిడీ ప్రయోగము.

"నవే ప్రతిశ్యాయే శస్తో యూష శ్చించాఫలోద్భవః॥"

తరుణ ప్రతిశ్యాయమునందు చింతపండురసముతో సిద్ధముజేసిన యూషమును సేవించిన హితము. (చ-ద.)

4. గుల్మమునందు తింతిడీ ప్రయోగము.

"పలాశవజ్రీశిఖరీ చించార్క-తిలనాలజాః।
యవజః స్వర్జికా చేతి క్షారా అష్టౌ ప్రకీర్తితాః॥
ఏతేగుల్మహరాః క్షారా అజీర్ణస్య చ పాచకాః"॥

చింతయీనెలను క్షారకల్పన విధి ననుసరించి క్షారమును సిద్ధము జేసి సేవించిన గుల్మము శమించును. అనుపాచనమగును. (భా-ప్ర.)

5. అస్థిభగ్నమునందు తింతిడీ ప్రయోగము.

"అమ్లికాఫలకల్కైః సౌవీర తైలవిమిశ్రితైః।
స్వేదాత్ భగ్నాభిహతరుజా ఘ్నః"॥

చింతపండ్ల కల్కమునందు సౌవీరమును, తైలమును జేర్చి యుడకబెట్టి దీనితో నస్థిభగ్నమునందు స్వేదముజేసిన భగ్నమువలన గలిగిన శూల శమించును. (భా-ప్ర.)

6. వాతవ్యాధియందు తింతిడీ ప్రయోగము.

"తింతిడీకదళైస్సిద్ధం తాలమండికయా సహ।
పిష్ట్వా సుఖోష్ణ మాలేపం దద్యా ద్వాతరుజాపహం"॥

చింతాకును తాటికల్లుతో మెత్తగా నూరి యుడికించి గోరువెచ్చగా నున్నప్పుడు లేపనము జేసిన వాతముచే గలిగిన పోట్లు శమించును. (వం-సే.)

7. శోథయందు తింతిడీ ప్రయోగము.

"సంస్వేదనక్రియా కార్యా సా కార్యా చ పునః।
పునః అథవా తింతిడీచ్ఛదైః॥"

చింతాకు కల్కమును నుడకబెట్టి దీనితో పలుమారు స్వేదముజేసిన శోథ శమించును. (హా-సం.)

8. నేత్రరోగమునందు తింతిడీప్రయోగము.

"చించాపత్రస్వరసం పయసా సంయోజ్య ఘర్షితం కాంస్యే।
లిప్తం బహిర్నయనయోః శమయతి రాగాశ్రుతోదసంరంభాన్॥"

చింతాకు రసమును పాలతోజేర్చి కంచుపాత్రయందుంచి చేతితో బాగుగారుద్ది నేత్రములకు పైన (కనురెప్పలమీద) లేపనముజేసిన నేత్రరోగము, నేత్రస్రావము, నేత్రతోదము, నేత్రసంరంభము ఇవి శమించును. (వై-మ.)

9. తిమిరమునందు తింతిడీప్రయోగము.

"చించాస్వరసనిఘృష్టం మరిచం సాయంతనే తథాప్రాత్యం।
అక్షినిషిక్తం శమయతి కండూం తిమిరం చ వాతోత్థం॥"

చింతాకు స్వరసమునందు మిరియపుగింజ నరుగదీసి అందు ఘృతమునుజేర్చి బాగుగాకలిపి ప్రతి సాయంకాలమునందు నేత్రముల కంజనమువేసిన వాతజతిమిరము, నేత్రకండూ ఇవి శమించును. (వై-మ.)

10. కర్ణశూలయందు తింతిడీప్రయోగము.

"చించాఫలస్వరససాధిత తైల మగ్ర్యం।
కర్ణే సశూలిని రహస్యపరాజ్ముఖేచ॥"

చింతపండ్ల రసముతో సిద్ధముజేసిన తైలమును ఉదయసాయంత్రములందు కర్ణపూరణము జేసిన కర్ణశూల శమించును. (వై-మ.)

11. కుకూణకమునందు తింతిడీప్రయోగము.

"కాంజికయా సంపిష్టం కంసాభ్యాం ఘర్షితం బహిర్లిప్తం।
చించాస్థ్యంకుర మచిరా ద్బాలస్యకుకూణకం జయతి॥"

చింత మొలకలను కాంజికముతో మెత్తగానూరి, కంచుపాత్ర యందుంచి మరియొక కంచుపాత్రతో చక్కగారుద్ది నేత్రములకుపైన లేపనము జేసిన బాలురకుకలుగు కుకూణకమను వ్యాధి శమించును. (వై-మ.)

12. సోమరోగమునందు తింతిడీప్రయోగము.

"పూర్వం తోయే వాసరంవా సితానాం చించాబీనాం దుగ్ధకల్కీకృతానాం పీత్వా స్యాతాం సుందరీపూరుషౌ ద్రాక్
అస్రిస్రావాత్ సోమరోగాచ్చ ముక్తా॥"

చింతగింజలను ఒకరోజు జలమునం దూరఁబెట్టి మఱునాఁడు పాలతో మెత్తగానూరి కల్కముజేసి సేవించిన స్త్రీపురుషులకు గలుగు శుక్రస్రావ-సోమరోగములు శీఘ్రముగ శమించును (వై-మ.)

13. దద్రుకుష్ఠమునందు తింత్రిడీప్రయోగము.

"చించాపత్రరసం వా కందూతినాశ మన్విచ్ఛన్ ప్రలింపేత్॥"

చింతాపత్రరసమును శరీరమునకు లేపనముజేసిన దద్రుకుష్ఠము శమించును. (వై-మ.)

14. సర్పవిషమునందు తింత్రిడీప్రయోగము.

"లవణార్ధపలోపేతః చించాపల్లవజోరసః।
కుడపప్రమితః పీతో విషం హంతి ఫణాభృతాం॥"

సైంధవలవణము అర్ధపలము, చింతచిగుళ్లరసము ఒకకుడవము ఇటుల గ్రహించి యొకటిగా గలిపి సేవించిన పామువిషము శమించును. (వై-మ.)

15. నాడీవ్రణమునందు తింత్రిడీప్రయోగము.

"పిష్టం చించాఫలం లేపా న్నాడీవ్రణహరం పరం॥"

చింతపండును మెత్తగానూరి లేపనముజేసిన నాడీవ్రణము శమించును. (గ-ని.)

16. గాత్రదౌర్గంధ్యమునందు తింత్రిడీప్రయోగము.

"పరిణతతింతిడీకాన్విత పూతికరంజోత్థబీజంవా।
లేపాత్ ...అపనయతి॥"

బాగుగా పండిన చింతపండును కానుగవిత్తులును మెత్తగానూరి లేపనముజేసిన శరీరమునందు గలుగు దౌర్గంధ్యము శమించును. (గ-ని.)

(ఖ) వృక్షామ్లము.

1. రక్తార్శస్సునందు వృక్షామ్లప్రయోగము.

"సకర్బుదారఫలామ్లానా...దధ్నఃసరేణ సిద్ధాన్।
దద్యాద్రక్తే ప్రవృత్తేఽతి॥"

తెల్లకాంచనారకాయలను, వృక్షామ్లఫలములను పెరుగుమీదితేటతో నుడకబెట్టి సేవించిన రక్తార్శస్సునందు అధికముగా స్రవించెడు రక్తము నిలిచిపోవును. (చ-చి-అ 9.)

2. అతీసారమునందు వృక్షామ్లప్రయోగము.

"ఫలామ్లం యమకే భృష్టంవా వర్చఃక్షయరుజాపహం॥"

వృక్షామ్లఫలములను యమకస్నేహమునందు భర్జనజేసి సేవించిన అతి సారమునందలి శూల శమించును. (చ-చి-అ 10.)

3. గుల్మమునందు వృక్షామ్లప్రయోగము.

"గుల్మనాశాయ...వృక్షామ్లస్య స్వరసః।
సైంధవయుక్త స్తథైవ నియతం స్యాత్॥"

వృక్షామ్లఫలరసమునందు సైంధవ లవణమునుజేర్చి సేవించిన నిశ్చయముగ గుల్మము శమించును. (వై-మ.)

(6) యోగములు:—

1. అమ్లాదిచూర్ణము-చ-గ్రహణి.

మాత్ర:—$\frac{1}{4}$ తులం.

ఉపయోగములు:—కాస, అజీర్ణము, అరుచి, శ్వాస, హృద్రోగము, పాండు, గుల్మము ఇవి శమించును.

2. తింతిడీపానకము - భైషజ్య - అరోచక.

మాత్ర:—$\frac{1}{2}$ పలం.

ఉపయోగములు:—అరుచిశమించును.

3. చించాదికషాయము-బ-రా-పాండు.

మాత్ర:—1 పలం.

ఉపయోగములు:—పాండు, కామిల, శోఫ ఇవి శమించును.

4. లఘుచించాదిలేహ్యము-మహాచించాదిలేహ్యము-బ-రా-పాండు.

మాత్ర:—1 తులం.

ఉపయోగములు:—పాండు, శోప, గ్రహణి, ప్రమేహము, ప్లీహ క్షీవృద్ధి, ఆనాహము ఇవి శమించును.

5. తింత్రిణీమండూరము-బ-రా-శోఫ.

మాత్ర:—10 యవలు.

ఉపయోగములు:—శోప, పాండు, క్షయము, ప్రరాణజ్వరము ఇవి శమించును.

6. అమ్లికావటకము-భా-ప్ర-పూ-ఖం-అ 5.

మాత్ర:—5 యవలు.

ఉపయోగములు:—రుచినిబుట్టించును. జాఠరాగ్నివృద్ధి బొందించును.

(7) Actions and uses (తింతిడీ):—Pulp anti scorbutic, refrigerant and laxative. Used in fever to quench thirst, in sunstroke and in bilious vomitting. As an aperient, it is given in habitual constipation. The pulp and the leaves made hot are applied locally to inflammatory swellings. A gargle of it is given in aphthous sores, and for the relief of sore throat. The seeds are given in dysentry. The ash obtained from the suber is used as an alkaline medicine in acidity of urine and in gonorrhoea. Khory II. P 231.

Actions and uses:—(వృక్షామ్ల). The concrete oil is nutritive, demulcent, and emmolient. It has been recommended as a substitute for Codliver oil. It was included in the Pharmacopooea of India with the view to its adoption in the preparation of ointments, suppositories and the like. It has not, however, been used to any extent for this pur pose.

Indigenous drugs of India.

## స్వానుభవము

[ (1) చింతపండులో గూడ వైటమిన్ "సి" అను జీవనీయపదార్థము గలదని నవీనశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. అనగా ప్రాణమును రక్షించు పదార్థములలో నిది యొకటి యని అర్థము. దక్షిణ హిందూదేశమున బీదవాండ్లందరు కొంచెము చింతపండు దానికి సరిపడు మిరపకాయ దొరకితే నీరుల్లిపాయ కొద్దిగా నుప్పు చేర్చి పచ్చడిచేసి నంచుకుంటూ అన్నమంతా తింటారు. పని బాగా చేస్తారు. వాళ్ళకేరోగం లేదు. అన్నిరోగాలు, భాగ్యవంతులకే. ఈ చింతపండు, యీ మిరపకాయ వీనిలో నుండే రాసాయనిక పదార్థములు లేక జీవనీయ పదార్థము లేవో యింకను పరిశోధింపవలసి యున్నది. ఈ పరిశోధనల తీర్మానం తేలేవరకూ చింతపండు మిరపకాయ కారము తినేవాళ్ళని చూచి హేళనచేయకూడదు. "బలాధిష్ఠానమారోగ్యం" కాబట్టి వాళ్ళను చూచి యితరులు నేర్చుకోనవలెను.

(2) ఎండుచింతాకుచారు చాల రుచిగా నుండును. చింతపండుకంటె పథ్యకరమని దేశములో వాడుక.

(3) వావిలాకు, చింతాకు తొక్కి ఆముదముతో నుడికించి వేడివేడిగా పెద్దకట్టుకట్టినయెడల వాపులు తగ్గును. ఇది అనుభూతము. ఆ. ల. ]

---

# 101

# త్రివృత్ (శ్వేత) - తెల్లతెగడ (క)

---

### భాషాంతర నామములు

హింది - నిసోత్. మరాఠి - తేంకసీ. గుజరాతి - నసోత్తర. మలయాళం - త్రికోల్పకొన్న. కర్ణాటకం - త్రివృత్. ద్రావిడం - శివదవేర్.

### Natural Order—Conuolunlaceae

తెగడ కుటుంబము

### తెల్లతెగడ - Ipomoea turpethum

### నైసర్గిక స్వరూప వర్ణనము

ఆకులు:—ఒంటరిచేరిక, హృదయాకారము. లఘుపత్రములు సమాంచలము కొనసన్నము. విషమరేఖపత్రము తొడిమలు పొడుగుగా నుండును.

పుష్పమంజరి:—కణుపు సందులందుండి మధ్యారంభ మంజరులుగ నున్నవి. పువ్వులు పెద్దవి. సరాళము.

పుష్పకోశము:—అసంయుక్తము, రక్షకపత్రము ఐదు. సమగోళాకారము నీచము.
దళవలయము:—సంయుక్తము గరాటివలె నుండును. 5 ఆకర్షణపత్రములు గలసియున్నది. మొగ్గలో మెలిపెట్టినట్లుండును.

కింజల్కములు:—అయిదు దళవలయము నంటియుండును. అన్నియు సమముగా లేవు, కొన్నిపొట్టి కొన్నిపొడుగు. కాడ లడుగున వెడల్పుగా నున్నవి. పుప్పొడితిత్తులు రెండుగదులు.

అండకోశము:—అండాశయము ఉచ్చము 4 గదులు ఒక్కొకదానియం దొక్కొక యండమగలదు. కీలము పొడుగు.

మట్టిపాలతీగె పెద్దతీగె.

ఆకులు:—ఒంటరిచేరిక, లఘుపత్రములు. అడుగుపరకు చీలియున్నవి. ఒక్కొక తమ్మె నమగోళాకారము.

పుష్పమంజరి:—కణుపుసందులందుండి మధ్యారంభమంజరులు గలవు. పుష్పలు ఊదారంగు పుష్పములయొద్ద చేటికలుగలవు.

పుష్పకోశము:—అసంయుక్తము 5 రక్షకపత్రములు నన్నముగా నుండును సమము.

దళవలయము:—సంయుక్తము 5 తమ్మెలు గలవు. సరాళము.

కింజల్కములు:—5 దళవలయమునంటి యుండును. పుప్పొడితిత్తులు రెండు గదులు.

అండకోశము:—అండాశయము ఉచ్చము 4 గదులు ఒక్కొక దానియం దొక్కొక యండమున్నది. కాని ఒకటియే సాధారణముగ పెరుగును. గింజపై రోమములు గలవు. కీలము ఒకటి గుండ్రము.

ఈ కుటుంబపు మొక్కలలో పెద్ద వృక్షములు లేవు. తీగెలే విస్తారముగగలవు. ఆకులు ఒంటరిచేరిక, లఘుపత్రములు, కణుపుపుచ్ఛములుండవు. పుష్పములు సరాళములు. దళవలయము మెలివట్టినట్లుండును. కింజల్కములైదు. అండాశయములో సాధారణముగ రెండు గదులును ఒక్కొక్కదానియందు రెండేసి గింజలునుండును.

## పర్యాయ పదములు

శ్లో॥ శ్వేతాత్రివృ త్త్రిభండీ స్యాత్ త్రివృతా త్రిపుటాపిచ।
సర్వానుభూతిః సరలో నిశోథో రేచనీతిచ॥

త్రిభండి, త్రివృత, త్రిపుట, సర్వానుభూతి, సరల, నిశోథ, రేచని యనునవి శ్వేతత్రివృన్నామములు.

## గుణములు

శ్లో॥ శ్వేతాత్రివృ ద్రేచనీ స్యాత్ స్వాదురుష్ణా సమీరహృత్,
రూక్షా పిత్తజ్వరశ్లేష్మ పిత్తశోథోదరాపహా॥

తెల్లతెగడ మధురరసమును, రూక్షగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. మలరేచనము జేయును. వాతమును శమింపజేయును. పిత్తజ్వరమును, శ్లేష్మపిత్తజ శోథను, ఉదరమును బోగొట్టును.

## శ్యామాత్రివృత్ - నల్లతెగడ (ఖ)

శ్లో॥ త్రివృచ్ఛ్యామార్ధచంద్రా చ పాలిందీ చ సుషేణికా॥

అర్ధచంద్ర, పాలింది, సుషేణిక యనునవి శ్యామా త్రివృన్నామములు

## గుణములు

శ్లో॥ శ్యామాత్రివృ త్తతో హీనగుణా తీవ్రరేచనీ,
మూర్ఛాదాహమదభ్రాంతి కంఠోత్కర్షణకారిణీ॥

నల్లతెగడ తెల్లతెగడయొక్క గుణములను హీనముగా గలిగియుండును. ఇదిమలములను తీవ్రముగా రేచనము జేయును. గళమునం దుత్కర్షమును గలిగించును. మూర్ఛా, దాహము, మదము, భ్రాంతియను రోగములను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(శ్వేత) - త్రివృత, సర్వానుభూతి, (త్ర్యస్రి, వ్యాఘ్రపాది,) (శ్యామ) - అర్ధచంద్రి, (మసూరవిదల, కాలమేషిక.)

(ఖ) గుణబోధకములు:—(శ్వేత) - సరల, రేచని, (శ్యామ) - పాలింది, సుషేణిక, (రేచిని.)

(2) శబ్దార్థములు:—

త్రివృత - త్ర్యస్రి - మూడు అంచులతో నావరింప బడియున్నట్టి వేళ్లనుగలది. సర్వానుభూతి - ఎల్లరచే సేవింపబడినది. లేక సమస్త రసముల యొక్క అనుభవముగలది. వ్యాఘ్రపాది - పులియడుగును బోలిన పత్రములను గలది. అర్ధచంద్రి - అర్ధచంద్రాకృతిగల పత్రములనుగలది. మసూరవిదల - చిరుశెనగలవలె రెండుగా చీలియుండునట్టి బీజములను గలది. కాలమేషిక - నల్లనివర్ణము గలదియని వ్యవహరింప బడినది. సరల - సౌమ్యగుణము గలది. రేచని - మలరేచనము జేయునది. పాలింది - రోగములనుండి రక్షించునది. సుషేణిక - క్రిములను కట్టగాగట్టి బయటకు వెలిపరచునది.

(3) భేదములు:—

ఇది శుక్ల, కృష్ణ, రక్త భేదముచే మూడు విధములుగానుండి వల్లీజాతులలో నుత్పత్తిగలిగి, వికారములులేక మలములను నిశ్శేషముగ శోధించునట్టి ద్రవ్యములలో గణింపబడుచున్నది. అయితే భావమిశ్రుడు తెల్లతెగడకంటె నల్లతెగడ స్వల్ప గుణములను గలిగియుండినను తీక్ష్ణరేచనము జేయునదిగ చెప్పియున్నారు. వైద్యక తంత్రమునందు ఈ రెంటికిమాత్రమే విశేష

ప్రయోగమున్నట్లు గానబడును. మరియు బజారులందుగూడ శ్వేతకృష్ణ వర్ణముగల తెగడలే విరివిగా లభించుచుండును. నిఘంటుకారులు దీనిని మూడు విధములుగ గ్రహించియున్నను రక్తత్రివృత్తుకు ప్రయోగము ఏల లేకున్నదో తెలియకున్నది. కాని కృష్ణముకంటె శ్వేతమే తీక్ష్ణవిరేచన కారియనియు, ఇందుచే దీనిని పాలతో శోధించి మిక్కిలి తక్కువమాత్రగా విరేచనకర్మకై యుపయోగింప వలెననియు గొందరు జెప్పుదురు. ఇటులనే శ్వేతత్రివృత్తు నుపయోగించుటగూడ గొన్ని ప్రాంతములందు ప్రచారమునందుగలదు. ఇటుల దీని ప్రయోగమునందు నిఘంటు నిరూపణమునకును, లోక వ్యవహారమునకును గొన్నిచోట్ల మతభేదము గానుపించుచున్నది. వారివారి యనుభవముచుబట్టి యటుల భిన్నవిధములుగ నుపయోగింప బడుచుండునట్లు గ్రహింపదగినది. అయితే చరక కల్పస్థానమునందలి దృఢబల నిరూపణమునకును ఈ పైనివ్రాసిన విషయమునకును కొద్దిపాటియైన సంబంధమున్నట్లు గానుపించదు. "మూలం తు ద్వివిధం తస్యాః శ్యామం చారుణమేవ చ। తయోః ముఖ్యతరం విద్ధి మూలం యదరుణప్రభం॥ సుకుమారే శిశౌ వృద్ధే మృదుకోష్ఠే చ తచ్ఛుభం। మోహాయ దాశుకారిత్వాత్ శ్యామా కంఠం క్షిణోత్యపి॥ తైక్ష్ణ్యాత్కర్షతి హృత్కంఠం ఆశు దోషం హరత్యపి శస్యతే బహుదోషాణాం క్రూరకోష్ఠాశ్చ యే నరాః॥" తెగడవేరు నలుపు, ఎరుపు భేదముచే రెండు విధములుగా నుండును. అందు అరుణమూలము శ్రేష్ఠము. ఏలయనగా నిది సుకుమారులకును, శిశువులకును, వృద్ధులకును, మృదుకోష్ఠులకును నిరపాయముగ విరేచనము చేయునదిగ నుండును. కృష్ణమూలత్రివృత్తన్ననో యది యాశుకారి యగుటచే కంఠమును బీడించును. సంజ్ఞామోహమును గలిగించును. తీక్ష్ణగుణము గలదగుటచే హృదయమును, కంఠమును బిగబట్టును. అతిశీఘ్రముగా (తీవ్రవేగముతో) దోషమును శోధించును. అందుచే నిది కేవలము దోషములు హెచ్చుబలముతో గూడియున్నప్పుడును, క్రూరకోష్ఠులకును నుపయోగింప దగియుండును." (చ-క-అ 7.) - దీనినిబట్టి కేవలము రక్తత్రివృత్తుకే గాని కృష్ణత్రివృత్తునకు సర్వసాధారణముగ నెల్ల వ్యాధులందుపయోగింప దగిన యర్హతయున్నట్లు గానుపించదు. చరకమతము ననుసరించి రక్తత్రివృత్తు విరేచనకర్మమందు నిరపాయకరమగునట్టి ద్రవ్యమని స్పష్టమగుచున్నదిగదా! ఇటులనే వాగ్భటుడు గూడ "త్రివృత్తు శ్యామము, శ్యామారుణము అని రెండువిధములు. అందు శ్యామారుణము శ్రేష్ఠము" అని కల్పస్థాన ప్రథమా

ధ్యాయమున నిరూపించియున్నారు. ఇటుల తంత్రకారులు అరుణత్రివృత్తు శ్రేష్ఠమనియు, దీనినే విరేచనకర్మకు ఆయాదోషాను గుణ్యముగ గల్పించి యుపయోగింప వలెననియు నిరూపించియుండ వ్యవహారమునందు కృష్ణత్రివృత్తు అంత విశేషప్రయోగము నేల గలిగియున్నదో దెలియకున్నది. అయితే ధన్వంతర్యాది నిఘంటుకారులు తంత్రకారులతోపాటు కృష్ణారుణ త్రివృత్తుల నుగ్రహించియు వీనికి శ్వేతమను మరియొక భేదమునుగూడ జెప్పుకొనిరి. ఇటుల నిఘంటుకారులు మూడువిధములుగా జెప్పి, వాటి గుణనిరూపణములో "కృష్ణత్రివృత్తు విరేచనకర్మకు శ్రేష్ఠమైనది. అరుణ త్రివృత్తు బహురేచన కరము." అని ధన్వంతరినిఘంటుకారుడును, "శ్వేతత్రివృత్తు విరేచనమునను ప్రశస్తమైనది. శ్యామత్రివృత్తు పైదానికంటె హీనమైన గుణములనుగలిగియు తీవ్రవిరేచనకారి" యని రాజనిఘంటు కారుడును ఇట్లు మరిభేదములను సూచించి యున్నారు. మరియు భావమిశ్రుడుగూడ రాజనిఘంటుకారుని వలెనే శ్వేతత్రివృత్తే శ్రేష్ఠమైనదిగ నిరూపించి యున్నారు. కాని యితడు పైవారివలె మూడువిధములుగాక కేవలము శ్వేత కృష్ణత్రివృత్తులను రెండింటినే గ్రహించి యున్నాడు. ఇటుల త్రివృత్ప్రయోగమునందు శాస్త్రము నకును, వ్యవహారమునకును మిక్కిలి భేదమున్నట్లు గానబడుచున్నది.

ఇది వర్ణభేదమునుబట్టి యెన్నివిధములుగ నున్నను మొత్తముమీద దీని యుత్పత్తి లతారూపముననే యుండును. పైపదములనుబట్టి శ్వేతత్రివృత్తు పులియాకువంటి యాకులతోగూడి తెల్లనివర్ణమును, మూడు అంచులునుగల వ్రేళ్లను గలిగి యుండుననియు, కృష్ణత్రివృత్తు అర్ధచంద్రాకృతిగల పత్రములను చిరు సెనగలవలె రెండుగా చీలియుండు బీజములను నల్లనివర్ణముగల వ్రేళ్లనుగలిగి యుండుననియు, అరుణత్రివృత్తు "రక్తపుష్ప, రక్తమూల, సూత్రమధ్య" (రా.ని.)-ఎర్రని పుష్పములను, ఎర్రని వ్రేళ్లను గలిగియుండి వ్రేళ్లమధ్య సన్నని సూత్రములవంటి నాళములతో (లేక) సన్నని సూత్రములవలె దీర్ఘములుగను పత్రరహితములుగను తీగెలకు మధ్య మధ్య నుత్పన్నములై బహుమార్గముగ వ్యాపించునట్టి యంగములతో గూడియుండుననియు దెలియుచున్నది. వీని పరిచయమును బోధించునట్టివిషయము లింతకంటె హెచ్చుగ గానరాకున్నవి. ఈమూడింటిలోను బజారులందు శ్వేతకృష్ణములే విరివిగ లభించుచున్నవి. అందు శ్వేతము మూలత్వగ్రూపముననను, కృష్ణము కేవలము మూలస్వరూపముగను లభించగలవు. అరుణ మెచ్చటను గానుపించకున్నది. ఇటుల శ్వేతకృష్ణములు

రికడే విరివిగ దొరకుచుండుట చేతను, అరుణము లభింపకుండుటచేతను ఆధునికుడగుభావమిశ్రుడా రెండింటినే (శ్వేత-కృష్ణ) తన నిఘంటు భాగమున గ్రహించుకొనియుండెనేమో యూహింప దగియున్నది. ఇవి యరణ్యములందును, పర్వతములందును దప్ప ఇతర భూములందు త్పన్నములగునవిగా గానుపింపవు. త్రివృన్మూలమును గ్రహించు పద్ధతి చరకమునందిట్లు వర్ణింపబడినది. "గుణవత్యాం తయో ర్భూమౌ జాతం మూలం సముద్ధరేత్। గంభీరానుగతం శ్లక్ష్ణం న తిర్యగ్విసృతం చ యత్॥ గృహీత్వా విసృజేత్కాష్ఠం త్వచం శుష్కాం నిధాపయేత్॥" (చ-క-అ 7.) - శ్రేష్ఠమైన భూమియందుత్పన్నమైనట్టియు, లోతుగను, తిన్నగ (నిదానముగ) ను, నునుపుగను వృద్ధిపొందినట్టియు తెగడ వేరునుగ్రహించి యది పచ్చిగనున్నప్పుడే దానిపైనుండు త్వక్కు మాత్రము దీసుకొని యెండబెట్టి జాగ్రత్త పరచవలెను. మధ్యనుండు కాష్ఠమును నిరుపయోగకరముగా దెలిసికొని దానిని దూరముగా విడువవలెను. ఇటుల గ్రహింపబడిన త్రివృన్మూలత్వక్కు నుపయోగించు పద్ధతిగూడ చరకమునందిట్లు వర్ణింపబడినది. "స్నిగ్ధస్విన్నో విరేచ్యస్తు పేయామాత్రాశిత స్సుఖం। అక్షమాత్రం తయోః పిండం వినీయామ్లేన నాపిబేత్॥" (చ-క-అ 7) - విరేచన కర్మచే యదగిన పురుషుడు తొలుత స్నేహ స్వేదముల నాచరించుకొని కేవలము పేయనుమాత్రము ఆహారముగా దీసికొని త్రివృన్మూలత్వక్కల్కమును అక్షప్రమాణము గ్రహించి దానిని కాంజికముతో జేర్చి పానము జేయవలెను. దీని వలన సుఖముగా విరేచనములగును. ఇటులనే చరక సుశ్రుత వాగ్భటములందీ త్రివృన్మూలము ఇతర ద్రవ్యసంయోగముతో సుఖవిరేచనార్థ మనేక విధములుగా ప్రయోగింప బడినది. ఇంతియేగాకుండ దీనికి సర్వరోగ హరత్వమును చరకుడిట్లు వచించియున్నాడు. "సేదానీమౌషధై ర్యుక్తా వాతపిత్తకఫాపహైః। ఫలవైశిష్ట్య మాసాద్య సర్వరోగహరా భవేత్॥" (చ-క-అ 7.)- వాతపిత్తకఫహరములగు ద్రవ్యములతో నీత్రివృన్మూలమునుజేర్చి యుపయోగించినచో నీసమ్మేళనమునందొక విధమగు విశేషగుణమును పొందినదై సమస్త వ్యాధులను బోగొట్టును. కావున దీనినిబట్టి యిది కేవలము శోధనార్థమే గాకుండ వ్యాధిశమనార్థముగూడ నుపయోగింప దగియుండునని గ్రహింపవలెను. దీనికి వ్యవహారమునందట్టి ప్రయోగములున్నట్లును గానరావు.

(4) విశేషగుణములు:—

(క) శ్వేత - కషాయరసమును, మధురానురసమును, కటువిపాకమును గలిగియుండును. వాతమును ప్రకోపింప జేయును. కఫపిత్తములను శమింప జేయును. ధ-ని., క్రిములను, కుష్ఠమును, కండువును, వ్రణమును బోగొట్టును. (రా-ని.)

(ఖ) శ్యామా - కషాయరసమును, మధురానురసమును, రూక్షగుణమును, కటువిపాకమును గలిగియుండును. వాతమును ప్రకోపింప జేయును. కఫపిత్తములను శమింపజేయును. (చ-క-అ 7.,) ఉష్ణవీర్యమును గలిగియుండును. శోఫను, పాండును, ప్లీహవృద్ధిని, క్రిములను, ఉదరమును, జ్వరమును బోగొట్టును. (ధ-ని.)

(గ) అరుణ - కషాయరసమును, మధురానురసమును, రూక్షగుణమును, కటువిపాకమును గలిగియుండును. అధిక రేచనకరము. వాతమును వృద్ధి బొందించును. కఫపిత్తములను శమింపజేయును. (ధ-ని.,) మృదుగుణమును గలిగియుండును. (రా-ని.,) మధురతిక్తానురసములను గలిగియుండును. మృదు రేచనకరము. (రా. వ.)

(5) ప్రయోగములు:—

1. జ్వరమునందు త్రివృత్ప్రయోగము.

"మృద్వీకానాం రసేన వా। త్రివృతాం జ్వరితః పిబేత్॥"

తెగడమూలమును ద్రాక్షపండ్ల రసముతో జేర్చి పానముజేసిన హితము. (చ-చి-అ 3.)

2. అర్శస్సునందు త్రివృత్ప్రయోగము.

"పాయయేత త్రివృచ్చూర్ణం త్రిఫలాయాః రసేన వా। వృతే గుదాశ్రయే దోషే గచ్ఛన్త్యర్శాంసి సంక్షయం॥"

త్రిఫలా కషాయమునందు త్రివృచ్చూర్ణమును గలిపి పానముజేసిన గుదము నందాశ్రయించిన దోషము శోధింపబడి పిమ్మట మూలవ్యాధి శమించును. (చ-చి-అ 9.)

"త్రివృద్దన్తీపలాశానాం...। ఘృష్టం యమకే దద్యాత్ శాకం దధిసరామ్లకం॥" తెగడ, నేపాళము, మోదుగ మీనియాకులను ఘృతతైలములతో భర్జనజేసి పెరుగుమీది నీళ్లతో సేవించిన అర్శోవ్యాధి శమించును. (చ-చి-అ 9.)

3. రక్తపిత్తమునందు త్రివృత్ప్రయోగము.

"త్రివృతాం..., విరేచనం ప్రయుంజీత ప్రభూతమధుశర్కరం।"

తెగడచూర్ణమును విశేషముగా తేనెతోను చక్కెరతోను గలిపి విరేచనార్థము సేవించిన ఊర్ధ్వగరక్తపిత్తము శమించును. (చ-చి-అ-4)

4. విసర్పమునందు త్రివృత్ప్రయోగము.

"త్రివృచ్చూర్ణం సమాలోడ్య సర్పిషా పయసాపి వా। ఘర్మాంబునా వా సంయోజ్య మృద్వీకానాం రసేన వా। విరేకార్థం ప్రయోక్తవ్యం సిద్ధం విసర్పనాశనం॥"

తెగడచూర్ణమును నెయ్యి, పాలు, వేడినీళ్ళు, ద్రాక్షపండ్లరసము వీనిలో నేయొకదానితోనైన గలిపి విరేచనార్థమై సేవించిన విసర్పరోగము శమించును. (చ-చి-అ 11.)

5. ఉదరమునందు త్రివృత్ప్రయోగము.

"శంఖినీస్నుక్త్రివృద్దన్తీ...। శాకం గాఢపురీషాయ ప్రాగ్భక్తం దాపయేద్భిషక్॥"

శంఖిని, జముడు, తెగడ వీని పత్రములను శాకముగాజేసి భోజనమునకు ముందుగా సేవించిన గాఢపురీషముగల ఉదరరోగికి మలసంసరణమేర్పడి కొంతసౌఖ్యము గలుగును. (చ-చి-అ 18.)

6 వాతశోథమునందు త్రివృత్ప్రయోగము.

"తత్రి వాతశ్వయథౌ త్రైవృత మేరండతైలం వా
మాసమర్ధమాసం వా పాయయేత్॥"

త్రివృచ్చూర్ణముగాని, ఏరండతైలముగాని యొకమాసము లేక యర్ధమాసము పర్యంతము సేవించిన వాతజశోథ శమించును. (సు-చి-అ 23.)

7. జ్వరమునందు త్రివృత్ప్రయోగము.

"శాంతిం నయేత్ త్రివృచ్చాపి సక్షౌద్రా ప్రబలం జ్వరం॥"

త్రివృచ్చూర్ణమును తేనెతో గలిపి సేవించినయెడల తీవ్రజ్వరము శమించును. (సు-ఉ-అ 39.)

8. గుల్మమునందు త్రివృత్ప్రయోగము.

"త్రివృచ్ఛాకేన వా స్నిగ్ధ ముష్ణం భుంజీత భోజనం॥"

తెగడయాకులను శాకముగాజేసి స్నిగ్ధముగను, ఉష్ణముగను నుండు ఆహారమునందుజేర్చి సేవించిన గుల్మము శమించును. (సు-ఉ-అ 42.)

9. కామిలయందు త్రివృత్ప్రయోగము.

"సశర్కరా కామలినాం త్రిభండీ॥"

త్రివృచ్చూర్ణమును చక్కెరతో జేర్చి సేవించినకామిల శమించును. (సు-ఉ-అ 44.)

10. రాజయక్ష్మయందు త్రివృత్ప్రయోగము.

"విరేచనం దద్యాత్ త్రివృచ్ఛ్యామాన్యతమ త్రివాన్। శర్కరా మధుసర్పిర్భిః పయసా తర్పణేన వా। ద్రాక్షావిదారీకాశ్మర్య మాంసానాం వా రసై ర్యుతం॥"

తెల్లతెగడ చూర్ణమునుగాని, నల్లతెగడ చూర్ణమునుగాని, రేలగుజ్జునుగాని చక్కెర, తేనె, నెయ్యి వీనితో గలిపిగాని, తర్పణద్రవ్యముతో సిద్ధముచేయబడిన పాలతో గలిపి గాని, ద్రాక్షపండ్లు, నేలగుమ్మడి. గాచిన పాలతో గలిపి గాని ద్రాక్షపండ్లు, నేలగుమ్మడి, పెద్దగుమ్మడి, మాంసము వీనిలో నేదొకదానిరసముతో గలిపిగాని విరేచనార్థము సేవించిన రాజయక్ష్మరోగికి హితమగును. (వా-చి-అ 5.)

11. కీటవిషమునందు త్రివృత్ప్రయోగము.

"తండులీయకతుల్యాంశాం త్రివృతాం సర్పిషా పిబేత్॥"

తండులీయకము, త్రివృత్తు వీనిరసములను గాని చూర్ణములను గాని సమాంశములుగా గ్రహించి యందు నెయ్యిగలిపి సేవించిన కీటవిషము శమించును. (వా-ఉ-అ 37.)

12. నేత్రరోగమునందు త్రివృత్ప్రయోగము.

"త్రిస్త్రివృద్వారిణా పక్వం క్షతశుక్రికే ఘృతం పిబేత్॥"

త్రివృత్కషాయముతో నేయిజేర్చి మూడుపర్యాయములు పాకముజేసి పానముజేసిన క్షతశుక్రము శమించును. (వా-ఉ-అ 11.)

(6) యోగములు:—

1. త్రివృతాదితైలము - సుశ్రుత - భగందర.

ఉపయోగములు:—అభ్యంగము చేసిన భగందరము శమించును.

2 త్రివృతాదిమోదకము - వా - రక్తపిత్త.

మాత్ర:—$\frac{1}{4}$ తులము.

ఉపయోగములు:—ఊర్ధ్వగరక్తపిత్తము, శోష, జ్వరము శమించును.

3. త్రివృతాది ఘృతము - భైషజ్య - వృద్ధి.

మాత్ర:—1 తులము.

ఉపయోగములు:—అంత్రవృద్ధి, ప్రమేహము, శ్వాస, కుష్ఠము, అగ్నిమాంద్యము, కామిల, హలీమకము, పాండు, గలగండ, అర్బుదము, విద్రధి, వ్రణశోఫ యివి శమించును.

4. బృహచ్ఛాగ్యమాఘృతము - భైషజ్య - ప్రమేహ పీటిక.

మాత్ర:—1 తులము.

ఉపయోగములు:—ప్రమేహము, ప్రమేహపిటిక, క్లైబ్యము, వాతరక్తము, శుక్రక్షయము, రక్తపిత్తము, హృద్రోగము, ధాతుశోష, గర్భదోషము ఇవి శమించును. బాలురకు పుష్టిని గలిగించును.

తెగడగల కొన్ని యోగములు.

అభయారిష్ట, అవిపత్తికరచూర్ణము, అశ్వగంధారిష్ట, చందనాసవము, త్రివృత్ లేహ్యము, బ్రాహ్మీఘృతము, సరస్వతారిష్టము.

## స్వానుభవము

( ఈ మూలికను చరకాచార్యుడు మిక్కిలి పొగడి యున్నాడు. (త్రివృన్మూలం సుఖవిరేచనీయానాం) నొప్పి మొదలయినవి లేకుండ విరేచనమును జేయును. వృక్కములకు ఉద్రేకము గలిగించదు. జాగ్రత్తగా మోతాదులిచ్చిన గర్భిణీ స్త్రీలకుగూడ నీయవచ్చును. కొంచెము తేనె లేక పంచదార జేర్చిన రుచికి వెగటుగానుండక తియ్యగానుండును. హృదయవ్యాధి, వృక్కవ్యాధి, యకృద్వ్యాధి వీనివలన నంజు గలిగినచో ఇది మిక్కిలి ఉపయోగకరమైనది. దీని యాకులు,

శొంఠి, మోదుగగింజలు వీనిని సమయెత్తు నేయి, నూనె. ఆగుదము, వీనిలో దేనితోనైనను వేచి కూరగాజేసి పెరుగు తోగూడ మూలవ్యాధిలో నిచ్చిన చాలమంచిది. ఇది జ్వరము, కామిల, మూలవ్యాధి రక్తపిత్తము, చప్పి, పిత్తోదరము, పిత్తపాండు, వాతశోఫ, గుల్మము, క్షయ, నేత్ర రోగములు, పిత్తరోగములు వీనియందుపయోగపడుచున్నది. (వివరముకొరకు వనౌషధి గుణాదర్శణమను పుస్తకములో 33వ పేజీని చూడుము.) ఆ. ల. ]

---

# 102

# తులసీ - తులసిచెట్టు

---

## భాషాంతర నామములు

హిందీ - తులసో. మరాఠి. తులసో. గుజరాతి. తులసో. మలయాళం - తులసి. కర్ణాటకం - తుళసి. ద్రావిడం - తులసి.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural—Order Labiateae

తులసి కుటుంబము

తులసిచెట్టు - Ocimum Sanctum (Eng. Sacred Basil)

ప్రకాండము—నాలుగుపలకలుగా నున్నది.

ఆకులు—అభిముఖచేరిక లఘుపత్రములు, తొడిమపొడుగు. కణుపు పుచ్ఛములు లేవు. పత్రము అండాకారము. కొనసన్నము. విషమ రేఖపత్రము. ఈనెలకింద రోమములుగలవు.

పుష్పమంజరి—కొమ్మల చివరలనుండిగాని, కణుపుసందుల నుండిగాని కంకులు, వీనిమీఁద ఒక్కొకచోట మూడేసియో నాల్గేసియో పువ్వులుగలవు, వీనిక్రింద చేటికలుగలవు. వీనిలో మధ్యపుష్పము మొదట వికసించును గాన నివి మధ్యారంభ మంజరులు. పువ్వులు చిన్నవి. అసహాశము.

పుష్పకోశము—సంయుక్తము ఓష్ఠాకారము పైపెదవి కొంచెము గుండ్రముగా నున్నది, క్రిందిదానికి నాల్గుదంతములుగలవు. నీచము.

దళవలయము—అండకోశము లోపుగానుండును. సంయుక్తము ఓష్ఠాకారము, పైపెదవికి నాల్గుదంతములు గలవు.

కింజల్కములు—4 దళవలయపుటడుగు పెదవిపైనున్నవి. పుష్పాంతస్థలు రెండు గదులు అండాకారము ఇవి ఒకచోటనే పగులును.

అండకోశము—అండాశయము ఉచ్చము, దీనికి నాల్గు తమ్మెలున్నవి. కీలము ఈ తమ్మెల మధ్యనుండి వచ్చును. కీలాంగ్రము రెండుచీలికలు ఇది పుష్పకోశములో నడఁగియుండును, పగిలి నాలుగుగఁ జీలును, ఇవి గింజలను కొందరుగాని నిజమైనగింజలు వీనిలోపల నొక్కొకటి గలదు.

ఈ కుటుంబములోని మొక్కలు చిన్నవి. వాని యాకులకీముఖ చేరిక వానికిఁ గణుపు పుచ్ఛములులేవు. ఆకులకును కొమ్మలకు ఒక విధమగు వాసనగలదు. పుష్పకోశము సాధారణముగ కాయతోఁ బెరుగుచుండును. దళవలయము ఓష్ఠాకారము. కింజల్కములు నాలుగు. అండాశయముచ్చము. కీలము అండాశయమున కడుగున నుండివచ్చును. ఇదియే ముఖ్యలక్షణము. కాయ రెండి పగులును. ఈకుటుంబము అడసరపు కుటుంబమును జేకు కుటుంబమును బోలియుండును. ఈకుటుంబపు మొక్కలలోఁ గింజల్కములు నాలుగో రెండో, పైజత పెద్దవో, అడుగుజత పెద్దవో, పుష్పావితత్తులు కలసియున్నవో విడిగా నున్నవో మొదలగు అంశములనుబట్టి జాతులుగను తెగలుగను విభజించి యున్నారు.

## పర్యాయ పదములు

శ్లో॥ తులసీ సురసా గ్రామ్యా సులభా బహుమంజరీ,
అపేతరాక్షసీ గౌరీ శూలఘ్నీ దేవదుందుభీ ॥

తులసి, సురస, గ్రామ్య, సులభ, బహుమంజరి, అపేతరాక్షసి, గౌరి, శూలఘ్ని, దేవదుందుభి యనునవి తులసీ నామములు.

## తులసీ గుణములు

శ్లో॥ తులసీ కటుకా తిక్తా హృద్యోష్ణా దాహపిత్తకృత్।
దీపనీ కుష్ఠకృచ్ఛ్రాస్రపార్శ్వరుక్కఫవాతజిత్॥

తులసి కటురసమును, తిక్తానురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. హృదయమునకు హితమైనది. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. పిత్తమును వృద్ధి బొందించును. కఫవాతములను శమింపజేయును. దాహము, కుష్ఠము, మూత్రకృచ్ఛ్రము, రక్తదోషము, పార్శ్వశూల అను వివ్యాధులను బోఁగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:— సురస - సులభ - బహుమంజరి - విష్ణువల్లభ - బహుపత్రి.

(ఖ) గుణబోధకములు:— అపేతరాక్షసి - శూలఘ్ని - పావని.

(గ) ఉత్పత్తిబోధకములు:— గ్రామ్య.

(2) శబ్దార్థములు:—

సురస - మంచిరసముగలది. సులభ - అనాయాసముగా లభించునది. బహుమంజరి - విశేషముగ పూగుత్తులను గలది. విష్ణువల్లభ - విష్ణుమూర్తికి ప్రియమైనది. బహుపత్రి - విశేషముగ పత్రములతో గూడియుండునది. అపేతరాక్షసి - రాక్షసబాధను తొలగించునది. శూలఘ్ని - శూలను పోగొట్టునది. పావని - పవిత్రము చేయునది. గ్రామ్య - గ్రామములందుత్పన్న మగునది.

(3) భేదములు:—

ఇది గ్రామ్య - అరణ్యభేదముచే రెండువిధములుగా నుత్పత్తిభేదములనుగలిగి కొంచెము ఎత్తుగాపెరుగు క్షుపజాతులలోజేరి క్రిమిహార విషహార ద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగా గణింపబడుచున్నది. ఇందలి గ్రామ్యము తిరిగి దీర్ఘహ్రస్వ భేదముచే రెండువిధములుగా నుండును. అందు దీర్ఘముగా నుండువానిలో కృష్ణతులసి, శుక్లతులసి, గంధతులసియను మొదలగు భేదములుగలవు. వీనిలో కృష్ణతులసి విష్ణుతులసి యనియు, శుక్లతులసి శివతులసి యనియు, గంధతులసి బిల్వగంధతులసి యనియు విశ్వగంధ తులసి యనియు విశ్వతులసి యనియు వ్యవహరింప బడుచున్నవి. ఇందలి గంధతులసియే రుద్రజట (డ) యని యాంధ్రమున బిలువబడుచున్నది. హ్రస్వముగా నుండువానిలో మరువకము అనునది ప్రధానమైనది. ఇది శ్వేతకృష్ణ భేదముచే రెండువిధములుగా నుండును. ఇదియే పూలయంగళ్లలో మరువమను పేరుతో దొరకునట్టి గంధద్రవ్యము. అరణ్యతులసి వర్వరికను నామముతో నిఘంటు కారులచే వ్యవహరింప బడినది. ఇది దీర్ఘహ్రస్వ భేదముచే రెండువిధములుగా నుండును. అందలి హ్రస్వవర్వరి కృష్ణ - శ్వేతభేదముచే తిరిగి రెండు విధములుగా నుండును. ఈ యారణ్యతులసియే భూతులసి లేక భూతతులసియని వ్యవ

హరింప బడుచున్నది. ఇట్లు తులసియందనేక భేదములు గానుపించు చున్నవి. కాని మనకు ఇందలి కృష్ణశ్వేత తులసులును, రుద్రజడయు మరువమును, భూతులసియు విశేషముగా లంభించును. వీనిలో కృష్ణతులసియు, శ్వేతతులసియు ప్రతి గ్రామమందలి విష్ణు శివాలయములలో వరుసగా దైవపూజకై ఉద్యాన వనములందు పెంచబడు చున్నవి. మరియు ప్రతి గృహస్థుని యింటి యందును ఇవి పెంచబడుచున్నవి. ఇటుల వీనిని పెంచుటలో రెండు ఉద్దేశ్యములు ముఖ్యముగా గానవగును. అందుతులసి పవిత్రమైనట్టి వస్తువు. ఇందుచే నిది ప్రతినిత్యము పూజింపబడు చుండును. ఇట్లు పూజించి దీని దళమును శిరమున ధరించునట్టివారు గూడ మనః కాయకర్మల బవిత్రు లగుదురని భారతీయుల నమ్మిక.

ఇట్లు పవిత్రులైనవారికి కామితార్థములు సులభముగా చేకూరును. పూర్వము సత్యభామా రుక్మిణీ ప్రియుడగు శ్రీకృష్ణమూర్తి భామాలోలుడై రుక్మిణిని ఉపేక్షించినప్పుడు రుక్మిణీదేవి ప్రతి నిత్యమును నిర్మలమైన భక్తితో తులసిని పూజించుచు తద్వారా తన పతి కత్యంత ప్రేమాస్పదురాలాయెను. ఈ మొదలగు కారణములను బట్టి భారతీయులలో నిప్పటికిని కొన్ని కుటుంబములందలి స్త్రీలు ఈ తులసిని పూజింపకుండ అన్నమును భుజింపరు. ఇందుచే నీ వృక్షములు ప్రతి యింటియందు గృహదేవతలవలె అలంకరించి యుండును. ఇంతియే గాకుండ నీ వృక్షములు విషహరములును క్రిమిహరములు నగుటచే సర్పాది విషజంతువులు ఇండ్లలోకి రాకుండుటకై యింటిముందటి వాకిళ్ళలోను, ఆరామములం దచ్చటచ్చటను నాటి పెంచబడుచుండును. ఒకవేళ విషజంతు దష్టమైనను తులసియాకు పసరు పిండి యట్టె దంశములపై రాయుచుందురు. ఇందువల్ల విషబాధ గూడ శమించుటయును గలదు. ఇవియే గాకుండ నీ తులసిజాతు లన్నియు విషహరములుగానే వర్ణింప బడినవి. మరియు ముదిరిన తులసి వృక్షముల కాండములను, వేళ్ళను అనువుగా గోసి పూసలువలె జేసి వీనిని మాలలుగా గ్రుచ్చి మెడలో ధరించుదురు. ఇటుల ధరించుటయందు గూడ పైని వివరించినట్టి రెండు ఉద్దేశ్యములు గలవని గ్రహింపనగును. ఇంతియే గాకుండ తులసి కఫహర మగుటచే చిన్నపిల్లలకు కలుగు కాస శ్వాసాది వ్యాధులలో వీని పత్రముల రసమును తేనెతో గలిపి నాకించుటయు, ఏరండతైలమున గలిపి పట్టుటయు మొదలగు గృహచికిత్సా సాంప్రదాయములు ప్రతి గ్రామములోను అనుసరింప బడుచున్నవి.

ఇది వైద్యమునందు విశేషముగా క్రిమిహరమనియు, ప్రాణశోధనమనియు వర్ణింపబడుటచే సుశ్రుతాదులు తమ క్రిమిఘ్నాయుక్తమై దుష్టమైనట్టి వ్రణములకు జేసెడి చికిత్సలలో నత్యాదరముతో దీనిని గ్రహించి యుండిరి. విశ్వతులసి లేక రుద్రజట యనునదియు మరువ మనునదియు పృథగ్జాతములుగా గ్రహింపబడలేదు. ఇవి మిక్కిలి సువాసన గలిగి యుండును. ఇవి గూడ ప్రతి గృహమునందును బెంచబడు చుండును. అయితే ఇవి భూభేదము ననుసరించి కొన్ని కొన్ని ప్రదేశములలో వృద్ధిబొందును. కొన్ని కొన్ని ప్రదేశములలో పెచ్చరిల్లనేరవు. వీనిలో రుద్రజట తీక్ష్ణమైన గంధము (ఘాటు) గలదిగా నుండును. దీని రసము తేలు, జెర్రి మొదలగువాని విషముల కుపయోగింప బడుచుండును. దీని గింజలే సబ్జా విత్తులని వ్యవహరింప బడుచున్నవి. ఇవి మిక్కిలి శీతవీర్యములు గలవగుటచే ఉష్ణకాలమందలి పానీయములలో వీనిని జేర్చుచుందురు. మరువము క్షుద్రక్షుపము. ఇది సౌమ్యమైన గంధము గలిగి యుండును. దీని రెమ్మలను పరిమళార్థమై స్త్రీలు తమ శిరస్సులం దలంకరించుకొను చుందురు. అరణ్యతులసి లేక భూతులసి యనునది ఎత్తుగా బెరుగు క్షుపము. ఇది రుద్రజటను బోలియే యుండును. కాని పరిమళము మాత్ర ముండదు. ఇది విశేషముగా రాక్షసాది గ్రహదోషహరమని వర్ణింపబడినది. ఇందుకు తగినట్లుగానే గ్రామస్థులు తమ యిండ్లలో చిన్నపిల్లలు బుట్టినప్పుడు మొదటి పదిరోజుల వరకును ప్రతియింటి ద్వారబంధములకు ఈ భూతులసి రెమ్మలను కట్టుచుందురు. ఇందువల్ల చంటిబిడ్డలకు గ్రహబాధలు కలుగవని వారి నమ్మకము. ఇట్లు తులసి యనేక ప్రయోజనములు గలిగి సర్వసామాన్యమైన వస్తువుగా విలసిల్లు చున్నది. ఇందలి మిగిలిన జాతులను గురించిన విషయములంతగా దెలియరాకున్నవి.

(4) విశేషగుణములు:—

(క) కృష్ణతులసి - వాతమును శమింపజేయును. కాసము, కృములను, వాంతిని, భూతవికారములను బోగొట్టును. (రా. ని.)

(ఖ) శ్వేతతులసి-కటురసమును, తిక్తానురసమును ఉష్ణవీర్యమును గలిగి యుండును. రుచిని బుట్టించును. వాతశ్లేష్మములను శమింపజేయును. క్రిములను భూతవికారములను బోగొట్టును. (రా.-ని.)

(గ) విశ్వతులసిబీజ (రుద్రజడగింజలు) :- శీతవీర్యమును గలిగియుండును. ప్రమేహమును, దాహమును, రక్తాతిసారమును బోగొట్టును. (వై-శ-సిం.)

(ఘ) శ్వేతతులసీ పత్రి - క్రిములను, సర్పవిషమును బోగొట్టును. (వై-శ-సిం.)

(చ) మరువక (ద్వివిధ) - కటురసమును, తిక్తాను రసమును, తీక్ష్ణ లఘురూక్షగుణములను, ఉష్ణవీర్యమును, కటువిపాకమును గలిగియుండును. పరిమళము గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. హృదయమునకు హితమైనది. రుచిని బుట్టించును. పిత్తమును వృద్ధి బొందించును. కఫవాతములను శమింపజేయును. వృశ్చికాది విషమును, కుష్ఠమును, కృమిని బోగొట్టును. భా-ప్ర., మలబంధమును, ఆధ్మానమును, శూలను బోగొట్టును. (రా-ని.)

(ఛ) ఆరణ్యతులసీ (వర్వరీ) సామాన్య - కటురసమును, రూక్ష తీక్ష్ణ లఘుగుణములను, శీతవీర్యమును గలిగియుండును. విదాహి. రుచిని బుట్టించును. హృదయమునకు హితమైనది. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. పిత్తమును వృద్ధి బొందించును. కఫవాతములను శమింపజేయును. రక్తదోషమును, కండువును, క్రిములను, విషమును బోగొట్టును. (భా-ప్ర-ప్రథమఖం.) సుఖప్రసవమును గలిగించును. నేత్రవ్యాధులను బోగొట్టును. (రా-ని.)

(జ) ఆరణ్యతులసీ (దీర్ఘా) - కటురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. వాతమును శమింపజేయును. త్వగ్దోషమును, విస్ఫోటమును, విషమును బోగొట్టును. (వై-ని.)

(ఝ) హ్రస్వారణ్య తులసీ (శ్వేత-కృష్ణ) సామాన్య - కటురసమును, తిక్తాను రసమును, రూక్ష లఘుగుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. విదాహి. హృదయమునకు హితమైనది. పిత్తమును వృద్ధి బొందించును. కఫవాతములను శమింపజేయును. కండువును, విషమును, వాంతిని, కుష్ఠమును, జ్వరమును, క్రిమిని, దద్రువును, రక్తదోషమును బోగొట్టును. (వై-ని.)

(ట) హ్రస్వారణ్య తులసీబీజ - దాహమును, శోషను బోగొట్టును. (వై-ని.)

**(5) ప్రయోగములు:—**

1. కఫజ కాసయందు తులసీప్రయోగము.

"సక్షౌద్రాః కఫకాసఘ్నాః సురసస్యాసితస్య చ॥"

శుక్లతులసీ పత్ర స్వరసమునందు తేనెగలిపి సేవించిన కఫజకాస శమించును. (చ-చి-అ 22.)

2. నవ నేత్ర కోపమునందు తులసీప్రయోగము.

"తాంబూలశిగ్రుకరవీరశిరీషకస్తి శ్యామాదధిత్థసుమనానుర
సార్జకానాం। ప్రత్యేకశో మధుయుతః స్వరసోఽంజనేన
కోపం నవం నయనయోః సహసైవ హంతి॥"

తులసీపత్ర స్వరసమునందు తేనెగలిపి నేత్రముల కంజనము వేసిన నూతనముగా గలిగిన నేత్రప్రకోపము వెంటనే శమించును. (గ-ని.)

3 పూతికర్ణమునందు తులసీప్రయోగము.

"పూర్ణో కర్ణో రసోనసురభిసలిలేన వాపి। పూత్యామయం త్యజతి
తక్షణసంప్రణష్టతీవ్రవ్యథా పరిచయప్రతిపన్న సౌఖ్యః॥"

వెల్లుల్లి, తులసి వీనిరసమును కర్ణపూరణము చేసిన పూతిప్రాయముచే గలిగిన కర్ణరోగము శమించును. (గ-ని.)

4. కుష్ఠమునందు తులసీప్రయోగము.

"ప్రాతః పిబేద్వా సురసస్య మూలం సనాగరం కోష్ణజలేన వాపి॥"

తులసివేరును, శుంఠి మెత్తగా కల్కముసూరి ప్రతిరోజున ఉదయమునందు గోరువెచ్చనినీళ్లతో సేవించిన కుష్ఠము శమించును. (గ-ని.)

(6) యోగములు:—

1. సురసాదితైలము - భైషజ్య - శ్లీపద.

ఉపయోగములు:—పానాభ్యంగములకై ఉపయోగించిన శ్లీపదము. అపచి, గండమాల, అంత్రవృద్ధి, అర్బుదము, గ్రహణి, క్షయము, అర్శస్సు, కోష్ఠజక్రిమి ఇవి శమించును. జాఠరాగ్ని వృద్ధి బొందును.

2. అర్జకాదివటి - భైషజ్య - వీర్యస్తంభ.

మాత్ర:—6 యవలు.

ఉపయోగములు:—వీర్యస్తంభమును, సద్యశ్శుక్రమును జేయును.

3. అరణ్యతులస్యాదిక్వాథము - వై - చిం. జ్వర.

మాత్ర:—1 పలము.

ఉపయోగములు:—త్ర్యాహికజ్వరము శమించును.

4. సురసాది క్వాథము - వా-సూ-అ 15.

మాత్ర:—1 పలము,

ఉపయోగములు:—కఫము, మేదస్సు, క్రిమి, ప్రతిశ్యాయము, అరుచి, శ్వాస, కాస ఇవి శమించును క్షాళనము జేసిన వ్రణశోధన మగును.

(7) Actions and uses:—Demulcent, expectorant and anti periodic; with Kaajaamari it is given in catarrhal affections of the lungs and cough. The powder of dry leaves is used by the natives as snuff in ozoena and for destroying maggots. The paste of the leaves with suntha and Safedmari is given in intermittent and remittent fevers. The medicated oil is used as drops into the ears in earache and purulent discharges and into the nose in ozoena. With lime juice the leaves are rubbed over ringworm. The seeds are mucilaginous and used as a diuretic in scanty urine and cough.

## స్వానుభవము

[ తులసి జీర్ణశక్తి వృద్ధిజేయుటయందును, క్రిములను హరించుటయందును ప్రసిద్ధమైనది. సురసాదిగణము వ్రణ ప్రక్షాళనకషాయములను తయారు చేయుటకు మిక్కిలి యోగ్యమైనది. సురసయున్నచోట దోమలుండవనియు చలిజ్వరమునకు తులసి యొక మహౌషధమనియు లోకప్రసిద్ధి. ఆధ్యాత్మిక దృష్టిగలవారికి తులసిమొక్క గృహములందు సృష్టిమాత యొక్క అవతారము. ఆ. ల. ]

# 103

# తువరకః - నీరుడుచెట్టు

---

## భాషాంతర నామములు

హిందీ - చేలమోగరే. మరాఠీ - చేలమోగరే. గుజరాతీ - చేలమోగరే. మలయాళం - ఓట్టుకరు. కర్ణాటకం - తువరక. ద్రావిడం - నీరుడిముత్తు.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Bixineae

### నీరుడు కుటుంబము

### నీరుడుచెట్టు - Gynocardia odorata

ఇదియొక చిన్నకుటుంబము. దీనిలో పెద్దచెట్లు గుబురు మొక్కలును గలవు. ఆకులు లఘుపత్రములు, ఒంటరి చేరిక, కొన్నిటిపువ్వులు మిధున పుష్పములు. కొన్నిటిలో నేకలింగ పుష్పములును గలవు. తరుచు నీపువ్వులకు ఆకర్షణ పత్రములుండవు. కింజల్కములు చాలగలవు. విత్తనములలో అంకురచ్ఛదనము గలదు.

నీరుడుచెట్లు:—దక్షిణ హిందూదేశము నందును మలబారు నందును విరివిగానున్నవి. దీని గింజలు ముప్పాతిక అంగుళము పొడుగు, అరంగుళము వెడల్పు ఉండును. ఈగింజలనుండి తీసిన చమురును చర్మవ్యాధులను బోగొట్టుటకును ఇతర జబ్బులకును వాడుదురు.

## పర్యాయ పదములు

శ్లో॥ తువరః సాగరోద్భూతః కుష్ఠహా అలసకాపహః ॥

తువరకము, సాగరోద్భూతము, కుష్ఠహ, అలసకాపహ యనునవి తువరక నామములు.

## తువరక గుణములు

శ్లో॥ తువరీ గ్రాహిణీ ప్రోక్తా లఘ్వీ కఫవిషాస్రజిత్ ।
తీక్ష్ణోష్ణా వహ్నిదా కండూకుష్ఠకోష్ఠక్రిమిప్రణుత్ ॥

నీరుడుగింజలు లఘుతీక్ష్ణగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. జఠరాగ్నిని వృద్ధిబొందించును. కఫమును శమింపచేయును. విషము, రక్తదోషము, కండూ, కుష్ఠము, కోష్ఠక్రిమి అను నీ వ్యాధులను బోగొట్టును.

# విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) గుణబోధకములు:—కుష్ఠహా, అలసకాపహా.

(ఖ) ఉత్పత్తిబోధకములు:—సాగరోద్భూతము.

2) శబ్దార్థములు:—

కుష్ఠహా - కుష్ఠరోగమును పోగొట్టునది. అలసకాపహా - అలసకమును పోగొట్టునది. సాగరోద్భూతము - సముద్రప్రాంతములం దుత్పన్నమగునది.

(3) పరిచయబోధకలక్షణము:—

"పత్త్రైస్తు కేసరాకారైః కలాయసదృశైః ఫలైః
వృక్ష స్తువరకో నామ పశ్చిమార్ణవతీరజః" ||

తువరకవృక్షము కేసరములవంటి పత్త్రములను, వేరుసెనగకాయలవంటి కాయలను గలిగి పశ్చిమ సముద్రతీరమునం దుత్పత్తియగును. (సు-సూ-అ-45.)

N. B:—ఇది యెత్తుగా పెరుగు వృక్షజాతులలో నుత్పత్తి గలిగి కుష్ఠహర-రసాయనద్రవ్యములందు శ్రేష్ఠమైనదిగా గణింపబడు చున్నది. పైవర్ణనమును బట్టి దీని యాకులు కేసరములతో సమానముగా అనగా సన్నముగను, పొడవుగను నుండునని తెలియగలదు. అయితే "పశ్చిమసముద్రభూమిషు పలాశానుకారీ వృక్షః" || (సు-చి-అ-31--డల్హణ.) పశ్చిమసముద్ర భూములందు మోదుగుచెట్టుతో సమమగు ఆకృతి గలిగి వృద్ధి బొందుచుండునను డల్హణాచార్య నిరూపణమును బట్టి దీని యాకు లోకవేళ పలాశ పత్త్రములవలె (గుండ్రముగను కొంచెము విశాలముగను) నుండునేమోయని గూడ దెలియు చున్నది మరియు నిది పశ్చిమసముద్ర ప్రాంతములం దుత్పన్నమగునని పై వర్ణనమును బట్టి తెలియుచున్నది. కాని "కుష్ఠహా శైలరోహీ చ మహాగద మహీరుహః" || (అత్రి) అను నాత్రేయ సంహితయందలి శైలరోహీ యను పదమును బట్టి యిది పర్వతములందు గూడ నుత్పత్తి యగునని తెలియగలదు. దీని కాయలు కలాయ సదృశములని వర్ణింపబడినవి. అయితే బజారులందు ఇవి వేరుసెనగకాయలను బోలి విక్రయింప బడుచున్నవి. ఇవియే సర్వసాధారణముగా నుపయోగింప బడుచున్నవి. దీనిని బట్టి పై వర్ణనము నందలి కలాయశబ్దమునకు తద్దేశము వేరుసెనగయని యర్థమును గ్రహించుట యుక్తముగా నుండును. ఈ వృక్షములనుండి బీజములే గ్రహింపబడి వైద్యము

నందు రసాయనమునకు, కుష్ఠరోగమునకును విశేషముగా వాడబడుచున్నవి. ఈ బీజములనుండి తైలమును గ్రహించుదురు. ఇది గూడ పై విధముగనే వాడబడుచున్నది. ఈ వృక్షమునకు వ్యవహారమునం దెట్టి ప్రయోగ మున్న దియు గానరాదు.

(4) విశేషగుణములు:—

(క) కషాయరసమును, తిక్తానురసమును గలిగి యుండును. వ్రణమును, ప్రమేహమును, జ్వరమును, ఆనాహమును, అర్శస్సును, శోఫను బోగొట్టును. (ని-ర) బలమును గలిగించును. రసాయనము, పామ, విచర్చిక, సిధ్మము, దద్రువు, విపాదిక, ఆమవాతము, ఆమమును వీనిని బోగొట్టును. (అత్రి.)

(ఖ) తువరక తైల - తీక్ష్ణలఘుగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును: కఫమును శమింపజేయును. రక్తదోషమును, విషమును, కండూవును, కుష్ఠమును, కోష్ఠకృములను, మేదోవృద్ధిని, వ్రణమును, శోఫను, బోగొట్టును. (భా-ప్ర.) మధురరసమును, కషాయతిక్తానురసములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. దోషములను ఊర్ధ్వాధోముఖములుగ వెడలించును. వాతకఫములను శమింప జేయును.

(సు సూ-అ-45.)

(గ) తువరకకల్పము—

"వృక్షా స్తువరకా యేస్యుః పశ్చిమార్ణవతీరజాః । వీచీతరంగవిక్షేప మారుతోద్ధూతపల్లవాః ॥ తేషాం ఫలాని గృహ్ణీయాత్ సుపక్వా న్యంబు దాగమే మజ్జాం తేభ్యోఽపి సంహృత్య శోషయిత్వా విచూర్ణ్యచ॥ తిలవ త్పీడయే ద్ద్రోణ్యాం స్రావయేద్వా కుసుంభవత్ తత్తైలం సంహృతం భూయః పచేదాతోయసంక్షయాత్ ॥ అవతార్య కరీషేచ పక్షమాత్రం నిధాపయేత్, స్నిగ్ధః స్విన్నో హృతమలః పక్షాదూర్ధ్వం ప్రయత్నవాన్॥ చతురర్భక్తాం తరితః శుక్లాదౌ దివసే శుభే, మంత్రపూతస్య తైలస్య పిబేన్మాత్రాం యథాబలం॥...తేనాస్యోర్ధ్వ మధశ్చాపి దోషాయాన్త్యసకృ త్తతః, అస్య హాలవణాం సాయం యవాగూం శీతలాం పిబేత్॥ పంచాహం ప్రపిబేత్తైల మనేనవిధినా నరః॥ పక్షం పరిహరేచ్చాపి ముద్గయూషౌదనాశనః। పంచభిర్దివసై రేవం సర్వకుష్ఠై ర్విముచ్యతే॥"

పశ్చిమ సముద్రతీరములందు సముద్ర తరంగములనుండి వచ్చువాయువుయొక్క ప్రచారముచే నల్లలాడు పల్లవములతో గూడిన తువరక వృక్షములపండి బాగుగాపండినట్టి పండ్లను వర్షాకాలమున గ్రహించి యందుండి మజ్జను దీసి యెండబెట్టి చూర్ణించవలెను. పిమ్మట నువ్వుల నుండివలెగాని కుసుంభ బీజములనుండి వలెగాని వైవిధముగ చూర్ణించినట్టి తువరక మజ్జనుండి తైలమును గ్రహించి యందు జలాంశము బోవుపరకు బాగు నిప్పులపైనుంచి మెల్లగ పాకము జేసి యొకపక్షముదినములు జాగ్రత్తగ నొకచో మూసియుంచవలెను స్నేహస్వేదనముల విరేచన కర్మలను చేసినట్టి కుష్ఠరోగికి యథాబలముగ మాత్రను గల్పించి వైవిధముగ సిద్ధముజేయబడినట్టి తువరక తైలమును ఆహారమునందలి నాల్గవ కబళమునందు గలిపి శుభదినమున నివ్వవలెను. దీనివలన దోషములు ఊర్ధ్వాధో ముఖములుగ పలుమార్లు బయటకు వెడలును. సాయంకాలమున స్నేహరహితమగు యవాగువు చల్లార్చి యాహారముగా నొసంగవలెను. ఈ విధముగా నైదుదినములు వరుసగానిచ్చి పక్షము దినములు పరిహారము ననుసరింప జేయవలెను. ఈదినములందు కేవలము ముద్గయూషము తోగూడిన యన్నమును మాత్రమాహారముగ నివ్వుచుండవలెను. ఇటుల యథావతుగ నైదుదినములు తువరక తైలమును సేవించినట్టివానికి సర్వకుష్ఠములు నశించును.

(సు-చి-అ 13.)

(స) తువరకఖదిరకల్పము:—

“తదేవ ఖదిరక్వాథే త్రిగుణే సాధుసాధితం। నిహితం పూర్వవత్పక్షం పిబేన్మాస మతంద్రితః॥ తేనాభ్యక్తశరీరశ్చ కుర్వీతాహారమీరితం। భిన్నస్వరం రక్తనేత్రం విశీర్ణం కృమిభక్షితం॥ అనేనాశు ప్రయోగేణ సాధయేత్ కుష్ఠినం నరం। సర్పిర్మధుయుతం పీతం తదేవ ఖదిరాంబునా॥ పక్షిమాంసరసాహారం కరోతి ద్విశతాయుషం॥”

వైవిధముగ గ్రహించినట్టి తువరక తైలము ఒకభాగము, చండ్రసార కషాయము మూడుభాగములును గలిపి తైలపాకముజేసి వైవిధముగ పక్షము దినములు ఒకచో మూసియుంచి యథాబలముగ నందుండి మాత్రను గ్రహించి సేవించుచు దీనితో శరీరమున కభ్యంగము జేసుకొనుచు నొకమాసము వరుసగా హితాహారము ననుసరించుచు నుండినయెడల భిన్నస్వరము, రక్తనేత్రము, విశీర్ణాంగము; కృమిభక్షితాంగమునగు కుష్ఠరోగి శీఘ్రముగ నట్టిరోగము నుండి విముక్తుడై సుఖవంతుడగును.

రక్తశోధకము, కుష్ఠహరము, రసాయనము.

ఇది కుష్ఠరోగమునకు పరమౌషధమని పేరుగాంచినది. కొన్ని కుష్ఠములలో ఇది చాల ఆశ్చర్యకరమగు గుణములను కలిగించినదను మాట నిస్సందేహము. కాని మిక్కిలి ముదిరిన కుష్ఠములలో దీని గుణములు స్పష్టముగా గానరాలేదు. దీని నుపయోగించునపుడు ఆహారము మిక్కిలి పథ్యముగా నుండవలయును.

చికిత్సలో దీనిని నూరి పైన బాగుగా పూయవలెను. దీనిని కుష్ఠరోగము, క్షయ, చర్మవ్యాధులు మొదలగు వానిలో రక్తముయొక్క స్థితిని మార్పుజేయుటకై ఉపయోగించుచున్నారు. మరియు రక్తము చెడియుండుట, చిరకాల గతమైన సవాయిరోగము, క్షయ, ఆమవాతము, కీళ్ళనొప్పులు వీనిలో లోపలికిని పైకిని గూడ ఉపయోగించుచున్నారు. దీనితో సమాన గుణములు గలిగిన వేపనూనెతో దీని తైలమును కలిపి ఉపయోగింపవచ్చును.

కుష్ఠరోగమువలన బాధపడువాడు పంచకర్మలచే తన శరీరమును శుద్ధిజేసికొని పథ్యాహారమును తప్పక భుజించుచు మొదటి ఐదురోజులవరకు ఉప్పును నూనెను విడిచి పెట్టి తరువాత పదునైదు రోజులవరకు పెసరకట్టుతో వరియన్నమును మాత్రము తినుచు నుండవలయునని చెప్పబడియున్నది. ఆ. ల. ]

# 104

# దాడిమః - దానిమ్మచెట్టు

---

## భాషాంతర నామములు

హిందీ - అనార, దాడమ. మరాఠీ - డాళింబ. గుజరాతీ - దాడమ. మలయాళం - మాతళం. కర్ణాటకం - దాళింబ. ద్రావిడం - మాదళై.

## Natural Order—Lythraceae

గోరింటకుటుంబము.

దానిమ్మచెట్టు - Punica granatum. Eng. Pomegranate

## నైసర్గిక స్వరూప వర్ణనము

గోరింటచెట్లు చాలచోట్ల పెరుగుచున్నవి. వానికి ముండ్లున్నవి.

ఆకులు:—అభిముఖచేరిక. లఘుపత్రములు. దళసారము సమాంచలము. కొనసన్నము.

పుష్పమంజరి:—కొమ్మలచివరలనుండి మధ్యారంభ మంజరులగు రెమ్మలు గెలలు పువ్వులు చిన్నవి. సువాసనగలదు.

పుష్పకోశము:—సంయుక్తము. 4 తమ్మెలున్నవి. నీచము.

దళవలయము:—అసంయుక్తము 4 ఆకర్షణపత్రములు. ఇవి ముడుతలు ముడుతలుగా నుండును. పుష్పకోశముయొక్క గొట్టముచివర నంటియుండును. వీనికి సువాసనగలదు.

కింజల్కములు:—ఎనిమిది. రెండు రెండు దగ్గరగానున్నవి. ఈ రెండును రెండు ఆకర్షణపత్రములకు మధ్యగానుండును. పుప్పొడితిత్తులు రెండుగదులు.

అండకోశము:—అండాశయముచ్చము. 4 గదులు స్తంభసంయోగము. కీలము ఒకటి. కాయ ఎండిపగులును.

ఈ కుటుంబములో చెట్లు గుబురుమొక్కలు, చిన్నమొక్కలుగూడ కలవు. ఆకులు అభిముఖచేరిక. చిన్నచిన్న పుచ్ఛములుండును పుష్పమంజరులు మధ్యారంభ మంజరులు. ఆకర్షణ పత్రములు నాలుగైన, ఆరైన నుండును. వానికి పాదము గలదు కింజల్కములు ఆకర్షణ పత్రములన్నియైన, వానికి రెట్టింపైన, మిక్కిలి యెక్కువగానైన నుండును. కాయలు పొడుగుగానే యుండును. అండాశయ ముచ్చము. గింజలు చాలగలవు.

## పర్యాయ పదములు

శ్లో॥ దాడిమః కరకో దన్తబీజో, లోహితపుష్పకః॥

దాడిమము, కరకము, దన్తబీజము, లోహిత పుష్పకము అనునవి దాడిమనామములు.

10 స్తనవృద్ధికి దాడిమప్రయోగము.

"విపాచితం దాడిమకల్కయుక్తం తైలంభవేత్ సర్షపసంభవంయత్। అభ్యంజనాత్తత్ కురుతేనితాంతం ఉచ్చైస్తనావృద్ధియుతౌచకర్ణౌ॥"

దానిమ్మ త్వక్కల్కముతో నావనూనెను పాకముజేసి యభ్యంజనము జేసిన స్తనములును, కర్ణములును వృద్ధిబొందును. (రా-మా.)

(6) యోగములు:—

1. దాడిమాష్టకచూర్ణము - వా - అతిసార.

మాత్ర:— $\frac{1}{4}$ తులం.

ఉపయోగములు:—అతీసారము, గ్రహణి, క్షయము, గుల్మము, ఉదరము, కాస, శ్వాస, అగ్నిమాంద్యము, అర్శస్సు, పీనసము, అరోచకము ఇవి శమించును.

2. దాడిమాది ఘృతము - వా - పాండు.

మాత్ర:—1 తులము.

ఉపయోగములు:—పాండు, గుల్మము, అర్శస్సు, ప్లీహము, శ్వాస, కాస ఇవి శమించును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. మూఢవాతమున కనులోమనము గలుగును. సుఖప్రసవమగును. వంధ్యాత్వము బోవును.

3. దాడిమాదితైలము - భైషజ్య - గ్రహణి.

మాత్ర:— $\frac{1}{4}$ తులము.

ఉపయోగములు:—గ్రహణి, ప్రమేహము, అర్శస్సు ఇవిశమించును.

4. దాడిమాది ఘృతము - బృహద్దాడిమాది ఘృతము - మహాదాడిమాదిఘృతము - భైషజ్య - ప్రమేహ.

మాత్ర:—1 తులము.

ఉపయోగములు:—ప్రమేహము, మూత్రాఘాతము, అశ్మరి, మూత్రకృచ్ఛ్రము, విబంధము, ఆనాహము, శూల, కామిల, జ్వరము, హృచ్ఛూల, వస్తిశూల, హిక్క, శ్వాస, కాస, యక్ష్మ, స్వరక్షయము, ఉరోరోగము, రక్తపిత్తము, అరుచి ఇవి శమించును. బృంహణము.

5. దాడిమాదివటిక - వై - చిం - అతీసార.

మాత్ర:—5 యవలు.

ఉపయోగములు:— పక్వాతీసారము శమించును.

6. వృద్ధదాడిమాది చూర్ణము - శార్ఙ - మ - అ 6.

మాత్ర:— $\frac{1}{4}$ తులము.

ఉపయోగములు:—అతిసారము, క్షయ, గుల్మము. గ్రహణి, పీనసము, గలగ్రహము, మందాగ్ని, కాస ఇవి శమించును.

దాడిమముగల కొన్ని యోగములు:—

కపిత్థాష్టకచూర్ణము, భాస్కరలవణము, దాడిమాదిపానకము.

(7) Actions and uses:—"Besides using the flowers and rind in variety of ways on account of their astringency, they recommend the rootbark as being the most astringent part of the plant, and a perfect specific in cases of tape-worms; it is given in decoction, prepared with two oumces of freshbark, boiled in a pint and a half of water, till three quarters of a pint remain; of this when cold a wine glass-ful may be drunk every half hour till the whole is taken. This doze sometimes sickens the stomach a little, but seldom fails to destroy the worm, which is soon after passed.

Dymock Part II. P 45.

## స్వానుభవము

[ దానిమ్మపండు, ఉసిరికపండు, ఈ రెండును పుల్లగా నున్నప్పటికి కూడ పిత్తమును ప్రకోపింపచేయక పులుపు నిషిద్ధమైన వ్యాధులలో కూడ నీయవచ్చునని యాయుర్వేద మతము. రోగులు కూడ దానిమ్మపండును తినవలెనని కోరుదురు. రుచిని బుట్టించుటయందు శ్రేష్ఠమైనదని ప్రఖ్యాతి. యేదో అప్పుడపుడు నాలుగు గింజలు తిందురుగాని పండంత నొకేసారి తినరు. మార్గమున నడచునపుడు కలిగెడు దప్పికి చాలా హితకరము. తియ్యదానిమ్మరసముకాని, పుల్లదానిమ్మ రసముకాని తగుమాత్రము చక్కెరతో చేర్చి తయారుచేసిన పానకము అతిసారము, గ్రహణి మొదలగు అంత్రప్రకోప

సంబంధమైన రోగములలో చాల హితకరము. నేను స్వాను భవముగా దీనిని పరీక్షించియున్నాను. దానిమ్మకాయతోలు (ముఖ్యముగా లేతది) సంగ్రాహిగా లోకమునం దుపయోగించుట కలదు. నిరపాయమైనది. కొందరు దీనిని పుటము బెట్టి నల్లమందుతో చేర్చి మాత్రిలు చేయుదురు ఈ మాత్రలను జాగ్రత్తగా నుపయోగింపవలెను నిరామావస్థలో తగు మోతాదుల నుపయోగించిన మిక్కిలి లాభకరము. కాని ఆమావస్థలో నల్లమందు చేర్చినయెడల నొకానొకప్పుడు అపాయహేతువగును. ఈ సంగ్రాహి గుణమును ప్రధానముగా జేసుకొని దానిమ్మకాయతోలును కపిత్థాష్టకచూర్ణము, భాస్కరలవణచూర్ణము మొదలగు చూర్ణములలో చేర్చుచున్నారు. దానిమ్మవేరుపట్ట ఒకటి రెండు తులాలు నాలుగు రెట్లు నీళ్ళలో చేర్చి నూరి కొద్దిగా చక్కెరచేర్చి తగు మోతాదులలో కడుపులో ఉండే బద్దె పురుగు (Tapeworm) తలతో గూడ ఊడిపడువరకు నియ్యవలెను.

ఇది మంచియోగము. నిరపాయమైనది మొత్తము మీద తియ్యదానిమ్మపండుగాని, పుల్లదానిమ్మపండుగాని ప్రజలచే నెక్కువగా గౌరవింపబడుచున్నవి. ప్రత్యేకమైన రుచిగలవి. అరుచిని పోగొట్టును.

దానిమ్మపండుయొక్క ఎండినబెరడు చూర్ణముగాని, ఎండబెట్టబడిన లేతకాయయొక్క చూర్ణముగాని 10 మొదలు 30 గ్రైనులవరకు తీసికొనునది.

పండ్లలోని రసము (పులుపు, తీపు రెండును) నకు సమ భాగము నీటిని కలిపి 8 ఔన్సులుగాని 10 ఔన్సులుగాని ఒక మోతాదుగా నుపయోగించునది.

పువ్వులను దాల్చినపట్టమున్నగు సుగంధద్రవ్యముల తోను, స్తంభనద్రవ్యములతోను కలిపి 10 గ్రైనుల మోతాదు నిచ్చునది.

పువ్వులలోని రసమును నస్యముగా నుపయోగించునది.

వ్రఘ్న క్రిములకు (Tape worms) దానిమ్మవేరు యొక్క పట్టను ½ మొదలు 5 తులములవరకు తీసి 4 రెట్లు నీళ్లుపోసి కషాయముగా కాచి వడియగట్టి పంచదార తేనె లేక ఆముదము కలిపి తీసికొనునది.

ఈ కషాయమును రెండేసి ఔన్సుల చొప్పున ప్రతి అరగంటకును ఇచ్చి అవసరమైనచో ఆముదమును ఈయవల యును. వ్రఘ్నక్రిమియొక్క తలయూడి వచ్చువరకు ఈ మం దును ప్రతి దినమును సేవింపవలయును.

స్తంభనీయము, వ్రిఘ్న కృమిహారము, కృమిహారము, బల్యము, శీతలము.

———

# 105

# ద్రాక్షా - ద్రాక్ష పండు

---

## భాషాంతర నామములు

హింది - అంగూర్, దాఖ. మరాఠి - ద్రాక్ష, కిస్ మిస్. గుజరాతి - ద్రాఖ్. మలయాళం - ముందిరిజ. కర్ణాటకం - ద్రాక్షే. ద్రావిడ - ద్రాక్ష.

## Natural—Ampelideae

ద్రాక్ష కుటుంబము

ద్రాక్షపండు - **Vitis Vinefera Eng grape**

## నైసర్గిక స్వరూప వర్ణనము

ఇది యొకచిన్నకుటుంబము. ఇందులోని మొక్కలు చాలాభాగము నులితీగెల మూలమునఁ బ్రాకునవియె. ఈనులితీగె లాకుల కెదురుగనున్నవి. ఇవి ప్రకాండము యొక్క మారురూపములుగాని యాకులయొక్క మారురూపములుగావు. ప్రకాండము పలకలుగా నుండును. ఆకులు ఒంటరిచేరిక. లఘుపత్రములు. వృంతముమీఁదను గొన్నిటిలో నులితీగెలుగలవు. అది పూర్తిగ నట్లు మారుటయుగలదు. పుష్పములు మిథునములేకాని, కొన్నిటిలో మాత్ర మేకలింగ పుష్పములున్నవి. ఆకర్షణపత్రములు నాలుగో, అయిదో యున్నవి. అవి మొగ్గలో నొకదానినొకటి తాకుచుండును. కింజల్కములు ఆకర్షణ పత్రములెన్నిగలవో, అన్నియే యున్నవి. ఇవి వానికెదురుగా నుండును. వీనిమధ్యనొక పళ్ళెరముకూడ గలదు. అండాశయమునందు గదులు అణువులకు గలుగుచుండును. కొన్నిటిలో కీలము పొట్టిగా నున్నది. కొన్నిటిలో నదిలేదు. ఫలము. కండకాయ.

## పర్యాయ పదములు

శ్లో॥ ద్రాక్షా స్వాదుఫలాప్రోక్తా తథామధురసాపిచ।
మృద్వీకాహారహూరాచ గోస్తనీ చాపికీర్తితా॥

ద్రాక్ష, స్వాదుఫల, మధురస, మృద్వీక, హారహూర, గోస్తనియనునవి ద్రాక్షా నామములు

## ఆమద్రాక్షా ఫలగుణములు

శ్లో॥ ఆమాస్వల్పగుణాగుర్వీసైవామ్లా రక్తపిత్తకృత్।

పచ్చిద్రాక్షపండు అమ్లరసమును, గురుగుణమును గలిగియుండును. రక్తమును, పిత్తమును దూషింపజేయును. మఱియు పక్వఫలమునకు జెప్పబడిన గుణములను స్వల్పముగ గలిగియుండును.

## పక్వద్రాక్షాఫల గుణములు

శ్లో॥ ద్రాక్షాపక్వా సరాశీతాచక్షుష్యా బృంహణీగురుః ।
స్వాదుపాక రసాస్వర్యాతువరాసృష్టమూత్రవిట్ ॥
కోష్ఠమారుత హృద్వృష్యాకఫ పుష్టిరుచిప్రదా ।
హంతితృష్ణాజ్వరశ్వాసవాత వాతాస్రకామలాః ॥
కృచ్ఛ్రాస్రపిత్త సమ్మోహదాహ శోషమదాత్యయాన్ ॥ "

బాగుగా పండిన ద్రాక్షఫలము మధురరసమును, కషాయానురసమును, సరగురుగుణములను, శీతవీర్యమును, మధురవిపాకమును గలిగియుండును. నేత్రములకు హితమైనది. బృంహణము, స్వరమును గలిగించును. మలమూత్రములను జారవిడుచును. వెంటనే శుక్రమును గలిగించును. పుష్టిని, రుచిని గలిగించును. కోష్ఠమునందు వికృతమైన వాతమునకు సరియగు గతిని గలిగించును. కఫమును వృద్ధిబొందించును. వాతమును శమింపజేయును. తృష్ణ, జ్వరము, శ్వాస, వాతరక్తము, కామిల, మూత్రకృచ్ఛ్రము, రక్తపిత్తము, మోహము, దాహము, శోష, మదాత్యయము అను నీవ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయ బోధకములు:—గోస్తని, (చారుఫల, గుచ్ఛఫల, తాపసప్రియ.)

(ఖ) గుణబోధకములు:—స్వాదుఫల, మధురస, (యక్ష్మఘ్ని.)

(2) శబ్దార్థములు:—

గోస్తని - ఆవుచనుకట్టువలె నాకృతినిగలది. చారుఫల - అందముగ నుండునట్టి ఫలము. గుచ్ఛఫల - గుత్తులు గుత్తులుగ ఫలించునట్టిది. తాపసప్రియ - మునీశ్వరులకు బ్రియమగునది. స్వాదుఫల - మధురముగ నుండునట్టి ఫలము. మధురస - మధురరసమును గలది. యక్ష్మఘ్ని - వ్యాధులను బోగొట్టునది.

(3) భేదములు:—

ఇది సబీజము, అబీజము అని రెండు విధములు. ఇందు మొదటిది తిరిగి సామాన్యద్రాక్ష, మృద్వీకాద్రాక్ష, గోస్తనీద్రాక్ష, పర్వతజద్రాక్ష యని నాలుగు విధములుగా నుండును. అనగా బీజములతో గూడిన ద్రాక్షజాతు

అలో నొకటి మధురరసమును గలిగి చిన్న పెద్ద భేదముచే నటుల సామాన్య - మృద్వీక - గోస్తనీద్రాక్షలనియు, మరియొకటి యమ్లరసము గలిగి పర్వతములం దుత్పత్తియగుట పర్వతద్రాక్షయనియు వ్యవహరింపబడుచున్నవి. ఇందలి గోస్తనీద్రాక్షయను ద్రాక్షపండు ఆవుచనుకట్టువలె నుండియంత పొడవుగా నుండుటబట్టి యది యట్టి నామముతో వ్యవహరింపబడుచున్నది. మిగిలినవి కొద్దిగ చిన్నవిగా నుండును. అబీజయగు ద్రాక్ష కిస్మిస్ యను నామముతో వ్యవహరింపబడుచు మిగుల చిన్నదిగా నుండును. ఇటుల ద్రాక్షఫలము పైనిజెప్పినట్టి భేదములతో నొప్పియుండి లతాజాతులలో నుత్పత్తి గలిగి మధురరసఫలవర్గమున జేరి యుత్తమ ఫలముగా గణింపబడుచున్నది. ఈ ద్రాక్షలతలు విశేషముగా నుత్తరభారతమున నాటబడి ఫలవంతములుగా జేయబడి యెల్ల భారతవర్షమునందే గాకుండ నితరదేశములందు గూడ నెగుమతి జేయబడి విక్రయింపబడుచుండును. బజారులందు పండి శుష్కించినట్టి ఫలములే విశేషముగా లభించుచుండును. అయితే పచ్చిద్రాక్షకాయలును, పండిన ద్రాక్షపండ్లును పెద్దపెద్ద పట్టణములలో పండ్లదుకాణములయందు విక్రయింపబడుటయును గలదు. ఇవి కొంచెము ఆమ్లరసముతో గూడియుండి తృష్ణను బోగొట్టునవిగ నుండును. వైద్యమునందు ఇట్టి ఫలములుగాక పండి శుష్కించినట్టి ఫలములే గ్రహింపబడుచున్నవి. ఇవి శుష్కించినను ఎల్లప్పుడును తడిగనే యుండును. ఈ ద్రాక్షఫలముల నెల్లవారును మిగుల ప్రీతితో భుజింతురు. మరియు పాయసాన్నము మొదలగు భక్ష్యవిశేషములందు ఈ ఫలములను జేర్చి పాకముజేసి భుజించుటయు గలదు. ఇంతియే గాక మలబద్ధకముగలవారు సామాన్యముగ నీ ఫలములను గొద్దిగా రాత్రిపరుండు నపుడు భక్షించి గోరువెచ్చని నీళ్ళనుగాని, పాలనుగాని త్రాగి పరుందురు. ఇందువలన వీనికి స్రంసనగుణముండుటబట్టి తెల్లవారుసరికి కోలప్రవృత్తి యగును. మరియు నీఫలములనుండి యాసవమును తయారుజేసి పానముజేయుచుందురు. ఈ యాసవము తృష్ణ - శోష - బలక్షయాదులను బోగొట్టునదై యుండును. ఇవి వైద్యమునందు జ్వర - రక్తపిత్తాది వ్యాధులందు విశేషముగా నుపయోగింపబడుచున్నవి. అయితే నిందలి పర్వతద్రాక్షయును, అబీజద్రాక్షయును వైద్యమునందంతగా బ్రయోగమున్నట్లు గానుపించదు.

(4) విశేషగుణములు:—

(క) ఆమఫల - కటురసమును, విశదగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. పిత్తమును, రక్తమును దూషింపజేయును. (రా-ని.)

(ఖ) మధ్యమఫల - అమ్లరసమును గలిగియుండును. రుచిని పుట్టించును. మిగుల జాఠరాగ్నిని వృద్ధిబొందించును. (రా-ని.)

(గ) పక్వఫల - అమ్లమధురరసమును గలిగియుండును. తృష్ణను, రక్తపిత్తమును బోగొట్టును. (రా-ని.)

(ఘ) శుష్కఫల - స్నిగ్ధగుణమును గలిగియుండును. (ధ-ని.,) క్షతక్షయమును, ఉదావర్తమును, స్వరభేదమును, తిక్తాస్యత్వమును, ఆస్యశోషను, కాసను బోగొట్టును. (చ-సూ.) అ 26, తృప్తిని గలిగించును. శ్రమను, ఛర్దిని, శోఫను, ఆధ్మానమును బోగొట్టును. (రా-ని.)

(చ) మృద్వీకాదాడిమ - మధురరసమును, స్నిగ్ధగుణమును, శీతవీర్యమును గలిగియుండును. వెంటనే శుక్రమును గలిగించును. మలవాతముల కనులోమగతిని గలిగించును. వాతమును శమింపజేయును. రక్తదోషమును, శ్వాసను, కాసను, భ్రమను, తృష్ణను, జ్వరమును బోగొట్టును. (ధ-ని.)

(ఛ) గోస్తనీదాడిమ - మధురరసమును, శీతవీర్యమును గలిగియుండును. హృదయమునకు హితమైనది. మదమును, హర్షమును గలిగించును. దాహమును, మూర్ఛను, జ్వరమును, శ్వాసను, తృష్ణను, హృల్లాసమును బోగొట్టును. (రా-ని.,) గురుగుణమును గలిగియుండును. వెంటనే శుక్రమును గలిగించును. కఫపిత్తములను శమింపజేయును. (భా-ప్ర.)

(జ) పర్వతజాదాడిమ - అమ్లరసమును, లఘుగుణమును గలిగియుండును. అమ్లపిత్తమును గలిగించును. శ్లేష్మమును వృద్ధిబొందించును. (భా-ప్ర.)

(ఝ) అబీజాదాడిమ - గురుగుణమును గలిగియుండును. వెంటనే శుక్రమును గలిగించును. పిత్తమును, కఫమును వృద్ధిబొందించును. (భా-ప్ర.)

(ట) దాడిమాసవ - లఘుగుణము గలిగియుండును. రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. హృదయమునకు హితమైనది. బలమును గలిగించును. కొద్దిగ వాతమును వృద్ధిబొందించును. కఫమును, కొద్దిగ పిత్తమును శమింపజేయును. విబంధమును బోగొట్టును. (చ-సూ-అ 27.)

మధురరసమును, సరగుణమును, కొద్దిగ నుష్ణవీర్యమును గలిగియుండును. లేఖనము. వాతమును శమింపజేయును. అమ్లపిత్తమును, పాండువును, ప్రమేహమును, అర్శస్సును, క్రిములను బోగొట్టును. (రా-ని.

(5) ప్రయోగములు:—

I. మూత్రనిరోధజ - ఉదావర్తమునందు ద్రాక్షాప్రయోగము.

"ద్రాక్షారసమథాపివా॥"

ద్రాక్షపండ్లరసమును పానముజేసిన మూత్రనిరోధమునందు గలిగిన ఉదావర్తము శమించును. (సు-ఉ-అ 55.)

2. మదాత్యయమునందలి తృష్ణయందు ద్రాక్షాప్రయోగము.

"తృష్యతే చాతి బలవద్వాత పిత్తేసముద్ధతే।
దద్యాద్ద్రాక్షారసం పానం శీతం దోషానులోమనం॥"

ద్రాక్షపండ్ల శీతకషాయమును వాతపిత్తాధికముగల మదాత్యయమునందు జనించిన తృష్ణయందిచ్చిన దోషానులోమనమగును. (వా-చి-అ 7.)

3. మూత్రకృచ్ఛ్రమునందు ద్రాక్షాప్రయోగము.

"తోయేన కల్కం ద్రాక్షాయాః పిబేత్ పర్యుషితేనవా॥"

ద్రాక్షపండ్ల కల్కమును పర్యుషిత జలముతో సేవించిన మూత్రకృచ్ఛ్రము శమించును. (వా-చి-అ 11.)

4. కామలాదులందు ద్రాక్షాప్రయోగము.

"పురాణసర్పిషః ప్రస్థో ద్రాక్షార్ధప్రస్థసాధితః।
కామిలా గుల్మపాండ్వర్తి జ్వరమేహోదరాపహః॥"

ద్రాక్షపండ్లు అర్ధప్రస్థము దీసికొని కషాయవిధి ననుసరించి కాచి వడియగట్టి అందు పురాణఘృతము నొక ప్రస్థమును జేర్చి పాకము జేసి సేవించిన కామిల, గుల్మము, పాండు, జ్వరము, ప్రమేహము, ఉదరము ఇవి శమించును (చ-ద.)

5. సన్నిపాతజ్వరమునందు ద్రాక్షా ప్రయోగము.

"ఉద్ధృష్టాం స్ఫుటితాం జిహ్వాం ద్రాక్షయా మధుపిష్టయా।
ప్రలేపయేత్ సఘృతయా సన్నిపాతాత్మకేజ్వరే"॥

ద్రాక్షపండ్లను, యష్టిమధుకమును మెత్తగా నూరి సన్నిపాతజ్వరమునందు జిహ్వ ఎండిపోయి పగిలినప్పుడు జిహ్వకు నేతితో గలిపి లేపనము జేసిన శమించును. (గ-ని.)

6. రక్తపిత్తమునందు దాడిమా ప్రయోగము.

"పక్వాఖర్జూరగోస్తనాః మధునా ఘ్నంతి ।
సంలీఢా రక్తపిత్తం పృథక్ పృథక్ "॥

దాడిమపండ్లను తేనెలోముంచి సేవించిన రోగుల రక్తపిత్తము శమించును. (గ-ని.)

7. గర్భశూలయందు దాడిమా ప్రయోగము.

"పీతాక్షౌద్రోపేతా మృద్వీకా గర్భశూలహరా "॥

దాడిమపండ్ల రసమునందు తేనె జేర్చి పానముజేసిన గర్భశూల శమించును. (వై-మ.)

(6) యోగములు:—

1. మృద్వీకాదిచూర్ణము - చ- త్రిమర్మీయ. మాత్ర-½ తులం.
ఉపయోగములు:—గలరోగము శమించును.

2. దాడిమాదిఘృతము - వా-విద్రధి. మాత్ర:-1 తులం.
ఉపయోగములు:—విద్రధి, గుల్మము, విసర్పము, దాహము, మోహము, మదము, జ్వరము, తృష్ణ, మూర్ఛ, ఛర్ది, హృద్రోగము, రక్తపిత్తము, కుష్ఠము, కామిల ఇవి శమించును.

3. దాడిమాదిలేహము - వా-పాండు. మాత్ర:-1 తులము.
ఉపయోగములు:—హలీమకము, పాండువు, కామిల ఇవిశమించును.

4. దాడిమాదిఫాంటకషాయము - వా-జ్వర. మాత్ర:-1 పలము.
ఉపయోగములు:-జ్వరము, మదాత్యయము, ఛర్ది, మూర్ఛ, దాహము. శ్రమ, భ్రమ, ఊర్ధ్వగరక్తపిత్తము, తృష్ణ, కామిల ఇవి శమించును.

5. దాడిమారిష్టము - భైషజ్య-యక్ష్మరోగ. మాత్ర:-1 పలము.
ఉపయోగములు:—ఉరఃక్షతము, క్షయ, కాస, శ్వాస, గల రోగము ఇవి శమించును. బలమును గలిగించును మలశోధనము జేయును.

6. మృద్వీకాదికషాయము - చ-ద-జ్వర. మాత్ర:-1 పలము.
ఉపయోగములు:—పిత్తజ్వరము శమించును.

7. దాడిమాదికషాయము - చ-ద-జ్వర. మాత్ర:-1 పలము.
ఉపయోగములు:—వాతజ్వరము శమించును.

8. దాడిమాదిగుటిక - బ ర-వాతరోగ. మాత్ర:-5 యవలు.

ఉపయోగములు:—గృధ్రసీవాతము శమించును. శుక్రవృద్ధియగును. వాజీకరణము.

9. దాడిమాదిపాకము - వై-చిం-ప్రమేహ. మాత్ర:-1కర్షము.

ఉపయోగములు:—ప్రమేహము, పిత్తరోగము, మూత్రాఘాతము, మలబంధము, మూత్రకృచ్ఛ్రము, రక్తదోషము, నేత్రరోగము, హృదయదాహము, పాణిదాహము ఇవి శమించును.

10. దాడిమాదితైలము - వై-చిం-నాసారోగ.

ఉపయోగములు:—నస్యముజేసిన నాసారోగము శమించును.

## స్వా ను భ వ ము.

[ 1 మొదలు 3 తులములు వేడినీటిలోవేసి 30 నిమిషములుంచి పిసికి వడియగట్టి ఇతరములైన ఔషధములకు అనుపానముగా జేసిగాని పాలు చక్కెర లేక తేనె వీనితో కలిపి పానీయముగా గాని ఉపయోగించునది.

తృష్ణాశమనము, ఉష్ణహరము, దోషశమనము, మృదువిరేచనీయము, రసాయనము, కొంచెము మూత్రలము.

ఆయుర్వేద యోగములలో నిది మిక్కిలి యుపయుక్తమైన ద్రవ్యము. జ్వరహరములు, మూత్రలములునగు అనేకయోగములలో నిది చేరుచున్నది. కొన్ని మందులను తియ్యగా నుండునట్లు జేయుటకును జ్వరములో దప్పికను పోగొట్టుటకును, గడ్డలు, వాపులు, మలబద్ధము మున్నగు వానిని పోగొట్టుటకును ఉపయోగింతురు.

కొంచెము మలబద్ధముగా నుండునపుడు దీనిని చిరకాలము వాడినచో గుణకరమగును. రసాయనముగా దీనిని లేహ్యములలో జేర్చెదరు. ఇది మంచి అనుపానముగా గూడ నుపయోగింపబడుచున్నది. బల్య గుణములు కలిగియుండు

టచే క్షయ వ్యాధిలోను మధుమేహములోను కూడ నుపయోగింపబడుచున్నది. రక్తపిత్తము రక్తక్షీణము వీనిలో నిది ప్రయోజనకారి. చిన్న పిల్లలకు యకృత్తుకు సంబంధించిన వ్యాధులలో ఇది మిగుల నుపయోగకరము. మిక్కిలి వేడి చేయుటచే గలుగు మూత్రకృచ్ఛ్రమును పోగొట్టును. నాడులలో జబ్బులచే నిద్రబట్టక బోయినప్పుడు ఇది నిద్రపట్టించును. చిన్నవి 50 పండ్లుగాని, పెద్దవి 25 పండ్లుగాని వేడినీళ్లలో అరగంట ఊరనిచ్చి పిసికి వడియకట్టి రాత్రి పరుండక పూర్వము తీసుకొనిన చక్కగా నిద్రపట్టును. ఆ. ల.

---

# 106

## దేవదారు - దేవదారుచెట్టు (క)

---

### భాషాంతర నామములు

హిందీ - చీడ, దేవధార్, దేవదారు, దేవద్యార్, ధూపసరల. మరాఠి - సరల, తేల్యా, దేవదారు, సగలదేవదార్. గుజరాతి - దేవదార్. బంగాళ దేవదార్. మలయాళం - దేవదారు. కర్ణాటకం - దేవదారు. ద్రావిడం - దేవదారు.

### నైసర్గిక స్వరూప వర్ణనము.

**Natural Order—Conifereae**

దేవదారు కుటుంబము

దేవదారుచెట్టు - Cedrus deodar (Eng. cedar)

(60[illegible] పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ దేవదారు స్స్మృతం దారు భద్రదార్వింద్రదారు చ ।
మస్తదారుర్ద్రుకిలిమం కిలిమం సురభూరుహః ॥

దేవదారు, దారు, భద్రదారు, ఇంద్రదారు, మస్తదారు, ద్రుకిలిమము, కిలిమము, సురభూరుహము అనునవి దేవదారునామములు.

## దేవదారు గుణములు

శ్లో॥ దేవదారు లఘుస్నిగ్ధం తిక్తోష్ణం కటుపాకి చ ।
విబంధాధ్మాన శోథామ తంద్రాహిక్కా జ్వరాసృజిత్ ॥
ప్రమేహపీనసశ్లేష్మ కాసకండూ సమీరనుత్ ॥

దేవదారుచెట్టు తిక్తరసమును, లఘుస్నిగ్ధగుణములను, ఉష్ణవీర్యమును, కటువిపాకమును గలిగియుండును. వాతకఫములను శమింపజేయును. విబంధము, ఆధ్మానము, శోధ, ఆమదోషము, తంద్రి, హిక్క, జ్వరము, రక్తదోషము, ప్రమేహము, పీనసము, కాస, కండూ అను వ్యాధులను పోగొట్టును.

## సరలదారుః — సరళదేవదారుచెట్టు (క్షు)

శ్లో॥ సరలః పీతవృక్షః స్యాత్ తథా సురభిదారుకః ॥

సరళము, పీతవృక్షము, సురభిదారుకము అనునవి సరళదారునామములు.

## సరలదారు గుణములు

శ్లో॥ సరలో మధురస్తిక్తః కటుపాకరసో లఘుః ।
స్నిగ్ధోష్ణః కర్ణకంఠాక్షి రోగరక్షోహరస్స్మృతః ।
కఫానిలస్వేద దాహకాస మూర్ఛావ్రణాపహః ॥

సరళదేవదారుచెట్టు తిక్తరసమును, మధురకటుకారసములను, లఘుస్నిగ్ధగుణములను, ఉష్ణవీర్యమును, కటువిపాకమును గలిగి యుండును. కఫవాతములను శమింపజేయును. కర్ణరోగము, రక్షోబాధ, అతిస్వేదము, దాహము, కాస, మూర్ఛ వ్రణము అను నీ వ్యాధులను పోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(దేవదారు) దేవదారు, ఇంద్రదారు, ద్రుకిలిమము, (పీతదారు, పూతికాష్ఠము,) (సరల) - సరలము, పీతవృక్షము, సురభిదారుకము, (ధూపవృక్షము, మహావపత్రికము, పూతికాష్ఠకము).

(ఖ) గుణబోధకము:—(దేవదారు) - (స్నిగ్ధదారు, భూతహారి,) (సరల) - (స్నిగ్ధదారు).

(2) శబ్దార్థములు:—

దేవదారు - దేవలోకమునం దుత్పన్నమగు వృక్షము. ఇంద్రదారు - ఇంద్రునికి ప్రియమైనట్టి వృక్షము. ద్రుకిలిమము - మార్గమునందు నిర్యాసమును విడచునట్టి వృక్షము. పీతదారు - పీతవృక్షము - పసుపువర్ణము గలిగినట్టి వృక్షము. పూతికాష్ఠము - తీక్ష్ణమైన గంధమును కాష్ఠములందు గలిగినట్టిది. సరలము - విశాలముగ విస్తరించి వృద్ధిబొందునట్టి వృక్షము. సురభిదారుకము - పరిమళించునట్టి వృక్షము. ధూపవృక్షము - ధూపము వేయుటకు యోగ్యమైన నిర్యాసమును విడుచునట్టి వృక్షము. మరిచపత్రకము - మిరియముల యాకులవంటి యాకులతో గూడినట్టిది. స్నిగ్ధదారు - స్నిగ్ధగుణముగల వృక్షము (లేక) తైలమును స్రవించునట్టి వృక్షము, భూతహారి - గ్రహదోషమును బోగొట్టునట్టిది.

(3) భేదములు:—

ఇది స్నిగ్ధదారు, కాష్ఠదారు, సరళదారు అని మూడు విధములుగా నుండి మిక్కిలి యెత్తుగా బెరుగు వృక్షజాతులలో నుత్పత్తిగలిగి తైలముతో గూడి, నాతికఠినమగునట్టియు, సుగంధయుతమగునట్టియు ద్రవ్యములలో గణింపబడుచున్నది. పైపదములనుబట్టి యీ వృక్షముయొక్క యాకృత్యాదులు స్పష్టపడుటలేదుగాని యిది స్వర్గలోకమున నుత్పన్నములగు వృక్షములలో నొకటియనియు, ఇంద్రునికి ప్రియకరమగునదియనియు దెలియగలదు. మరియు సరళవృక్షముయొక్క ఆకులు మరిచపత్రములవలె నుండునని దెలియగలదు. స్నిగ్ధదారువులని జెప్పబడుటచే నివి చమురును విడుచునవియని గ్రహింపవలెను. ఈ తైలము బజారులందు విక్రయింపబడుచున్నది. విశేషముగ నీనికాష్ఠములే ప్రయోగములను గలిగియున్నవి. ఇవి యుగ్రగంధమును గలిగియుండును, అయితే దేవదారు సరలదారువుల వర్ణము సితవర్ణముగా వర్ణింపబడినది. గుణములు గూడ కొంచెము హెచ్చుతక్కువగా రెండింటికిని సమానముగనే జెప్పబడినవి. దీనినిబట్టి యీ రెండింటికినిగల భేదమెట్టిదియో నిర్ణయింపవీలులేకున్నది. బజారులందు గూడ నొకేవిధమగు దారుకాష్ఠములు విక్రయింపబడుచుండును. అవి కేవలము దేవదారుకాష్ఠములనియే వ్యవహరింపబడుచున్నవి. దీనినిబట్టి సరలదారువుకాష్ఠములకు వైద్యమునందు వ్యవహా

మున్నట్లు గానబడదు. ఇంతియేగాక ఇది ధూపవృక్షమని జెప్పబడుటచే దీని తైలము గాని, నిర్యాసముగాని కుష్ఠవ్రణాదులందు ధూపరూపమున నుపయోగింపబడుచుండునని యు, కాష్ఠమునకంతగా ప్రయోగము గలిగియుండలేదనియు, నందుచే వీనియొక్క నిర్యాసమే విశేషముగ బజారులందు లభించుచుండుననియు దెలియగలదు. కావున మనకు బజారులందు దొరకు నీ దేవదారు జాతులలోని దేవదారుకాష్ఠములును, దేవదారు తైలమును, సరళదారు నిర్యాసమును గ్రాహ్యాంశములుగా గ్రహింపదగినవి. సరలదారు నిర్యాసము "శ్రీవేష్టకము" అని వ్యవహరింపబడుచున్నది. మరియు నిదియే "గంధ బిరోజా" యని భాషాంతరనామమున విశేషప్రచారము గలిగియున్నది. ఇది తెల్లగను, చిక్కగను, బంకవలెను నుండును. సుగంధవాసన గలిగియుండును. దీనిని ధూపముల కుపయోగించుదురు. ఇది నిఘంటుకారులచే "సరలస్రావ - సరల దేవదారులనుండి స్రావరూపమున నుత్పన్నమగునది, వృక్షధూపక - వృక్షమునుండి యుత్పన్నమై ధూపయోగ్యముగా నొప్పునది, పాయస - పాయసమువలె తెల్లగను చిక్కగను నుత్పన్నమగునది. శ్రీవాస - మంగళప్రదమగుటచే లక్ష్మీదేవికి నివాసయోగ్యమైనది." యను మొదలగు పదములచే వర్ణింపబడినది. ఈ మూడును వైద్యమునందు విశేషప్రయోగమును గలిగియున్నవి. ఇందలి కాష్ఠదారువనునది "దారుగంధ - కాష్ఠములందు పరిమళమును గలది, కపాటిని - గృహద్వారముల తలుపుల కుపయోగింపబడునది, గ్రహజిత్ - గ్రహదోషములను బోగొట్టునది" యను మొదలగు పదములతో నిఘంటువులందు వర్ణింపబడినది. దీనికిని స్నిగ్ధదారువునకువలె గుణవిశేషములు జెప్పబడియున్నను కాష్ఠదారువను పదముచేతనే యిది స్నిగ్ధముగ లేక కేవలము శుష్కముగ నుండునదియు నందుచే నిస్సారమైనదగుట వలన ప్రయోగార్హము గాదేమోయని యూహింపదగియున్నది. మరియు వైద్యమునందు స్నిగ్ధదార్వాదిజాతులలో నుత్పత్తిగలదగుటచే దీనికి కేవలము గుణనిరూపణమేగాని వానితోబాటు వ్యాధులందు ప్రయోగములు జెప్పబడినట్లు గానరావు. కావున నిది కపాటినియని చెప్పబడుటచే వీని మ్రానులను విశాలములగు పలకలవలె కోసి కేవలము తలుపులకును, పెట్టెలు చేయుటకును నుపయోగింపదగియుండునేమో యూహింపదగియున్నది. ఇంతియేగాక బజారులందు వస్తువిక్రేతలు తమ సామానుల నొకచోనుండి మరియొక [illegible] పంపుటకై నుపయోగించు దేవదారుపెట్టెలు (తేలికగను [illegible]

కొంచెము తెలుపు కలసిన పసుపువర్ణము గలవిగను వెల్పుగను నుండు పలకలకే చేయబడినట్టివి) ఈ వృక్షముల యొక్క పలకలతో చేయబడిన వేపొగాలిదు నూహింపడగియున్నది. ఇవియే నిజముగ కొష్ఠదారు పలకలైనచో నిటువంటి ద్రవ్యము దేవదారుయొక్క యున్న జైన్యమునందు గ్రహింపవలసినట లేదని గ్రహింపవలెను.

(4) విశేషగుణములు:—

(క) దేవదారు - అర్శస్సును, మలబంధమును బోగొట్టును. (ని_ర.)

(ఖ) దేవదారుతైల - తిక్తరసమును, కటుకషాయానురసములను గలిగి యుండును. దుష్టవ్రణములను శోధించును. వాతకఫములను శమింపజేయును. క్రిములను, కుష్ఠమును బోగొట్టును. (సుశ్రుత.)

(గ) కొష్ఠదారు - తిక్తరసమును, రూక్షగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. కఫవాతములను శమింపజేయును. భూతబాధను బోగొట్టును. లేపనము జేసిన వ్యంగమును బోగొట్టును. (రా_ని.)

(ఘ) సరలదారు - కోష్ఠశుద్ధిని జేయును. త్వగ్దోషమును, శోఫను, కండూను బోగొట్టును. (రా_ని) కాంతిని గలిగించును. యూకను బోగొట్టును. (ని_ర.)

(చ) శ్రీవేష్ట - పిత్తమును వృద్ధిపొందించును. వాతమును శమింపజేయును. శిరోరోగము, నేత్రరోగము, స్వరభంగము, క్షయము, గ్రహదోషము, స్వేదము, శరీరదౌర్గంధ్యము, యూక, కండూ, వ్రణము మీనిని బోగొట్టును. (భా_ప్ర.) కటురసమును, తిక్తకషాయానురసములను గలిగి యుండును. కఫపిత్తములను శమింపజేయును. యోనిదోషమును, యోనిశూలను, అజీర్ణమును, ఆధ్మానమును బోగొట్టును. (రా_ని.) మధురానురసమును, లఘుస్నిగ్ధగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. శుక్రమును వృద్ధిపొందించును. వెంటనే శుక్రమును గలిగించును. జ్వరమును, కుష్ఠమును, దాహమును బోగొట్టును. (ని_ర.) మూత్రమును వృద్ధిజేయును. వ్రణశోఫను విమ్లాపనము జేయును. లేపము జేసిన క్రిములు, వేదన శమించును. (అ_సం.)

(5) ప్రయోగములు:—

1. శ్వాసరోగములందు దేవదారు ప్రయోగము.

"శ్వాసమునవా దేవదారుః" ॥

దేవదారుకషాయమును సేవించిన శ్వాసహిక్కలు శమించును. (చ.చి.అ.21.)

2. జ్వరమునందు దేవదారు ప్రయోగము.

"దేవదారుకషాయం విధివత్కృత్వా పేయమేతజ్జ్వరాపహమ్" ||

దేవదారుకషాయమును సేవించిన జ్వరము శమించును. (సు.ఉ.అ.39.)

3. శోఫయందు దేవదారు ప్రయోగము.

"దేవదారుశుంఠీ వా మూత్రేణ" ||

దేవదారు, శొంఠి వీని చూర్ణమును గోమూత్రమునందు గలిపి పానము జేసిన శోఫ శమించును. (సు.చి.అ.23.)

4. కఫకాసమునందు దేవదారు ప్రయోగము.

"కఫకాసేపి బేదాదౌ సురకాష్ఠాత్ప్రదీపితాత్ ।
స్నేహం పరిస్రుతం వ్యోషయవక్షారావచూర్ణితమ్" ||

దేవదారుకాష్ఠమును కాల్చి యందుండి స్రవించినట్టి తైలమునందు త్రికటుకములు, యవక్షారము వీని చూర్ణమును గలిపి సేవించిన కఫజకాస శమించును. (వా.చి.అ.3.)

5. వాతవ్రణమునందు దేవదారు ప్రయోగము.

"సురదారు తథాశుంఠీ లేపో వాతవ్రణేహితః" ||

దేవదారు, శొంఠి వీటిని మెత్తగా జలముతో నూరి లేపనము జేసిన వాతవ్రణము శమించును. (హా.సం.)

6. శ్లీపదమునందు దేవదారు ప్రయోగము.

"హితశ్చ లేపనే నిత్యం చిత్రకో దేవదారుచ ।
సుఖోష్ణో మూత్రపేషితః" ||

దేవదారు, చిత్రమూలము వీటిని గోమూత్రముతో మెత్తగా నూరి యుడకబెట్టి గోరువెచ్చగా ప్రతినిత్యము లేపనము జేయుచుండిన శ్లీపదము శమించును. (చ.ద.)

7. కఫజగండమాలయందు దేవదారు ప్రయోగము.

"దేవదారు విశాలా చ కఫగండే ప్రలేపనమ్" ||

దేవదారు, పాపగవేరు వీటిని మెత్తగా జలముతో నూరి లేపనము జేసిన కఫజగండమాల శమించును. (వం.సే.)

8. కర్ణశూలయందు దేవదారు ప్రయోగము.

"తైలాక్తశస్త్రశలాకా వృతదారు కాష్ఠాద్వై ।
నిస్సరతి యజ్జ్వలన ప్రతప్తాత్ ।
తత్తైలమాశు హరతి శృతిరంధ్రపీడాం" ॥

దేవదారు కాష్ఠమునకు తైలములో తడిపిన గుడ్డపీలికలను చుట్టబెట్టి నిప్పు అంటించగా నందుండి స్రవించునట్టి తైలమును కర్ణపూరణమును జేసిన వెంటనే కర్ణశూల శమించును. (గ-ని.)

9. శోథాదులందు దేవదారు ప్రయోగము.

దేవదారు, శుంఠి, వసాసారము వీనిని సమాంశములుగ గ్రహించి మెత్తగా చూర్ణించి గోమూత్రముతో గాని, ఉష్ణోదకముతో గాని కలిపి లేపనము జేసిన వ్రణశోథ, శోథ, అండవృద్ధి, శ్లీపదము, గ్రంథి మొదలగునవి శమించును. (అనుభూతము)

10. కర్ణరోగమునందు సరలదారు ప్రయోగము.

"కుర్యాద్దేవం భద్రకాష్ఠే కుష్ఠే కాష్ఠే చ సరలే ।
మతిమాన్ దీపికాతైలం కర్ణశూల నిబర్హణం" ॥

సరళదేవదారు కాష్ఠమును దేవదారుకాష్ఠమును వలె గాల్చి యందుండి స్రవించునట్టి తైలమును కర్ణపూరణము జేసిన కర్ణశూల శమించును. (సు-ఉ-అ-21.)

11. వ్రణధూపమునకు సరలదారు ప్రయోగము.

"సరలేదేవదారుణీ సాలసారపి చ ।
కుర్వీత మతిమాన్ వ్రణధూపనం" ॥

సరళదేవదారు చూర్ణమును ధూపము వేసిన వ్రణములు శమించును. (సు-సూ-అ-37.)

(6) యోగములు:—

1 దేవదార్వాది తైల [illegible] -కౌస. మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—[illegible]సము శమించును.

2. దేవదార్వాది క్షా[illegible] - గా గుల్మ. మాత్ర:-$\frac{1}{4}$ తులము.

ఉపయోగములు:—గుల్మము, ఉదావర్తము, వర్ధ్మ, అర్శస్సు, ఉదరము, గ్రహణి, క్రిమి, అపస్మారము, గరము, ఉన్మాదము, యోనిరోగము, శుక్రరోగము, అశ్మరి, ఆఖువిషము, సర్పవిషము ఇవి శమించును.

3. దేవదార్వరిష్టము - భైషజ్య-ప్రమేహ. మాత్ర:-1 ఔన్సు.
ఉపయోగములు:—ప్రమేహము, వాతరోగము, గ్రహణి, మూత్రకృచ్ఛ్రము, కుష్ఠము ఇవి శమించును.

4. దేవదార్వాది కషాయము - బ-రా-వాతరోగ. మాత్ర:-1 పలము.
ఉపయోగములు:—సిరావాతము శమించును.

5 సరలాదివర్తి - సు-నాసారోగ.
ఉపయోగములు:—ధూమపానము జేసిన కఫజ ప్రతిశ్యాయము శమించును.

6 శ్రీవేష్టకాది చూర్ణము - భైషజ్య-ముఖరోగ.
ఉపయోగములు:—ప్రతిసారణము జేసిన ముఖరోగములు శమించును.

7. శీనాసాది చూర్ణము - భైషజ్య-నేత్రరోగ.
ఉపయోగములు:—నేత్రములందు చూర్ణనము జేసిన నేత్రరోగములు శమించును.

8. సరలాది లేపము - గ-ని-వృద్ధి.
ఉపయోగములు:—లేపనము జేసిన కఫవాతజ అండవృద్ధి శమించును.

కల్యాణఘృతము, ఖదిరారిష్ట, చందనాసవము, చంద్రప్రభావటి, దశమూలారిష్ట, మాంజిష్ఠాదిక్వాథచూర్ణము, చందనాదితైలము, యోగరాజగుగ్గులు, సురదారులేపచూర్ణము.

(7). Actions and uses:—The wod is carminative, diaphoretic and diuretic given in fever, flatulance, dropsy and urinary diseases as gravel. In ascites it is given in combination with Sheghta chhal (శిగ్రుఛాల్) and aghedo. In gonorrhoea, syphilis, gout and rheumatism the decoction (Devadári Kwáth) is given as a powerful alterative With Halada and guggula its paste is applied to indolent swellings. The tar is used as a favourite alterative and given in chronic skin diseases and in large dozes, given in leprosy and also applied externally to ulcers.

R. N. Khory II P 578.

వరందేవదారు, Actions and uses:—The oleo-resin and resin are much used as external stimulating applications for ulcers abscesses and the like, and as a basis for plasters and an ingerdient in ointments. Interanally they are used to some extent and with some success as a stimulant, diuretic in gleet and similar actions. The purified oleo-resin might be given in doses of one to two drachums in emulsion. The tar is employed in chronic bronchitis and phthisis and is a favourite application in skin diseases. Indegenous Drugs P 239.

## స్వానుభవము

[దీని చెక్కను రెండు తులములు తీసికొని 16 రెట్ల నీళ్ళలో వేసి నాలుగు లేక ఎనిమిది తులములు మిగులునట్లు దించి చక్కెరతో జేర్చిగాని పాలు చక్కెర వీనితో జేర్చి కాఫీవలె జేసిగాని తీసికొనవచ్చును.

పాచనీయము, రక్తశోధకము, రక్తవర్ధకము, స్వేద జనకము, కొంచెము మూత్రలము.

ఈ ద్రవ్యమును ప్రత్యేకముగా నుపయోగించువారుక లేకున్నను ఇతర ద్రవ్యములతో కలిపి మంచి జ్వరహరౌషధ ముగా నుపయోగించు చున్నారు.

దీనికి మంచి సువాసన యుండుటచే శరీరములో కొన్ని గ్రంథులకు సంబంధించిన వ్యాధులలోను క్షయలోను ఇది మిక్కిలి ఉపయోగకారి. దేవదారును మాడ్చి దానినుండి తారువలె తీసిన తైలమును అనేక వ్రణములకు పై పూత గాను, కుష్ఠము సవాయి మున్నగు వ్యాధులలో లోనికిని ఉప యోగింపవచ్చును. ఇది చెమటను పుట్టించును. మూత్రమును గూడ కొంచెము జారీచేయును. ఈ ద్రవ్యము మిగుల నుప యోగకారి యగుటచే ప్రస్తుతము కంటె ఇంకను విరివిగా మనము వాడవచ్చును. కాని సామాన్యముగా ఈ ద్రవ్యము మంచిది దొరకుట దుర్లభము. సురదారుచూర్ణ మను పేరుతో దేవదారు, శొంఠి, సవారము ఈ మూడును సమభాగములు

చేర్చి చూర్ణముచేసి నీళ్ళతో ఉడికించి వాపులకును, నొప్పులకును. అంతర్విద్రధులకును చర్మముపైని పట్టువేయుదురు. ఇంకను తీక్ష్ణముగా పనిచేయుటకై ఈ చూర్ణమునందు 4-వ వంతు మిరపకాయల చూర్ణమును గాని, ఆవాలు చూర్ణమును చేర్చుట గాని గలదు. అ. ల.]

---

# 107

# దేవదాలీ - దేవదాళి (లేక) డావరడంగి

---

## భాషాంతర నామములు

హింది - ఘుఘురవేల్, కుకరవేల, దేవదాలీ, బన్దాల, బిందాల, బిన్దాల, సోనైయా. మరాఠి - దేవడాంగరీ, దేవడాంగర. గుజరాతి - కుకడవేలాం. మలయాళం - దేవతాళి, కర్ణాటకం - దేవడాంగర. ద్రావిడం - దేవతాళి.

## నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order—Cucarbi taceae**

గుమ్మడి కుటుంబము

(56-వ పుట చూడుము.)

డావరడంగి - **Luffa echinata**

## పర్యాయ పదములు

శ్లో॥ దేవదాలీతు వేణీస్యాత్కర్కోటీ చ గరాగరీ।
దేవతాడో వృత్తకోశః తథా జీమూత ఇత్యపి॥
పీతాపరాఖరస్పర్శా విషఘ్నీ గరనాశనీ॥

దేవదాలి, వేణి, కర్కోటి, గర, గరీ, దేవతాడము, వృత్తకోశము, అనునవి శ్వేతదేవదాలీ నామములు. జీమూతము, ఖరస్పర్శ, విషఘ్ని, గరనాశనీ యనునవి పీతదేవలీనామములు.

## దేవదాలీ గుణములు

శ్లో॥ దేవదాలీరసే తిక్తా కఫార్శః శోఫపాండుతాః ।
నాశయేద్వామనీ ప్రోక్తా క్షయహిక్కా కృమిజ్వరాన్ ॥

దేవదాలి తిక్తరసమును గలిగి యుండును. వమనమును గలుగజేయును. కఫమును శమింపజేయును. అర్శస్సు, శోఫ, పాండు, క్షయము, హిక్క, క్రిమి, జ్వరము అను నీ వ్యాధులను బోగొట్టును.

### విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయ బోధకములు:—కర్కోటి, వృత్తకోశము, (వృన్తకోశము, కంటఫల, రోమశపత్రిక.)

గుణబోధకములు:—ఖరస్పర్శ, విషఘ్ని, గరనాశని, (ఆఖువిషహా, గుదజారి.)

(2) శబ్దార్థములు:—

కర్కోటి - ఆగాకరకాయవలె నుండు కాయలను గలది. వృత్తకోశము - గుండ్రముగ నుండు కోశమును గలది. వృన్తకోశము - కాయ నంటియుండు తొడిమె కోశరూపమున నుండునది. కంటఫల - ముండ్లతో గూడిన ఫలములను గలది. రోమశపత్రిక - నూగుతో గూడిన పత్రములను గలది. ఖరస్పర్శ - కఠినమైన స్పర్శగలది. విషఘ్ని-విషమును బోగొట్టునది. గరనాశని - గరవిషమును బోగొట్టునది. ఆఖువిషహా - ఎలుకవిషమును బోగొట్టునది. గుదజారి - అర్శోరోగమును బోగొట్టునది.

(3) పరిచయబోధకలక్షణములు:—

"సితపీతారుణైః పుష్పైః దేవదాలీత్రియం భవేత్ ।
బృహ్యాశిక్తా స్థిరా చైకా కర్కోటాభ ఫలా చ సా ॥
తస్యాః ఫలం దీర్ఘకంటం లఘువృత్తం సుశోభనం ।
పార్శ్వేశాన్యాధి శమనే రక్తాపీతా రసాయనే" ॥

దేవదాలి యనునది తెలుపు, పసుపు, ఎరుపు రంగుల పుష్పములతో మూడు విధములుగ నుండును. ఫలము ఆగాకరకాయవలె నుండును. ఈ ఫలము పొడవుగనుండు ముండ్లను గలిగి చిన్నదిగను గుండ్రముగను అందముగను నుండును. ఇందు తెల్లది వ్యాధులను బోగొట్టుటయందును, ఎర్రదియు

(౫) బీజ - గురుగుణమును గలిగి యుండును. మలబంధమును గలిగించును. అగ్నిమాంద్యమును గలుగజేయును. రుచిని బుట్టించును. కఫమును వృద్ధిబొందించును. వాతపిత్తములను శమింపజేయును. (స-గు-శ.)

(6) ప్రయోగములు:—

1. జ్వరమునందు దేవదారీ ప్రయోగము.

"జీమూతకస్యకల్కం చూర్ణం వా శీతాంబునా ।
జ్వరే పిత్తభవే వాతదుష్టేశ్లేష్మశేచానుగే" ॥

దేవదాలీకల్కమును గాని చూర్ణమును గాని శీతలజలముతో నిచ్చిన వాతశ్లేష్మానుబంధముగల పిత్తజజ్వరము శమించును. (చ-క-అ-1.)

2. మూషిక విషమునందు దేవదాలీ ప్రయోగము.

"దేవదాలీ ఫలంచైవ దధ్నాపీత్వా విషం వమేత్ ।
సర్వమూషిక దష్టానాం విషయోగః సుఖావహః" ॥

మూషికదష్టమైనప్పుడు దేవదాలీఫల చూర్ణమును పెరుగునందు గలిపి పానముజేసి వాంతిజేసిన విషము శమించును. (సు-క-అ-7.)

3. సుఖప్రసవమునకు దేవదాలీ ప్రయోగము.

"రసిష్టమబలాం క్షకం పిబేత్ దేవదాలి కుసుమోద్భవం రజః ।
శీఘ్రమేవ సుఖినూలిమావహేత్ నాస్త్యతః పరతరం తదౌషధం" ॥

దేవదాలిపువ్వుల చూర్ణమును ఒక తులము సేవించిన గర్భిణికి సుఖప్రసవము గలుగును. (వై-మ.)

4. కామిలయందు దేవదాలీ ప్రయోగము.

"జీమూతకేన సహితం నిశిసితం వారి కామిలాం హరతి" ॥

జలమునందు దేవదాలినిపలియగొట్టి యొకరాత్రియూరబెట్టి మరునాడు పిసియగొట్టి యా జలమును పానము జేయుచుండిన కామిల శమించును. (గ-ని.)

5. ప్లీహోదరమునందు దేవదాలీ ప్రయోగము.

"మూలం బలాయాః ప్రియసా ప్రపిష్టం ।
జీమూత జం[illegible] వారిణా వా
క్షౌద్రేణ మిశ్రం పరిపీయమానం ।
స్త్రీణాం విదంతి ప్రదరామయం" ॥

దేవదాలిమూలమును [illegible] తో నూరి తేనెగలిపి సేవించిన ప్రదరము శమించును. (గ-ని.)

6. అర్శస్సునందు దేవదాలీ ప్రయోగము.

"దేవదాలీ కషాయేణ శౌచమాచరతాం నృణాం।
కిం వా తన్మూలనీరాద్భిః కుతః స్యుః గుదజాంకురాః"॥

దేవదాలియొక్క కషాయముతో గాని, లేక దేవదాలీ లతయొక్క మూలమున బోసి యుంచినట్టి జలముతో గాని గుదప్రక్షాళనము జేసిన అర్శోరోగము శమించును. (భా-ప్ర-టీ.)

(7) యోగములు:—

1. జీమూతకాది ఘృతము - గ-ని-గ్రంథ్యాది. మాత్ర:-½ తులం.
ఉపయోగములు:—అరుచి శమించును.

2. దేవదాల్యాదిలేపము - బ-రా-అర్శ.
ఉపయోగములు:—లేపనముజేసిన అర్శస్సు శమించును.

(8) Medicinal uses:—The fruit of Luffa echinta (Hind. Bindal) has the reputation in Sind of a remedy for jaundice. (Indigenous drugs of India.)

I have been using Luffa bindal for a long time in the Camphell Hospital and in private practice. From the prolonged use, I have come to the conclusion that the fruits or even the stems, if used as a tincture or hot or cold infusion, are superior to many remedies that I have used in the treatment of ascites and enlarged liver and spleen. I make the tincture with rectified spirit. The strength, I generally use, is 1 in 20. The usual dose is 10 to 20 minims or more. The cold infusion is made by infusing two bruised fruits in a pint of water. In obstinate cases the dose is to be increased gradually. I have used it in larger doses to get the desired effect. Externally I have used the in fusion as a stimulating and antiseptic lotion in carbuncles and other unhealthy ulcers. The result is very promissing. I can strongly recommend this drug to the medical world in the treatment of foul ulcers after a prolonged use of many years, both in hospital and out-side. In congestion of the brain caus in integse head-ache and in jaundice I have used this in fusion as an errhive. It is a very efficient errhive remedy. Profuse discharge is noticed under its in fluence from the nasal mucous membrane.

In 10 to 15 minim doses the tincture acts as a purgative. In still large doses it is emetic and drastic purgative. In cases of enlarged liver and spleen I have found this drug to be very useful. It is to be stopped when it produces diarrboea. In chronic diseases I generally use iodide of potassium and arsenic with tincture of in fusion of luffa. If used carelessly it may produce diarrhoea. The dose is to be regulated according to the effect produced. In infantile cirrhosis of the liver I have used the tincture as a purgative and diure tic. It is very useful in commencing in cirrhosis. It is a very useful diuretic in dropsy of hepatic origin. Owing to its diuretic and

# 103

# ద్రోణపుష్పి - తుమ్మి

---

## భాషాంతర నామములు

హిందీ - గూమా, గోమా. మరాఠి - తుంభా, తుంభా. గుజరాతి - కుబో. మలయాళం - తుంబ. కర్ణాటకం - తుంబె. ద్రావిడం - తుంబెయ్.

## నైసర్గిక స్వరూప వర్ణనము

### Natural Order—Labiateae

తులసి కుటుంబము

తుమ్మి - Lencas Cephalotes

(662-వ పుట చూడుడు.)

## పర్యాయ పదములు

శ్లో॥ ద్రోణాచ ద్రోణపుష్పీచ ఫలపుష్పాచ కీర్తితా ॥

ద్రోణ, ద్రోణపుష్పి, ఫలపుష్ప యనునవి ద్రోణపుష్పీ నామములు.

## ద్రోణపుష్పీ గుణములు

శ్లో॥ ద్రోణపుష్పీ గురుః స్వాదూ రూక్షోష్ణా వాతపిత్తకృత్ ।
సతీక్ష్ణ లవణా స్వాదు పాకా కట్వీచ భేదనీ ॥
కఫామకామలా శోథతమకశ్వాస జంతుజిత్ ॥

తుమ్మి మధురరసమును, లవణకటుకానురసములను, గురురూక్ష తీక్ష్ణ గుణములను, ఉష్ణవీర్యమును, మధురవిపాకమును గలిగి యుండును. మలభేదనము జేయును. వాతపిత్తములను వృద్ధిబొందించును కఫమును శమింపజేయును. ఆమము, కామిల, శోథ, తమకశ్వాస, క్రిమి, యను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) సంగ్రహ నామములు:—

పరిచయబోధకములు:—ద్రోణపుష్పి, ఫలపుష్ప, (కుంభపత్ర. ఛత్రిణీ.)

(2) శబ్దార్థములు:—

ద్రోణపుష్పి - ద్రోణము (దొప్ప) వంటి పుష్పములను గలది. ఫల(లే)పుష్ప - కాయలందు పుష్పములను గలది. క్షవపత్రి - తుమ్ములను బుట్టించునట్టి పత్రములను గలది. ఛత్రిణి - గొడుగు ననుకరించు పై కాయలను గలది.

(3) భేదములు:—

ఇది చిన్న పెద్ద భేదముచే రెండు విధములుగా నుండి తుమ్మిపుష్ప జాతిలో నుత్పత్తి గలిగి కామిలాశోథాది హారిద్ర్యములందు గణింపబడుచున్నది. ఇందలి పెద్దజాతితుమ్మి "దివ్యపుష్పి, దేవద్రోణి" అను మొదలగు పదములచే వ్యవహరింపబడుచున్నది. ఈ మొక్కలు సామాన్యముగ నిసుక నేలలలో విశేషముగ పెరుగుచుండును. చిన్నజాతి మొక్కలు భూమినంటియే చిన్న చిన్న కొమ్మలతో నలువైపులకు విస్తరించును. పెద్దజాతి మొక్కలు భూమినుండి కొంచెమెత్తుగ బెరిగి చిన్న చిన్న కొమ్మలతో నాలుగు వైపులను ఆవరించి యుండును. ఆకులు, కాయలు, పువ్వులును, చిన్న జాతికంటె పెద్దజాతి మొక్కలకు కొంచెము పెద్దవిగనే యుండును. అయితే పోలిక మాత్రము రెండింటికిని సమానముగనే యుండును. వీని యాకులు సన్నముగను కొంచెము పొడవుగను నుండును. క్షవపత్రియను బిరుదమును బట్టి ఈ యాకులను ఆఘ్రాణించినప్పుడు తుమ్ములు గలుగునట్లుగా దెలియగలదు. కొమ్మలయొక్క అగ్రభాగమునుండి కొంచెము పొడవుగ నొక సన్నని కాడ యుత్పత్తియై దీని యగ్రమున గట్టిదనముతో గూడి గుండ్రని కాయలు బుట్టును. వీనికి మీదిభాగమునను, ప్రక్కలందును తెల్లని పుష్పములంటి యుండును. ఇవి ఒకే రేకతో గూడి దొప్పవలె మొదటిభాగమున చుట్టబడిన ట్లుండును. ఇందలి పెద్దజాతి "దివ్యపుష్పి" యని వ్యవహరింపబడుటను బట్టి దీని పుష్పములు దైవపూజకై యుపయోగింపబడునట్లుగా దెలియగలదు. కాని సామాన్యముగా నీ రెండువిధములగు మొక్కలనుండియు పుష్పములను గ్రహించి దైవకార్యమునకై యుపయోగించుట వాడుకలో గలదు. అందును శివార్చనకై యుపయోగించుట విశేషముగా గలదు. వీనిలో పెద్దజాతి తుమ్మి "పారదశోధని" అను రాజనిఘంటుకార నిరూపణమును బట్టి యిది విశేషముగా పాదరససంస్కారములకై యుపయోగింపబడుచున్నటును చిన్న జాతి తుమ్మి ఔషధరూపమున నుపయోగింపబడుచున్నట్లును దెలియగలరు.

మరియు నీ ద్రవ్యము కామిలాదిరోగములలో అంజన-నస్యరూపమున గూడ నుపయోగింప బడుచున్నది.

(4) విశేషగుణములు:—

(క) ద్రోణపుష్పి - కటురసమును గలిగి యుండును. రుచిని బుట్టించును. పథ్యకరము, వాతమును శమింప జేయును. అగ్నిమాంద్యమును బోగొట్టును. (రా-ని.) పక్షవాతమును బోగొట్టును. (శో-ని.) అర్శస్సును బోగొట్టును. (రా-వ.)

(ఖ) ద్రోణపుష్పీపత్రి - మధురరసమును, కటుక్షారరసమును, రూక్ష గురుగుణములను గలిగి యుండును. మలభేదనము జేయును. పిత్తమును వృద్ధి బొందించును. కామిలను, శోఫను, ప్రమేహమును, జ్వరమును బోగొట్టును. (భా-ప్ర.)

(గ) మహాద్రోణపుష్పి - కటురసమును, తిక్తానుగరసమును గలిగి యుండును. మేధాశక్తిని వృద్ధిబొందించును. కఫవాతములను శమింపజేయును. వాతరోగములను, భూతవికారములను, అగ్నిమాంద్యమును బోగొట్టును. (రా-ని.)

(5) ప్రయోగములు:—

1. విషమజ్వరమునందు ద్రోణపుష్పి ప్రయోగము.

"ద్రోణపుష్పీ రసోపాపి నిహంతి విషమజ్వరాన్" ॥

తుమ్మిస్వరసమును సేవించిన విషమజ్వరములు శమించును. (భా-ప్ర.)

2. కామిలయందు ద్రోణపుష్పి ప్రయోగము.

"అంజనే కామలార్తానాం ద్రోణపుష్పీ రసోహితః" ॥

తుమ్మి స్వరసమును నేత్రముల కంజనము వేసిన కామిలారోగము శమించును. (బృంద.)

3. పటలమునందు ద్రోణపుష్పి ప్రయోగము.

"హరతిపటలమక్ష్ణోః తండులాంబుపిష్టా ।
గలితసారా సాకద్రోణపుష్పీ" ॥

తుమ్మిని బియ్యపుకడుగుతో నూరి వస్త్రమునందు పిండి రసమును గ్రహించి దీనితో నస్యముచేసిన నేత్రములందలి పటలములు శమించును. ([illegible])

N. B:—ఇది యెత్తైగా బెరుగు వృక్షజాతులలో నుత్పత్తి గలిగి సారసార ద్రవ్యములలో గణింపబడు చున్నది. పై విషయములను బట్టి దీని యొంగము అగ్నియు నెండిపోయినట్లు నుండి తెల్లని వర్ణము గలిగి యుండునట్లుగా దెలియగలదు. ఇంతకంటె హెచ్చుగా దీని స్వరూపాది బోధకములగు లక్షణములు గానుపించకుండుటచే జేసి యింకను విమర్శించిన గాని నిశ్చయించుటకు వీలుగాకున్నది: ఈ వృక్షము పిశాచములకు నివాస యోగ్యమని గూడ దెలియగలదు. దీని యుపయోగము వ్యవహారమునం దెట్లుండునో గాని వైద్యమునందు మాత్రము కుష్ఠవిసర్పాదులందుపయోగము గలిగి యున్నట్లుగా దెలియుచున్నది.

(4) విశేషగుణములు:—

(క) కటుకొనురసమును గలిగి యుండును. రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. పిత్తమును బ్రకోపింపజేయును. వాతమును శమింపజేయును. (రా_ని.)

(ఖ) ధనఫల _ కొంచెము మధురరసమును గలిగియుండును. (భా_ప్ర)

(5) ప్రయోగములు:—

1. కర్ణరోగమునందు ధవ ప్రయోగము.

"మధూకధవశాల్మజం ।

పూరణార్థం ప్రశంసంతి తైలం వా త్వైపాచితం" ॥

ధవమును వృక్షముయొక్క త్వగ్రసముతో గాచిన తైలమును కర్ణపూరణముజేసిన పూయము మొదలగునవి శమించును. (సు_ఉ_అ_21.)

2 కుష్ఠమునందు ధవ ప్రయోగము.

"ఖదిరో ధవశ్చ లేపః" ॥

ధవసారముతో లేపనము జేసిన కుష్ఠము శమించును. (చ_చి_అ_7.)

3, విసర్పమునందు ధవప్రయోగము.

"ఖదిరం సప్తపర్ణంచ ముస్తమారగ్వధం ధవం ।

పృథగాలేపనం కుర్యాద్ద్వంద్వశః సర్వశోపివా" ॥

ధవవృక్షముయొక్క పట్టను మెత్తగానూరి లేపనము జేసిన విసర్పము శమించును. (చ_చి_అ_11.)

4. రసాయనమునకు ధవ ప్రయోగము.

"ధవాశ్వకర్ణాసనబాలపత్రిసారాస్తథా పిప్పలీవత్స్యయోజ్యాః।
లోహోపలిక్తాః పృథగేవ జీవేత్సమాః శతం వ్యాధి జరావిముక్తః"॥

ధవవృక్షముయొక్క సారమును లోహపత్రములకు లేపముజేసి ఎర్రగా గాల్చి ధవసారమునందు ఇరువదియొక మారులు ముంచి మెత్తగా చూర్ణించి పై సారముతో యథాప్రమాణముగా సేవించుచు పాలను ఆహారముగా దీసుకొనుచుండిన ఎట్టి వ్యాధులును లేక నూరు సంవత్సరములు జీవింపగలుగును.
(వా-ఉ-అ-39.)

(6) యోగములు:—

1. ధవాదితైలము - వా-ఉ-నాసారోగ.
ఉపయోగములు:—నస్యముజేసిన పిత్తరక్తజమగు పీనసముశమింతును.

2. ధవాదిచూర్ణము - సు-వ్రణ.
ఉపయోగములు:—అవచూర్ణనము జేసిన మృదువుగనుండు వ్రణములకు కఠినత్వ మేర్పడును

3 ధవాదిఘృతము - సు-కుష్ఠ. మాత్ర-:1 తులము.
ఉపయోగములు:—పిత్తజకుష్ఠము శమించును.

---

# 110

# ధాతకీ - ఆరెచెట్టు

---

## భాషాంతర నామములు

హిందీ - ధవాయీకేఫూల్, ధాయ్, ధాయీ, ధాయకేఫూల్, మరాటి - ధాపటీ, ధావస, ధాయటీ, గుజరాతి - ధావడీనాంఫూల్, మలయాలం - తాదరిపూ, కన్నడం - ధాయిఫూల, ద్రావిడం - కాట్టాత్తిపూ, ఆరెపూ.

N. B:—ఇది "పార్వతి, మద్యవాసిని, మద్యపుష్పి, సీధుపుష్పి," యనెడి నామములచే గూడ వ్యవహరింపబడుచుండుటవలన ఆరెచెట్టు పర్వతములపై నుత్పత్తియగుననియు, దీనిపుష్పము ఆసవారిష్టాది మద్యకల్పనలకు సంధాన ద్రవ్యముగ నుండుననియు దెలియగలదు. కావుననే దీనిపుష్పమును సామాన్యముగ నాసవము, అరిష్టము మొదలగువానిని జేయునప్పుడు అందు జేర్చుచుందురు. మరియు ("అనుక్తేఽపిచ ప్రస్థారం ధాతకీ కుసుమం క్షిపేత్ । సాధారణాసవేషు సంధేయం......॥" శా-ని.) ఆరెపువ్వును ఆసవాదులందు జేర్చుకొనవలెనని విధి గూడ గలదు. ఇందువలన నవి చెడిపోకుండ చాలకాలము నిలువయుండునని జెప్పుదురు. అయితే కొన్ని యాసవాదులందు దీనిని జేర్చకుండుటయు వ్యవహారమునందు గలదు.

(4) విశేషగుణములు:—

ఉష్ణవీర్యమును గలిగియుండును. గర్భస్థాపనముజేయును. (ధ-ని.)
ప్రవాహికను, వ్రణమును బోగొట్టును. (రా-ని.)

(5) ప్రయోగములు:—

1. కుష్ఠమునందు ధాతకీ ప్రయోగము.

"లోధ్రస్య ధాతకీనాం...కల్కం కుష్ఠేషు ఉద్వర్తనాలేపః ॥"

కుష్ఠమునందు లొద్దుగచెక్క, ఆరెపువ్వు వీని కల్కమును లేపనము జేసినను, వీని చూర్ణమును ఉద్వర్తనము జేసినను హితము. (చ-చి-అ-7.)

2. ప్రవాహికయందు ధాతకీ ప్రయోగము.

"ధాతకీ బదరీపత్రం...ఏకతో దధ్నా పిబేత్ ।
ప్రవాహికార్దితః ॥"

ఆరెపువ్వు, రేగాకులు వీని కల్కమును పెరుగుతో జేర్చి సేవించిన ప్రవాహిక శమించును. (భా-ప్ర.)

3. జ్వరాతీసారమునందు ధాతకీ ప్రయోగము.

"ధాతకీక్వాథ సంసిద్ధా విశ్వభేషజ సంస్కృతా ।
దాడిమామ్లయుతా పేయా జ్వరాతీసార శూలినాం ॥"

ఆరెపువ్వు కషాయముతో సిద్ధముజేసిన పేయయందు శుంఠిచూర్ణమును, పుల్లదానిమ్మపండురసమును జేర్చి యిచ్చిన జ్వరాతీసారమును, అందు గలుగు శూలయును శమించును. (వం-సే.)

4. శ్వేతప్రదరమునందు ధాతకీ ప్రయోగము.
"ధాతక్యాశ్చాక్షమాత్రం వా...... ।
పాండుప్రదర శాంత్యర్థం పాయయేత్తండులాంబునా ॥"
ఆరెపువ్వు కల్కము ఒక అక్ష (తులము) ప్రమాణము బియ్యపు కడుగుతో సేవించిన శ్వేతప్రదరము శమించును. (గ-ని.)

(5) వ్రణములకు:—
"ధాతకీ చూర్ణలోధ్రాభ్యాం తథారోహంతి తే వ్రణాః ॥"
వ్రణములపై ఆరెపువ్వు, లొద్దుగపట్ట వీని చూర్ణమును ప్రతిసారణము జేసిన శీఘ్రముగ మానును. (చ-ద.)

(6) యోగములు:—
1, ధాతక్యాదితైలము - చ - యోనిరోగ.
ఉపయోగములు:—వస్త్యభ్యంగాది రూపముగ నుపయోగించిన యోని వ్యాపత్తులు శమించును.
2. ధాతక్యాదిచూర్ణము - భైషజ్య - బాలరోగ. మాత్ర:—5 యవలు.

ఉపయోగములు:—బాలుర జ్వరాతీసారములు శమించును.
3. ధాతక్యాద్యవలేహము - శా - మ అ 2. మాత్ర:— $\frac{1}{8}$ తు।
ఉపయోగములు:—బాలురకు గలుగు అతిసారము శమించును.
4. ధాతక్యభిషుతము (మద్యవిశేషము) - చ - సూ - అ 27. మాత్ర:— $\frac{1}{2}$ పలము.
ఉపయోగములు:—రూక్షగుణమును గలిగియుండును హృదయము నకు హితము. కఫ పిత్త ... చును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును.

## స్వానుభవము

[మేము బజారులో దొరకే ఆరెపువ్వును ఆసవారిష్టములలో నుపయోగించుచున్నాము. ఆ. ల.]

———

# 111

# ధాన్యకం - ధనియాలు

## భాషాంతర నామములు

హింది - ధనియా. మరాఠి - ధణే. గుజరాతి - ధాణా. మలయాళి - కొత్తంబాలరి. కన్నడం - కొత్తంబరి. ద్రావిడం - ...నియు.

## నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order—Umbelliferae.**

కొత్తిమేర కుటుంబము

(580-వ పుట చూడుము.)

ధనియాలు - Coriandrum Sativum

## పర్యాయ పదములు

శ్లో॥ ధాన్యకం ధానకం ధాన్యం ధానా ధానేయకం తథా ।
కునటీ ధేనుకా ఛత్రా కుస్తుంబురు వితున్నకం ॥

ధాన్యకము, ధానకము, ధాన్యము, ధాన, ధానేయకము, కునటి, ధేనుక, ఛత్రి, కుస్తుంబురు, వితున్నకము అనునవి ధాన్యక నామములు.

## ధాన్యక గుణములు

శ్లో॥ ధాన్యకం తువరం స్నిగ్ధం అవృష్యం మూత్రలం లఘు ।
తిక్తం కటూష్ణవీర్యం చ దీపనం పాచనం స్మృతం
జ్వరఘ్నం రోచనం గ్రాహిస్వాదు పాకి త్రిదోషనుత్ ।
తృష్ణాదాహవమిశ్వాసకాసార్శః కృమిప్రణుత్ ॥

ధనియాలు కషాయరసమును, కటు తిక్తానురసములను, స్నిగ్ధ లఘు గుణములను, ఉష్ణవీర్యమును, మధురవిపాకమును కలిగి యుండును. కొంచెము శుక్రమును వృద్ధిజేయును. మూత్రమును వృద్ధిపరచును. జాఠరాగ్నిని వృద్ధి పొందించును. ఆమమును పాకముజేయును. రుచిని బుట్టించును. మలమును శోధించును. త్రిదోషములను శమింపజేయును. జ్వరము, తృష్ణ, దాహము, వాంతి, శ్వాస, కాసము, ఆమదోషము, అర్శస్సు, క్రిములు అను నీ వ్యాధులను బోగొట్టును.

## ఆర్ద్రధాన్యక గుణములు

శ్లో॥ ఆర్ద్రం తు తద్గుణం స్వాదు విశేషాత్పిత్తనాశనమ్ ॥

పచ్చిగనున్న ధనియాలు పైనిజెప్పిన గుణములనే కలిగి యుండును. మరియు విశేషముగా మధురరసమును కలిగి యుండును. పిత్తమును శమింపజేయును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:— ధాన్యకము, ఛత్రి.

(ఖ) గుణబోధకములు:— కుస్తుంబురు, వితున్నకము.

(2) శబ్దార్థములు:—

ధాన్యకము - వరిధాన్యమువలె నుండునది. ఛత్రి - గొడుగువంటి పూగుత్తిగల పుష్పములది. కుస్తుంబురు, వితున్నకము - పిత్తము, దాహము మొదలగు వానిని బోగొట్టునవి.

(3) విశేషగుణములు:—

(క) ఆర్ద్రధాన్యకం - సుగంధమును గలుగజేయును. హృదయమునకు హితమైనది (ధ-ని.)

(ఖ) శుష్కధాన్యకం - మధురరసమును స్నిగ్ధగుణమును గలిగి యుండును. నేత్రములకును, హృదయమునకును హితమైనది. (ధ-ని.) శీత వీర్యము గలిగి యుండును. కఫమును శమింపజేయును. (రా-ని.) స్రోతస్సులను శోధించును. (సు-సూ-అ-46.)

(గ) ధాన్యపానక గుణములు:—

"శిలాయాం సాధుసంపిష్టం ధాన్యాకం వస్త్రగాలితం ।
శర్కరోదకసంయుక్తం కర్పూరాదిసుసంస్కృతం ॥
నూతనే మృణ్మయే పాత్రే స్థితం పిత్తహరం పరం" ॥

ధనియాలను పంచదారకలిపిన నీళ్లతో మెత్తగా రాతిపై నూరి వస్త్రగాలితముజేసి యా జలమును పచ్చకర్పూరమును మొదలగు పరిమళ ద్రవ్యములతో సంస్కరించి యొక క్రొత్తభాండమునందు భద్రపరచవలెను. ఇటుల తయారుచేసినది ధాన్యపానకమని జెప్పబడును. ఇది పిత్తవికారములను బోగొట్టును. (భా-ప్ర.)

(4) ప్రయోగములు:—

1. తృష్ణయందు ధాన్యక ప్రయోగము.

"రోగోపసర్గజాతాయాం ధాన్యాంబు ససితం మధు ।
పానం ప్రశస్తం ... ... ... "॥

ఒకానొక వ్యాధియందుపద్రవముగా జనించిన దప్పికయందు ధనియాల రసమును చక్కెర, తేనె వీనితో జేర్చి పానము చేయించిన హితము. (హా-చి-అ-7.

2. జ్వరమునందు ధాన్యక ప్రయోగము

"పర్యుషితం ధాన్యజలం ప్రాతః పీతం సశర్కరం పుంసాం ।
అంతర్దాహం శమయతి ప్రవృద్ధమపి తత్క్షణాత్సద్యః"॥

జ్వరమునం దంతర్దాహము కలిగినప్పుడు ధనియాలతో తొలినాటి కాచిన కషాయమున కొద్దిగ చక్కెర జేర్చి యిచ్చిన వెంటనే శమించును. (గ-ని.)

3 కఫపిత్తజ జ్వరమున ధాన్యక ప్రయోగము.

"ఉషణం కఫవిచ్ఛేది పిత్తవాతానులోమనం ।
జ్వరఘ్నం పాచనం భేది శృతం ధాన్యపటోలయోః"॥

ధనియాలు, పొదుపాట్ల వీనితో గాచిన కషాయము నిచ్చిన జ్వరము వృద్ధిపొందకుండ ఆమమును పాకము జేయును. మలమును భేదించును. [illegible] అనులోమతను గలిగించును. కఫపిత్తములను శమింపజేయును. ([illegible])

4 వాతరక్తమునందు ధాన్యక ప్రయోగము.

"ధాన్యాకర్షంచ జీరేద్వే గుడేన పరిపాచితం ।
[illegible]సేవాతిరక్తానాం దాపయే ద్దోషశాంతయే"॥

ధనియాలు, 1 కర్షము, జీలకర్ర 2 కర్షములు ఇటుల గ్రహించి మెత్తగా చూర్ణముజేసి బెల్లముతో జేర్చి లేహ్యపాకముచేసి సేవకాలానుసారముగా వాతరక్తరోగికిచ్చిన దోషశమనమగును. (హా-చి-అ-24.)

5. పిత్తాతిసారమునందు ధాన్యక ప్రయోగము.

"ధాన్యకల్కేన సంసిద్ధం చతుర్గుణ జలంఘృతం ।
పిత్తాతిసారే సరుజే దేయం దీపన పాచనం"॥

ధనియాలకల్కము $\frac{1}{4}$ భాగము, నెయ్యి 1 భాగము, జలము 4 భాగములు ఇటుల గ్రహించి ఘృతపాకముజేసి పిత్తాతిసారమున శూలమొదలగు బాధ లున్నప్పుడు ఇచ్చిన దీపన పాచనమగును. (వం-సే-అతిసా.)

6. ఆమాజీర్ణమునందును, బాలరోగమునందును ధాన్యక ప్రయోగము.

"ధాన్యనాగరసిద్ధం వా తోయం దద్యాద్విచక్షణః ।
ఆమాజీర్ణప్రశమనం శూలఘ్నం వస్తిశోధనం" ॥

ధనియాలు, శుంఠి వీనితో గాచిన కషాయమును ఇచ్చిన ఆమాజీర్ణము, శూలయు శమించును. వస్తి శోధించును. (సు. సే.–అజీర్ణ.)

7. బాలుర శ్వాస–కాసలయందు ధాన్యక ప్రయోగము.

"ధాన్యం శర్కరయాయుక్తం తండులోదక సంయుతం ।
పానమేతత్ప్రదాతవ్యం కాసశ్వాసాపహం శిశోః" ॥

బాలురకువచ్చు కాసశ్వాసలయందు ధనియాలకల్కమును బియ్యపు కడుగునందు జేర్చి అందు కొద్దిగ చక్కెర వేసి కలిపి పానము జేయించిన శమించును. (వం, సే.–బాలరోగ.)

8. వాతోల్బణార్శోరోగమున ధాన్యక ప్రయోగము.

" ... ... ... శృతేనాగరధాన్యకైః ।
అన్నపానం భిషగ్దద్యాత్ వాతవర్చోనులోమనం" ॥

వాతోల్బణమగు అర్శోరోగమున శుంఠి, ధనియాలు వీనితో గాచిన కషాయమును ఇచ్చుచు, వాతపురీషముల ననులోమగతిని గలిగించు నన్నపానముల నాచరింపజేసిన హితము. (చ.–అర్శోరోగ.)

(5) యోగములు:—

1. ధాన్యపంచకకషాయం – (భైషజ్య–అతీసార.) మాత్ర:–1 పలం.
ఉపయోగములు:—అతీసారము, రక్తాతీసారము ఇవి శమించును.

2. ధాన్యచతుష్కకషాయం – (గ–ని–అతీసార.) మాత్ర:–1 పలం.
ఉపయోగములు:—అనుశూల, విబంధము ఇవి శమించును. జఠరాగ్ని వృద్ధిబొందును. ఆమపాచనమును జేయును.

3. ధాన్యపటోలక్వాథము (సి–యో–జ్వర.) మాత్ర:–1 పలం.
ఉపయోగములు:—పిత్తశ్లేష్మజ జ్వరము శమించును.

4. ధాన్యకలేహ్యము (బ–రా–పిత్తరోగ.) మాత్ర:–1 తులం.
ఉపయోగములు:—పిత్తము, అరుచి, ఛర్ది ఇవి శమించును.

## ధాన్యకముగల కొన్ని యోగములు

అభయాదిక్వాథచూర్ణము, అగస్త్యారిష్టము, కూష్మాండలేహ్యము, కపిత్థాష్టకచూర్ణము, చంద్రప్రభావటి, చిత్రకాదివటి, గుడూచ్యాదిక్వాథ

చూర్ణము, దాడిమాష్టక చూర్ణము, ద్రాక్షాదిచూర్ణము, బిల్వాదిలేహ్యము, భాస్కర లవణచూర్ణము, యోగరాజగుగ్గులు, శిరశ్వగవటి, స్వర్ణముఖీ పానకము.

## స్వానుభవము

[ 1/4 తులము మొదలు 1 తులము ద్రవ్యమును ఎనిమిది రెట్లు నీళ్ళలో కాచి నాలుగవ వంతు మిగులునట్లు దింపి తీసి కొనునది.

2. మొదలు 60 గ్రేనులు చూర్ణమును ఇతరములైన సుగంధ ద్రవ్యములతో కలిపి తీసుకొనునది.

బియ్యపుకడుగుతో దీనిని నూరి స్వరసముతీసి. ఒక్కొక్క టీ చెంచాడు చొప్పున బిడ్డల కిచ్చునది.

దీని పచ్చియాకును చింతపండు, నిమ్మపండు పులుసు, పెరుగు. మిరపకాయలు. మిరియాలు, ఉప్పు మున్నగు వానితో కలిపి పచ్చడిగా జేసి యిచ్చునది.

సౌగంధ్యకరము, ఉత్తేజకము, పాచనీయము, కొంచెము కఫనిస్సారకము. మూత్రిలము, జ్వరహారము, రసాయనము.

సునాముఖి మున్నగు ద్రవ్యముల దుర్వాసన తెలియ కుండునటుల వాటితో కలిపి ఉపయోగించెదరు. శొంఠి, మిరి యాలు వీనివలె మిక్కిలి ఉత్తేజకరమైన ద్రవ్యముకాదు. అవి కలిగించునంత ఉద్రేకమును ఇది కలిగించదు. చిన్న పిల్లలకు అజీర్ణముచే కడుపునొప్పి కలిగిన యెడల ఇది మిగులమంచిది. మరియు చిన్నపిల్లలకు దగ్గు, జలుబు, ఆయాసము మున్నగు వానికి కూడ మిక్కిలి ఉపయుక్తము. జ్వరము మిక్కిలి

హెచ్చుగా నున్నప్పుడు దీని కషాయమును చెంబెడు ఇచ్చి నచో దప్పికను పోగొట్టి చెమటను బుట్టించి జ్వరమును తగ్గించును. ఇది అన్నహితవును కలిగించును. శీతపుశీతోష్ణ స్థితి యొక్క మార్పులచే గలుగు జ్వరమును పోగొట్టును. ఆ. ల. ]

---

# 112

# నాగకేసరః - నాగకేసరము

---

## భాషాంతర నామములు

హిందీ - నాగకేసర్. మరాఠీ - నాగకేసర్. గుజరాతీ - నాగకేసర్. బంగాలీ - నాగేశ్వర్. మలయాళీ - నాకపుప్పొ. కర్ణాటకం - నాగకేసర్. ద్రావిడం - చిరునాగప్పూ.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Gutli fereae

పొన్న కుటుంబము

నాగకేసరము **Mesua ferrea**

ఇదియొక చిన్న కుటుంబము. దీనిలో పెద్ద చెట్లు, గుబురు మొక్కలు మాత్రము గలవు. ఈ మొక్కలలోను, బీర్లపు మొక్కలలోనున్నట్లు పాలుగలవు. గాని అవి చిక్కగాను, సాధారణముగ పచ్చగాను నుండును. ఆకులు లఘు పత్రములు, అభిముఖచేరిక. నున్నగా నుండును. పువ్వులలో నేకలింగపుష్పములు మిశ్రపుష్పములు గూడ నున్నవి. పుష్పకోశపు తమ్మెలు మొగ్గలో నల్లుకొని యుండును. ఇది ఈ కుటుంబము యొక్క ముఖ్యలక్షణము.

## పర్యాయ పదములు

శ్లో॥ నాగపుష్పః స్మృతో నాగః కేసరో నాగకేసరః।
చాంపేయో నాగకింజల్కః కథితః కాంచనాహ్వయః॥

నాగపుష్పము, నాగము, కేసరము, నాగకేసరము, చాంపేయము, నాగకింజల్కము, కాంచనాహ్వయము అనునవి నాగకేసర నామములు.

## నాగకేసర గుణములు

శ్లో॥ నాగపుష్పం కషాయోష్ణం రూక్షం లఘ్వామపాచనం।
జ్వరకండూ తృషాస్వేద ఛర్ది హృల్లాసనాశనం॥
దౌర్గంధ్య కుష్ఠ వీసర్ప కఫపిత్త విషాపహం॥

నాగకేసరము కషాయరసమును, రూక్షలఘుగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. ఆమమును పాకము జేయును. కఫపిత్తములను శమింపజేయును. జ్వరము, కండు, తృష్ణ, స్వేదము, ఛర్ది, హృల్లాసము, దౌర్గంధ్యము, కుష్ఠము, విసర్పము, విషము అను నీ వ్యాధులను పోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—కేసరము, కాంచనాహ్వయము, (షట్పదప్రియ, రాజపుష్ప, హేమకింజల్కము, ఫణికేసరము.)

(ఖ) ఉత్పత్తిబోధకములు:—నాగపుష్పము, నాగకేసరము, చాంపేయము, నాగకింజల్కము:

(గ) గుణబోధకములు:—(మహౌషధము.)

(2) శబ్దార్థములు:—

కేసరము-కింజల్కరూపమున నుండునది. కాంచనాహ్వయము-బంగారు యొక్క నామములను గలిగి యుండునది. అనగా బంగారువలె పచ్చని వర్ణమును గలిగి యుండునది. షట్పదప్రియ - తుమ్మెదలకు ప్రియమైనది. రాజపుష్ప - పుష్పములలో శ్రేష్ఠమైనదిగ వ్యవహరింపబడునది. హేమకింజల్కము - బంగారువర్ణము గల కింజల్కరూపమున నుండునది. ఫణికేసరము - నాగఫణమువలెనుండు కింజల్కరూపమున నుండునది. నాగపుష్పము - నాగకేసరము - నాగకింజల్కము - నాగచంపక పుష్పమునందు కింజల్కరూపమున నుత్పత్తి యగునది. చాంపేయము - చంపక (నాగ) పుష్పసంబంధమైనది. మహౌషధము - ఓషధులలో శ్రేష్ఠమైనదిగ నుండునది.

(3) పరిచయబోధకలక్షణములు:—

"పున్నాగవృక్షస్య కేసరో నాగకేసరః"॥

చంపకజాతులలో నొకటియగు పున్నాగవృక్షముయొక్క పుష్పమునందలి కేసరము నాగకేసరమని వ్యవహరింపబడును. (శ-డ.)

N. B:—ఇది కేసరరూపమున గాక యొకవిధమగు నల్లని మొగ్గరూపమున బజారులందు గానబడుచున్నది. పై వర్ణనమును బట్టి యిది వాస్తవముగా పుష్పకేసరమనియె తెలియగలదు. అయితే పైన కటుల భిన్నముగ నేల లభ్యమగుచున్నదో తెలియకున్నది. పై పదములను బట్టి యీ యొక చంపకజాతి పుష్పములోని పచ్చని కింజల్కమని తెలియుచున్నను బజారులందు నాగకేసరమను నామముతో పైదానికి భిన్నమగు స్వరూపముతో దొరకుచుండుటను బట్టి నాగచంపక కేసరమునకు ఇది భిన్నమగు మరియొక ద్రవ్యముగా దోచగలదు. ఒకవేళ నాగకేసరమను ద్రవ్యము వాస్తవముగా నాగచంపక పుష్పకేసరమేయై యుండి, బజారునందు దొరకునది నిజమగు ద్రవ్యముగాదేమో యనియు దోచగలదు. ఇంకను విమర్శించినగాని వాస్తవము తెలియకున్నది. *

(4) విశేషగుణములు:—

తిక్తరసమును, కొద్దిగ నుష్ణవీర్యమును గలిగి యుండును. వస్తిరోగము, కంఠరోగము, శిరోరోగము వీనిని బోగొట్టును. (రా-ని.) రక్తార్శస్సును బోగొట్టును. (గ-ని.) వాతరక్తమును బోగొట్టును. (ని-ర.)

(5) ప్రయోగములు:—

1. రక్తార్శస్సులందు నాగకేసర ప్రయోగము.

"కేసరనవనీత శర్కరాభ్యాసాత్ ......।
......అర్శాంసి శమయంతి రక్తాని" ॥

నాగకేసరముల చూర్ణమునందు చక్కెరను, వెన్నను జేర్చి సేవించిన రక్తార్శస్సు శమించును. (చ-చి-అ 9.)

హిక్కయందు నాగకేసరప్రయోగము.

"క్షౌద్రం సితాం నాగరకేసరంచ ।
పిబేద్రసేనేక్షు ఫలాంకజేన" ॥

నాగకేసరచూర్ణమునందు చక్కెరను, తేనెను గలిపి, చెరకు ఇప్ప పువ్వుల రసముతో సేవించిన హిక్క శమించును. (సు-ఉ-అ-50.)

* N. B:—నాగచంపకమును గురించిన విషయములను చంపకమను ద్రవ్యమును చూడుడు.

3. పుత్రోత్పత్తికై నాగకేసర ప్రయోగము.

"గోఘృతేన సహా నాగకేసరం శ్లక్ష్ణచూర్ణితమృతౌ నితంబినీ ।
గవ్యదుగ్ధానుగతా పిబేద్యది స్యాత్తదా నియతమేవ వీరసూః" ॥

నాగకేసర చూర్ణమును గోఘృతమునందు గలిపి గోక్షీరముతో ఋతుకాలమున సేవించినట్టి స్త్రీకి నిశ్చయముగ వీరుడగు పుత్రుడు జనించును. (రా-మా.)

4. అసృగ్దరమునందు నాగకేసర ప్రయోగము.

"తక్రాశ్రితస్తథా సమ్యక్ సంపిబేన్నాగకేసరమ్" ॥

నాగకేసర చూర్ణమును సేవించుచు, తక్రముతో జేర్చి యాహారమును తినుచుండిన యెడల అసృగ్దరము శమించును. (గ-ని.)

5. అతిసార (రక్త)మునందు నాగకేసర ప్రయోగము.

"సితయా సహ । నాగకేసరచూర్ణం వా రక్తసంగ్రహణం పరం" ॥

నాగకేసరచూర్ణము చక్కెరతో జేర్చి సేవించిన రక్తాతిసారమునందు రక్తము నిలుచును. (వం-సే.)

(6) యోగములు:—

1. కేసరాదికషాయము (వై-చిం-పాండు.) మాత్ర:-1 పలం.

ఉపయోగములు:— పాండురోగము శమించును.

నాగకేసరముగల కొన్ని యోగములు

అ[illegible]రిష్ట, అశ్వగంధారిష్ట, ఆమలకరసాయనము, ఏలాదిచూర్ణము, కనకాసవము, కర్పూరాదిచూర్ణము, కల్యాణఘృతము, గోక్షురాదిచూర్ణము, దశమూలారిష్టం, బిల్వాదిలేహ్యము, చ్యవనప్రాశలేహ్యము, చాతుర్జాతక చూర్ణము, భృంగామలకతైలము, వాసారిష్టము, శివామోదకము.

(7) Actions and uses.—The dried blossoms, root, and bark are, bitter, aromatic, and sudovific. unripe fruits are aromatic, acrid and purgetive. Flower buds are used in dysentery. The oil is used as an application for rheumatic joints; an ointment of the powder of blossoms with better is applied to blueeding piles and for burning sensations of the feet.

R. N. Khory II. P. 78.

స్వానుభవము.

[10 మొదలు 30 గ్రైనుల చూర్ణమును తేనె లేక వెన్న పంచదార కలిపి తీసికొనవలెను.

శీతలము, పాచనీయము, సౌగంధ్యకరము.

అనేక లేహ్యములలో ఇది పాచనీయముగాను సౌగంధ్యకరముగాను చేర్పబడుచున్నది. ఇది స్వల్ప జ్వరమును హరించును. రక్తార్శస్సు, గ్రహణి వీనిలో రక్తము పడుచున్నప్పుడు దీని చూర్ణమును వెన్న చక్కెరలతో చేర్చి ఈయవలెను. శ్వేతప్రదరము లేక తెల్లకుసుమలో దీనిని పెరుగుతో నూరి తీసికొని మజ్జిగతో వరియన్నమును తినవలెనని భావమిశ్రుడు చెప్పియున్నాడు. ఆ. ల. ]

---

# 113

# నారికేలః - కొబ్బరిచెట్టు

---

## భాషాంతర నామములు

హిందీ - నారియల్, ఖోపడా. (కొబ్బరముక్క లేక పరిడి) మలయాళం - నాళికేరం, తేంగా. కర్ణాటకం - తెంగినకాయి. ద్రావిడం - తెంగాయ్.

## నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order—Palmeae**

కొబ్బరి కుటుంబము

కొబ్బరిచెట్టు - **Cocos mucifera (Eng-Coconut Palm)**

(603-వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో: నారికేలో దృఢఫలః లాంగలీ కూర్చశీర్షకః ।
తుంగః స్కంధఫలశ్చైవ తృణరాజః సదాఫలః ॥

నారికేలము, దృఢఫలము, లాంగలి, కూర్చశీర్షకము, తుంగము, స్కంధఫలము, ఉచ్చము, తృణరాజము, సదాఫలము అనునవి నారికేల నామములు.

## నారికేలఫల గుణములు

శ్లో॥ నారికేలఫలం శీతం దుర్జరం వస్తిశోధనం।
విష్టంభి బృంహణం బల్యం వాతపిత్తాస్రదాహనుత్ ॥

కొబ్బరికాయ శీతవీర్యమును గలిగి యుండును. కష్టముగ జీర్ణమగును. వస్తిని శోధించును. విష్టంభమును జేయును. బృంహణము, బలమును గలిగించును. వాతపిత్తములను శమింపజేయును. రక్తదోషమును, దాహమును పోగొట్టును.

## విశేషాంశములు

(1) పర్యాయనామములు:—

పరిచయబోధకములు:—దృఢఫల, లాంగలీ, కూర్చశీర్షక, తుంగ, స్కంధఫల, తృణరాజ, సదాఫల, సదాపుష్ప, త్ర్యంబకఫల, విశ్వామిత్రప్రియ, దాక్షిణాత్య.

(2) శబ్దార్థములు:—

దృఢఫల - మిగుల గట్టిగా నుండునట్టి ఫలములు గలది. లాంగలీ-నాగలి యాకృతి నిర్మించిన ఆకులను, పువ్వులవిమాది రేకులను గలది. కూర్చశీర్షక - పిచ్చ వంటి పుష్పములను శిరస్సునందు గలది. తుంగ - మిక్కిలి ఎత్తుగా పెరుగునది. స్కంధఫల - మాని నంటి ఫలించునది. సదాపుష్ప - ఎల్లప్పుడు పుష్పములతో గూడి యుండునది. త్ర్యంబకఫల - మూడు నేత్రములవంటి గంధములుగల ఫలములను గలది. విశ్వామిత్రప్రియ - విశ్వామిత్రునికి ప్రియమైనది. దాక్షిణాత్య - దక్షిణభారతమున విశేషముగా పెరుగును.

N. B:—ఇది మిక్కిలి ఎత్తుగా పెరుగు తృణజాతులలో నుత్పత్తిగలిగి నిత్య ముపయోగింపబడు మానవాహార ద్రవ్యములలో నొకటిగాను, అతి శీతలమైన ద్రవ్యములలో ప్రధానమైనదిగాను గణింపబడు చున్నది. బీజభేదమును బట్టి ఫలములు అనేక రకములుగా నున్నవి ఈ వృక్షములు మాత్రము మన్ని యు నెత్తుగా పెరుగునవియే. కొబ్బరికాయలలో గొన్ని పెద్దవిగను, కొన్ని చిన్నవిగను, కొన్ని గుండ్రముగను, కొన్ని కోలగను నుండును. అయితే ఈ కొబ్బరిలో చెన్నంగికొబ్బరి యను ఒక జాతి గలదు. ఈ వృక్షము

అంత ఎత్తుగా పెరుగదు. కాయలు చిన్నవిగానే ఉండును. కాని యీ కాయలపైని త్వక్కు (డొక్క) మిగుల పలచగా నుండును. లోనిది (కొబ్బరి) మిగుల మధురముగా నుండును. కొబ్బరిచెట్లు ప్రతిచోట వృద్ధిగా నుండును. కాని విశేషముగా దక్షిణసముద్రతీరమున వృద్ధి యగుచుండును. ఈ చెట్లు విశేషముగా నా ప్రదేశములందుండుటను బట్టియే మలబారుదేశము కేరళదేశమని వ్యవహరింప బడుచున్నది. కొబ్బరి చెట్టుయొక్క అంగములలో కొబ్బరియు, కొబ్బరినూనెయు ఆహారమున నుపయోగింప బడుచున్నవి. అందు కొబ్బరినూనె కేరళప్రాంతముననే ఉపయోగింపబడును. కొబ్బరిమాత్రము సర్వత్ర ఉపయోగింప బడుచున్నది. కొబ్బరిని ఇతర ఫలములవలె కేవలము ఫలాహారరూపముగను భుజించుదురు. దీనిని మెత్తగా రుబ్బి యందుండి పాలను గ్రహించి పాయసము చేయుదురు. మరియు నీ కొబ్బరితో ననేక పిండివంటలు కూడ చేయబడు చుండును. కొబ్బరినూనె కేశసంస్కారమునకై ప్రతినిత్య ముపయోగింప బడుచున్నది. ఇట్లు కొబ్బరియు కొబ్బరినూనెయు ప్రతి మానవునకు ప్రతి నిత్యము కావలసిన ద్రవ్యములలో చేరుటవలన నీ రెండును వర్తకరూపేణ ఒక దేశమునుండి మరియొక దేశమునకు ఎగుమతి దిగుమతులు చేయబడుచుండును. కొన్ని కొన్ని ప్రాంతములలో కేవల మీ కొబ్బరినేద్యము పైననే వారి జీవయాత్ర గడుచుచుండుటయు గలదు. మరియు నిటులనే ఈ కాయలపైనుండు డొక్కలను నలియగొట్టి త్రాళ్ళుపేని యమ్ముచుందురు. ఈ త్రాళ్ళు కూడ మిగుల ఉపయోగకరములు. మరియు నీ నారతో చాపలు, సంచులు, కాళ్లుతుడుచుకొనుట కనువైనపీచులు, సంచులు మొదలైనవి యల్లబడి సర్వజనోపయోగకరము లగుచున్నవి. కాయలోని నీళ్లు మిక్కిలి మధురముగను, శీతలముగను, తృష్ణాహరములుగను నుండుటచే నెల్లరును త్రాగుదురు. అందు విశేషించి వేసవికాలమునందు లేతకొబ్బరికాయల నీళ్ళను త్రాగుచుందురు. ప్రత్యేకము నీళ్ళ మాత్రమే ప్రధానముగా గల కొబ్బరిచెట్లు గలవు. వీటి కాయలను గంగాబొండములని కొన్ని ప్రాంతములలో చెప్పెదరు. ఇందు కొబ్బరి యుండదనియే చెప్పవచ్చును. ఈ నీరు మిక్కిలి చలువచేయును. ఈ నీళ్ళు మూత్రము శోధించునవి యగుటచే మూత్రవ్యాధులలో నుపయోగింప బడుచుండును. ముదిరిన కొబ్బరి కాయలలో లోన నీరు హరించి పోవునంతకు నిలువయుంచినచో నవి పరిడీలని వ్యవహరింప బడుచుండును. వీటిని తేనెయందును, చక్కెరపాకమునందు ఊ

చేటి భుజించుదురు. పైనుండు పెంకులను కాల్చి యందుండి తైలమును గ్రహించుదురు. ఇది చర్మరోగములకు హితమైనది. ఈ చెట్టుయొక్క మట్టలు, పువ్వులు, ఆకులు మొదలగు ఇతరాంగములు వంటచెరుకుగా నుపయోగింపబడును. మరియు కొబ్బరాకులను చాపలుగాను, చదరులుగాను, బుట్టలుగాను అల్లి ఉపయోగించుచుందురు. ఈ కొబ్బరిచాపలను కొన్ని ప్రాంతములలో ఇంటి పైకప్పులు వేయుటకును, పందిళ్ళకు కప్పులు వేయుటకును ఉపయోగింతురు. కొబ్బరిమొవ్వులను గూడా కొందరు తిందురు. కొబ్బరిపువ్వుల నుండి కొన్ని ప్రాంతములలో మద్యమును గ్రహించుదురు. దీనిని మద్యపానాభ్యాసకులు అతి ప్రేమతో పానము చేయుదురు. ఇది మిక్కిలి మధురముగా నుండుననియు, మిక్కిలి మత్తును గలిగించుననియు చెప్పుదురు. వైద్యమునందు నారికేళము, కూష్మాండ, అమ్లపిత్తాదులలో నుపయోగింపబడుచున్నది. కొన్ని ప్రాంతములలో కొబ్బరిపెంకులనుండి తీసిన తైలమును ఉపజిహ్వాభివృద్ధియందు (కొండనాలుక ఎదిగినప్పుడు) జాగ్రత్తగా నట్టి నాలుకను సన్నని పుడకతో నంటించుదురు. వృద్ధి క్రమముగా శమించును. మరియు కొబ్బరిపుచ్చును అరగదీసి యా గంధమును కంటిలోని పువ్వునకు అంజనము వేయుదురు. పువ్వు క్రమముగా తగ్గిపోవును. ఇటుల గృహవైద్యమునందు గూడ దీని ప్రచారమునందున్నది.

(3) విశేషగుణములు:—

(క) నారికేలఫలము—సామాన్యముగ మధురరసమును, స్నిగ్ధగుణమును గలిగియుండును. (చ-సూ-అ-27.) గురుగుణమును గలిగి యుండును. హృదయమునకు హితమైనది. మాంసధాతువును బోషించును. (సు-సూ-అ-46.)

(ఖ) కోమలనారికేలఫలము (లేతకొబ్బరి)—పిత్తమును శమింపజేయును. పిత్తజ్వరమును బోగొట్టును. (భా-ప్ర.)

(గ) అర్ధపక్వనారికేలఫలము (ముప్పేటకాయ)— గురుస్నిగ్ధగుణములను, శీతవీర్యమును గలిగి యుండును. కష్టముగ జీర్ణమగును. పిత్తమును శమింపజేయును. తృష్ణను, శోషను బోగొట్టును. (రా-ని)

(ఘ) జీర్ణనారికేలఫలము (పండిన లేక ముదిరినకాయ)—గురుగుణమును గలిగియుండును. విదాహమును, విష్టంభమును గలిగించును. పిత్తమును వృద్ధిబొందించును. (భా-ప్ర.) మధురరసమును గలిగియుండును. రుచిని బుట్టించును.

జాఠరాగ్నిని వృద్ధి బొందించును. వీర్యవృద్ధిని, సద్యశ్శుక్రమును జేయును బలమును గలిగించును. (రా-ని.)

(చ) నారికేళజలము - మధురరసమును, లఘుగుణమును శీతవీర్యమును గలిగి యుండును. హృదయమునకు హితమైనది. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. శుక్రమును వృద్ధిజేయును. వస్తిశోధనము జేయును. పిత్తమును శమింపజేయును. తృష్ణను పోగొట్టును. (భా-ప్ర) గురువిపాకమును గలిగియుండును. బలమును గలిగించును. పీనసమును, శ్రమను, దాహమును, శోషను పోగొట్టును. (రా-ని.)

(ఛ) కోమల నారికేళజలము - విరేచనము జేయును. (రా-వ.)

(జ) శుష్కనారికేళఫలము (ఎండుకొబ్బరి లేక కుడిడి)-గురుస్నిగ్ధగుణములను గలిగి యుండును. కష్టముగ జీర్ణమగును. దాహమును గలిగించును. మలస్తంభమును జేయును. బలమును, వీర్యమును, రుచిని బుట్టించును. (-గ.)

(ఝ) నారికేళశిరము (మొవ్వు) కషాయరసమును, మధురానురసమును, గురుస్నిగ్ధగుణములను గలిగి యుండును. బృంహణము. (భా-ప్ర.) మధురరసమును, మధురవిపాకమును గలిగి యుండును. (వై-ని.)

(ట) నారికేళపుష్పము శీతవీర్యమును గలిగి యుండును. మలస్తంభమును జేయును. రక్తాతిసారమును, రక్తపిత్తమును, ప్రమేహమును, సోమరోగమును పోగొట్టును. (వై-...)

(ఠ) నారికేళమద్యము - గురుగుణమును గలిగి యుండును. సద్యశ్శుక్రమును జేయును. (వై-ని.)

(డ) నారికేళగుడము - మధురరసమును, మధురవిపాకమును గలిగి యుండును. కఫమును శమింపజేయును. రక్తపిత్తమును పోగొట్టును. (రా-ని.) స్నిగ్ధగురుగుణములను, కించిదుష్ణవీర్యమును గలిగి యుండును. బలమును రుచిని గలిగించును. సద్యశ్శుక్రమును జేయును. దాహమును గలిగించును. వాతమును శమింపజేయును. గుల్మమును, కాసను పోగొట్టును. (వై-ని.)

(ఢ) నారికేళఘృతము - బృంహణము, బలమును వృద్ధి జేయును. (రా-ని) మధురరసమును, మధురవిపాకమును గలిగి యుండును. కేశములను వృద్ధిబొందించును. రుచిని గలిగించును. హృదయమునకు హితమైనది. వాతపిత్తములను శమింపజేయును. (వై-ని.)

(౨) నారికేలశర్కర - మధురరసమును గలిగి యుండును. వాతపిత్తములను శమింపజేయును. (రా-ని.)

(౩) నవనారికేల తైలము - మధురరసమును, మధురవిపాకమును గలిగి యుండును. బృంహణము, బలమును వృద్ధిబొందించును. కేశములకు హితమైనది. హృదయమునకు హితమైనది. రుచిని బుట్టించును. (రా-ని.) గురుగుణమును గలిగి యుండును. వాజీకరణము, క్షీణధాతువులను బోషించును. మేధాశక్తిని వృద్ధిజేయును. వాతపిత్తములను శమింపజేయును. మూత్రాఘాతమును ప్రమేహమును, శ్వాసను, కాసను, యక్ష్మను, అభిఘాతవ్రణమును బోగొట్టును. (ఆత్రేయ.)

(౪) పురాణనారికేల తైలము-తిక్తరసమును, మధురానురసమును, గురుగుణమును గలిగి యుండును. హృదయమునకు హితమైనది. వాతమును శమింపజేయును. కండువును, కుష్ఠమును బోగొట్టును. (రా-ని.)

(4) ప్రయోగములు:—

1. ఛర్దియందు నారికేల ప్రయోగము.

"సితోపలా మాక్షికపిప్పలీభిః ।
అథ నారికేలం లిహ్యాత్" ॥

కొబ్బరికల్కమునందు కలకండను, పిప్పళ్ళచూర్ణమును, తేనెనుగలిపి సేవించిన ఛర్ది శమించును. (చ-చి-అ-20.)

2. పరిణామశూలయందు నారికేల ప్రయోగము.

"నారికేలం సతోయం చ లవణేన సుపూరితం ।
మృదావశేషితం శుష్కం పక్వం గోమయవహ్నినా ।
పిప్పల్యా భక్షితం హన్తి శూలం హి పరిణామజం" ॥

నీళ్ళతోగూడిన కొబ్బరికాయను సైంధవలవణముచే పూరించి పైన మన్నుబూసి బాగుగా ఎండించి పిడకలతో పుటము వేయవలెను. సాంగశీతలమున అందుండు మజ్జను గ్రహించి పిప్పళ్ళతో జేర్చి మెత్తగా చూర్ణించి సేవించిన పరిణామశూల శమించును. శా-ప్ర.

3. మూత్రశర్కరయందు నారికేల ప్రయోగము.

"దధ్నాపీతం వా నారికేలజం కుసుమం ।
విణ్మూత్రశర్కరాయాః భవతి సుఖీ కతిపయైః దివసైః" ॥

కొబ్బరిపువ్వును కల్కముగా నూరి పెరుగుతో సేవించిన మూత్రజాది శర్కరలు శమించును. (భా-ప్ర.)

4. సూర్యావర్తార్ధావభేదకములందు నారికేల ప్రయోగము.

"నీరం వా నారికేలజం" ॥

కొబ్బరికాయ నీటిని పానముజేసిన సూర్యావర్త, అర్ధావభేదకములను శిరోవ్యాధులు శమించును. (చ-ద.)

5. కృమిరోగమునందు నారికేల ప్రయోగము.

"నారికేలస్య నిర్యూహః కృమిహా స్యాత్సరామఠః" ॥

కొబ్బరికషాయమున నింగువ జేర్చి సేవించిన కృమిరోగముశమించును. (వై-మ.)

6. వ్రణమునందు నారికేల ప్రయోగము,

"జీర్ణంచ నారికేలస్య తైలం హన్యాత్ వ్రణం ద్రుతం" ॥

నిలవయున్నట్టి కొబ్బరినూనెను బూయుచుండిన వ్రణము శీఘ్రముగా శమించును. (వై-మ.)

(5) యోగములు:—

1. నారికేలఖండము - బృహన్నారికేలఖండము - (భైషజ్య - శూల.) మాత్ర:- $\frac{1}{2}$ తులం.

ఉపయోగములు:—అమ్లపిత్తము, అరుచి, క్షయ, రక్తపిత్తము, శూల ఛర్ది, పరిణామశూల, హృద్రోగము ఇవి శమించును. బలము పుష్టియు గలుగును. వాజీకరమగును.

2. నారికేలామృతము - (భైష-శూల.) మాత్ర:—1 తులం.

ఉపయోగములు:—శూల, పరిణామశూల, అమ్లపిత్తము, పృష్ఠశూల, అన్నద్రవశూల, పార్శ్వశూల, మూత్రాఘాతము, రక్తపిత్తము, పీనసము, ప్రతిశ్యాయము ఇవి శమించును. రసాయనము. అగ్నిదీపనమును జేయును.

3. నారికేళాంజనము - మహానారికేళాంజనము - (బ-రా-నేత్రరోగ)

ఉపయోగములు:—అంజనము వేసిన అర్మము, కాచము, తిమిరము, అర్బుదము, వర్త్మరోగము మొదలగు నేత్రవ్యాధులు శమించును.

4. నారికేలరసాయనము - (వై-చిం-ప్రమేహ.) మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—సోమరోగము, ప్రమేహము, మూత్రకృచ్ఛ్రము, అంగదాహము, కార్శ్యము ఇవి శమించును. రసాయనము.

5. నారికేళఘృతము - (వై-చిం-మూత్రకృచ్ఛ్ర.) మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—మూత్రకృచ్ఛ్రము, అంగదాహము, శిరోదాహము, అసృగ్దరము, యోనిరోగము, క్షయము, పిత్తప్రకోపము ఇవి శమించును.

(6) Actions and uses:—Coconut oil has been recommended as a substitute for Cod liver oil. But its prolonged use is said to induce disturbance of the digestive organs and diarrhoea, this objection may be removed by using the oleim, separated from the solid fats, as is done by the natives in the preparation of what they call 'muthel' or hand oil. To prepare this the kernal of the freshnuts is pulped and strained and the oil prepared from the milky fluid by heating it; a preparation of the same kind is now known in Europe as Coco oleim.

(Dymock III. P. 515.)

Whilst the worldi population Continues to increase, and whilst communities continue to advance towards what we have termed "a higher plane of living" the demand for and the consumption of the Coconut in the form of edible, and industrial fats, fibres yarns, and many other articles must continue to increase. There can be no limitation the coconut is a necessasity and not a luxury.

(Tropical Mail 1913).

---

# 114

# నింబః - వేపచెట్టు (క)

---

## భాషాంతర నామములు

హింది - నీమ్. మరాఠి-బాళంతనింబ, కడూనింబ. గుజరాతి-లీంబడో. మలయాళం - ఆర్యవేప్పు. కర్ణాటకము - బేవవేవు. ద్రావిడ-వేప్పు.

## Natural Order—Meliaceae

వేప కుటుంబము

వేపచెట్టు - Melia Azadirachta (Eng·Nimb tree)

## నైసర్గిక స్వరూప వర్ణనము.

ఈకుటుంబములో విస్తారము వృక్షములేగలవు. ఆకులంకు గణుప ఫుచ్ఛము ...కవు, ఒంటరిచేరిక. సాధారణముగ బహువైఖరిగ నుండును. చివ్వనాకుల ఖుదలు వంకరగానుండును. పుష్పములు చిన్నవి. రక్షకపత్రిములు, ఆకర్షణపత్రములు, ...

కలవు. అవి కలసియైనను విడివిడిగా నైనను నుండును. కింజల్కపు కాడలన్నియుఁ గలసి ఒక గొట్టమువలె నేర్పడును. ఈగొట్టముయొక్క లోపలి వైపుననే పుప్పొడి తిత్తులు గలవు. అండాశయము మట్టఁ బత్తెరము గలదు. అండాశయములోఁ దఱుచుగా నైదు గదులుండును.

## పర్యాయ పదములు

శ్లో॥ నింబః స్యాత్పిచుమర్దశ్చ పిచుమందశ్చ తిక్తకః ।
అరిష్టః పారిభద్రశ్చ హింగునిర్యాస ఇత్యపి॥

నింబము, పిచుమర్దము, పిచుమందము, తిక్తకము, అరిష్టము, పారిభద్రము, హింగునిర్యాసము అనునవి నింబనామములు.

## నింబ గుణములు

శ్లో॥ నింబః శీతో లఘుర్గ్రాహీ కటుపాకోఽగ్నివాతకృత్ ।
అహృద్యః శ్రమతృట్కాస జ్వరారుచి కృమిప్రణుత్ ॥
వ్రణపిత్త కఫచ్ఛర్ది కుష్ఠహృల్లాసమేహనుత్ ॥

వేపచెట్టు తిక్తరసమును, లఘుగుణమును, శీతవీర్యమును, కటువిపాకమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. కొద్దిగ హృదయమునకు హితమైనది. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. వాతమును వృద్ధిజేయును. పిత్తకఫములను శమింపజేయును. శ్రమ, తృష్ణ, కాస, జ్వరము, అరుచి, క్రిమి, వ్రణము, ఛర్ది, కుష్ఠము, హృల్లాసము, ప్రమేహము అను నీ వ్యాధులను బోగొట్టును.

### మహానింబః—పెనువేప (లేక) కొండవేపచెట్టు (ఖ)

శ్లో॥ మహానింబః స్మృతో ఽద్రేక్కః రమ్యకో విషముష్టికః ।
కేశముష్టిర్నింబరకః కార్ముకో ఽక్షీవ ఇత్యపి ॥

మహానింబము, ద్రేక్కము, రమ్యకము, విషముష్టికము, కేశముష్టి, నింబరకము, కార్ముకము, అక్షీవము అనునవి మహానింబనామములు.

## మహానింబ గుణములు

శ్లో॥ మహానింబో హిమో రూక్షః తిక్తో గ్రాహీ కషాయకః ।
కఫపిత్తభ్రమచ్ఛర్ది కుష్ఠహృల్లాస రక్తజిత్ ॥
ప్రమేహశ్వాస గుల్మార్శో మూషికా విషనాశనః ॥

పెనువేపచెట్టు తిక్తరసమును, కషాయానురసమును, రూక్షగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. కఫపిత్తములను శమింపజేయును. భ్రమను, ఛర్ది, కుష్ఠము, హృల్లాసము, రక్తదోషము, ప్రమే

హము, శ్వాస, గుల్మము, అర్శస్సు, మూషికవిషము అను నీ వ్యాధులను పోగొట్టును.

## కాలశాకః — కరివేపచెట్టు (గ)

## Natural Order—Tilia ceae

### కాలశాకము - Corcholus Capsularis

శ్లో॥ నాడీకం కాలశాకం చ శ్రాద్ధశాకం చ కాలకం ॥

నాడీకము, కాలశాకము, శ్రాద్ధశాకము, కాలకము అనునవి కాలశాక నామములు.

### కాలశాకగుణములు

శ్లో॥ కాలశాకం పరం రుచ్యం వాతకృత్కఫశోథహృత్ ।
బల్యం రుచికరం మేధ్యం రక్తపిత్తహరం హిమం ॥

కరివేపాకు సరిగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. రుచిని పుట్టించును. బలమును గలిగించును. మేధాశక్తిని గలిగించును. వాతమును వృద్ధిబొందించును. కఫపిత్తములను శమింపజేయును. శోఫను రక్తదోషమును పోగొట్టును.

### విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(నింబ) - హింగునిర్యాసము, (వరత్వచ, కాకఫలము, కీరేష్టము, విశీర్ణపర్ణము, పీతసారకము.) (మహానింబ) - (శుక్లశాలము,) (కాలశాక) - కాలశాకము, శ్రాద్ధశాకము.

(ఖ) గుణబోధకములు:—(నింబ)-నిముగ్నము, అరిష్టము, తిక్తకము, (ఛర్దనము, పక్వకృత్తు, పూయారి, ఛర్దిఘ్నము, శీతము), (మహానింబ)-(మహాతిక్తము, హిమద్రుమము.)

(గ) ఉత్పత్తిబోధకములు:—(మహానింబ) (పార్వతము).

(2) శబ్దార్థములు:—

హింగునిర్యాసము - ఇంగువవంటి నిర్యాసమును విడుచునది. వరత్వచ - శ్రేష్ఠమైన పట్టను గలది. కాకఫలము - కీరేష్టము—కాకులకును, చిలుకలకును ఇష్టమైన ఫలములను గలది. విశీర్ణపర్ణము - చుట్టును కోతలు కోసినటు చిహ్నములుగల పత్రములను గలది. పీతసారకము - పసుపుపచ్చనిసార

ము నుగలది. శుకసాలము - తెల్లని శాలవృక్షములవలె నుండునది. కైట శాకము [illegible] పత్రములతో గూడియుండునది. శార్ఙ్గశాకము - శార్ఙ్గ ములం దుపయోగించబడునట్టి పత్రములు గలది. పిచుమర్దము - వ్యాధులను బోగొట్టునది. అరిష్టము - వ్యాధులు లేకుండునట్లు జేయునది. తిక్తకము - తిక్తరసమును గలది. ఛర్దనము - వాంతిని గలిగించునది. పక్వకృత్తు - (వ్రణశోథన) పాకము బొందించునది. పూయారి - పూయమును బోగొట్టునది. ఛర్దిఘ్నము - వాంతిని బోగొట్టునది. శీతము - శీతవీర్యము గలది. మహాతిక్తము - విశేషముగా తిక్తరసము గలది. హిమద్రుమము - చల్లదనమును గలిగించునట్టి వృక్షము. పార్వతము - కొండలపై నుత్పత్తి యగునది.

(3) భేదములు:—

ఇది సాధారణవేప, పెద్దవేప (లేక) కొండవేప, కరివేపయని మూడు విధములుగానుండి యెత్తుగా బెరుగు వృక్షజాతులలో నుత్పత్తి గలిగి తిక్తరస వర్గములో జేరి జ్వరకుష్ఠాదిరోగ హరద్రవ్యములలో నుత్తమమైనదిగ వ్యవహరింపబడుచున్నది. అయితే నింకను దీనియందనేక భేదములున్నవని జెప్పుదురు. కొందరు ఈ సాధారణ వేపయే కొండల యందుత్పత్తి యగుటచే కొండవేప యని జెప్పబడుచున్నది గాని నిజముగా నీరెండింటికిని భేదములేదనియు జెప్పుదురు. ఎట్లైనను ఈ వేపజాతులు మిగుల తిక్తరసమును గలిగియుండును. ఇవి యెల్లచోటుల నుత్పత్తియగును. వేపపండ్లు పండినప్పుడు పచ్చవర్ణమునుండి లోపగుజ్జు మిగుల మధురముగా నుండును. వీనిని విశేషముగా కాకులు చిలుకలు మొదలగు పక్షిజాతులత్యంత ప్రేమతో భక్షించును. వ్యవహారమునందీ వృక్షముయొక్క పుష్పమును, గింజలను మాత్రమే యాహారమునందుపయోగించు ద్రవ్యములలో జేర్చుదురు. దీని పువ్వును సంవత్సరారంభమున షడ్రసముల నభ్యాసపరచుటకు భుజించు భక్ష్యకల్పనలో జేర్చుదురు. అవగా దీనిని వసంతర్తువారంభమున భక్షించుటకు ఆరంభించుటను బట్టిజూడగా తిక్తరసము నభ్యాసపరచుటయు, నిందువలన ఆకాలమునందు ప్రకోపించుట కున్ముఖమైన కఫమునకు ముందుగా జేయు చికిత్సయునని యూహింపవచ్చును. మరియు నీవృక్షములను గ్రామములలో నాలుగు వీధులు గలియు చోట రావిచెట్లతో గలిపి నాటి పెద్దజేసిన పిమ్మట నీజంటను వివాహము జేయుట యాచారమైయున్నది. ఈ క్రియ గృహస్థులుజేయు ధర్మకార్యములలో నొకటిగా నెన్నబడుచున్నది. మరియు దీనియాకులను నీళ్లలోవేసి కాచి

యోనులను బాలింతలను స్నానమునకై యుపయోగించుదురు. పొరుగింటియం దెవరికైన గ్రహము సోకినను, మసూచికము కలిగినను చుట్టుప్రక్కలనున్న ప్రతియింటి వీధిగుమ్మమునకును వేపాకులను గట్టుదురు. ఇట్టి యాచారము వలన నట్టి గ్రహము మసూచికాది బాధలు తమయిండ్లలోనికి సోకవని వారి యభిప్రాయము. ఈ వృక్షముయొక్క చిన్న చిన్న కట్టెలను వంటచెరకుగాను, పెద్దకర్రలను (లావుగానుండువానిని) ఇంటి ద్వారబంధములు, కర్రసామానులు మొదలగువానిని నుపయోగించుదురు. దీనిచెక్కయొకవిధమగు పరిమళమును గలిగియుండును. ముదిరిన చెట్లనుండి యొకవిధమగు నిర్యాసము(జిగురు) కారుచుండును. దీనిని వేపబంగారమనిగూడ వ్యవహరించు చుందురు. అయితే దీని యుపయోగ మెట్టిదియో దెలియకున్నది. మరియు ముదిరిన చెట్లనుండి కొన్నిచోట్ల కల్లువంటిదియూటగూడ వాడుకలో నున్నట్లు చెప్పుదురు. ఇది కుష్ఠాదిమహారోగములందు ప్రశస్తమైనదిగా జెప్పుదురు. వీని కాష్ఠములతో ప్రతివారును దంతధావనము జేయుదురు. ఈ వృక్ష[illegible] వ్యవహారమునందే గాకుండ వైద్యమునందు గూడ ననేక విధములగు ప్రయోగములను గలిగి యున్నవి. అందు జ్వరము, కుష్ఠము, వ్రణము మొదలగు పిత్త, రక్త, ప్రధానములైన వ్యాధులందు విశేషముగా వాడబడు చున్నవి. ఈ వృక్షముయొక్క పంచాంగములును (ఆకు, పువ్వు, కాయ, పట్ట, వేరు) పైని జెప్పినట్టి ప్రయోగములను గలిగి యున్నవి. దీనిపటయొక్క కషాయముతో క్షాళనము జేసిన దుష్టవ్రణము శీఘ్రముగా మానును. ఆకులను ధూపమువేసినను (లేక) మెత్తగానూరి పైనివేసి కట్టినను వ్రణములందలి పూయము, క్రిములు మొదలగునవి నశించి శీఘ్రముగా రోపణమగును. వీనిగింజలనుండి దీసిన తైలమును కుష్ఠాదివ్రణములకు అభ్యంగము జేసిన మిగుల శ్రేష్ఠము. ఇటుల వేపచెట్టు యొక్క ప్రత్యంగమును అమోఘముగు ననేక ప్రయోజనములను గలిగి యున్నది.

కాలశాకమనగా కరివేపయని వ్యవహరింప బడుచున్నది. కొందరు పైని జెప్పినట్టి కొండవేపనె కరివేపగా జెప్పుదురు. కాని మహానింబముయొక్క పత్రములు కాల (నల్లని) వర్ణమునుగలిగి యున్నట్లుగా వర్ణింపబడకుండుటనుబట్టి యీకాలశాకమే కరివేపగా గ్రహించుట యుక్తముగా దోపగలదు. మరియు దీనికి జెప్పబడిన 'శ్రాద్ధశాకము' అను పర్యాయ పదమునుబట్టి యిది పితృకార్యములలో నుపయోగింపబడుట వ్యవహారము నందుగూడ గలదు.

ఈ వృక్షము ఒక్క వర్ణమునందుదప్ప ప్రతి యంగమునందును వేపచెట్టును బోలియే యుండును. వర్ణముమాత్రము మిగుల నల్లగనుండును. కాయలు పచ్చివిగా నున్నప్పుడు ఆకుపచ్చని వర్ణమును, ముదిరినప్పుడు ఎఱ్ఱని వర్ణమును, పండినప్పుడు నల్లనివర్ణమును గలిగియుండును. ఈఫలములనుగూడ భక్షించుదురు. అయితే దీనియంగములలో పత్రములకు మాత్రమే విశేష ప్రయోగమున్నట్లు గానబడును. ఈ యాకు ఒకవిధమగు సువాసనగలిగి ప్రతినిత్యము భుజింపబడు ఆహారమునందలి భిన్నభిన్న పదార్థములందెల్ల చేర్చబడుచుండును. మరియు దీపన పాచనముకై యీ యాకును భర్జనచేసి ధాన్యకము జీరకము మొదలగు వాటితో జేర్చి లవణసహితముగా చూర్ణించి ప్రథమ కబళమున ఘృతసహితముగా కలుపుకొని యన్నమును భుజించుదురు. ఇటులనే వైద్యమునందుగూడ నీ పత్రము దీపనపాచనముకై ప్రయోగింపబడుచున్నది.

**(4) విశేషగుణములు:—**

(క) నింబము-రక్తదోషమును కండువును పోగొట్టును. లేపనముజేసిన అపక్వవ్రణశోథను పాకము బొందించును. పక్వశోథను శోధించును. (ధ-ని.) విషమును, హృదయదాహమును పోగొట్టును. (రా-ని.)

(ఖ) నింబపత్రము - కటువిపాకమును గలిగి యుండును. నేత్రములకు హితమైనది. వాతమును వృద్ధిబొందించును. పిత్తమును శమింపజేయును. క్రిములను, విషమును, అరుచిని, కుష్ఠమును పోగొట్టును. (భా-ప్ర.)

(గ) నింబఫలము - తిక్తరసమును, స్నిగ్ధలఘుగుణములను, ఉష్ణవీర్యమును, కటువిపాకమును గలిగి యుండును. మలభేదనము జేయును. కుష్ఠమును, గుల్మమును, అర్శస్సును, క్రిములను, మేహోవృద్ధిని పోగొట్టును. (భా-ప్ర.)

(ఘ) నింబతైలము - తిక్తరసమును గలిగియుండును. కుష్ఠమును, క్రిములను పోగొట్టును. (భా-ప్ర-టీ.) కటురసమును గలిగి యుండును. కఫమును శమింపజేయును. (రా-ని.)

(చ) నింబపుష్పము - రుచిని బుట్టించును. పిత్తశ్లేష్మములను శమింపజేయును. (ప-గు-క.,) కుష్ఠమును పోగొట్టును. (సు-సూ-అ 46.)

(ఛ) మహానింబము - కటుకాషాయరసమును గలిగియుండును. విషజ్వరమును పోగొట్టును (రా-ని.,) దాహము, వ్రణము, క్రిములు, విషూచిక, శీతపిత్తము, కోఠము, విషము అను నీవ్యాధులను పోగొట్టును. (చ-ర.)

(జ) మహానింబత్వక్కు - మిగుల తిక్తరసమును గలిగియుండును. అధిక సేవనవలన మత్తును కలుగజేయును. (ద్రి-గు.)

(ఝ) మహానింబపుష్పము - శిరశ్శూలను బోగొట్టును, (ద్రి-గు.)

(ట) పత్రము - ఫలము - విషమువంటి గుణమును గలిగియుండును. కుష్ఠమును బోగొట్టును. (ద్రి-గు.)

(ఠ) కాలశాకము - గురుగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. (రా-వ,) కటురస, తిక్త లవణానురసములను గలిగియుండును. ఆమమును పచింపజేయును. మలభేదనము జేయును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. విషమును, అస్మృస్సు బోగొట్టును. (వై-ని.)

(5) ప్రయోగములు:—

1. కుష్ఠమునందు నింబప్రయోగము.

"నింబపటోలస్య ఇతిషట్ కషాయయోగాః
కుష్ఠఘ్నాః నిర్దిష్టాః స్నానే పానే చ మతాః"

వేపకషాయమును స్నానపానముల కుపయోగించిన కుష్ఠముశమించును. (చ-చి-అ 7.)

2. సురామేహమునందు నింబప్రయోగము.

"సురామేహినం నింబకషాయం॥"

వేపచెక్క కషాయమును పానముజేసిన సురామేహము శమించును. (సు-చి-అ 11.)

3. అరూంషికయందు నింబప్రయోగము.

"అరూంషికాం హృతే రక్తే సేచయేన్నింబవారిణా॥"

అరూంషికయను శిరోవ్రణములకు(తలవ్రణరోగ)మందుగా రక్తస్రావము జేసిపిమ్మట నింబత్వక్కుకషాయముతో సేచనముజేసిన శమించును. (సు-చి-అ20.)

4. పద్మినీకంటకమందు నింబప్రయోగము.

"నింబారగ్వధయోః క్వాథో హిత ఉత్సాదనే భవేత్॥"

వేపచెక్క, రేలచెక్క వీటికషాయముతో రుద్దిన పద్మినీ కంటకమను వ్యాధి శమించును. (సు-చి-అ 20.)

5. దాహజ్వరమునందు నింబప్రయోగము.

"మధుఫాణితయుక్తేన నింబపత్రాంభసాపి వా,
దాహజ్వరార్తం మతిమాన్ వామయేత్ క్షిప్రమేవచ॥"

వేపాకుల కషాయమునందు తేనెతో సిద్ధముచేసిన ఫాణితమును జేర్చి పానముజేయించి వమనము జేయించిన వెంటనే దాహజ్వరము శమించును. (సు-ఉ-అ 39.)

6. కఫజతృష్ణయందు నింబప్రయోగము.

"హితం భవేత్ ఛర్దనమేవ చాత్ర తప్తేన నింబప్రసవోదకేన" ॥

వేపపువ్వుల కషాయముతో వమనకర్మ జేసిన కఫజతృష్ణ శమించును. (సు-ఉ-అ-48.)

7. వాతరక్తమునందు నింబ ప్రయోగము.

"పటోలనింబ పత్రాణి క్వథిత్వా మధుసంయుతం ।
పాచనం వాతరక్తానాం తథా చ శమనాని చ" ॥
"కాంజికేన చ సంపిష్య పిచుమర్ద దలాని చ ।
లేపనం శస్యతే తస్య వాతరక్త ప్రశాంతయే" ॥

వేపాకుల కషాయమునందు తేనెనుజేర్చి పానముజేసిన వాతరక్తము నందు దోషపాచనమును, వ్యాధిశమనమును నగును. మరియు వేపాకులను కాంజికముతో నూరి లేపనముజేసిన వాతరక్తము శమించును (హా-సం.)

8. వ్రణమునందు నింబ ప్రయోగము.

"నింబపత్రాణి సంపిష్య మధునా వ్రణశోధనం" ॥

వేపాకులను మెత్తగా నూరి తేనెగలిపి లేపనము జేసిన వ్రణశోధన మగును. (హా-సం.)

9. దన్తరోగమునందు నింబ ప్రయోగము.

"క్వాథశ్చ నింబమూలస్య దన్తరోగ నివారణః" ॥

వేపవేరు కషాయముతో సుఖోష్ణముగ గండూషము జేసిన దన్తరోగము శమించును. (హా-సం.)

10. విషమునందు నింబ ప్రయోగము.

"......నింబఫలాని చ ।
ఉష్ణోదకేన పీతాని జయేయుః తత్ క్షణాద్విషం" ॥

వేపగింజలను మెత్తగా నూరి యుష్ణోదకముతో సేవించిన వెంటనే విషప్రతీకారమగును. అనగా విషము వాంతిరూపముగా బయటకు వచ్చును. శేషము శమించును అని భావము. (హా-సం.)

11. ఖాలిత్య పాలిత్యములందు నింబ ప్రయోగము.

"మాసం వా నింబజం తైలం క్షీరభుక్ నావయేత్ యతిః" ||

వేపనూనెను యథావిధిగ నొక మాసము నస్యముచేయుచు పాలతో కలిపి యాహారమును సేవించుండిన ఖాలిత్యము, పాలిత్యము శమించును. (వా-ఉ-అ-24.)

12. ఉదర్దకోఠాదులందు నింబ ప్రయోగము.

"నింబస్య పత్రాణి సదా ఘృతేన

ధాత్రీ విమిశ్రాణ్యథవోపయుంజ్యాత్ ।

విస్ఫోటకోఠ క్షత శీతపిత్త కండ్వమ్లపిత్తం సహసాచ హన్యాత్" ||

వేపాకులను, ఉసిరికపప్పును మెత్తగా నూరి నేయిగలిపి లేపనము జేసిన విస్ఫోటము, కోఠము, క్షతము, శీతపిత్తము, కండు, అమ్లపిత్తము ఇవి వెంటనే శమించును. (చ-ద.)

13. కామిలయందు నింబ ప్రయోగము.

"......నింబస్య వా రసః ।

ప్రాతః మాక్షికసంయుక్తః శీతః కామలాపహః" ||

వేపచెక్క కషాయమునందు తేనెజేర్చి ప్రాతి యుదయమునను సేవించిన కామిల శమించును. (చ-ర.)

14. కఫజహృద్రోగమునందు నింబ ప్రయోగము.

"నింబకోశాతకీభ్యాం వామ్యం హృది కఫోత్థితే" ||

వేపగింజలను, చేదుబీరగింజలను మెత్తగా నూరి జలమునందు గలిపి పానముజేసి వమనము జేసిన కఫజహృద్రోగము శమించును. (వం-సే.)

15. నేత్రరోగమునందు నింబ ప్రయోగము.

"శుంఠీ నింబదలైః పిండః సుఖోష్ణః స్వల్పసైంధవః ।

ధార్యశ్చక్షుషి సంక్షేపాచ్ఛోథ కండూవ్యథాపహః" ||

శుంఠి వేపాకులు వీనిని మెత్తగా నూరి అందు కొద్దిగా సైంధవలవణమును గలిపి యుడికించి సుఖోష్ణముగ నేత్రములపైనుంచి కట్టుగట్టిన నేత్రశోఫ, కండు, శూల ఇవి శమించును. (వం-సే.)

16. శిశువుల జ్వరమునందు నింబ ప్రయోగము.

"నింబస్య పత్రం మాక్షికం సర్పిర్యుక్తంతు ధూపనం ।

జ్వరవేగం నిహంత్యాశు బాలానాం తు విశేషతః" ||

23. యోనిరోగమునందు నింబ ప్రయోగము.

"ప్రక్షాళితం తు బహుశః పిచుమందతోయైః।
నింబత్వచా తదనునిర్మిత ధూపకార్యం।
స్త్రీణాం నితంబసహాం ప్రవిముక్తగంధం।
పైచ్ఛిల్య దోషరహితా చ భవేత్ ప్రగాఢా"॥

వేపచెక్క కషాయముతో ననేకమార్లు క్షాళనము జేసి, పిమ్మట వేపచెక్క చూర్ణముతో ధూపమువేసిన యోనియందలి దుర్గంధమును పైచ్ఛిల్యమును నశించి యోనికి గాఢత్వ మేర్పడును. (గ-ని.)

24. గృధ్రసీవాతమునందు మహానింబ ప్రయోగము.

"మహానింబ జటాకల్కో గృధ్రసీ నాశనః పరః"॥

పెద్దవేపచెట్టుయొక్క వేరును మెత్తగా నూరి కల్కముచేసి సేవించిన గృధ్రసీవాతము శమించును. (గ-ని.)

(6) యోగములు:—

1. నింబాది తైలము - (వా-వాతరోగ.) మాత్ర:-5 బిందువులు,

ఉపయోగములు:—వాతరోగము, కుష్ఠము, నాడీవ్రణము, అర్బుదము, భగందరము, గండమాల, జత్రూర్ధ్వగతవ్యాధులు, గుల్మము, అర్శస్సు, ప్రమేహము, యక్ష్మ, అరుచి, శ్వాస, కాస, పీనసము, శోఫ, హృద్రోగము, పాండు, మదాత్యయము, విద్రధి, వాతరక్తము అను నీ వ్యాధులు శమించును.

2. పంచనింబాదిచూర్ణము - (భైషజ్య-అమ్లపిత్త.) మాత్ర: ½ తులము.

ఉపయోగములు:—శూల, అమ్లపిత్తమును శమించును.

3. పంచనింబచూర్ణము - బృహత్పంచనింబచూర్ణము-(భైషజ్య-కుష్ఠ.) మాత్ర:-1 కోలము మొదలు 1 పలము.

ఉపయోగములు:—విచర్చిక, ఉదుంబరము, పుండరీకము, కపాల కుష్ఠము, దద్రువు, కిటిభము, అలసము, శతారు, విస్ఫోటము, విసర్పము, పామ, కిలాసము, భగందరము, శ్లీపదము, వాతరక్తము, నాడీవ్రణము, ప్రమేహము, ప్రదరము, జంగమవిషము, స్థావరవిషము, స్థౌల్యము, ఉదరము ఇవి శమించును, రసాయనము.

4. నింబపత్రాదిలేపము - (భైషజ్య-వ్రణ.)

ఉపయోగములు:—లేపనముచేసిన వ్రణశోధనమగును. దుష్టవ్రణము శమించును.

(7) Actions and uses:—(వేప) The bark and leaf stalks are astringent bitter tonic and antiperiodic and used in intermittent and paraxysmal fevers and for general debility and convalescence, and after febrile and other diseases. The leaves are discutient and local stimulant and used in various or poultices to disperse indolent gland and swellings. The young trees yield a kind of (toddy) sweet juice which when fermented is used as stomachic and anthelmintic and is given in worms and jaundice. The pulp is applied to boils, pustular eruptions, open sores and bruised joints. The compound powder 'Pancha nimba choornam' is tonic and given in convalescence after fever. The fruit is a purgetive anthelmintic and alterative. The oil of the seed is bitter anthelmintic and stimulent and given in leprosy, intestinal worms, piles, and urinary diseases. The gum is used by lying in women as an uterine stimulent. The seeds are used for killing pediculi and the powdered kernal for washing the hair and as a remedy for mange in dogs. The oil mixed with other oils is applied to skin diseases, suppurating scrofulons glands and leprous ulcers. It is rubbed on the skin in rheumatic affections and to the head in headache. The oil contains sulphur and therefore with alkalies it is used in skin diseases. (Khory II. P. 120)

Actions and uses:—(మహానింబ) In small doses the bark is bitter tonic, astringent, antiperiodic, anthelmintic, given to children in round worms and to adults in fever and indigestion; leaves and flowers are alterative and diuretic. The juice of the leaves is used in fevers, dyspepsia, general debility, jaundice, worms, scrofula, boils, leprosy etc., Externally the flowers and leaves are discutients, as a poultice they are made warm and applied to the head in nervous headaches. A Poultice of the flowers is said to kill lice and to cure eruptions of the scalp; a paste of the leaves is applied hot to unhealthy ulcers, to indolent scrofulous glands and to pustular eruptions; in large doses producing giddiness, dimness of sight, mental contusion, stupor, dilated pupils and stertor. It also acts as a gastrointestinal irritant producing vomitting and purging.

Khory II. P 119.

స్వానుభవము

[ క్రిములను కడుగులకు దీని పట్టను కషాయము కాచి క్రిమిహారముగా నుపయోగించుచున్నారు. దీని యాకులు కూడ క్రిములను పోగొట్టునవియును, ఉత్తేజమును గలిగించునవియును అయి యున్నవి. మరియు మొద్దుబారియుండు గ్రంథులకును, వాపులకును ఆకులముద్దను కట్టుకట్టుదురు. వేపాకుముద్దను పసుపుతో కలిపి మసూచికపు పొక్కులు చితి

కిన తరువాత పైన పూయుటకు ఉపయోగింతురు. లేత చిగుళ్ళను చన్నీళ్ళలో గాని, మంచుగడ్డ కలిపిన నీళ్ళలో గాని వేసి బాగుగా చిలకగా వచ్చిన నురుగును హెచ్చుజ్వర ముండునపుడు జ్వరము తగ్గుటకు పై పూతగా నుపయోగింతురు. వేప నూనె బహిర్లేపనముచే కృమిహరమును వ్రణరోపణమును అయి యున్నది. అ. ల. ]

---

# 115
# నీలదూర్వా - పచ్చగరికె (క)

---

## భాషాంతర నామములు

హిందీ - మలయాళం - కరుగ. కర్ణాటకం - కరిగె. ద్రావిడం-అరుహూర్ పుల్.

## నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order—Gramineae**

తృణ. కుటుంబము

పచ్చగరిక - Cynodon dactylon (Eng, Creeping Cynodon)

(325-వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ నీలదూర్వా రుహా సంతా భార్గవీ శతపర్వికా।
శష్పా సహస్రవీర్యా చ శతవల్లీ చ కీర్తితా॥

నీలదూర్వా, అనంత, భార్గవి, శతపర్విక, శస్య, సహస్రవీర్య, శతవల్లి యనునవి నీలదూర్వానామములు.

## నీలదూర్వా గుణములు

శ్లో॥ నీలదూర్వా హిమా తిక్తా మధురా తువరా హరేత్ ।
కఫపిత్తాస్రవీసర్ప తృష్ణా దాహత్వగామయాన్ ॥

పచ్చగరికె తిక్తరసమును, మధుర కషాయానురసములను, శీతవీర్యమును గలిగి యుండును. కఫపిత్తములను శమింపజేయును. రక్తదోషము, విసర్పము, తృష్ణ, దాహము, త్వగ్రోగములు అను నీ వ్యాధులను బోగొట్టును

## శ్వేతదూర్వా తెల్లగరికె (ఖ)

శ్లో॥ దూర్వా శుక్లా తు గోలోమీ శతవీర్యా చ కథ్యతే ॥

శుక్లదూర్వ, గోలోమి, శతవీర్య యనునవి శ్వేతదూర్వానామములు.

## శ్వేతదూర్వా గుణములు

శ్లో॥ శ్వేతదూర్వా కషాయా [illegible] వర్ణ్యా చ దీపనీ ।
తిక్తా హిమా విసర్పా[illegible]దాహహృత్ ॥

తెల్లగరికె కషాయరసమును, మధుర తిక్తానురసములను, శీతవీర్యమును గలిగి యుండును. వర్ణములకు హితమైనది. జఠరాగ్నిని వృద్ధిబొందించును. పిత్తకఫములను శమింపజేయును. విసర్పము, రక్తదోషము, తృష్ణ, దాహము అను నీ వ్యాధులను బోగొట్టును.

## గండదూర్వా నీటిగరికె (గ)

శ్లో॥ గండదూర్వా తు గండాలీ మత్స్యాక్షీ శకులాదనీ ॥

గండదూర్వ, గండాలి, మత్స్యాక్షి, శకులాదని యనునవి గండదూర్వా నామములు.

## గండదూర్వా గుణములు

శ్లో॥ గండదూర్వా హిమా లోహద్రావణీ గ్రాహిణీ లఘుః ।
తిక్తా కషాయా మధురా వాతకృత్కటుపాకినీ ॥
దాహతృష్ణా బలాసాస్ర కుష్ఠపిత్తజ్వరాపహా ॥

నీటిగరికె తిక్తరసమును, కషాయమధురానురసములను, లఘుగుణమును, శీతవీర్యమును, కటువిపాకమును గలిగి యుండును. లోహములను ద్రావింప

జేయునది. మలాదులను నిరోధించును. వాతమును వృద్ధిబొందించును. కఫ పిత్తములను శమింపజేయును. దాహము, తృష్ణ, రక్తదోషము, కుష్ఠము, జ్వరము ఆది వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(నీల)-రుహా, అనంత, శతపర్వీక, శత వల్లి, హరిత, శివేష్ట, (శ్వేత)-గోలోమి, శతవీర్య, శ్వేతకాండ, (గండ)-మత్స్యాక్షి, శకులాదని, గండీరి, శ్యామగంధి, సూచిపత్రి, జలస.

(ఖ) గుణబోధకములు:—(నీల)-శీత, భూతహన్త్రి. (గండ)-అతితీవ్ర.

(2) శబ్దార్థములు:—

రుహా - మధ్యకు నరికినను తిరిగి మొలచునది. అనంత-మిక్కిలి దూర ముగా పాకునది. శతపర్వీక - అనేకమైన గణుపులతో గూడి యుండునది. శతవల్లి - బహువిధములుగ తీగెలతో ప్రసరించునది. హరిత - ఆకుపచ్చని వర్ణముగలది. శివేష్ట - ఈశ్వరునికి ప్రియమైనది. గోలోమి - గోరోమముల వంటి [illegible] - [illegible] శతవీర్య - అనేకమైన వేళ్ళతో గూడియుండునది. శ్వేతకాండ - తెల్లని కాండము గలది. మత్స్యాక్షి - చేపకన్నులవంటి గ్రంథులు గలది. శకులాదని - చేపలచే దినబడునది. గండీరి-శ్యామగంధి-నల్లని గ్రంథులతో గూడి [illegible] - [illegible] సన్నముగానుండు పత్రములతో గూడి యుండునది. [illegible] శీత-శీతవీర్యము గలది. భూతహన్త్రి-భూతవికారములను బోగొట్టునది. అతితీవ్ర - మిక్కిలి తీవ్రగుణము గలది.

(3) భేదములు:—

ఇది స్థలజ - జలజభేదముచే రెండు విధములుగా నుండి మాలిని లేక జలమును అంటి తీగె రూపమున ప్రసరించునట్టి తృణజాతులలో నుత్పత్తిగలిగి ప్రధానౌషధములలో నొకటిగా గణింపబడుచున్నది. ఇందలి స్థలజదూర్వ నీల - శ్వేత - మాలా భేదముచే తిరిగి మూడు విధములుగా నుండును. ఈ గరిక ప్రతిస్థలమునం దుత్పన్నమగును. ఆకులు సన్నముగను దీర్ఘముగను నుండును. కాండము గూడ సన్నముగ నుండి భూమిపై లతలవలె పాకి విస్తరిల్లును. ఇటుల గరికచే నావరింపబడినట్టి ప్రదేశములు వర్షాకాలమునందు చూచుటకు మనోహరముగా నుండి ప్రకృతిసౌందర్యముతో నొప్పియుండును.

ఇది పశువులకు మిక్కిలి హితమైన ఆహారము. మరియు నిది పుష్పజాతులవలె భగవత్పూజకు ఉపయోగింపబడునట్టి ద్రవ్యముగా గ్రహింపబడినది. ఇది భూతాది గ్రహదోషములను పోగొట్టునదిగా గ్రహింపబడినది. ఇందుచేతనే సుశ్రుతుడు వ్రణరోగిచే ఆచరింపవలసిన హితాహార విహారపద్ధతిని వివరింపుచు "...శతవీర్యాం సహస్రవీర్యాం...శిరసాధారయేత్" (సు-సూ-అ-19.) అని యీ దూర్వను (సహస్రవీరా-శ్వేతదూర్వా అని డల్హణవ్యాఖ్య) భూత గ్రహాదులుసోకకుండ శిరస్సునందు ధరించి యుండవలెనని విధించియున్నాడు. మరియు లోకములో కొందరు మాంత్రికులు అవసరమైనప్పుడు ఈ గరిక చిగుళ్ళతో మంత్రించుట ఆచారముగా గలదు. మరియు వ్రణము, గజ్జి మొదలగు వానియందు గూడ బాహ్యోపయోగమునకై గ్రహింపబడుచున్నది. ఇందలి గండదూర్వ యనునది లోహములను ద్రవింపజేయునదిగా వర్ణింపబడినది.

(4) విశేషగుణములు:—

(క) దూర్వాసామాన్యము-కషాయరసమును, మధురానురసమును, శీతవీర్యమును గలిగి యుండును. పిత్తకఫములను శమింపజేయును. తృష్ణను, అరుచిని, ఛర్దిని, దాహమును, మూర్ఛను, భూతగ్రహాది దోషములను, శ్రమను పోగొట్టును. (రా-ని.)

(ఖ) నీలదూర్వ - రుచిని బుట్టించును. అతీసారమును, జ్వరమును పోగొట్టును. (రా-ని.)

(గ) శ్వేతదూర్వ - అధిక శీతవీర్యమును గలిగి యుండును. రుచిని బుట్టించును. ఛర్దిని, ఆమాతిసారమును, కాసను పోగొట్టును. (రా-ని.)

(ఘ) గండదూర్వ - ద్వంద్వదోషములను శమింపజేయును. భ్రమను పోగొట్టును. (రా-ని.)

(చ) మాలాదూర్వ - మధురరసమును, తిక్తానురసమును, శీతవీర్యమును గలిగి యుండును. కఫపిత్తములను శమింపజేయును. ఛర్దిని, తృష్ణను పోగొట్టును. (రా-ని.)

(5) ప్రయోగములు:—

1. రక్తపిత్తమునందు దూర్వా ప్రయోగము.

"నస్యం దూర్వాస్వరసస్య చైవ" ॥

గరికవేళ్ళ రసమును నస్యము చేసిన ముక్కునుండివచ్చు రక్తపిత్తము శమించును. (చ-చి-అ-5.)

2. విసర్పమునందు దూర్వా ప్రయోగము.

"దూర్వాస్వరససిద్ధం చ ఘృతం స్యాద్వ్రణరోపణం" ॥

గరికవేళ్ళ రసమును జేర్చి ఘృతమును పాకముజేసి అభ్యంగము జేసిన విసర్పము శమించును (చ-చి-అ-11.)

3. పిత్తజచ్ఛర్దియందు దూర్వా ప్రయోగము.

"దూర్వాం పిబేత్తండుల వారిణా వా ।
తస్యాపశ్శాంతిం సముపైతి శాంతిం" ॥

గరికవేళ్ళ కల్కమును బియ్యపుకడుగుతో పానముజేసిన పిత్తజఛర్ది శమించును. (గ-ని.)

4. పామాదులందు దూర్వా ప్రయోగము.

"స్వరసేన తు దూర్వాయాః పచేత్తైలం చతుర్గుణం ।
కచ్ఛూం విచర్చికాం పామాం అభ్యంగా దేవనాశయేత్" ॥

గరికవేళ్ళ స్వరసమునందు నాలుగు భాగములు తైలమునుజేర్చి పాకము జేసి యభ్యంగము జేసిన కచ్ఛు, పామ, విచర్చిక మొదలగు త్వగ్రోగములు శమించును. (గ-ని.)

5. శీతపిత్తమునందు దూర్వా ప్రయోగము.

"దూర్వానిశాయుతో లేపః కచ్ఛూపామా వినాశనః ।
కృమిదద్రుహరశ్చైవ శీతపిత్తాపహః స్మృతః" ॥

గరికవేళ్ళ కల్కమునందు పసపుచూర్ణమును జేర్చి లేపనము జేసిన కచ్ఛు, పామ, కృమి, దద్రువు, శీతపిత్తము ఇవి శమించును. (గ-ని.)

6. ఆర్తవరోధమునందు దూర్వా ప్రయోగము.

"దూర్వాయాః పిష్టకం ప్రాశ్య వనితా త్వార్తవం లభేత్" ॥

గరికకల్కమును సేవించినచో స్త్రీకి యార్తవరోధము నశించును.

(చ-ద.)

(6) యోగములు:—

1. దూర్వాదితైలము - (భైషజ్య-జ్వర.)

ఉపయోగములు:—అభ్యంగము జేసిన నాసాజ్వరము శమించును.

2. దూర్వాదిఘృతము - (భైషజ్య-రక్తపిత్త.) మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—పాన నస్యాదిరూపముగ నుపయోగించిన రక్త పిత్తము శమించును.

3. దూర్వాదిక్వాథము - (గ-ని-ప్రమేహ.) మాత్ర:-1 పలము.
ఉపయోగములు:—శుక్రమేహము శమించును.

(7). Actions and uses:—Demulcent, astringent and acid; used in checking vomitting. As a diuretic it is given in dysuria and as an astringent in epistaxis and to stop bleeding from wounds. It is used as a substitute for triticum repens.

(R. N. Khory II. P 640.)

---

# 116

# నీలిని - నీలిచెట్టు

---

## భాషాంతర నామములు

హింది - నీల. మరాఠి - నిళ, గుళీ. గుజరాతి - గళీ. మలయాళం - అమరీ. కర్ణాటకం - నిలి. ద్రావిడం - అవురీ.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—LeguMinosae

చిక్కుడు కుటుంబము

నీలిచెట్టు - Indigo tinctoria (Eng. indigo)

(ప్రథమభాగమున 23-వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ నీలీ తు నీలినీ తూలీ కాలదోలా చ నీలికా ।
రంజనీ శ్రీఫలా తుత్థా గ్రామీణా మధుపర్ణికా ॥
క్లీతకా కాలకేశీ చ నీలపుష్పా చ సా స్మృతా ॥

నీలి, నీలిని, తూణి, కాలదోల, నీలిక, రంజని, శ్రీఫల, తుత్థ, గ్రామీణ, మధుపర్ణిక, క్లీతక, కాలకేశి, నీలపుష్ప అనునవి నీలినీ నామములు.

## నీలినీ గుణములు

శ్లో॥ నీలినీ రేచనీ తిక్తా కేశ్యా మోహభ్రమాపహా ।
ఉష్ణా హన్త్యుదరప్లీహ వాతరక్తకఫానిలాన్ ।
ఆమవాతముదావర్తం మదంచ విషముద్ధతం ॥

నీలిచెట్టు తిక్తరసమును, ఉష్ణవీర్యమును కలిగి యుండును. మలరేచనము జేయును. కేశములను రంజింపజేయును. కఫవాతములను శమింపజేయును. మోహము, భ్రమ, ఉదరము, ప్లీహవృద్ధి, వాతరక్తము, ఆమవాతము, ఉదావర్తము, మదము, తీక్ష్ణమగు విషము అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—నీలి, నీలిని, నీలిక, క్లీతక, నీలపుష్ప, (నీలపత్రి, భారవాహి, గంధపుష్ప.)

(ఖ) గుణబోధకములు:—రంజని, తుత్థ, మధుపర్ణిక, కాలకేశి, (శోధిని, గంగపత్రి, స్థిరరంగ, రంగపుష్పి.)

(గ) ఉత్పత్తిబోధకములు:—గ్రామీణ.

(2) శబ్దార్థములు:—

నీలి - నీలిని - నీలిక - సర్వాంగములందును నీలవర్ణమును కలది. క్లీతక - వర్ణమును కలుగజేయు ద్రవ్యములలో నిది యొకటిగా బజారులందు విక్రయింపబడునది. నీలపుష్ప - నీలవర్ణముగల పుష్పములు గలది.

భారవాహి - చాకలులచే ఉపయోగింప బడునది. గంధపుష్ప - పరిమళించు పుష్పములను గలది. రంజని - వస్త్రములు మొదలగు వానికి నీలవర్ణమును గలిగించునది. తుత్థ - వ్రణములందలి దుష్టమాంసాదులను వ్యధనము (ఛేదనము) జేయునది. మధుపర్ణిక - మధురరసముగల పత్రములను గలది. కాలకేశి - కేశములకు నల్లని వర్ణమును గలిగించునది. శోధిని - మలమును శోధించునది. రంగపత్రి - వర్ణమును గలిగించు పత్రములను గలది. రంగపుష్పి - వర్ణమును గలిగించు పుష్పములను గలది. స్థిరరంగ - ఎల్లప్పుడును స్థిరముగనుండు నల్లని వర్ణమును గలిగించునది. గ్రామీణ - గ్రామములందు విశేషముగ నుత్పత్తి యగునది.

(3) పరిచయాభోధకలక్షణములు:—

"నీలినీ నీలపత్రా స్యా చ్ఛరపుంఖదలాచ సా।
బహుశింబా కాలికా చ రంగపత్రీ చ రంజని"॥

నీలిచెట్టు నీలవర్ణముగలిగి వెంపలియాకులతో సమమగు పత్రములను గలిగియుండును. విశేషమగు బీజములతో గూడిన కాయలను గలిగియుండును. దీని యాకులను వర్ణముకై యుపయోగింతురు. మరియు కేశములకు నల్లని వర్ణమును గలిగించును. (శి-ద.)

(4) భేదములు:—

ఇది సాధారణనీలి, మహానీలి యని రెండు విధములుగా నుండి క్షుప వర్గములో గణింపబడు చున్నవి. ఇవి భూమినుండి కొంచెము ఎత్తుగ బెరిగి చుట్టుప్రక్కలకు గుబురుగా వ్యాపించి నీలవర్ణముగలిగి చూచుటకు రమ్యముగా నుండును. వీనిలో మొదటిది పైవర్ణమునుబట్టి వెంపలియాకులవంటి యాకులతో నొప్పియుండును. రెండవది పైదానికంటె కొంచెము ఎత్తుగ పెరుగును. దీని యాకులు గూడ కొద్దిగ పెద్దవిగనే యుండును. ఇది మొదటిదానికంటె శ్రేష్ఠమైనదిగ నిఘంటుకారులచే వర్ణింపబడినది. ఈ మొక్కలు సామాన్యముగ నెల్లచోటుల నుత్పత్తి యగుచుండును. కాని వీనిని కొందరు విశేషముగా పైరు చేయుచుందురు. ఈ మొక్కలనుండి వర్ణకరద్రవ్యమును (గడ్డగానుండునది. నీలిమందు అని వ్యవహరింపబడునది.) తయారుజేసి విశేషముగా బజారులందు విక్రయించు చుందురు. కొందరు ఈ యాకుల కషాయము రసక్రియగా పాకము జేయబడి యది నీలిమందని వ్యవహరింప బడుచున్నట్లు జెప్పుదురు.

ఈ నీలిమందు వస్త్రములకు రంగులు వానికి వర్ణము వేయుటకై యుపయోగింపబడుచున్నది. అయితే చాకలివాండ్రు ఈ నీలిమందును విశేషముగా సున్నముతో గూడిన వస్త్రములను శుభ్రపరచుటకై యుపయోగించుచుందురు. ఇది కొంచెము ఘాటుగుల దగుటచే నీ మొక్కల యాకులనే నాటుల వస్త్రములను శుభ్రపరచుటకై యుపయోగించుటయు గలదు. వైద్యమునందు గూడ దీని పత్రకషాయముతో తైలలేపాదులను జేసి కేశములకు వర్ణము గలుగజేయుటకై విశేషముగా నుపయోగింపబడుచున్నట్లు తెలియగలదు.

(5) విశేషగుణములు:—

(క) కటీవాతమును క్రిములను బోగొట్టును. (ధ-ని.) కటురసమును గలిగి యుండును. కాసను, ఆమవాతమును, గుల్మమును, జ్వరమును బోగొట్టును. (రా-ని.) సరగుణమును గలిగి యుండును. వ్యంగమును. హృద్రోగమును, కుష్ఠమును బోగొట్టును. (వి-ర.) శిరోరోగమును, వ్రణమును బోగొట్టును. (శో-ని.)

(ఖ) మహానీలి — ఇది వర్ణమును గలిగించుటలో పైదానికంటె శ్రేష్ఠమైనది. మరియు పైగుణములను విశేషముగా గలిగియుండును. (రా-ని.)

(6) ప్రయోగములు:—

1. పక్వాశయ గతవిషమునందు నీలినీ ప్రయోగము.

"నిశోషణం సస్వరసం ... త్రిక్తం నీలీఫలం" ॥

నీలిగింజల చూర్ణము నేతితో గలిపి యిచ్చిన పక్వాశయ గతవిషమును శోధించును. (సు-క-అ-1.)

2. క్షయమునందు నీలినీ ప్రయోగము.

"గోక్షీరయుక్తం ప్రశమాయ తస్య ।
స్యాన్నీలినీమూలమథామయస్య" ॥

నీలిచెట్టువేరుకల్కమును ఆవుపాలతో సేవించిన క్షయము శమించును. (గ-ని.)

3. క్రిమిదంతమునందు నీలినీ ప్రయోగము.

"నీలీ ధాత్రీ స్నుహీ బింబీ హేమక్షీరీ చ పంచమీ ।
ఆసామన్యతమాన్మూలం ధారణాత్క్రిమిదన్తజిత్" ॥

నీలి, ఉసిరిక, జెముడు, దొండ, హేమక్షీరి వీనిలో నే యొకదాని

మూలమునకైన కంఠములతో నమిలినచో క్రిమికంతువులవలన కలిగిన బాధ శమించును. (గ-ని.)

4. మండలకర్ప విషమునందు నీలిని ప్రయోగము.

"తండులజలేన పిష్టం నీలిన్యా మూలమాశు నాశయతి।
............పానేన మండలీవిషం" ॥

నీలిచెట్టు వేరును బియ్యపుకడుగుతో మెత్తగానూరి సేవించిన మండల విషము శమించును. (రా-మా)

5. మూత్రకృచ్ఛ్రమునందు నీలిని ప్రయోగము.

"మూత్రకృచ్ఛ్రం జయే[illegible]త్వా క్షీరేణ శర్కరాన్వితా।
[illegible] పిష్ట్వా పీతా నీలీజటా తథా" ॥

నీలిచెట్టువే[illegible] [illegible]తో నూరి సేవించిన మూత్రకృచ్ఛ్రము శమించును. (వై-మ.)

6. విసర్పమునందు నీలిని ప్రయోగము.

"ప్రాశ పయసా పీతా లిప్తా చ విసర్పకం జయేన్నీలీ" ॥

నీలిచెట్టును మెత్తగా కల్కమువలె నూరి పాలతో కలిపి లేపనము జేసి దీనినే సేవించినను గూడ విసర్పము శమించును. (వై-మ.)

(7) యోగములు:—

1. నీలిన్యాదిఘృతము - (వా-గుల్మ.) మాత్ర:—1 తులం.

ఉపయోగములు:—గుల్మము, కుష్ఠము, ఉదరము, వ్యంగము, శోఫ, పాండు, జ్వరము, శ్విత్రము, ప్లీహము, ఉన్మాదము ఇవి శమించును.

2. నీలికాదితైలము - (శార్ఙ్గ-మ-అ-9.)

ఉపయోగములు:—అభ్యంగము జేసిన పలితము శిరోరోగము ఇవి శమించును, కేశములకు స్థిరత్వ మేర్పడును.

(8) Actions and uses:—Plant stimulant, alterativo and purgative; used in enlargement of the liver and spleen, dropsy, affections of the lungs and kidneys, whooping congh and palpition of the heart. Indigo is given in epilepsy and crisipelas and also in amenorrhoea. The natives apply indigo to the navel with castor-oil in constipation, also to the pubes and hypogastrium in reliving retention of urine. A Poultice of the plant is used to relieve haemorrhoids. Indigo is a smoothing application to burns and scald, and the juice of the leaves

is used as a poultice externally and given internally as a prophylactic against bites of venomous animals and hydrophobia.

P. N. Khory. II. p 215-16.

The plant has a great repute in some Parts of India as a Prophylactic against hydrophobia so much so as to be known among the natives as the 'dog bite shrub'. A wine glass ful of the juice of the leaves is administered in the morning with out milk for 3 days, to those who have been bitten by dogs supposed to be mad. People who have taken it inform us that beyond slight headache no disagreeable effect is Produced, but that when a larger dose has been given it has proved purgetive. In addition to the internal administration the expressed leaves are each day applied to the bitten part as a poultice. For Roth's observation on the use of indigo in epilepsy and other spasmodic affections, see "Brit, and For, Med, Rev. July 1836 P 244.

## స్వానుభవము

నీలిమందు శ్విత్రమునందు వేపములలో గూడ నుపయోగము గలదని శ్రీ కొండేపల్లి చెంచు రామయ్యగారు (కాళహస్తి) 1920 సంవత్సరములో నాకు చెప్పియుండిరి. అప్పటినుండి శ్విత్రమునందు రక్తరస ప్రధానమైన సుదర్శనచూర్ణము, చర్మవ్యాధుల నివారణయందు ప్రసిద్ధిగా నుపయోగింపబడు వాకుచి చూర్ణముతోను చేర్చి నెయ్యి. చక్కెర అనుపానములతో సహా నేను శ్విత్రవ్యాధి (బొల్లి) యందు విశేషముగా యుపయోగించియున్నాను. నూటికి యాభై పైగా గుణము కనబడినది. నీలిమందు 2 గ్రైనులు, వాకుచీ చూర్ణము 2 గ్రైనులు, సుదర్శన చూర్ణము 10 గ్రైనులు కలిపి మెత్తగానూరి ఒక మోతాదుగా యిచ్చేది. రోజునకు రెండు మోతాదులు యిచ్ఛాపథ్యం. కాని వేడిచేయు పదార్థములను వదలవలెను. విస్తారం ఎండలో తిరుగ గూడదు. పైకి కూడ తువరకను నీలిమందు, ఏనుగుదంతము మసి పాము కుబుసము మసి రాక్షసిబొగ్గు మొదలగు వానితో కలిపి నూరిన

తైలమును తువరకాది తైలమును నేరుతో నుపయోగింపవలెను. విస్తారము మర్దన చేయగూడదు. పైపైన పూయవలెను. ఈ విషయమందు నీలిమందు మహౌషధమని నా యభిప్రాయము. కాని అయిదారు నెలలు తీసుకొనవలెను. పిత్తోల్బణ సన్నిపాతమువలె చికిత్స చేయవలెను.

వ్రణములు మాన్పుటయందు నీలిమందుకు ప్రత్యేకమైన శక్తి గలదని ప్రబలనమ్మకము. కొబ్బరి నూనెతో కలిపి కొన్ని మొండివ్రణములకు పూయుదురు. ఆ. ల. ]

---

# 117

# పద్మకం - పద్మకాష్ఠము

---

## భాషాంతర నామములు

హిందీ - కమలకంగీ, కమలకంద, కాల, పద్మాక, (ఖ) భసీండా. మరాఠీ - కమలకంద, పద్మకాష్ఠ, పద్మకంద, భిస్సాండ. గుజరాతీ - కమళకంద, కమలికంద, పద్మకమ్, లాకడుం. మలయాళం - పతుముకం. కర్ణాటకం - పద్మక. ద్రావిడం - పతుముకం.

## నైసర్గిక స్వరూప వర్ణనము

Natural Order—Rosaceae

గులాబి కుటుంబము

పద్మకాష్ఠము - Prunus pudum

(381-వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ పద్మకం పద్మగంధి స్యాత్తథా పద్మాహ్వయం స్మృతం ॥

పద్మకము, పద్మగంధి, పద్మాహ్వయ యనునవి పద్మక నామములు.

## ప ద్మ క గు ణ ము లు

శ్లో॥ పద్మకం తువరం తిక్తం శీతలం వాతలం లఘు ।
విసర్పదాహ విస్ఫోటకుష్ఠ శ్లేష్మాస్రపిత్తనుత్ ॥
గర్భసంస్థాపనం వృష్యం వమివ్రణ తృషాప్రణుత్ ॥

పద్మకాష్ఠము కషాయరసమును, తిక్తానురసమును, లఘుగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. వెంటనే శుక్రమును గలిగించును. గర్భ సంస్థాపనము జేయును. వాతమును వృద్ధిబొందించును. శ్లేష్మమును శమింపజేయును. విసర్పము, దాహము, విస్ఫోటము, కుష్ఠము, రక్తపిత్తము, ఛర్ది, వ్రణము, తృష్ణ యను నీ వ్యాధులను బోగొట్టును.

## వి శే షాం శ ము లు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—పద్మగంధి, (పీతరక్తము, సుప్రభ, పాటలాపుష్పసన్నిభ.)

(ఖ) గుణబోధకములు:—(శీతల.)

(గ) ఉత్పత్తిబోధకములు:—(కేదారజ, మలయ.)

(2) శబ్దార్థములు:—

పద్మగంధి - పద్మమువంటి పరిమళముగల పుష్పములను గలది. పీతరక్తము - పసుపు ఎరుపు గలసిన వర్ణముగల పుష్పములను గలది. సుప్రభ - మిగుల కాంతిగల పుష్పములను గలది. పాటలాపుష్పసన్నిభ-పాదిరి పుష్పములతో సమానమైన యాకృతిగల పుష్పములను గలది. శీతల-శీతవీర్యము గలది. కేదారజ - కేదారక్షేత్రమునం దుత్పత్తియగునది. మలయ - మలయ పర్వతములం దుత్పన్నమగునది.

(3) పరిచయబోధకలక్షణము:—

"పద్మకః సూక్ష్మవిచ్ఛిన్నపత్రో ఉద్భిద్పాదపోఽసలః ।
ఈషత్పుష్ప సుగంధిః స్యాత్ పద్మకం రక్తవల్కలం" ॥

పద్మకాష్ఠమును మెత్తగా చూర్ణించి అందు నెయ్యి కలిపి సేవించిన హిక్కయును, శ్వాసయును శమించును. (వా-చి-అ-4.)

(7) యోగములు:—

1. పద్మకాదిలేహ్యము - (చ-కాస.) మాత్ర:-1 తులం.

ఉపయోగములు:— కాస, శ్వాస, హిక్క ఇవి శమించును.

2. పద్మకాదిగణకషాయము - (వా.సూ ౨_15.) మాత్ర:-1 తులం.

ఉపయోగములు:— స్తన్యము వృద్ధిబొందును. ప్రీణనము, బృంహణము, జీవనము, వృష్యము, పరిసర్పపిత్తము శమించును.

(8) Actions and uses:—The bark is used as a bitter tonic and sedative. It is given during convalescence from acute diseases and palpitation of the heart.

Khory II P 244.

---

# 118

## పనసః - పనసచెట్టు (క)

---

### భాషాంతర నామములు

హింది - కటహళం - చెక్క. కర్ణాటకం-హలసు. ద్రావిడం-పం.

### నైసర్గికస్వరూప వర్ణనము

### Natural Order—Boracae

పనస కుటుంబము

పనసచెట్టు - Artocarpus in tegri folia (A. lucooch)

(75.వ పుట చూడుము.)

### పర్యాయ పదములు

శ్లో॥ పనసః కంటకిఫలః ఫలసోఽతి బృహత్ఫలః ॥

పనస, కంటకిఫలము, ఫలస, అతిబృహత్ఫలము అనునవి పనస నామములు.

### పక్వపనసఫల గుణములు

శ్లో॥ పనసం శీతలం పక్వం స్నిగ్ధం పిత్తానిలాపహం ।
తర్పణం బృంహణం స్వాదు మాంసలం శ్లేష్మలం భృశం ॥
బల్యం శుక్రప్రదం హంతి రక్తపిత్త క్షతవ్రణాన్ ॥

పనసపండు మధురరసమును, స్నిగ్ధగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. తర్పణము, బృంహణము, మాంసలము, శుక్రము వృద్ధి పొందించును. బలమును గలిగించును. విశేషముగ శ్లేష్మమును వృద్ధిపొందించును. వాతపిత్తములను శమింపజేయును. రక్తపిత్తమును, క్షతజవ్రణములను బోగొట్టును.

### ఆమపనసఫల గుణములు

శ్లో॥ ఆమం తదేవ విష్టంభి వాతలం తువరం గురు ।
దాహకృన్మధురం బల్యం కఫమేదోవివర్ధనం ॥

పనసకాయ కషాయరసమును, మధురరసమును, గురుగుణమును గలిగి యుండును. విష్టంభమును చేయును. బలమును గలిగించును. మేదోవృద్ధి గలిగించును. కఫవాతములను వృద్ధిపొందించును. దాహమును బోగొట్టును.

### లకుచః — చిన్నపనసచెట్టు (లేక) సబాపనసచెట్టు (ఖ)

శ్లో॥ లకుచః క్షుద్రపనసః లికుచో డహుశ్చాపి ॥
లకుచము, క్షుద్రపనస, లికుచము, డహువు అనునవి లకుచ నామములు.

### ఆమలకుచఫల గుణములు

శ్లో॥ ఆమం లకుచముష్ణం చ గురు విష్టంభకృత్తథా ।
మధురం చ తథామ్లం చ దోషత్రితయరక్తకృత్ ॥
శుక్రాగ్నినాశనం చాపి నేత్రయోరహితం స్మృతం ॥

సబాపనసకాయ మధురరసమును, అమ్లరసమును, గురుగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. విష్టంభమును జేయును. శుక్రమును జఠరాగ్నిని బోగొట్టును. నేత్రముల కహితమైనది. రక్తమును జెరచును. త్రిదోషములను వృద్ధిపొందించును.

### పక్వలకుచఫల గుణములు

శ్లో॥ సుపక్వం తత్తు మధురమమ్లం చానిలపిత్తహృత్ ।
కఫవహ్నికరం రుచ్యం వృష్యం విష్టంభకం చ తత్ ॥

సదా పనస పండు మధురరసమును. అమ్లానురసమును గలిగి యుండును. రుచిని బుట్టించును. సద్యశ్శుక్రమును చేయును. విష్టంభమును గలిగించును. జాఠరాగ్నిని వృద్ధిజేయును. కఫమును వృద్ధిబొందించును. వాతపిత్తములను శమింపజేయును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

పరిచయబోధకములు:—(పనస) కంటకిఫల, అతిబృహత్ఫల, మృదంగఫల, మూలఫల, అపుష్పఫల,(లపచ)-ఐరావత, స్థూలస్కంధ, గ్రంథిమత్ఫల.

(2) శబ్దార్థములు:—

కంటకిఫల - ముండ్లతో గూడియుండునట్టి ఫలములను గలది. అతిబృహత్ఫల - పెద్దవైన ఫలములను గలది. మృదంగఫల - మద్దెలయొక్క ఆకృతిని బోలిన పండ్లనుగలది. మూలఫల - వ్రేళ్ళకు సమీపముగా (లేక) మ్రానుయొక్క మొదటిభాగమున ఫలించునట్టిది. అపుష్పఫల - పుష్పింపకనే ఫలించునట్టిది. ఐరావత - జలముండు స్థలములలో బెరుగునట్టిది. (లేక) ఐరావతమను ఏనుగంత ఎత్తుగా పెరుగునట్టిది. (లేక) ఐరావతకర్ణములను బోలిన పత్రములతో గూడి యుండునది. స్థూలస్కంధ - లావుగానుండు మ్రాను గలది. గ్రంధిమత్ఫల - గ్రంధులతో గూడిన ఫలములు గలది.

ఇది బృహత్ - క్షుద్రభేదముచే రెండు విధములుగా నుండి యెత్తుగా పెరుగు వృక్షజాతులలో నుత్పత్తి గలిగి, మధురరస విశిష్టఫలజాతులలో నొకటిగా గణింపబడు చున్నది. ఈ రెండింటిలో బృహత్పనసయే శ్రేష్ఠమైనదిగా నెన్నబడు చున్నది. ఇది బీజభేదమును బట్టి యనేక విధములుగా నుండును. కొన్ని జాతులఫలములు మిక్కిలి మధురముగా నుండును. కొన్ని జాతుల ఫలములు లోన ద్రవముతో గూడి యుండును. వీటినే తేనెపనసయనియు వ్యవహరించుదురు. పనసకాయలు ముదిరినప్పుడు శాకముకై యుపయోగించుదురు. కాయలు పచ్చిగా నున్నప్పుడు వీని పైతోలు కోయగా నందు తెల్లని పాలుండును. ఇవి బంకగలిగి యుండును. ఈ తోలును తొలగించియే మిగిలిన భాగమును శాకముకై ఉపయోగించుదురు. ఇందలి పాలు చేతి కంటుకొన కుండుటకై తిలతైలమును చేతులకు పూసుకొందురు. పనసకాయలు నాళము

(మధ్యకాండ)తో గూడి యుండును. ఆ నాళమును గూడా తొలగించుదురు. పండు పసుపుపచ్చని వర్ణముగలిగి మిక్కిలి సువాసనతో గూడి యుండును. ఫలముల గోసి యందుండు తొనలను, బీజములను గూడ తిందురు. ఇవి మిగుల మధురముగా నుండును. ఇవి శీఘ్రముగా జీర్ణముకావు అందుచే పనసతొనను తిలతైలమునందు ముంచి తినినచో శీఘ్రముగా జీర్ణమగును. ఈ పనసపండ్లు ఇతర ఫలజాతులవలె దానార్హములైనవి. ఈ పనసమ్రానులు కర్రసామానులకై ఉపయోగింప బడుచుండును. కొన్ని ప్రాంతములందు పనసచెక్కకషాయమునే వాపాపప్రయోగమునకు విరుగుడుగా నుపయోగించుటయు ప్రచారమునందు గలదు. పనసఫలము గుల్మవ్యాధియందును, అగ్ని మాంద్యమునందును వర్జింపదగినదని భావమిశ్రుడు నిరూపించి యుండెను.

సదాపనస యనునది మిక్కిలి ఎత్తుగా బెరుగునట్టి వృక్షము. దీనియాకు విశాలముగాను పెద్దవిగాను నుండును. కాయలు గుండ్రముగాను, పైన ముండ్లతో గూడియు నుండును. ఈ కాయలును గూడా శాకములకై ఉపయోగించుటయు గలదు ఈ రెండును పుష్టికరమే ఫలించునట్టివి. శాస్త్రనిరూపణమును బట్టి లకుచవృక్షము త్రిదోషవర్ధక మగుటచే నింద్యమైనదిగా దెలియగలదు.

మరియు “న లికుచం పక్వం మధుపయోభ్యాం సహోపయోజ్యం। ఏతద్ధి మరణాయ అథవా బలవర్ణ తేజోవీర్యోపరోధాయ అలఘువ్యాధయే షాండ్యాయ చ” ॥ (చ-సూ-26.) - సదాపనసపండును తేనెతోను, పాల తోను గలిపి భుజించినచో విరుద్ధమగును. ఇందువలన మరణమైనను గలుగును. లేక బలము, వర్ణము, తేజస్సు, వీర్యము ఇవి నశించును. లేక కష్టసాధ్యమైన వ్యాధియైన గలుగును. షండత్వముగూడ గలుగును. అని చరకుడు నిరూపించెను.

(4) విశేషగుణములు:—

(క) పక్వపనసఫలము - పిచ్ఛిలగుణము గలిగి యుండును. రుచిని బుట్టించును. మలమును నిరోధించును. (రా-ని.)

(ఖ) బాలపనసఫలము (లేతకాయ) - హృదయమునకు హితమగును. (రా-ని.)

(గ) పనసమజ్జము (పనసకొన) - సద్యశ్శుక్రమును జేయును. త్రిదోషములను శమింపజేయును. (భా-ప్ర.)

(ఘ) పనసబీజము - మధురరసమును, గురుగుణమును గలిగియుండును. సక్రమ్మకరమును చేయును. మలమును బంధించును. మూత్రమును శోధించును. (భా-ప్ర.) కొద్దిగ కషాయరసమును గలిగి యుండును. రుచిని బుట్టించును. వాతమును వృద్ధి బొందించును. త్వగ్దోషమును బోగొట్టును. (రా-ని.)

(చ) లకుచఫలము - పిత్తకఫములను ప్రకోపింపజేయును. (చ-సూ-అ-27.)

(5) ప్రయోగములు:—

1. అపచియందు పనస ప్రయోగము.

"పనస శిఫాలేపో వా...... ।
అపచీమపికంఠగతాం పూయయుతాం హంతియోగోఽయం" ॥

పనసవేరు కల్కమును లేపనము జేసిన పూయముతో గూడిన అపచి శమించును. (గ-ని.)

2. పిటికయందు లకుచ ప్రయోగము.

"క్షీరఘూదుంబరం యత్నాత్ లాకుచం వా ప్రయోజయేత్ ।
పిటికాసు సమస్తాసు లేపనం సంప్రశాంతయే" ॥

సదాపనసచెట్టునుండి పాలను గ్రహించి లేపనము జేసిన సమస్త పిటికలు శమించును. (గ-ని.)

"—But some seeds which are not oleaginous may also be given with advantage to diabetics. Principal amongst them is the seeds of Jack fruit (Artocarpus in tegri folia) Many years ago my esteemed friend the late lamented Lientevant-colvel K. R. Kirtikar F. L. S; I. M. S. drew me attention to it. He found it useful in diabetis.

స్వానుభవము.

[ పనసకాయ అపథ్యమగు కూరలలో ఆంధ్రదేశమున నెన్నబడుచున్నది. కాని, ఆవపెట్టి వండినయెడల మిక్కిలి రుచిగా నుండును. గురువు, విదాహి, కావున తక్కువగా తినవలెను. ఆంధ్రులకు మిక్కిలి ప్రీతికరమైన పదార్థము. పనసకాయ దొరకినపుడు తద్దినము పెట్టుకొనమని సామెత. ఆ.ల.]

———

# 119

# పరూషకం - చిట్రేత

## భాషాంతర నామములు

హిందీ - ఫాలసా. మరాఠి - ఫాలసా. గుజరాతి - ఫాలసాం. మలయాళం - పరూషకం. కర్ణాటకం - దోగలి. ద్రావిడం -

## నైసర్గిక స్వరూప వర్ణనము

### Natural Order—Tiliaceae

రుద్రాక్ష కుటుంబము

**చిట్రేత - Grewia asiatica (Eng. grewia)**

ఈ కుటుంబపు మొక్కలు విస్తారముగ నుష్ణదేశమునందుఁ గలవు. ఆకులు వంటరిచేరిక, లఘుపత్రములు కణుపుపుచ్ఛములు గలవు. మూడో, అయిదో పెద్ద ఈనె లున్నవి. లేఁగొమ్మలపైన మెత్తని పచ్చని రోమములు గలవు. పుష్పములు చిన్నవి. రక్షక పత్రములును, ఆకర్షణపత్రములు నైదేసి కలవు. కింజల్కములు చాలగలవు. అండాశయ మొక్కటి. కీలము దీని మధ్యనుండియే బయలుదేరును. కీలాగ్రము చిన్నది. ఫలము ఎండు కాయఁగాని, లోపెంకుకాయగాని యగుచున్నది. ఈ కుటుంబము బెండ, గుత్తపు బాదము కుటుంబములను బోలి యుండునుగాని దీనియందుఁ గింజల్కములు విడివిడిగా నుండును. అవి పుట్టుచోట వృంతము కొంచెము పైకి వచ్చినది. పుప్పొడితిత్తులు సన్నముగ నుండును. వీనియందు రెండుగదులు గలవు.

## పర్యాయ పదములు

శ్లో॥ పరూషకం తు పరుషం అల్పాస్థి చ పరాపరం ॥

పరూషకము, పరుషము, అల్పాస్థి, పరాపరము అనునవి పరూషక నామములు.

## అపక్వపరూషకఫల గుణములు

శ్లో॥ పరూషకం కషాయామ్లం మామం పిత్తకరం లఘు॥

పచ్చికాయ కషాయరసమును, అమ్లానురసమును, లఘుగుణమును గలిగి యుండును. పిత్తమును వృద్ధి బొందించును.

## పక్వపరూషకఫల గుణములు

శ్లో॥ తత్పక్వం మధురం పాకే శీతం విష్టంభి బృంహణం।
హృద్యం తు పిత్త దాహాస్ర జ్వరక్షయ సమీరహృత్ ॥

పండిన ఫలము మధురరసమును, శీతవీర్యమును, మధురవిపాకమును గలిగి యుండును. బృంహణము, మలమును నిరోధించును. హృదయమునకు హితమైనది. వాతపిత్తములను శమింపజేయును. దాహము, రక్తదోషము, జ్వరము, క్షయము, అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—అల్పాస్థి - (నాగదలోపమ, నీలచర్మ, ధన్వనచ్ఛద, మృదుఫల)

(ఖ) గుణబోధకములు:—పరుషము.

(2) శబ్దార్థములు:—

అల్పాస్థి - చిన్న చిన్న బీజములనుగల పండ్లనుగలది. నాగదలోపమ - తమలపాకులవంటి యాకులను గలది. నీలచర్మ - నల్లని త్వక్కును గలది. ధన్వనచ్ఛద - ధనుర్వృక్షముయొక్క త్వక్కువంటి త్వక్కును గలది. మృదుఫల - మృదువుగనుండు ఫలములను గలది. పరుషము - పరుషగుణముగల పత్రములనుగలది.

N. B.—దీనిని ఖర్జూరపుజాతిలో జేరిన యొక వృక్షభేదముగా జెప్పుదురు. కొందరు పూతికచెట్టని జెప్పుదురు. అయితే చరక సుశ్రుతాదుల టీకాకారులు దీని స్వరూప మిట్టిది యని వర్ణించి యున్నట్లు గానరాదు. కాని "నాగదలోపమ" యని జెప్పబడుటచే దీని యాకులు తమలపాకులవలె నుండునని దెలియుచున్నది. మరియు "అల్పాస్థి" యనుటవలన గింజలు మిగుల చిన్నవిగ నుండుననియు దెలియగలదు. ఇందుచే నిది చిట్లీత కాదేమో యని సందేహము గలుగుచున్నది. కాన యిది ఈతచెట్టుజాతిలోనిది కాదని దెలియనగును. మరియు నీ వృక్షము చిన్న పెద్ద భేదముచే రెండు విధములుగా నుండునని వైద్యకశబ్ద సింధువునందు జెప్పబడినది. దీనిని గురించిన విషయము లంతగా గానరాకుండుటచే నింకను విమర్శించిన గాని నిశ్చయింప వీలు గాకున్నది.

(3) విశేషగుణములు:—

(క) ఆమఫలము_ఆమ్లరసమును, గురుగుణమును గలిగియుండును. వాతమును శమింపజేయును. (ధ_ని.) కటుకషాయరసమును గలిగి యుండును. కఫమును శమింపజేయును. (రా_ని.) మధురానురసమును, రూక్షగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. (ని_ర.) అత్యంతామ్లరసమును, మధురకషాయానురసములను గలిగి యుండును. (సు_సూ_అ_46.) పిత్తశ్లేష్మములను ప్రకోపింపజేయును. (చ_సూ_అ_27.)

(ఖ) పక్వఫలము - రుచిని బుట్టించును. శోఫను బోగొట్టును. (రా_ని.) అమ్లానురసమును గలిగి యుండును. శుక్రమును వృద్ధి బొందించును. తృష్ణను, క్షతక్షయమును బోగొట్టును. (ని ర.) ప్రమేహమును, సంధివాతమును బోగొట్టును. (అ_సం.) రక్తమును శోధించును. (సు_సూ_అ_46.)

(గ) పత్రము - శోఫను పోగొట్టును. (అ_సం.) వ్రణమునుబోగొట్టును. (ద్రి_గు.)

(ఘ) త్వక్కు - వాతమును శమింపజేయును. ప్రమేహము, యోనిదాహము, మేఢ్రదాహము, మూత్రదోషము, శీతపిత్తము వీనిని బోగొట్టును. (అ_సం.)

(4) ప్రయోగములు:—

1. మదాత్యయమునందు పరూషక ప్రయోగము.

"పరూషకాణాం పీలూనాం రసం" ॥

చిట్టీతపండ్లు, గొలుగుపండ్లు, వీని రసమును సేవించిన మదాత్యయమునందలి తృష్ణ శమించును. (చ_చి_అ_12.)

2. మూఢగర్భమునందు పరూషక ప్రయోగము.

పరూషక శిఫాలేపః .........।

నాభివస్తి భగాస్యేషు మూఢగర్భాపకర్షణః" ॥

చిట్టీతవేళ్ళ కల్కమును గర్భిణికి నాభివస్తిభగాములందు లేపనముజేసిన మూఢగర్భము (ప్రసవకాలమున బయటకురాక గర్భాశయముఖమున నడ్డపడినట్టి గర్భము) సుఖముగ బయటకు వచ్చును. (గ_ని.)

3. రోహిణియను గలరోగమున పరూషక ప్రయోగము.

"కవలో దాక్షాపరూష్కైః క్వథితో రోహిణీమ్" ||

దాక్షపండ్లు, చిట్టీతపండ్లు వీని కషాయమును కవలధారణము జేసిన రోహిణియను గళరోగము శమించును. ((భా-ప్ర.

(5) యోగములు: —

1. పరూషకాదిఘృతము - (చ-వాతరక్త.) మాత్ర:-1 తులం.

ఉపయోగములు:— వాతరక్తము, క్షయ, విసర్పము, జ్వరము ఇవి శమించును.

2. పరూషకాదికషాయము - (వా-సూ-అ-15.) మాత్ర:-1 పలం.

ఉపయోగములు:— వాతమును, తృష్ణను, మూత్రదోషమును శమింప జేయును.

## స్వా ను భ వ ము

[ ఈతిచెట్టు వృక్షాయుర్వేదము 72 వ పుట 73 వ నెంబరు కొబ్బరి జాతిలో చేరియున్నది. పరూషకము అది కాదని తోచుచున్నది. నాకు అనుభవములేదు. ఆ. ల. ]

---

# 120

# పర్పాటకః - పర్పాటకము

---

## భాషాంతర నామములు

హిందీ - దవనపాపండా, (గా) పిత్తపాపడా, శాహతరా. మరాఠీ-సిర పళీ, పిత్తపాపడా. గుజరాతి - పీతపాపడో, ఖడ్సలియోపీతపాపడో, శాహతరా, పిత్తపాపడో. మలయాళం - పర్పటకపుల్లు. కర్ణాటకం - పర్పటి. ద్రావిడం - పర్పటకం.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Acanthaceae

అడ్డసగ కుటుంబము

పర్పాటకము - **Justicia procumbens**

(ప్రథమ భాగమున 118-వ పుట చూడుము.)

### పర్యాయ పదములు

శ్లో॥ పర్పటో వరతిక్తశ్చ స్మృతః పర్పటకశ్చసః।
కథితః పాంశు పర్యాయః తథా కవచ నామకః॥

పర్పటము, వరతిక్తము, పర్పటకము, పాంశు, కవచము అనునవి పర్పాటక నామములు

### పర్పటక గుణములు

శ్లో॥ పర్పటోహంతి పిత్తాస్రభ్రమ తృష్ణా కఫజ్వరాన్।
సంగ్రాహీ శీతల స్తిక్తః దాహనుద్వాతలో లఘుః॥

పర్పాటకము తిక్తరసమును, లఘుగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. వాతమును వృద్ధి బొందించును. కఫమును శమింపజేయును. రక్తపిత్తము, భ్రమ, తృష్ణ, జ్వరము, దాహము అను వ్యాధులను పోగొట్టును.

### విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయ బోధకములు:- పాంశు, (కృష్ణశాఖ, రక్తపుష్పక, శీతప్రియ.)

(ఖ) గుణబోధకములు:-వరతిక్తము, (తృష్ణారి, శీత, పిత్తారి, కటుపత్ర.)

(2) శబ్దార్థములు:—

పాంశు - ఎండినప్పుడు ధూళివలె విడిపోవునది. కృష్ణశాఖ - నల్లని పత్రములను గలది (కృశశాఖ - మిగులసన్నముగ నుండు పత్రములనుగలది). రక్తపుష్పక - ఎర్రని పుష్పములను గలది. శీతప్రియ - చల్లని ప్రదేశము లందు వృద్ధియగునది. వరతిక్తము - శ్రేష్ఠమైనతిక్తరసముగలది. తృష్ణారి - దప్పికను బోగొట్టునది. శీత - శీతవీర్యముగలది. పిత్తారి - పిత్తమును శమింపజేయునది. కటుపత్ర - కటురసముతో గూడిన పత్రములను గలది.

NB :— ఇది క్షుపజాతిలో నుత్పత్తి గలిగి తిక్తరసయుక్తమై జ్వర - తృష్ణా - పిత్తాదిశమన ద్రవ్యములందు గణింపబడుచున్నది. ఇది చిన్న చిన్న మొక్కల రూపముగ వృద్ధిబొందును. పై పదములనుబట్టి శీతల ప్రదేశములందు విశేషముగా వృద్ధిబొందునదిగా దెలియగలదు. ఆకులు సన్నముగను కొంచెము పొడవుగ నుండును. పుష్పములు ఎర్రగానుండును. మిగుల చిన్నవియగు కాయలుండును. ఇది సమూలముగా నుపయోగింపబడును. ఎండినప్పుడు ధూళివలె ప్రత్యేకముగా విడిపోవుచుండును. ఇందుచేతనే యిది రేణు లేక పాంసు అని వ్యవహరింపబడుచున్నది. ఇది వైద్యమునందు విశేషముగా జ్వరము తృష్ణ, పిత్తరోగములు రక్తపిత్తము మొదలగు వానియందుపయోగింపబడు చున్నది. ఇందును "ఏకః పర్పటకః శ్రేష్ఠః పిత్తజ్వరనిషూదనః" అను మొదలగు మహర్షుల సూత్రములనుబట్టి విశేషముగా పిత్తజజ్వరము నందుపయోగింపబడుటయు వ్యవహారమునందుగలదు. జ్వరమునందలి తృష్ణను బోగొట్టుటలో నిది శ్రేష్ఠమైనదిగా నెన్నబడుచున్నది.

(3) విశేషగుణములు:—

(క) పర్పటి - రక్తదోషమును, అరుచిని, మదమును బోగొట్టును. (ధ-రా-ని.) కటువిపాకమును గలిగియుండును. వాంతిని బోగొట్టును. (ని-ర.)

(ఖ) పర్పటశాకము-తిక్తరసమును లఘుగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. వాతమును వృద్ధిబొందించును. పిత్త కఫములను శమింపజేయును. రక్తదోషమును, జ్వరమును, తృష్ణను, భ్రమను, దాహమును బోగొట్టును. (భా - ప్ర.)

(4) ప్రయోగములు:—

1. రక్తపిత్తమునందు పర్పటక ప్రయోగము.

"దురాలభా పర్పటక ప్రియాలం ।
ఏతే సమస్తాః గణశః పృథగ్వా రక్తం సపిత్తం శమయంతి యోగాః॥"

పర్పాటకమును కషాయముగా గాని యందు తేనెజేర్చి సేవించిన రక్తపిత్తము శమించును. (చ. చి. అ. 4.)

**2.** అతీసారమునందు పర్పటక ప్రయోగము,

"ముస్త పర్పటకేన ... ..."॥

తుంగముస్తలు, పర్పాటకము వీనిచూర్ణమును తేనెతో సేవించిన అతీసారము శమించును. (చ. చి. అ. 10.)

**3.** పిత్తజ్వరమునందు పర్పటక ప్రయోగము.

"ఆరోగ్యలక్ష్మీరుపయాతి పిత్తజ్వరాతురం కేణుక షాయభాజం।
మాం త్వం యథాగ కాలే స్మరార్గం కృత్రప్రకోపోపశమా సఖీభిః"॥

పర్పాటకకషాయమును సేవించిన పిత్తజజ్వరము శమించును. (వై.జీ.)

**4.** ఛర్దియందు పర్పటక ప్రయోగము.

"క్వాథః పర్పటజః శీతః సక్షౌద్రః ఛర్దినాశనః"॥

పర్పాటక కషాయమునందు తేనెచే సేవించిన ఛర్దిశమించును. (బృంద.)

**5.** యోగములు.

**1.** పర్పటారిష్టము.-(భైషజ్య-పాండు కామిలాది.) మాత్ర:-ఔన్స.
**ఉపయోగములు:**—పాండు, గుల్మము, ఉదరము, అష్ఠీల, కామిల, హాలీమకము, ప్లీహ, యకృత్తు, శోఫ, జ్వరము, విషమజ్వరము, ఇవిశమించును.

2. పర్పటాది కషాయము. (చ. ద. పిత్తజ్వర.) మాత్ర—: 1 పలం.
**ఉపయోగములు:**—పిత్తజ్వరము శమించును.

## పర్పాటకముగల కొన్ని యోగములు

ఉశీరాది క్వాథచూర్ణము, గుడూచ్యాది క్వాథచూర్ణము, పంచతిక్త క్వాథచూర్ణము.

## స్వానుభవము

[ ఉపయోగములు:—తుంగముస్తవలెనే ఇదియును తీవ్రజ్వరములను పోగొట్టుటకు ఉపయోగింపబడుచున్నది. పిత్త జ్వరములలో ఇదియొకటియే కూడ మంచిపని జేయునని వర్ణింప

బడియున్నది. ("ఏకః పర్పటకః శ్రేష్ఠః పిత్తజ్వరవినాశనః" చక్రిదత్త) 120 తులముల నీటిలో 1 తులము పర్పాటకమును నలియగొట్టివేసి బాగుగా కాచిచల్లార్చి ఇచ్చినగాని అంతయే జలములో ఆద్రవ్యమును రాత్రివేసి నానిచ్చి పొద్దుట వడియగట్టి ఇచ్చినగాని మూత్రనాళములో మంటను, వాపును, వేడిమిని తగ్గించును. మూత్రకృచ్ఛ్రమునందును గనేరియా యందును ఉపయోగింప వచ్చును. వాంతు లధికముగా నగు చున్నప్పుడు దీని చూర్ణమును తేనెతో నీయవచ్చును. అ.ల.]

---

# 121

# పలాశః - మోదుగచెట్టు

---

## భాషాంతర నామములు

**హిందీ-కేసూ, టేసూ, ఢాక, పలాశ. మరాఠీ-పళస. గుజరాతీ-ఖాఖరో. మలయాళం-ప్లాశ. కర్ణాటకం - పలాశ. ద్రావిడం-ప్లాశ.**

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Leguminosae

చిక్కుడు కుటుంబము

మోదుగచెట్టు - **Butea frondosa (Eng-Bastard Peak)**

(ప్రథమ భాగమున 23-వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ పలాశః కింశుకః పర్ణో యాజ్ఞికో రక్తపుష్పకః,
క్షారశ్రేష్ఠో వాతహరో బ్రహ్మవృక్షః సమిద్వరః॥

పలాశము, కింశుకము, పర్ణము, యాజ్ఞికము, రక్తపుష్పకము, క్షారశ్రేష్ఠము, వాతహరము, బ్రహ్మవృక్షము, సమిద్వరము, అనునవి పలాశ నామములు.

## పలాశ గుణములు.

శ్లో॥ పలాశో దీపనో వృష్యః సరోష్ణో వ్రణగుల్మజిత్,
భగ్నసంధానకృద్దోష గ్రహణ్యర్శః క్రిమీన్ హరేత్॥
కషాయః కటుకః తిక్తః స్నిగ్ధో గుదజరోగజిత్॥

మోదుగచెట్టు కషాయరసమును, కటుతిక్తానురసములను, సరస్నిగ్ధ గుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. వెంటనే శుక్రమును గలిగించును. భగ్నసంధానముజేయును. త్రిదోషములను శమింపజేయును. వ్రణము, గుల్మము, గ్రహణి, అర్శస్సు, క్రిములు, గుద రోగములు అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచాయకములు:— యాజ్ఞికము, రక్తపుష్పము, సమిద్వరము, (త్రిపత్రకము, బ్రహ్మోపనేత, బీజస్నేహ, వక్రపుష్పక.)

(ఖ) గుణబోధకములు:— పలాశము, క్షారశ్రేష్ఠము, వాతహరము. (క్రిమిఘ్నము.)

(2) శబ్దార్థములు:—

యాజ్ఞికము - యజ్ఞములందుపయోగింపబడునది. రక్తపుష్పము - ఎఱ్ఱని పుష్పములతో గూడియుండునది. సమిద్వరము - యజ్ఞాదికర్మలందు హోమములకై నుపయోగింపబడు సమిధలలో నిది శ్రేష్ఠమైనదిగ నుండునది. త్రిపత్రకము - మూడుమూడాకుల చొప్పున గలిసియుండునట్టి యాకులతో

నొప్పియుండునది. బ్రహ్మోపనేత - బ్రాహ్మణుల ఉపనయనసంస్కారము నందుపయోగింపబడినది. బీజస్నేహ - తైలముతో గూడిన బీజములను గలది. వక్రపుష్పక - వంకరతిరిగిన పుష్పములతో నొప్పియుండునది. పలాశము - క్షారము గలదగుటచే దుర్నామమును లేపనముజేసి దొలగించునది. క్షార శ్రేష్ఠము - క్షారములలో శ్రేష్ఠమైనదిగ నెంచునది. వాతహరము - వాతము శమింపజేయునది. కృమిఘ్నము - క్రిములను బోగొట్టునది.

(3) స్వరూపబోధకలక్షణము:—

"పలాశపాదపః సిత స్త్రిదలః శిశిరే క్షయః ।
కృష్ణవృన్తోజ్జ్వలద్రక్తపుష్పశ్చ తిక్తబీజకః ॥
ఏకబీజాయుతా శింబీ తీర్ణపర్ణశ్చ సమిద్వనాః ॥"

మోదుగ చెట్టు మూడు మూడు చొప్పున గలసియున్నట్టి యాకులను, నల్లని తొడిమగలిగి మిగుల ప్రకాశమానమైన యెర్రని పుష్పములను గలిగి యుండును. దీని కాయలు పొడవుగనుండి యొక్కొక్క బీజముతో నొప్పి యుండును. ఈ బీజములు తిక్తరసమును గలిగియుండును. దీని కొమ్మలు యజ్ఞాదులందు సమిధలుగా నుపయోగింపబడును. ఈ వృక్షము శిశిరర్తువునందు ఆకులను రాల్చుటంజేసి క్షైణ్యమును బొందును. (శి-ద.)

(4) భేదములు:—

ఇది రక్త - పీత - సిత - నీలవర్ణములచే నాలుగు విధములుగానుండును. ఇందలి రక్తవర్ణము గల పుష్పములుగల పలాశమే విశేషముగా గానబడుచుండును. నిఘంటుకారులచే నిందలి శ్వేతవర్ణముగల పలాశము "సితో విజ్ఞానదః స్మృతః" ॥ మంచి జ్ఞానమును వృద్ధిపొందించుటలో నుత్తమమైనదిగా వర్ణింపబడినది. మరియు మిగిలినవన్నియు "కింశుకారుణ సామ్యేపి" సమాన గుణములనే గలిగియుండునని జెప్పబడినను రక్తపలాశము తప్ప పీతాదిపుష్ప పలాశములు గానుపించకుండుటకు గారణము దెలియకున్నది. ఏది యెట్లున్నను పలాశమనునది యెత్తుగా బెరుగు వృక్షజాతులలో నుత్పత్తిగలిగి శ్రేష్ఠమగు క్షారద్రవ్యగణములో గణింపబడుచున్నది. ఈ వృక్షములు విశేషముగా నడవులలో నుత్పత్తియగుచుండును. కావుననే క్రిమిహరములగు వీని బీజములను (మోదుగమాడలను) అడవులలో నివసించువాండ్రు సంపాదించి గ్రామములలో విరివిగా నమ్ముచుందురు. ఈ బీజములు క్రిమిహర ద్రవ్యములలో

మిగుల శ్రేష్ఠములైనవిగ నుపయోగింపబడుచున్నవి. ఈ వృక్షము క్షారముగలది యైనను ప్రత్యేకముగ దీని సర్వాంగముల నేక విధములుగా ననేక వ్యాధులం దుపయోగింపబడుచున్నవి. మరియు నీవృక్షము మిగుల పవిత్రమైనదిగ వ్యవహరింపబడుచున్నది. మరియు దీనియొక్క చిన్న చిన్న కాష్ఠములను యజ్ఞాదులందు హోమములకు సమిధలుగా నుపయోగింతురు. ఇంతియేగాక దీనియొక్క దీర్ఘమగు నొక కాష్ఠమును బ్రాహ్మణాదుల యుపనయన సంస్కారమునందు బ్రహ్మచారిచే దండముగా ధరింపజేసి గొన్ని మంత్రములుచ్ఛరింపజేయుదురు. అనగా నీదండ ధారణమువలన నట్టి బ్రహ్మచారి పవిత్రుడై నూతన జ్ఞాన సంపన్నుడగునని భావము. ఇటులనే దీనియొక్క పవిత్రత వేదములందనేక విధములుగా వర్ణింపబడినట్లు గానబడును. మరియు దీని యాకులందు గృహస్థులు గొందరు ఆహారమును భుజింతురు.

ఈ పలాశమునందు పైనిజెప్పినటుల నాలుగువిధములగు భేదములేగాక "హస్తికర్ణ పలాశ" మను మరియొక భేదమున్నట్లుగా రాజనిఘంటు కారునిచే నిరూపింపబడినది. వైద్యశబ్దసింధువు నందు "గజకర్ణాకారైక పత్రే, పలాశభేదే, భూపలాశ ఇతిలోకే"॥ ఇది గజకర్ణముపంటి యాకృతితో విశాలముగనుండు ఒక్కొక్క పత్రముతో నొప్పు పలాశభేదముగా జెప్పబడుచున్నది. మరియు నిది భూపలాశమని వ్యవహరింపబడుచున్నది యని నిరూపింపబడినది. దీనిని బట్టి గజకర్ణమువలె దీనియాకులు విశాలముగ నుండుననియు, పైదానివలె మూడు మూడు ఆకుల చొప్పున గలిసియున్నట్లు గాక యివి విడివిడిగ నుండుననియు దెలియగలదు. కాని స్పష్టముగా దీని స్వరూపమును బోధించునట్టి విశేషములు ఎచ్చటను గానరాకున్నవి. అయితే పై పలాశవృక్ష పత్రములకంటె మిగుల విశాలముగ నుండు పత్రములనుగలిగి విశేషముగ కొమ్మలు లేక నొకే కాండరూపమున భూమినుండి కొద్దిగ నెత్తుగ బెరుగు నొక మొక్క పలాశ భేదముగా వ్యవహరింపబడుచున్నది. ఒకవేళ హస్తికర్ణ పలాశమనునది పై భేదమై యుండునేమో విమర్శింపదగినది.

(5) విశేషగుణములు:—

(క) మలాదులను నిరోధించును. వాత శ్లేష్మములను శమింపజేయును. ప్లీహాభివృద్ధిని బోగొట్టును. (ధ - ని.) యోనిరోగమును బోగొట్టును. (ని - ర.)

(ఖ) పుష్పము కటురసమును, తిక్తకషాయానురసములను, శీతవీర్యమును మధుర విపాకమును గలిగియుండును. మలాదులను నిరోధించును, వాతమును

వృద్ధిం బొందించును. కఫపిత్తములను శమింపజేయును. రక్తపిత్తము, మూత్రకృచ్ఛ్రము, తృష్ణ, దాహము, వాతరక్తము, కుష్ఠము వీనిని బోగొట్టును. (భా-ప్ర.) సుగంధమును గలిగి యుండును. మధురరసమును గలిగి యుండును. (ధ - ని.) ఉష్ణవీర్యమును గలిగి యుండును. కండువును బోగొట్టును. (రా - ని.) రక్తదోషమును బోగొట్టును. (ని - ర.)

(గ) బీజము - లఘు రూక్ష గుణములను, ఉష్ణవీర్యమును, కటువిపాకమును గలిగి యుండును. వాత కఫములను శమింపజేయును. ప్రమేహమును, అర్శస్సును, క్రిములను, కుష్ఠమును, గుల్మమును, ఉదరమును బోగొట్టును. (భా - ప్ర.) స్నిగ్ధగుణములను గలిగి యుండును. (ధ - ని.) పామను, కండువును, దద్రువును, బోగొట్టును. (రా - ని.) శూలను బోగొట్టును. (ని - ర.)

(ఘ) నూతనపల్లవము - వాతమును శమింపజేయును. కృములను బోగొట్టును. (ని - ర.)

(చ) పత్రశాకము కఫపిత్తములను శమింపజేయును. (సు-సూ-అ 46)

(ఛ) కాండగుణము:— రసాయనము. (శో - ని.)

(జ) మూలస్వరసము - నేత్రాంధ్యమును, నేత్రపుష్పమును బోగొట్టును. (శో - ని.)

(ఝ) పలాశనిర్యాసము - మలాదులను నిరోధించును. గ్రహణిని, ముఖరోగములను, కాసను, అతిస్వేదమును బోగొట్టును. (అ - సం.)

(ట) బీజతైలము - మధురరసమును, కషాయానురసమును గలిగియుండును. కఫపిత్తములను శమింపజేయును. (సు - సూ - అ 46.)

(ఠ) హస్తికర్ణపలాశము - మిగుల వృష్యము, మేధాశక్తిని, ఆయుర్వృద్ధిని, బలవృద్ధిని గలిగించును. (రా - ని.)

(6) బ్రహ్మవృక్షకల్పము:—

(క) "బ్రహ్మవృక్షస్య పంచాంగం ఛాయాశుష్కం సుచూర్ణితం। మధ్వాజ్యాభ్యాం లిహేత్కర్షం వర్షేకేన జరాం జయేత్॥ జీవేద్వర్షసహస్రైకం దివ్యతేజా మహాబలః। బ్రహ్మవృక్షస్య పుష్పాణి ఛాయాశుష్కాణి కారయేత్॥ త్రింశత్పలం తు తచ్చూర్ణం చతుర్వింశత్పలం ఘృతం॥ ఏకీకృత్య క్షిపేద్భాండే తం రుద్ధ్వా ధాన్యరాశిగం। కృత్వామాసాత్సముద్ధృత్య భాగాన్కుర్యాన్నచతు

ర్ధకః॥ భాగైకం భక్షయేన్నిత్యం భుంజీత కాంతభాజనే। ఏవం మాసత్రయం కుర్యాద్వజ్రకాయో భవేన్నరః॥ తస్య మూత్ర పురీషాభ్యాం తామ్రం యాతి కాంచనం। బ్రహ్మవృక్షస్య బీజాని చూర్ణితాని ఘృతైస్సహ॥ పూర్వవద్ధాన్య మధ్యే తు క్షిప్త్వా మాసాత్సముద్ధరేత్। పలైకైకం సదా ఖాదేద్వత్సరాన్మృత్యుజిద్భవేత్॥ వలీపలిత నిర్ముక్తో జీవేద్బ్రహ్మ దినత్రయం। బ్రహ్మబీజోత్థితం తైలం గవాం క్షీరైః పలద్వయం॥ తుల్యైః పిబేద్భవేన్మూర్ఛా సించేత్తస్య ముఖే పయః। బోధే క్షీరౌదనం దద్యాత్ మాసాత్ జ్ఞానీ భవేన్నరః। ద్వితీయే శంకరతుల్యస్స్యాత్ తృతీయే వజ్రివద్భవేత్। మారణాద్యపి చతుర్థే తు పంచమే ఖేగతిర్భవేత్॥ మాస షట్కే స్వయం కర్తా శివతుల్య పరాక్రమః। మహాకల్పాంతపర్యంతం జీవేద్వర్షైక సేవనాత్"॥

(1) మోదుగవృక్షముయొక్క పంచాంగములను గ్రహించి నీడనెండించి మృదుచూర్ణము జేయవలెను. పిమ్మట మధు ఘృతములతో గలిపి యొక్కొక్క కర్షము చొప్పున నొకసంవత్సరకాలము ప్రతిరోజూనను సేవించుచుండిన ముసలితనము పోయి మిగుల తేజోబలసంపన్నుడై వేయి సంవత్సరములు జీవించును. (2) మోదుగ పుష్పములను గ్రహించి నీడ నెండించి మృదుచూర్ణము జేయవలెను. ఈచూర్ణమును ముప్పది పలములును, ఘృతమును ఇరువది నాలుగుపలములును, ఒకటిగా కలిపి యొక భాండమునందుంచి దృఢముగా సంధిబంధనము జేసి దీనిని ధాన్యరాశియందు ఒకమాసము గప్పి యుంచవలెను. పిమ్మట దీనిని పదునాలుగు భాగములు జేసి యొక్కొక్క భాగము చొప్పున ప్రతిదినమును సేవించుచు కాంతలోహపాత్రయందు ఆహారమును దీసుకొనుచుండవలెను. ఇటుల మూడు మాసములు జేసిన వజ్రముతో తుల్యమైన శరీరము గలవాడగును. ఈ విధముగ నాచరించినట్టి పురుషునియొక్క మలమూత్రములందు తామ్రము నుంచిన నది బంగారమగును. (3) మోదుగగింజలను మృదుచూర్ణము జేసి ఘృతమునందు గలిపి పై దాచవలెనే భాండమునందుంచి సంధిబంధనము జేసి యొక మాసము ధాన్యరాశియందుంచి పిమ్మట నొక్కొక్క పలము చొప్పున నొకవత్సరము సేవించిన వలీపలిత నిర్ముక్తుడై యనేకవేలసంవత్సరములు జీవించును. (4) మోదుగగింజలనుండి తీసిన తైలమును రెండు పలములు గ్రహించి సమాంశము గోక్షీరమునందు గలిపి సేవించవలెను. ఇందువలన మూర్ఛ గలిగిన యెడల ముఖముపై పాలను సేకము జేయవలెను. తెలివి వచ్చిన

పిమ్మట పాలతోగలిపి యన్నమును భుజించవలెను. ఈవిధముగ నొకమాసము జేసిన మంచి జ్ఞానవంతుడగును. రెండుమాసములు సేవించిన ఇంద్రునితో తుల్యమగు పరాక్రమము గలవాడగును. మూడు మాసములు సేవించిన వజ్రముతో తుల్యమగు శరీరము గలవాడగును. నాలుగు మాసములు సేవించిన మిగుల దూరమునందలి శబ్దమును వినగలవాడగును. అయిదు మాసములు సేవించిన ఖేచరత్వము సిద్ధించును. ఆరు మాసములు సేవించిన శివతుల్య పరాక్రమవంతుడగును. ఒకవత్సరము సేవించినకల్పాంతమువరకు జీవింపగలుగును.

(4) శ్వేతపలాశ కల్పము:—

శ్లో॥ "శ్వేతపలాశ పంచాంగం చూర్ణితం మధునాసహ। కర్షైకం భక్షయేన్నిత్యం మాసాన్మృత్యుజరాపహం॥ బ్రహ్మాయుర్జాయతే సిద్ధో వరమాత్రిన్నసంశయః। అజాఘృతేన తద్బీజ మేకైకం భక్షయేత్సదా॥ శరీరం భస్మనా మర్ద్యం మాసాన్మృత్యు జరాం జయేత్। జీవేద్బ్రహ్మ దినం యావత్ దివ్యకాయో భవేన్నరః॥ అన్యే యోగాః యథా రక్తే బ్రహ్మవృక్షే చ యే గుణాః। తథైవ శ్వేత పాలాశే భవేయుః సాధకస్యవై ॥"

(1) తెల్లమోదుగచెట్టుయొక్క పంచాగములనుగ్రహించిచాయాశుష్కముజేసి మృదుచూర్ణముజేయవలెను దీనిని తేనెతో గలిపి యొక్కొక్క కర్షము చొప్పున ప్రతిదినమును సేవించవలెను. ఒకమాసము సేవించిన జరామృత్యువులు లేనివాడగును. ఒకవత్సరము సేవించిన అనేక వేలసంవత్సరములుజీవింపగలుగును.

(2) తెల్లమోదుగగింజలను ప్రతిదినము ఒకొక్కటిచొప్పున మేకనెయ్యితో భక్షించుచు శరీరమును వెలిబూడిదతో మర్దించుకొనుచుండిన నొకమాసమునకు జరామృత్యువులు లేనివాడై యనేక వేల సంవత్సరములు జీవింపగలుగును.

(3) తెల్లమోదుగగూడ నెర్రమోదుగతో సమానమగు గుణములనుగలదగుటచే పైనిజెప్పిన బ్రహ్మవృక్షకల్పమునందలి యోగములను దీనితో (తెల్లమోదుగ) గూడ పైవిధముగ గల్పించి సేవించిన పై విధముగనే సిద్ధించును.

(రసరత్నాకర - రసాయనఖండ.)

(7) ప్రయోగములు:—

(1) అతిసారమునందు పలాశ ప్రయోగము:—

"పలాశఫలనిర్యూహం పయసా పాయయేత్తతం।

తతోఽనుపాయయేత్ కోష్ణం క్షీరమేవ యథాబలం॥
ప్రవాహితే మలే తేన ప్రశామ్యత్యుదరామయః॥"

మోదుగగింజల కషాయమును పాలయందుజేర్చి త్రిసికొని కొద్దిగా ఉష్ణముగనుండు పాలను అనుపానముగా సేవించిన అడ్డుపడిన మలము పూర్తిగా బయటకు బోవును. కిమ్మట అతిసారము శమించును. (చ - చి - అ 10.)

(2) అర్శోరోగమునందు పలాశ ప్రయోగము:—

"త్రివృద్దంతీ పలాశానాం ... ... ...।
సుభ్రష్టం యమకే దద్యాత్ శాకం దధిసరాయుతం॥"

తెగడ, నేపాళము, మోదుగ వీనియొక్క పత్రములను యమక స్నేహమునందు భర్జనజేసి పెరుగుమీద నీళ్లతో శాకముగా సిద్ధముచేసి యిచ్చిన అర్శోరోగము శమించును. (చ - చి - అ 9.)

(3) పిత్తాభిష్యందమునందు పలాశ ప్రయోగము:—

"క్షౌద్రోపేతం కైంశుకం వాపి పుష్పం॥"

మోదుగపుష్పస్వరసమును తేనెతో గలిపి యంజనము వేసిన పిత్తజాభిష్యందము శమించును. (సు - ఉ - అ 10)

(4) క్రిమిరోగమునందు పలాశ ప్రయోగము:—

"పలాశబీజ స్వరసం కల్కం వా తండులాంబునా॥"

మోదుగగింజల కల్కమునుగాని, స్వరసమునుగాని బియ్యపుకడుగుతో నిచ్చిన క్రిమిరోగము శమించును. (సు - ఉ - అ - 54.)

(5) రక్తపిత్తమునందు పలాశ ప్రయోగము:—

"పలాశవృక్షస్వరసే విపక్వం సర్పిః పిబేత్ క్షౌద్రయుతం సుశీతం॥"

మోదుగచెట్టుయొక్క స్వరసమునందు ఘృతమును జేర్చి పక్వము జేసి సాంగశీతలమునందు తేనెగలిపి సేవించిన రక్తపిత్తముశమించును.సు.ఉ.అ.55.

(6) శర్కరయందు పలాశ ప్రయోగము:—

"తిలాపామార్గ కదలీ పలాశ యవ కల్కజః।
క్షారః పేయోఽవిమూత్రేణ శర్కరా నాశనః పరః॥"

మోదుగక్షారమును మేకమూత్రముతోగలిపి సేవించిన మూత్రజశర్కరగ శమించును. (సు - చి - అ 7.)

(7) గుల్మ - ప్లీహలయందు పలాశ ప్రయోగము:—

"పలాశక్షారతోయేన పిప్పలీ భావితా శుభా।
గుల్మప్లీహార్తిశమనీ అగ్నిదీప్తికరీ స్మృతా॥"

మోదుగక్షారజలమునందు పిప్పళ్లను పలుమార్లు భావన జేసి సేవించిన గుల్మమును ప్లీహాభివృద్ధిని శమింపజేయును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును.
(బృంద.)

(8) శ్లీపదమునందు పలాశ ప్రయోగము:—

"పలాశమూలస్వరసం పిబేద్వా తైలేన తుల్యం సితసర్షపాణాం॥"

మోదుగ వేళ్లరసమునందు సమాంశముగ తెల్లావాలనుండితీసిన తైలమును గలిపి పానము జేసిన శ్లీపదము శమించును.
(బృంద.)

(9) పిల్లరోగమునందు పలాశ ప్రయోగము:—

"పలాశవృంత మాహృత్య దధ్నా కాంస్యే నిధాపయేత్।
ఆశ్చోతనం శ్లేష్మహరం పక్ష్మణాం చ ప్రరోహణం॥"

మోదుగపుష్పముయొక్క తొడిమను మెత్తగానూరి పెరుగునందుగలిపి కంచుపాత్రయందుంచి చేతితో మెత్తగా రుద్ది పిమ్మట కంటికి ఆశ్చోతనము జేసిన పిల్లరోగము శమించును.పక్ష్మప్రరోహమగును.
(గ - ని.)

(10) గర్భనివారణార్థమై పలాశప్రయోగము:—

"ఋతౌ ఘృత క్షౌద్ర యుతైః పలాశబీజైః ప్రలేపం మసృణపిష్టైః।
కరోతి యా స్త్రీ భగరంధ్రమధ్యే న సా భవేద్గర్భవతీ కదాచిత్॥"

మోదుగగింజలను మెత్తగా నూరి ఘృత క్షౌద్రములందు గలిపి ఋతుకాలమున యోనియందు లేపనము జేసిన యెడల నెప్పటికి గర్భము ధరింపకుండును.
(గ - ని.)

(11) అంత్రవృద్ధియందు పలాశ ప్రయోగము:—

"అంత్రవృద్ధి శమనాయ కింశుకత్వక్కషాయమపి పాయయేచ్ఛిశుం॥"

మోదుగపట్టకషాయమును పానము జేయించిన శిశువుల అంత్రవృద్ధి శమించును.
(వై - మ.)

(12) నక్తాంధ్యమునందు పలాశప్రయోగము:—

"దినావసానే రుధిరం పలాశాత్ ఆదాయ నేత్రే సహసైవ దద్యాత్।
నక్తాంధ్యనాశ్యేవ విజిత్య జీవేత్ చంద్రాత్ పరేచాక్షరవాచకః స్యాత్॥"

సూర్యాస్తమయ కాలమునందు మోదుగచెట్టునుండి నిర్యాసమును సంపాదించి వెంటనే నేత్రములకంజనము వేసిన నక్తాంధ్యము శమించి వెన్నెలలో నక్షరము చదువగల శక్తిగలవాడగును. (వై - మ.)

(13) అర్శోరోగమునందు పలాశ ప్రయోగము:—

"క్షారోదకగర్భం పలాశస్య త్రిగుణే భస్మవారిణి।
సాధితం పిబతః సర్పిః పతంత్యర్శాంస్యసంశయం॥"

మోదుగక్షారజలము మూడుభాగములు, ఘృతము ఒకభాగము, త్రికటుకకల్కము నాల్గవభాగము ఇటుల గ్రహించి ఘృతపాకము జేసి సేవించిన నిశ్చయముగ మూలవ్యాధి శమించును. (భా - ప్ర.)

14 రక్తగుల్మమునందు పలాశ ప్రయోగము:—

"పలాశక్షారతోయేన సర్పిః సిద్ధం పిబేచ్చసా॥"

మోదుగక్షారజలమునందు ఘృతమును జేర్చి పాకముజేసి సేవించిన రక్తగుల్మము శమించును. (భా - ప్ర.)

(15) పుష్పరోగమునందు పలాశ ప్రయోగము:—

"పలాశపుష్పస్వరసైః బహుశః పరిభావితం।
కరంజబీజం తద్వర్తిః దృష్టేః పుష్పం వినాశయేత్॥"

మోదుగపువ్వులరసమునందు గానుగపిక్క (గింజ)ను పలుమార్లు భావనచేసి వర్తివలెజేసి ప్రతిదినమును జలముతో నరుగదీసి కంటికి అంజనము వేసిన పుష్పమను నేత్రరోగము శమించును. (భా - ప్ర.)

(16) వృశ్చికవిషమునందు పలాశ ప్రయోగము:—

"అర్కక్షీరేణ సంపిష్టం లేపాద్బీజం పలాశజం।
... ... ... వృశ్చికార్తిం హరేత్॥"

మోదుగగింజలను జిల్లేడుపాలతో నూరి తేలు పట్టినచోట లేపనముజేసిన వెంటనే విషవేగము తగ్గి బాధశమించును. (వం - సే.)

(17) రసాయనమునకై పలాశ ప్రయోగము:—

"పలాశబీజాని విడంగయుక్తాన్యస్మిశ్రితాన్యామలకీఫలానాం।
రసేన మధ్వాజ్యయుతాని పీత్వా వృద్ధోఽపి మాంసాత్తరుణత్వమేతి॥"

మోదుగగింజలను, వాయువిడంగములను మెత్తగా చూర్ణించి ఉసిరిక పండ్లరసమునందు జేర్చి అందు మధు ఘృతములను గలిపి సేవించుచుండిన నొక మాసమునకు ముసలి వానికి గూడ తరుణత్వము గలుగును. (రా - మా.)

(8) యోగములు:—

(1) క్రిమిముద్గరరసము (పలాశబీజయుత) - భైషజ్య - క్రిమిరోగ.
మాత్ర:— 10 యవలు.

ఉపయోగములు:— క్రిమిరోగము శమించును. అగ్నిదీపనముగలుగును.

(2) పలాశాది లేపము:— భైషజ్య- యోనిరోగ.

ఉపయోగములు:— లేపనము జేసిన యోనిగాఢీకరణముగును.

(3) కింశుకాదిగణచూర్ణము:— ర - సా - సం.
మాత్ర:— $\frac{1}{4}$ తులం.

ఉపయోగములు:— త్రిదోషములు శమించును.

(9) Actions and uses:—Laves astringent and alterative, used in diarrboea, Pyrosis, sweating of phthisis, diabetis, mevorrhagia, worms and colic. A hot poultice of leaves is used to disperse boils and pimples. The decoction is used as an injection into the vagina in leucorrhoea; also used as a gargle in sore throat and ulcers of the mouth. The seeds are aperient and an thelmintic, used with success in tape worms and round worms. A decoction of the seeds and infusion of flowers is used with nitre as a diuretic in dysuria and in infuntion of urine. Externally the seeds are irritant and used with lime junce in dhobys itch, ringworm, indolent ulcers and fistula. Gum a powerful astringent and a good substitute for kino and may be used for all the purposes for which kino is used. Flowers are also astringent and diuretic. Varaliaus of flowers are applied to the pubes in dysuria and retention of urine and to promote menses.

Khory. Vol. II. P. 195.

## స్వానుభవము

[ పలాశమును గూర్చి రసాయనముగను, క్రిమిహారముగను హెచ్చుగా పైన వర్ణింపబడి యున్నది. నేను క్రిమిహారముగా మోదుగవిత్తుల చూర్ణమును ఉపయోగించుచున్నాను. పలాశమును అనేకవిధముల పరిశోధించి యుపయోగింపవలసి యున్నది. ఆ. ల. ]

---

# 122

# ప్రిసారిణీ - గొంతెమకోమరు

## (లంజసవరము)

### భాషాంతర నామములు

హిందీ - గంధప్రసారణీ, పసరన్, ప్రిసారనీ, ప్రిసారిణీ. మరాఠి - ప్రసారణీ, చాందవేల, చాండవేల. గుజరాతి - ప్రిసారణవేల. మలయాళం - తలనోళి. కర్ణాటకం - ప్రిసారిణి. ద్రావిడం - ముదియాన్ కుండల్.

### నైసర్గిక స్వరూప వర్ణనము

### Natural Order—Convolulaceae

తెగడ కుటుంబము

గొంతెమకోమరు - Convolulus arvensis

(652-వ పుట చూడుము.)

శ్లో॥ ప్రిసారిణీ రాజబలా భద్రపర్ణీ ప్రితానినీ।
సరణీ సారణీ భద్రబలా చాపి కటంభరా ॥

ప్రిసారిణీ, రాజబల, భద్రపర్ణి, ప్రతానిని, సరణి, సారణి, భద్రబల, కటంభర యనునవి ప్రసారణీ నామములు.

### ప్రిసారణీ గుణములు.

శ్లో॥ ప్రిసారిణీ గురుర్వృష్యా బలసంధాన కృత్సరా।
వీర్యోష్ణా వాతహృత్తిక్తా వాతరక్త కఫాపహా ॥

గొంతెమకోమరు తిక్తరసమును, గురుసరగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. వెంటనే శుక్రమును గలిగించును. బలమును గలుగజేయును. వాతకఫములను శమింపజేయును. వాతరక్తమును బోగొట్టును.

## విశేషాంశములు.

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయ బోధకములు:- ప్రతానిని, సరణి, (చారుపర్ణి, గంధాఢ్య)

(ఖ) గుణబోధకములు:— ప్రసారిణి, రాజబల, (బల్య)

(2) శబ్దార్థములు.

ప్రతానిని - విస్తరించి లతారూపమున నుండునది. సరణి - దూరము పాకునది. చారుపర్ణి - అందమగు పత్రములతో గూడియుండునది. గంధాఢ్య - విశేషముగ పరిమళముతో గూడియుండునది. ప్రసారిణి - వంగిన అంగములు చాచునట్లు చేయునది. రాజబల - బలము గలిగించువానిలో శ్రేష్ఠమైనది. బల్య - బలమును గలిగించునది.

ఇది లతాజాతులలో నుత్పత్తిగలిగి విశేషముగ వాతహరద్రవ్యములలో గణింపబడుచున్నది. కొందరు దీని యుత్పత్తి వృక్షరూపమున నుండునని చెప్పుదురు. అందుకు ఎట్టి ఆధారమును గానబడదు. పై పదములనుబట్టి యిది లతయనియే గ్రహింపదగియున్నది. చిన్నవిగను, కొంచెము గుండ్రముగను, నుండు పత్రములను గలిగి సన్నని కాండముతో భూమిపై కొద్దిదూరము ప్రాకునదిగా నుండును. రెండు కాండములకు మధ్య సన్నని దారములవంటి నాళములు గూడ దీర్ఘముగ భూమిపై వ్యాపించును. వీటికి పత్రములుండవు. ఇటువంటి దీర్ఘనాళములను బట్టియే యిది లంజసవరపుతీగె యని గూడ వ్యవహరింపబడుచుండును. ఇది యిసుక నేలలలోను, రేవటి నేలలలోను విశేషముగనుత్పన్నమగును. దీనిని సమూలముగ గ్రహించియే వైద్యమునందుపయోగించుదురు. ఇది యొక విధమగు గంధమును గలిగియుండును. విశేషముగా వాతవ్యాధులందుపయోగింపబడుచున్నది. ప్రసారిణి యను శబ్దమునుబట్టి అందును విశేషముగ పక్షవధాదులందుపయోగింపబడునట్లుగా దెలియగలదు.

(3) విశేషగుణములు:—

తేజస్సును కాంతిని గలిగించును. త్రిదోషములను శమింపజేయును. ధ-ని. అర్శస్సును, శ్వయథును, మలబంధమును పోగొట్టును. రా-ని. కటురసమును, లఘు గుణమును గలిగి యుండును. నేత్రములకుహితమైనది. సమస్తజ్వరములను రాత్ర్యంధమును బోగొట్టును. శో-ని. భగ్నాస్థిసంధానమును జేయును. ధాతుపోషణము జేయును.

(ని-ర.)

(4) ప్రయోగములు:—

1. వాతవ్యాధియందు ప్రసారిణీప్రయోగము.

"క్వాథకల్కపయోభిర్వా బలాదీనాం
(బలా ప్రసారిణ్యశ్వగంధానాం) పచేత్పృథక్"

ప్రసారిణిని సమూలముగ గ్రహించి దీనికల్క క్వాథములను, పాలను, తైలమును ఒకటిగాజేర్చి పాకముజేసిన తైలమును పానాభ్యంగములకై నుపయోగించిన వాతవ్యాధి శమించును. (చ - చి - అ. 28.)

2. ఆమవాతమునందు ప్రసారిణీ ప్రయోగము.

"ప్రసారిణ్యాఢక క్వాథే ప్రస్థో గుడరసోనయోః।
పక్వః పంచోషణరజః పాదః స్యా దామవాతహా॥"

ప్రసారిణీక్వాథము ఒక ఆఢకము, గుడము, లశునము వీనిరసములు ఒక్కొక్క ప్రస్థము, పంచకోలచూర్ణము నాల్గవభాగము, ఇటులవీనినెల్లఒకటిగాజేర్చి యేడుదినములు సంధానముచేసి సేవించిన ఆమవాతము శమించును. (చ - ద.)

3. మూత్రకృచ్ఛ్రమునందు ప్రసారిణీ ప్రయోగము.

"జలేన నారికేళస్య పిబేత్ ప్రాతః ప్రసారిణీం।
మూత్రకృచ్ఛ్రవినాశాయ శర్కరాపాతనాయ చ"॥

ప్రసారిణీ కల్కమును కొబ్బరినీళ్లతో ప్రతిదినము సేవించిన మూత్రకృచ్ఛ్రమును, శర్కరయును శమించును. (వై - మ.)

4. బాలుర హిక్కావ్యాధియందు ప్రసారిణీ ప్రయోగము:—

"ప్రసారిణీ కల్క కషాయ సిద్ధం తిలోద్భవం నావన పాన లేపైః।
హిక్కాం నిజాం నాశయతి త్రిమాసాత్ పౌలస్త్య లక్ష్మీ మివ
రామభద్రః"॥

ప్రసారిణీ కల్క కషాయములతో సిద్ధము జేయబడిన తైలమును చంటిపిల్లలకు నస్యరూపముగను, పానరూపముగను, అభ్యంగరూపముగను, నుపయోగించిన హిక్క శమించును.

(5) యోగములు:—

1. ప్రసారిణీ తైలము - వా - వాతరోగ.

ఉపయోగములు - పానాభ్యంగనస్యాదిరూపముగ నుపయోగించిన సమస్తవాతవ్యాధులను శమించును.

2. త్రిశతీ ప్రసారిణీ తైలము.　　భైషజ్య - వాతరోగ
సప్తశతిక ప్రసారిణీ తైలము.　　"　　"
ఏకాదశశతిక ప్రసారిణీ తైలము.　　"　　"
అష్టాదశశతిక ప్రసారిణీ తైలము.　　"　　"
మహారాజ ప్రసారిణీ తైలము.　　"　　"

ఉపయోగములు:—పానాభ్యంగ నస్యాది రూపముగ నుపయోగించిన కుబ్జవాతము, పంగువాతము, వమనము, అంగశోష, భగ్నము, వాతరక్తము, అపస్మారము, ఉన్మాదము, భ్రమ, వలీపలితములు ఇవిశమించును. వర్ణకరము, రసాయనము, వయసికరము, బృంహణము, పుష్టికరము, గర్భప్రదము.

3. కుబ్జ ప్రసారిణీ తైలము. చ - ద. వాతవ్యాధి.

ఉపయోగములు:— పానాభ్యంగనస్యాదిరూపముగ నుపయోగించిన సమస్తవ్యాధులను శమించును.

## స్వానుభవము

[ప్రసారిణి 'లంజసవరము' గొంతెమగోరు (కొమరు) తీగె యని కొందరి యభిప్రాయము. గ్రంథకర్తయు నదే యభిప్రాయముతో గ్రంథస్థములగు కొన్ని యోగములను వ్రాసి యున్నాడు. ఆంధ్రదేశమునందు లంజసవరమనెడు తీగెవంటి మొక్కకు గంధములేదు. గంధాఢ్యాయని చెప్పుట చేత ఇది ప్రసారిణి కాదని నా అభిప్రాయము. ఆంధ్రదేశము నందు పీతికంపుగొట్టెడు ఆకు ఒకటి కలదు. దానిని ప్రసారిణి

యని నేను వ్రాయుచున్నాను. దీనికి తక్కెడాకు, తక్కెళ్ళాకు అని గ్రామములలో పేరు. ఇది వంగిన అంగములను చూచు నట్లు చేయునది. కాబట్టి దీనికి ప్రసారిణి యను పేరు వచ్చిన దని గ్రామములలో ప్రతీతి కలదు. ఆమవాత సంబంధమైన నొప్పులయందు స్వేదకర్మనిమిత్తమై ఉపయోగించు కషాయ ములకును, అవగాహస్నానములకును ఈ ప్రసారిణిని అనుభవ పూర్వకముగా నే నుపయోగించు చున్నాను. లోపలికిచ్చుట లేదు. ఆంధ్రదేశమునందు పలువురు వైద్యులు ఈ తక్కెడ ఆకును ఉపయోగించుట చూచి యున్నాను. కాచిన కషా యము దుర్గంధము లేక ఒక విధమైన సుగంధము గలిగి యుండును. ఆ. ల. ]

# 123

## ప్లక్షః - జువ్విచెట్టు

### భాషాంతర నామములు

హిందీ - పాకర, పాఖర, పిలఖన, మరాఠి - పీపళీవృక్ష. గుజ రాతి - పీపళీ, పీపలీవృక్ష. మలయాళం - ఇత్తి. కర్ణాటకం - అరళీ. ద్రావిడం - ఇత్తి.

# నైసర్గిక స్వరూప వర్ణనము

# Natural Order—Boracae (Urticaceae)

పనస కుటుంబము

## జువ్విచెట్టు - Ficus Tsiela

(ప్రథమ భాగమున 201-వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ ప్లక్షో జటీపర్కటిశ్చ పర్కటీ చ స్త్రియామపి॥

ప్లక్షము, జటి, పర్కటి, పర్కటీయనునవి ప్లక్షనామములు.

## ప్లక్ష గుణములు

శ్లో॥ ప్లక్షః కషాయః శిశిరో వ్రణయోనిగదాపహః ।
దాహపిత్తకఫాస్రఘ్నః శోధహా రక్తపిత్తహృత్ ॥

జువ్విచెట్టు కషాయరసమును, శీతవీర్యమును గలిగి యుండును. పిత్తకఫములను శమింపజేయును. వ్రణము, యోనిరోగము, దాహము, రక్తదోషము, శోఫ, రక్తపిత్తము అను నీ వ్యాధులను పోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిదనామములు:—

పరిచయబోధకములు:—జటి, (చారుదర్శిని, క్షీరి, మహాబలము, దృఢప్రరోహము.)

(2) శబ్దార్థములు:—

జటి - జడలవలె వ్రేలాడునట్టి కాయలగుత్తులను గలది. చారుదర్శిని - అందముగ కాన్పించునది. క్షీరి - పాలను గలిగి యుండునది. మహాబలము - హెచ్చుబలమును గలది అనగా దృఢముగా నాటుకొని యుండునది. దృఢప్రరోహము - దృఢమైన మొలకలను గలది.

(3) భేదములు:—

ఇది మహావృక్షప్రభేదముచే రెండు విధములుగా నుండి వృక్షజాతులలో నుత్పత్తి గలిగి క్షీరివృక్షములలో (లేక) పంచవల్కలగణద్రవ్యములలో గణింపబడు చున్నది. ఈ వృక్షములు సామాన్యముగ నెల్లచోటుల నుత్పత్తి యగుచుండును. పైని చెప్పినట్లుగ పెద్ద-చిన్న భేదముచే రెండు విధములుగ నున్నవని తెలియుచున్నను కొంచెము హెచ్చుతక్కువగ నిగిలి చిన్నది గూడ ఎత్తుగనే పెరుగుచుండుటను బట్టి వీనికంత హెచ్చు భేదముండునని తోచుటలేదు. ఇదియును గాక "హ్రస్వోఽపి మహతో గుణం లభతే" (రా-ని.) యను రాజనిఘంటుకార నిరూపణమును బట్టి ఈ రెండును సమాన గుణములనే గలిగి యున్నట్లు గూడ తెలియగలదు. కాని "హ్రస్వపత్రో విశేషతః" అను శాలిగ్రామనిఘంటుకార వచనమును బట్టి పెద్ద-చిన్న పత్రభేదమునిది రెండు విధములుగా నుండుననియు నందు చిన్నపత్రము గలదియే శ్రేష్ఠమైనదనియు తెలియగలదు. అయితే "హ్రస్వపత్రో విశోషకః" అను రాజనిఘంటుకార వచనమును బట్టి చిన్న జువ్వి శోషింపజేయు స్వభావము గలదిగా తెలియగలదు. ఈ రెండు విధములగు వచనములను బట్టి చిన్నజువ్వి చిన్న యాకులను గలిగి యుండునో లేక, పొట్టిగానుండునో గూడ నిశ్చయింప వీలుగాకున్నది. ఇంతకంటె హెచ్చువిషయము తెచ్చుటను గానరాకుండుటచే నింకను విమర్శించవలసి యున్నది. ఈ వృక్షము లంత విశాలముగా పెరుగవు. ఆకులు వళసరిగను, కొంచెము విశాలముగను, కోడిగుడ్డాకారమును గలవిగను నుండును. శాఖలసంధ్యనుండి పొడవుగ పెరిగిన యొక నాళమువంటి చిన్న చిన్న గుండ్రని కాయలు గుత్తులుగుత్తులుగ నుత్పన్నమగును. ఇట్టివి యనేకములుగా నొకచో నుండియే యేర్పడును. ఇవి యిటుల క్రిందకు జడలవలె వ్రేలాడుచుండుటను బట్టి జటీయని వ్యవహరింపబడుచున్నవి. ఈ వృక్షముయొక్క త్వక్కు పసుపువర్ణమును గలిగియుండును. ఇది మిగుల కషాయరసముతో గూడి యుండును. దీనియొక్క సర్వాంగములును పాలను గలిగి యుండును. దీని పట్టనే విశేషముగా వైద్యమునందుపయోగింతురు. రక్తపిత్తాదులందు ఇది విశేషముగా నుపయోగింప బడుచున్నది.

(4) విశేషగుణములు:—

(క) కటురసమును, కషాయానురసమును గలిగి యుండును. మూర్ఛను, ప్రలాపమును, భ్రమను బోగొట్టును. (ధ-ని.)

(ఖ) హ్రస్వప్లక్ష - వ్రణాంశములను శోషింపజేయును. (రా-ని.)

(5) ప్రయోగములు:—

1. యోనిస్రావమునందు ప్లక్ష ప్రయోగము.

"ప్లక్షత్వక్చూర్ణపిండం వా ధారయేత్ మధునాకృతం" ||

జువ్విపట్టచూర్ణమును తేనెతో గలిపి ముద్దవలెచేసి యోనియందుంచిన రక్తస్రావము నిలుచును. (చ-చి-అ-30.)

2. విసర్పమునందు ప్లక్ష ప్రయోగము.

"ప్లక్షవేతసాశ్వత్థపల్లవైః ।
త్వక్కల్కైర్బహుసర్పిష్కైః తైర్వా లేపనంహితం" ||

జువ్వి, ప్రబ్బలి, రావి వీనియొక్క చిగుళ్లు, పట్టలు మెత్తగా నూరి అధికముగా నేయిచేర్చి లేపనముజేసిన విసర్పము శమించును. (చ-చి-అ-11.)

3. శోఫనిర్వాపణమునకు ప్లక్ష ప్రయోగము.

"ప్లక్ష వేతసవల్కలాః ।
ససర్పిష్కాః ప్రలేపః స్యాచ్ఛోఫ నిర్వాపణం పరం" ||

జువ్వి, ప్రబ్బలి వీని పట్టలను మెత్తగా నూరి నేయి గలిపి లేపనము జేసిన శోఫ నిర్వాపణమగును. (చ-చి-అ-13.)

4. వ్రణరోపణమునకు ప్లక్ష ప్రయోగము.

"ప్లక్ష వేతసాః ।
కషాయాః రోపణాః స్మృతాః" ||

జువ్వి, ప్రబ్బలి వీని పట్టలతో కషాయము గాచి వ్రణశోధనము జేసిన శీఘ్రముగా రోపణమగును. (చ-చి-అ-13.)

5. రక్తాతిసారమునందు ప్లక్ష ప్రయోగము.

"ప్లక్షశల్లకీతినిశత్వచః ।
క్షీరే విమృదితాః పీతాః సక్షౌద్రా రక్తసారణాః" ||

జువ్వి, అందుగుచెట్టు, నెమ్మిచెట్టు వీని పట్టలను క్షీరముతో నూరి తేనె గలిపి సేవించిన రక్తాతిసారము శమించును. (సు-ఉ-అ-40.)

6. రక్తపిత్తమునందు ప్లక్ష ప్రయోగము.

"ప్లక్ష వేతస పల్లవాః।
శాకార్థే శాకసాత్మ్యానాం తండులీయాదయో హితాః"॥

జువ్వి, ప్రబ్బలి వీని చిగుళ్ళను శాకముగాపక్వముజేసి శాకసాత్మ్యుల కిచ్చిన రక్తపిత్తము శమించును. (భా-ప్ర.)

---

# 124

# పాటలా - కలిగొట్టు (లేక) పాదిరిచెట్టు (ఎర్రనిది) (క)

---

## భాషాంతర నామములు

హిందీ - కరపాడర, పాఢర (ల). మరాఠి-పాడళ్. గుజరాతి-పాడళ్. మలయాళం - పాదిరి. కర్ణాటకం - హాదరి. ద్రావిడం - పాదిరి.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Bignoniaceae

తగడ కుటుంబము

కలిగొట్టు - Sterios permum Chelonoides

ప్రకాండము:—లావుగను పొడుగుగను వంకరలు లేక తిన్నగను నుండును. బెరడు, దట్టము, గోధుమవర్ణము.

ఆకులు:—అభిముఖచేరిక, మిశ్రిమపత్రిమూలు విషమపక్షవైఖరి. చిట్టియాకులు

4 అంతలు. వీనితొడిమ పొట్టివి. అండాకారము విషమరేఖపత్రము లేతాకుల కదుగున పెత్తని రోమములు గలవు. సమాంచలము. కొన్నిటియంచు కొంచెము గొగ్గిగొగ్గులుగ నుండును కొనసన్నము.

పుష్పమంజరి:—కొమ్మలచివరలనుండి రెమ్మ గెలలు వృంతము మీఁదను సుప వృంతము మీఁదను గోధుమవర్ణముగల రోమములు గలవు. పుష్పములు పెద్దవి. అసరాళము చేటికలు చిన్నవి గలవు.

పుష్పకోశము:—సంయుక్తము 5 దంతములు నీచము.

దళవలయము:—సంయుక్తము 5 తమ్మెలు అసరాళము పసుపురంగు మంచి వాసన వేయును.

కింజల్కములు:—4 కాఁడలు పొడుగు మఱియొక గొడ్డుకాడ గలదు. దీనికి షష్ఠ్పాదితిత్తి లేదు. పుష్పాదితిత్తులు రెండుగదులు.

అండకోశము:—అండాశయము ఉచ్చము రెండుగదులు అండములు చాలగలవు. గింజలకు ఱెక్కలుండును. కీలము గుండ్రము. కీలాగ్రము రెండు చీలికలు.

ఈ కుటుంబములో నెక్కువగ తీగెలును, చెట్లును గలవు. వీని ఆకులు అభిముఖ చేరిక, కొన్నిటివి మాత్రము లఘుపత్రములు. పుష్పము లసరాళము. కింజల్కములు దళ వలయపు తమ్మెలకంటెఁ దక్కువగా నుండును. అండాశయము రెండు గదులు, చాల గింజలుండును. గింజలకు సాధారణముగ ఱెక్కలు గలవు. కాయ యెండి పగులును. ఈ కుటుంబములో నుపయోగించు మొక్క లంతగా నున్నట్లు గానవచ్చుటలేదు.

## పర్యాయ పదములు

శ్లో॥ పాటలీ పాటలామోఘా మధుదూతీ ఫలేరుహా।
కృష్ణవృన్తా కుబేరాక్షీ కాచస్థాల్యలి వల్లభా॥
తామ్రపుష్పీచ కథితా .........॥

పాటలీ, పాటల, అమోఘ, మధుదూతి, ఫలేరుహ, కృష్ణవృన్త, కుబేరాక్షి, కాచసాలి, అలివల్లభ, తామ్రపుష్పి యనునవి రక్తపాటలా నామములు.

## రక్తపాటలా గుణములు

శ్లో॥ పాటలా తువరాతిక్తా ఽనుష్ణా దోషత్రయాపహా।
అరుచి శ్వాసశోథాస్రఛ్ఛర్ది హిక్కా తృషాహరీ॥

ఎఱ్ఱపాదిరిచెట్టు కషాయరసమును, తిక్తరసమును, కొద్దిగ నుష్ణ వీర్యమును గలిగి యుండును. త్రిదోషములను శమింపజేయును. అరుచి, శ్వాస, శోఫ, అర్శస్సు, ఛర్ది, హిక్క, తృష్ణ అను నీ వ్యాధులను పోగొట్టును.

## సితపాటలా తెల్లకలిగొట్టు (తెక) పాదిరిచెట్టు (ఖ)

శ్లో॥ పరాస్యాత్పాటలాసితా।
ముష్కకో మోక్షకో ఘంటాపాటలిః కాష్ఠపాటలా॥

ముష్కకము, మోక్షకము, ఘంటాపాటలి, కాష్ఠపాటల యనునవి సితపాటల నామములు.

## సితపాటలా గుణములు

శ్లో॥ సితపాటలికా తిక్తా గురూష్ణా వాతదోషజిత్।
వమిహిక్కా కఫఘ్నీ చ శ్రమశోషాపహారకా॥

తెల్లపాదిరిచెట్టు తిక్తరసమును, గురుగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. వాతకఫములను శమింపజేయును. వాంతి, హిక్క, శ్రమ, శోష అను నీ వ్యాధులను బోగొట్టును.

## వి శే షాం శ ము లు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(రక్త) - మధుదూతి, ఫలేరుహా, కృష్ణవృన్త, అలివల్లభ, తామ్రపుష్పి, (స్థిరగంధ). (శ్వేత) - సితపాటల, ఘంటాపాటలి.

(ఖ) గుణబోధకములు:—(రక్త) - అమోఘ.

(గ) ఉత్పత్తిబోధకములు:—(అంబువాసిని.)

(2) శబ్దార్థములు:—

మధుదూతి - వసంతకాలమునకు దూతగానుండునది అనగా వసంత కాలమునందు పుష్పించునది. ఫలేరుహా - ఫలమునందు మొలచునది. కృష్ణవృన్త - నల్లని తొడిమలను గలది. అలివల్లభ - తుమ్మెదలకు ప్రియమైనది. తామ్రపుష్పి - ఎర్రని పుష్పములను గలది. స్థిరగంధ - చిరకాలముండునట్టి పరిమళమునుగలది. సితపాటలా- తెల్లనిపుష్పములనుగలది. ఘంటాపాటలి-గంట వలెనుండు పుష్పములను గలది. అమోఘ - వ్యాధులను నిశ్చయముగ బోగొట్టునది. అంబువాసిని - జలప్రాంతమునందుత్పత్తి యగునది.

(3) పరిచయబోధక లక్షణము:—

"పాటలా పాదపః శుదః శేలుపత్రః ప్రసిద్ధకః ।
కాష్ఠపాటలికా తద్వత్ కదంబదలినీ చ సా" ॥

పాదిరివృక్షము నక్కెరియాకులవంటి యాకులను గలిగి మిగుల ప్రసిద్ధి గలిగి యుండును. తెల్లపాదిరిచెట్టు కడిమియాకులవంటి యాకులతో నొప్పి యుండి పై దానివలెనే ప్రసిద్ధి గలిగి యుండును. (శి-ద.)

(4) భేదములు:—

ఇది రక్త-శ్వేత భేదముచే రెండు విధములుగా నుండి యెత్తుగా బెరుగు వృక్షజాతులలో నుత్పత్తిగలిగి దశమూలాంతర్గతమై త్రిదోషహరద్రవ్యము లందు గణింపబడుచున్నది. పై పదాదులను బట్టి యిందలి రక్తపాటల వృక్షము నక్కెరియాకులవంటి యాకులను గలిగి నల్లని తొడిమెలతో గూడిన ధూర్రని పుష్పములతో గూడి యుండును. ఈ పుష్పములు చిరకాలము చెడి పోనట్టి పరిమళమును గలిగి తుమ్మెదల కామోదమును గలిగించునవిగా నుండును. ఇది వసంతఋతువునందు పుష్పించుచుండును. ఈ వృక్షము సామాన్యముగా జలప్రాంతములం దుత్పన్నమగునట్లుగా దెలియగలదు. శ్వేతపాటల కడిమియాకులవంటి యాకులను గలిగి గంటయొక్క యాకృతిని బోలి తెల్లని పుష్పములతో నొప్పియుండును. సాధారణముగ నిందలి యెఱ్ఱపాదిరియే వైద్యమునం దుపయోగింప బడుచున్నట్లు దెలియగలదు. వాగ్భటాదులచే "పాటలావాసితం చాంభః" (వా-సూ-అ-3.) అని గ్రీష్మఋతువర్ణనమునందు ఎఱ్ఱపాదిరిపుష్పములచే పరిమళింపజేయబడిన జలము పానార్హమై నిరూపింప బడినది. దీని మూలము విశేషముగా ప్రయోగములందు గ్రహింపబడుచున్నది. ఇతరాంగములు గూడ నచ్చటచ్చట ప్రయోగింప బడుచున్నట్లు దెలియగలదు.

ఇందు పైని జెప్పిన భేదములే గాకుండ భూమిపాటల, క్షుద్రపాటల, వల్లీపాటల యను మరి మూడు భేదములు శాలిగ్రామ నిఘంటుకారునిచే గ్రహింపబడినవి. అయితే ఇందలి భూమిపాటల యనునది "స్వనామఖ్యాత హ్రస్వపాటల" యని వైద్యకశబ్దసింధువునందు జెప్పబడి యుండుటను బట్టి దీనికిని క్షుద్రపాటలకును భేదము లేనట్లుగా దెలియుచున్నది. మరియు

నీ భూమిపాటల పారదసంస్కారముల నుపయోగింప బడునట్లుగా రాజనిఘంటుకారు నిరూపణమును బట్టి తెలియుచున్నది. అయితే మిగిలిన క్షుద్రపాటల, వల్లీపాటలలను గురించిన విశేషములు తెలియకుండుటచే వీని స్వరూప మెట్టిదనియు గూడ జెప్పుటకు వీలుగాకున్నది. మొత్తముమీద నీ కడపటి మూడు పాటల భేదములును సందేహజనకములుగా నుండుటం జేసి యింకను విమర్శపై నిశ్చయింపదగి యున్నవి.

(5) విశేషగుణములు:—

(క) రక్తపాటల - రక్తదోషమును బోగొట్టును. (ధ-ని.) తిక్తరసమును. కటుకానురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. ఆధ్మానమును బోగొట్టును. (రా-ని.)

(ఖ) రక్తపాటలాపుష్పము - కషాయరసమును, మధురానురసమును, శీతవీర్యమును గలిగి యుండును. హృదయమునకు హితమును గలిగించును; కఫపిత్తములను శమింపజేయును. రక్తదోషమును, అతీసారమును, దాహమును బోగొట్టును. (భా-ప్ర.) కొద్దిగ నుష్ణవీర్యమును గలిగి యుండును. కఫవాతములను శమింపజేయును. (ధ-ని.) సుగంధమును విశదగుణమును గలిగి యుండును. (సు-సూ-అ-46.)

(గ) రక్తపాటలాఫలము - హిక్కను, రక్తపిత్తమును బోగొట్టును. (భా-ప్ర.) కఫవాతములను శమింపజేయును. ఛర్దిని, తృష్ణను బోగొట్టును. (శో-ని.) కషాయరసమును, మధురానురసములను, గురుగుణమును గలిగి యుండును. మూత్రకృచ్ఛ్రమును బోగొట్టును. (రా-ని.)

(ఘ) సితపాటల - సుగంధమును గలిగి యుండును. రక్తదోషమును, అరుచిని, శోఫను, శ్వాసను, తృష్ణను బోగొట్టును. (ని-ర.)

(చ) భూమిపాటల - కటురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. బలమును, వీర్యమును వృద్ధిబొందించును. (శా-ని.) లఘుగుణమును గలిగి యుండును. (రా-ని.)

(ఛ) క్షుద్రపాటల- స్నిగ్ధగుణమునుగలిగి యుండును. వ్రణశోధనము జేయును. కఫమును శమింపజేయును. మేదోవృద్ధిని, కుష్ఠమును, విషమును బోగొట్టును. (శా-ని.)

(జ) వల్లీపాటల - ఉష్ణవీర్యమును గలిగి యుండును. వాతపిత్తము లను శమింపజేయును. అరుచిని, రక్తదోషమును, శోఫను బోగొట్టును.(శా-ని.)

(6) ప్రయోగములు:—

1. వ్రణపరిచ్ఛాదనార్థమై పాటలా ప్రయోగము.

"పాటల్యాః పిప్పలస్య చ ।
వ్రణపరిచ్ఛాదనే విద్వాన్ పత్రాణ్యర్కస్య చాదిశేత్ "॥

పాదిరిపత్రములు వ్రణములపై కప్పుటకు శ్రేష్ఠములైనవి. (చ-చి-అ-13.)

2. అశ్మరియందు పాటలా ప్రయోగము.

"పాటలా కరవీరాణాం క్షారమేవం సమాచరేత్ "॥

పాదిరిక్షారమును సేవించిన అశ్మరి శమించును. (సు-చి-అ-7.)

3. హిక్కయందు పాటలాప్రయోగము.

"పాటలాయాః ఫలం పుష్పం ।
చ త్వారో యూషయోగాః స్యుః ప్రతిపాద ప్రదర్శితాః ।
మధుద్వితీయాః కర్తవ్యాః తే హిక్కాసు విజానతా "॥

పాదిరిపువ్వులను, కాయలను యూషములుగా జేసి అందు తేనెగలిపి సేవించిన హిక్క శమించును. (సు-ఉ-అ-50)

4. మూత్రవికారములందు పాటలా ప్రయోగము.

"పాటలా క్షారమాహృత్య సప్తకృత్వః పరిస్రుతం ।
పిబేన్మూత్రవికారఘ్నం సంసృష్టం తైలమాత్రయా "॥

పాదిరిక్షారమును ఏడుసార్లు పాకము జేయుబడినట్టిదానిని గ్రహించి తైలముతో జేర్చి సేవించిన మూత్రవికారములు శమించును. (సు-ఉ-అ-58.)

6. అగ్నిదగ్ధవ్రణమునందు పాటలా ప్రయోగము.

"సిద్ధం కల్కకషాయాభ్యాం పాటల్యాః కటుతైలకం ।
దగ్ధవ్రణ రుజాస్రావ దాహవిస్ఫోట నాశనం "॥

పాదిరిపట్టయొక్క కల్కకషాయములతో కటుతైలమును గలిపి పాకముజేసి దీనితో నభ్యంగము జేసిన దగ్ధవ్రణమునందు గలిగిన శూల, స్రావము, దాహము, బొబ్బలు ఇవిశమించును. (గ-ని.)

(7) యోగములు:—

1. పాటలాపుష్పాదిక్వాథము - (వై-చిం-జ్వగ.) మాత్ర:-1 పం.

ఉపయోగములు:—అంతర్దాహజ్వరము శమించును.

2. పాటలాద్యంజనము - (సు-ఉ-నేత్రరోగ.)

ఉపయోగములు:—అంజనము వేసిన రక్తాభిష్యందము శమించును.

స్వా ను భ వ ము

[ నేను దీనిని ప్రత్యేకముగా నుపయోగించి చూడ లేదు. ఆ. ల. ]

---

# 125

## పాఠా - విషబొద్ది (లేక) చిరుబొద్ది

---

### భాషాంతర నామములు

హిందీ - (దుఖనిర్విసీ, పహాడీ, హాడజోడీ) పాఠా, పాఢ - మరాఠీ - (పహాడవేల) పహాడ్‌మూల. గుజరాతి - (కరండియుం) కాళీపాట, మలయాళం - పాడక్కి. కర్ణాటకం - పాఠా. ద్రావిడం - పాడక్కిడంగు, వట్టితిరుప్పి.

### నైసర్గిక స్వరూప వర్ణనము

Natural Order—Manis permaceáe

తిస్పతీగ కుటుంబము

చిరుబొద్ది - Cyclea Peltata

(ప్రథమభాగమున 478-వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ పాఠాంబష్ఠాంబష్ఠకీ చ ప్రాచీనా పాపచేలికా।
ఏకాష్ఠీలా రసా ప్రోక్తా పాఠికా వరతిక్తకా (వనతిక్తకా)॥

పాఠ, అంబష్ఠ, అంబష్ఠకి, ప్రాచీన, పాపచేలి, ఏకాష్ఠీల, రస, పాఠిక, వరతిక్త (వనతిక్తక) యనునవి పాఠానామములు.

## పాఠాగుణములు

పాఠోష్ణా కటుకా తీక్ష్ణా వాతశ్లేష్మహరీ లఘుః।
హన్తి శూల జ్వరచ్ఛర్ది కుష్ఠాతీసార హృద్రుజః॥
దాహ కండూ విష శ్వాస కృమిగుల్మ గరవ్రణాన్॥

విషబొద్ది కటురసమును, తీక్ష్ణలఘుగుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. వాతశ్లేష్మములను శమింపచేయును. శూల, జ్వరము, ఛర్ది, కుష్ఠము, అతీసారము, హృద్రోగము, దాహము, కండు, విషము, శ్వాస, కృమిరోగము, గుల్మము, కృత్రిమవిషము, వ్రణము అను నీవ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(అవిద్ధకర్ణి, మాలతి, వృత్తపర్ణి, ప్రతానిని, వత్సాదని.)

(ఖ) గుణబోధకములు:—పాపచేలిక, వరతిక్త, (తిక్తపుష్ప, బృహత్తిక్త, రక్తఘ్ని, విషహన్త్రి, రుచిష్య, దీపని.)

(గ) ఉత్పత్తిబోధకములు:—వనతిక్త, ప్రాచీన.

(2) శబ్దార్థములు:—

అవిద్ధకర్ణి - ఛిద్రములులేనటి కర్ణములవంటి పత్రములను గలది. మాలతి - మాలతీ తీగవలె లతారూపమున విస్తరించునది. వృత్తపర్ణి - గుండ్రముగనుండు పత్రములనుగలది. ప్రతానిని - లతారూపమున విస్తరించునది. వత్సాదని - చిన్నచిన్నదూడలచే దినబడునది (లేక) తిప్పతీగవలె నుండునది.

పాపచేలిక - వాతమును శమింపజేయునది. (లేక) వ్యాధులను బోగొట్టునది. వరతిక్త - తిక్తరస ద్రవ్యములలో శ్రేష్ఠమైనది. తిక్తపుష్ప - తిక్తరసము గలిగిన పువ్వులతో కూడియుండునది. బృహత్తిక్త - హెచ్చుగ తిక్తరసమును గలిగియుండునది. రక్తఘ్ని - రక్తదోషమును బోగొట్టునది. విషహన్త్రి - విషమును బోగొట్టునది. రుచిష్య - రుచిని బుట్టించునది. దీపని - జాఠరాగ్నిని వృద్ధి బొందించునది. వనతిక్త - తిక్తరసమునుగలిగి వనములందుత్పన్నమగునది. ప్రాచీన - తూర్పు భూములందుత్పత్తి యగునది.

(3) పరిచయబోధకలక్షణము:—

"వత్సాదనీ సమా పీలుఫలా తిక్తా చ పిచ్ఛిలా॥"

విషబొద్దితీగ తిప్పతీగతో సమానముగ నుండును. దీనికాయలు గోలుగు (పీలు) కాయలవలె నుండును. ఇవి చేదుగను, జిగురుగలవిగ నుండును.

కై - దే.

(4) భేదములు:—

ఇది రాజపాఠ - లఘుపాఠయని పెద్ద చిన్న భేదముచే రెండువిధములుగా నుండునట్లు దెలియగలదు. ఇది లతాజాతులలో గణింప బడుచున్నది. దీనియాకులపై వర్ణముబట్టి గుడూచీపత్రములవలె నుండునని దెలియుచున్నను వాటితో గొద్దిగ పోలికగలిగి కొద్దిగా పొడవుగనుండును. ఈ పత్రముల కన్నిభాగములందును సన్నని నూగు అంటియుండును. ఈలత యేదేని యొక వృక్షమునంటి గుబురుగా నల్లుకొనును. దీనిమూల-పత్ర-పుష్పములెల్ల మిగుల చేదుగనుండును. అందుమూలమునకే విశేషప్రయోగ మున్నట్లు గానబడును. "ఈషద్రోమశా శ్వేతపుష్పగుచ్ఛా"యని వైద్యకశబ్ద సింధువునందిది కొద్దిగ రోమములను (నూగును) గలిగియుండుననియు, దీనిపుష్పములు తెల్లగ నుండి గుత్తులుగుత్తులుగ నుండుననియును జెప్పబడినది. ఈనూగు పత్రములకేగాని యితరాంగముల నున్నటుల గానరాదు. పైపదములనుబట్టి యిదితూర్పు దిక్కునందలి వనభూములలో నుత్పత్తి యగుచుండునని దెలియగలదు. అయితే మలబారు (దక్షిణ) ప్రాంత వనములలో విశేషముగా బెరుగునని కొందరు జెప్పుదురు.

ఇందలి లఘుపాఠయనునది కైయదేవునిచే నిట్లు వర్ణింపబడినది.

"లఘు పాఠా తు బాంగాస్యాత్ కరేంధకమితి స్మృతం। ఫంజికా

సదృశా వల్లీ గుచ్ఛపుష్పా చ పీలుకీ।" చిన్నచిరుబొద్ది భారంగీలతవలెనుండి గుత్తులు గుత్తులుగా నుండు పుష్పములను గలిగి యుండును. ఇది బాంగ, కరేంథకము అని వ్యవహరింప బడును.

ఇటుల రెండు విధములగు పాఠలలో మనకు దొరకునది యేదియో దెలియకున్నది. ఇంతియే గాకుండ నీభేదములితర నిఘంటు కారులచే నంతగా గ్రహింప బడినట్లుగూడ గానరాదు.

(5) గుణములు:—

(1) వెంటనే శుక్రమును గలిగించును. కఫపిత్తజ్వరములను బోగొట్టును. (ధ-ని.,) గురుగుణమును గలిగియుండును. భగ్నసంధానమును జేయును. వాతపిత్తజ జ్వరమును, రక్తదోషమును, గుల్మమును, ఉదరమును, దాహమును బోగొట్టును. (రా-ని.,) త్రిదోషములను శమింపజేయును. (రా-వ.)

( ) లఘువాత - తిక్తరసమును గలిగి యుండును. త్రిదోషములను శమింపజేయును. విషము, కోపము, కండు, ఛర్ది, హృద్రోగము, కృత్రిమ విషము వీనిని బోగొట్టును. (రా-ని.)

(గ) పాఠాశాకగుణములు - లఘు గుణముగలిగి యుండును. మలాదులను నిరోధించును. త్రిదోషములను శమింపజేయును. (వా-సూ-అ-6.)

(6) ప్రయోగములు:—

1. అర్శోరోగమందు పాఠా ప్రయోగము.

"దుఃస్పర్శకేన బిల్వేన యవాన్యా నాగరేణ వా।
ఏకైకేనాపి సంయుక్తా పాఠా హన్త్యర్శసాంరుజం"॥

చిరుబొద్దిని లగొండివేళ్ళతో గాని, మారేడువేళ్ళతో గాని, ఓమముతో గాని, శుంఠితో గాని చేర్చి కల్కముగ గాని, కషాయముగ గాని జేసి సేవించిన అర్శస్సులందలి శూల శమించును. (చ-చి-అ-9.)

2. అతీసారమునందు పాఠా ప్రయోగము.

"లోణికాయాః స పాఠాయాః శుష్కశాకేన వా ఘనః।
దధిదాడిమసిద్ధేన బహుస్నేహేన భోజయేత్"॥

లోణిక (అమ్లద్రవ్యము,) చిరుబొద్ది వీని యాకులను శుష్కముగ గాని, పెరుగు, దానిమ్మపండ్లరసము వీనితో నుడకబెట్టి యందు విశేషముగ

ఘృతమును జేర్చి గాని శాకముగాజేసి భుజించిన అతీసారము శమించును.
(చ-చి-అ-10.)

3. లవణమేహమునందు పాఠా ప్రయోగము.

"పాఠాగరుకషాయం లవణమేహినాం" ॥

చిరుబొద్దివేరు, కృష్ణాగరు వీని కషాయమును సేవించిన లవణమేహము శమించును. (సు-చి-అ-11.)

4. ఆర్తవరోగమునందు పాఠా ప్రయోగము.

"గ్రంధిభూతే పిబేత్పాఠా త్ర్యూషణం వృక్షకాణి చ" ॥

ఆర్తవము గ్రంధిరూపమున దుష్టమైనప్పుడు చిరుబొద్దిమూలము, త్రికటుకములు, కొడిశపాలపట్ట వీని కషాయమును సేవించిన ఆర్తవశోధనమగును.
(సు-శా-అ-2)

5. అర్శోరోగమున వాతవిబంధము గలిగినప్పుడు పాఠా ప్రయోగము.

"పాఠయా వా యుతం తక్రం వాతవర్చోఽనులోమనం" ॥

చిరుబొద్ది [illegible]మును [illegible]మునందు జేర్చి సేవించిన అర్శోరోగమునందు వాత-పురీషములకు అనులోమనము గలుగును. (వా-చి-అ-8.)

6. అంతర్విద్రధియందు పాఠాప్రయోగము.

"శమయతి పాఠామూలం క్షౌద్రయుక్తం తండులాంబునా పీతం।
అంతర్భూత విద్రధి ముద్ధత మాశ్వేవ మనుజస్య చ॥"

చిరుబొద్దివేరు చూర్ణమును తేనెతో గలిపి బియ్యపుకడుగుతో సేవించిన యంతర్విద్రధి శీఘ్రముగ శమించును. (శా-ద.)

7. సుఖప్రసవముకై పాఠాప్రయోగము.

"పాఠాయాస్తు శిఫాం యోనౌ యానారీ సంప్రధారయేత్।
శిరః ప్రసవ కాలే తు సా సుఖేన ప్రసూయతే॥"

గర్భిణి ప్రసవకాలమునందు శిశువుయొక్క శిరస్సుమాత్రము బయటకువచ్చి మిగిలిన శరీరము రాక బాధపడుచున్న ప్పుడు చిరుబొద్దివేరును యోనిముఖమును నందుంచినచో సుఖప్రసవము గలుగును. (చ-ద.)

8. జ్వరమునందు పాఠాప్రయోగము.

"పాఠా శిఫాపయః పీతం ప్రాత రేవ దినే స్త్రీభిః।
శీతికాం... ... ...కంప బహులాం నాశయేత్॥"

చిరుబొద్దివేరుతో గాచినపాలను మూడు దినములు ప్రతియుదయమున సేవించిన విశేషకంపముతో గూడిన శీతజ్వరము శమించును. (వై-మ.)

9. ప్లీహోదరమున పాఠాప్రయోగము.

"మూలం సమం తండులధావనేన ప్రపేషితం శ్వేతపునర్నవాయాః।
పీతం భవేత్ ప్లీహవినాశహేతుః పాఠాజటాఛిన్నరుహాజటా వా॥"

తెల్లగలిజేరువేరును, చిరుబొద్ది వేరును సమముగగ్రహించి బియ్యపుకడుగుతో మెత్తగానూరి కల్కముజేసి సేవించిన ప్లీహోదరము శమించును. (రా-మా.)

10. అర్ధావభేదకమునందు పాఠాప్రయోగము.

"అర్ధశీర్షః శమం గచ్ఛేత్ పాఠామూలస్య నస్యతః॥"

చిరుబొద్దివేళ్ల స్వరసమును నస్యముజేసిన యర్ధావభేదకము శిరశ్శూల శమించును. (గ-ని.)

(7) యోగములు:—

(1) పుష్యానుగ (పాఠాది) చూర్ణము- (చ - యోనిరోగ.)
మాత్ర $\frac{1}{4}$ తులము.

ఉపయోగములు - అర్శస్సు, రక్తాతిసారము, యోనిరోగము, రజోదోషము, ఇవి శమించును.

(2) పాఠాదిచూర్ణము- (వా-ఉ- ముఖరోగ.)
ఉపయోగము - దంతధావనము జేసిన దంతశూల, దంతకండు, దంతమాంసపాకము, దంతస్రావము ఇవి శమించును.

(3) పాఠాదిగణక్వాథము - (చ సూ- అ-4.)
మాత్ర 1 పలం.
ఉపయోగములు - స్తన్యశోధనమగును.

(4) పాఠాది కషాయము - (వా - జ్వర.)
మాత్ర 1 పలం.

ఉపయోగములు - దోషపాచనమగును. జ్వరము, అరుచి, తృష్ణ,ముఖ వైరస్యము, ముఖపాకము ఇవి శమించును.

(5) పాఠాద్య చూర్ణము - చ ద. గ్రహణీ.

మాత్ర $\frac{1}{4}$ తులము.

ఉపయోగములు - గ్రహణి, అతీసారము, ఛర్ది, జ్వరాతీసారము,శూల హృద్రోగము, అరుచి, అగ్నిమాంద్యము శమించును.

6. పాఠాదిసప్తకకషాయము - చ - ద - జ్వర.

మాత్ర 1 పలం.

ఉపయోగములు - కఫాదికోపిత్తశ్లేష్మజజ్వరము శమించును.

7. పాఠాదితైలము - భైషజ్య - నాసారోగ.

ఉపయోగములు. - నస్యము జేసిన పీనసము శమించును.

8. పాఠాదిఘృతము - బ - రా - అసృగ్దర.

మాత్ర 1 తులం.

ఉపయోగములు - అసృగ్దరము శమించును.

స్వానుభవము.

నేను దీనిని ప్రత్యేకముగా నుపయోగించలేదు. ఆ. ల.]

---

# 126

# పారిభద్రః - బాడిదచెట్టు

## భాషాంతర నామములు

హింది-ఫరహద. మరాఠి - పాంగరా, పారంగా. గుజరాతి - పాండేరవో. మలయాళం - మురిక్క. కర్ణాటకం-హారివాల. ద్రావిడం-పవళముల్లైకై.

## గజపిప్పలీ గుణములు

శ్లో॥ గజకృష్ణా కటుర్వాతశ్లేష్మహృద్వహ్నివర్ధనీ।
ఉష్ణా నిహంత్యతీసారం శ్వాసకంఠామయక్రిమీన్॥

ఏనుగపిప్పలి కటురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. వాతశ్లేష్మములను శమింపజేయును. అతీసారము, శ్వాసము, కంఠరోగము, క్రిములు అను నీవ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు (క) (పిప్పళ్లు);

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—కృష్ణ, ఉషణ, తీక్ష్ణతండుల.

(ఖ) ఉత్పత్తిబోధకములు:—మాగధి.

(2) శబ్దార్థములు:—

కృష్ణ - నల్లగనుండునది. ఉషణ - కారముగ నుండునది. తాపమును గలిగించునది. తీక్ష్ణతండుల - తీక్ష్ణగుణముగల (ఘాటుగనుండు) బీజములను గలది. మాగధి - మగధదేశమున నుత్పన్న మగునది.

(3) పరిచయబోధక (విశేష) లక్షణము:—

"అథ పిప్పలికావల్లీ నాగవల్లీదలా మృదుః॥"

పిప్పళ్లతీగె తమలపాకులవంటి యాకులను గలిగియుండును. ఈయాకులు మృదువుగ నుండును. (శి-ద.)

(4) భేదములు:—

పిప్పలి, వనపిప్పలి, సింహపిప్పలి, గజపిప్పలి అనిపిప్పళ్లు నాలుగు విధములుగానుండి త్రికటుకాంతర్గతమై దీపనపాచన ద్రవ్యములలో నొకటిగ బరిగణింప బడుచున్నవి.

(5) విశేషగుణములు:—

(క) తిక్తానురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. (రా-ని.

(ఖ) వనపిప్పలీ గుణములు:—

..............ఉష్ణా తీక్ష్ణా రుచ్యా దీపనీ,
ఆమా భవే ద్గుణాఢ్యా తు శుష్కా స్వల్పగుణా స్మృతా॥"

అడవిపిప్పళ్లు సామాన్యముగ తీక్ష్ణగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. అవి పచ్చివి గుణాధికములుగను, ఎండువి స్వల్పగుణము గలవిగను నుండును.

(రా-ని.)

(గ) సింహాపిప్పలీగుణములు:— "కటుః ఉష్ణా కృమిఘ్నీ దీపనీ కఫశ్వాసవాతవ్యాధిశమనీ కోష్ఠశోధనీ చ" ॥

ఇది సింహళదేశమున (Cylone) నుత్పన్నమగును. కటురసమును, ఉష్ణవీర్యమును, గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. కోష్ఠమును శుద్ధిజేయును. కృములను, కఫజశ్వాసను, వాతవ్యాధిని బోగొట్టును.

(రా-ని.)

(6) ప్రయోగములు:—

1. కాసయందు పిప్పలీ ప్రయోగము.

"అథవా పిప్పలీకల్కం ఘృతభృష్టం ససైంధవం" ॥

పిప్పళ్లకల్కము నేయితో భర్జనజేసి సైంధవలవణమును జేర్చి సేవించిన కాసరోగము శమించును. (చ-చి అ-22.)

2. వాతరక్తమునందు పిప్పలీ ప్రయోగము.

"పిప్పలీర్వా క్షీరపిష్టా వారిపిష్టా వా పంచాభివృద్ధ్యా దశాభివృద్ధ్యా వా పిబేత్ క్షీరౌదనాహారో దశరాత్రిం, భూయశ్చాపకర్షయేత్ ఏవం యావత్పంచదశ చేతి। తదేతత్పిప్పలీవర్ధమానకం వాతశోణిత విషమజ్వరా రోచక పాండు ప్లీహోదరార్శః కాస శ్వాస శోఫశోషాగ్నిసాద హృద్రోగోదరాణ్యుపహంతి" ॥

పిప్పళ్ళను మొదటిదినమున నైదు చొప్పున నారంభించి, రెండవదినము నుండి యైదైదు చొప్పున హెచ్చింపుచుగాని, లేక మొదటిదినమున పది చొప్పున ఆరంభించి రెండవ దినమునుండి పది పది చొప్పున హెచ్చింపుము గాని వానిని జలముతోగాని (లేక) పాలతోగాని నూరి కల్కముజేసి యిటుల పది దినములు సేవించి, తిరిగి యైదు చొప్పున గాని, పది చొప్పున

గాని పదునైదు మిగులువఱకు తగ్గించుచు సేవించి పాలతో గూడిన యన్నమును ఆహారముగా దీసుకొనుచుండవలెను. ఇది పిప్పలీవర్ధమానకమని జెప్పబడును. దీనివలన వాతరక్తము, విషమజ్వరము, అరుచి, పాండువు, ప్లీహోదరము, అర్శస్సు, కాసము, శ్వాస, శోఫ, శోష, అగ్నిమాంద్యము, హృద్రోగము, ఉదరము ఇవి శమించును. (సు-చి-అ-5.)

3. అర్శస్సునందు పిప్పలీ ప్రయోగము.

"పిప్పలీపిప్పలీమూల......పూర్వవదేవ।
నిరన్నో వా తక్రమహారోహః మాసముపసేవేత" ॥

పాలు, అన్నమును ఆహారముగా దీసుకొనుచు గాని లేక నిరాహారుడై కేవలము తక్రమును దీసికొనుచు గాని పిప్పళ్ళు, మోడి మొదలగు వానిని పిప్పలీవర్ధమానకమువలె నొక మాసము సేవించిన అర్శోరోగము శమించును. (సు-చి-అ-6.)

4. కఫజకాసయందు పిప్పలీ ప్రయోగము.

"తైలభృష్టంచ వైదేహీ కల్కం ససితోపలం।
పాయయేత్కఫకాసఘ్నం కులుత్థసలిలాప్లుతం" ॥

పిప్పళ్ళకల్కమును తైలముతో భర్జనజేసి అందు చక్కెరజేర్చి ఉలవకషాయములో గలిపి సేవించిన కఫజకాసము శమించును. (వా-చి-అ-2.)

5. ప్రవాహికయందు పిప్పలీ ప్రయోగము.

"పిప్పల్యాః పిబతః సూక్ష్మం రజో మరిచజన్మ వా।
చిరకాలానుషక్తాపి నశ్యత్యాశు ప్రవాహికా" ॥

పిప్పళ్ళచూర్ణమును గాని, మిరియాలచూర్ణమును గాని సేవించిన చిరకాలమునుండి బాధించెడు ప్రవాహిక గూడ శీఘ్రముగ శమించును. (వా-చి-అ-9.)

6. శ్లేష్మజజ్వరమునందు పిప్పలీ ప్రయోగము.

"క్షౌద్రేణ పిప్పలీచూర్ణం లిహ్యాత్ శ్లేష్మజ్వరాపహం।
ప్లీహానాహవిబంధార్తి కాసశ్వాసవిమర్దనం" ॥

పిప్పళ్ళచూర్ణమును తేనెతో సేవించిన శ్లేష్మజజ్వరము శమించును. మరియు, ప్లీహాభివృద్ధి, ఆనాహము, విబంధము, కాసము, శ్వాస ఈవ్యాధులు గూడ శమించును. (హా-సం-చి-అ-3.)

**7. కాసాదులయందు పిప్పలీ ప్రయోగము**

కాసాజీర్ణ శ్వాసహృత్పాండురోగే ।
మందే వా గ్నౌ కామలా రోచకేచ ।
తేషాం శస్తా పిప్పలీస్యా ద్గుడేన ।
హన్యాన్నూలాణాం జీర్ణమాశు జ్వరంచ " ॥

పిప్పళ్ళచూర్ణమును బెల్లముతోజేర్చి సేవించిన కాసము, అజీర్ణము, శ్వాస, పాండురోగము, అగ్నిమాంద్యము, కామిల, అరోచకము. జీర్ణ జ్వరము ఇవి శమించును. (హా-సం-చి-అ-52.)

8. వాతశ్లేష్మజ్వరమునందు పిప్పలీ ప్రయోగము.
"పిప్పలీభిః శృతం తోయం అనభిష్యంద దీపనం ।
వాతశ్లేష్మ వికారఘ్నం ప్లీహాజ్వర వినాశనం " ॥

పిప్పళ్ళకషాయమును పానముజేసిన వాతశ్లేష్మజజ్వరము శమించును. ప్లీహాభివృద్ధి పోవును. ఇది యభిష్యందమును గలుగజేయక జాఠరాగ్నిన వృద్ధి పొందించును. (చ-ద.)

**9. రక్తపిత్తమునందు పిప్పలీ ప్రయోగము.**

"వాసకస్వరసే......సప్తధా పరిభావితా ।
కృష్ణా వా మధునా లీఢా రక్తపిత్తం ద్రుతం జయేత్ " ॥

పిప్పళ్ళను అడ్డసరపు స్వరరసమునందు ఏడు మారులు భావనజేసి తేనెతో సేవించిన రక్తపిత్తము శమించును.

10. ఊరుస్తంభమునందు పిప్పలీ ప్రయోగము.
"పిప్పలీ మధునాగరం............ ।
ఊరుస్తంభే పిబేత్ మూత్రైః దశమూలీ రసేనవా " ॥

పిప్పళ్ళు, శుంఠి వీని చూర్ణమును గోమూత్రముతో గాని, దశమూల కషాయముతో గాని సేవించిన ఊరుస్తంభవాతము శమించును. (చ-ద.)

11. శోథయందు పిప్పలీ ప్రయోగము.

"సేవేత పిప్పలీ వా పయోన్వితా "॥

పిప్పళ్ళను పాలతో సేవించిన శోఫరోగము శమించును. (చ-ద.)

12. అమ్లపిత్తమునందు పిప్పలీ ప్రయోగము.

"పిప్పలీ మధుసంయుక్తా చామ్లపిత్త వినాశినీ "॥

పిప్పళ్ళను తేనెతో సేవించిన అమ్లపిత్తము శమించును. (చ-ద.)

13. ప్లీహాభివృద్ధియందు పిప్పలీప్రయోగము.

"తథా దుగ్ధేన పాతవ్యాః పిప్పల్యః ప్లీహశాంతయే॥"

పిప్పళ్ల చూర్ణమును పాలతో సేవించిన ప్లీహాభివృద్ధి శమించును. (భా-ప్ర.)

14. గృధ్రసీ వాతమునందు పిప్పలీప్రయోగము.

"గోమూత్రైరండ తైలాభ్యాం కృష్ణాచూర్ణం పిబేన్నరః।
దీర్ఘ కాలోత్థితాం హంతి గృధ్రసీం కఫవాతజాం॥"

పిప్పళ్ల చూర్ణమును గోమూత్రము, ఏరండతైలము (ఆముదము) వీనితో జేర్చి సేవించిన చిరకాలమునుండి బాధించుచున్న కఫవాతజమగు గృధ్రసీ వాతము శమించును. (భా-ప్ర.)

15. పరిణామ శూలయందు పిప్పలీప్రయోగము.

"క్వాథేన కల్కేన చ పిప్పలీనాం సిద్ధం ఘృతం మాక్షిక
సంప్రయుక్తం। క్షీరానుపానం వినిహంత్యవశ్యం శూలం ప్రవృద్ధం
పరిణామసంజ్ఞం॥"

పిప్పళ్లయొక్క క్వాథ కల్కములతో పక్వముచేసిన ఘృతమును తేనెనుగలిపి క్షీరాను పానముతో సేవించిన పరిణామశూల శమించును. (వం-సే.)

16. జీర్ణజ్వరమునందు పిప్పలీప్రయోగము.

కాసాజీర్ణారుచిశ్వాస హృత్పాండు కృమిరోగనుత్।
జీర్ణజ్వరేఽగ్ని సాదే చ శస్యతే గుడపిప్పలీ॥"

పిప్పళ్లను బెల్లముతో జేర్చి పుచ్చుకొనిన జీర్ణజ్వరము శమించును. మరియు, కాసము, అజీర్ణము, అరుచి, శ్వాస, పాండువు, కృమిరోగము, అగ్నిమాంద్యము ఇవి శమించును. (గ-ని.)

17. కామలయందు పిప్పలీప్రయోగము.

"కామలార్తస్య వైడంగం పిప్పల్యో నావనాంజనే॥"

కామలయందు వాయువిడంగములను పిప్పళ్లను కలిపినూరి నస్యాంజనకర్మలు జేసినహితము. (గ-ని.)

18. హిక్కయందు పిప్పలీప్రయోగము.

"పిప్పలీ శర్కరాన్వితా హిక్కాఘ్నం నావనత్రయం॥"

పిప్పళ్లను చక్కరతో జేర్చి మున్మారు నస్యకర్మ జేసిన హిక్క శమించును. (గ-ని.)

19. కఫోదరమునందు పిప్పలీప్రయోగము.

"ఉష్ణాంభసా తు యుంజీత పిప్పలీంచ కఫోదరే,
పిప్పలీవర్ధమానం వా పయసైవ ప్రయోజయేత్॥
జాతరాణాం వినాశాయ నాస్తి తేన సమం భువి॥"

పిప్పళ్లను వేడినీళ్లతో నూరి యుపయోగించినను, లేక, పిప్పలీ వర్ధమానమును పాలతో నాచరించినను కఫోదరము శమించును. ఈప్రయోగమునువిడచి యుదరరోగమునకు వేరే ప్రయోగములేదు. (గ-ని.)

20. ప్లీహోదరమునందు పిప్పలీప్రయోగము.

పిప్పలీలోహ చూర్ణం వా పయసా ప్లీహనాశనం॥"

పిప్పళ్ల చూర్ణమును లోహభస్మముజేర్చి పాలతో సేవించిన ప్లీహోదరము శమించును. (గ-ని.)

21. దంతహర్షమునందు పిప్పలీప్రయోగము.

"మాక్షికం పిప్పలీసర్పిః మిశ్రితం ధారయేన్ముఖే॥"

పిప్పళ్లతో సిద్ధముజేసిన ఘృతమును తేనెతోగలిపి ముఖమునందు ధరించిన దంతహర్షము శమించును. (గ-ని.)

22. గండమాలయందు పిప్పలీప్రయోగము.

"పిప్పలీవర్ధమానం వా గండమాలాసు యోజయేత్॥"

గండమాలయందు పిప్పలీ వర్ధమానమును ప్రయోగించిన హితము. (గ-ని.)

23. శీఘ్రముగ దంతము బయటకువచ్చుటకు పిప్పలీప్రయోగము.

"దంతపాలీం సమధునా చూర్ణేన ప్రతిసారయేత్। పిప్పల్యాః॥"

దంతములు వచ్చుచున్నప్పుడు దంతపాళిని పిప్పళ్ల చూర్ణమును తేనె తోగలిపి ప్రతిసారణము (పైనివేసిరుద్దుట) జేసిన నొప్పి మొదలగునవి శమించి శీఘ్రముగ దంతముపైకి వచ్చును. (గ-ని.)

24. కర్ణశూలయందు పిప్పలీప్రయోగము.

"తప్తాంగారోపరిక్షిప్త వస్త్రబద్ధే కణాపుటే।
యో ధూమః తచ్ఛ్రుతే కర్ణే కర్ణశూలం వినశ్యతి॥"

పిప్పళ్లను గుడ్డయందు మూటగట్టి నిప్పులపై గాల్చి యందుండివచ్చు ధూమమును చెవిలోనికి బోవునట్లు జేసిన అట్టి ధూమసంయోగమువలన కర్ణశూల శమించును. (గ-ని.)

(7) యోగములు:—

1. పిప్పల్యాదిఘృతం - (వా. అర్శ.) మాత్ర 1 తులం.

ఉపయోగములు - వాతమునకనులోమనగతి గలుగును. మలమూత్రముల విబంధము బోవును.

2. శ్రేయస్యాది ఘృతం. (వా - హృద్రోగ.) మాత్ర 1 తులం.

ఉపయోగములు - హృద్రోగము శమించును.

3. పిప్పల్యాది క్వాథము - (చ- ఉదర.) మాత్ర-బిడాలపదకం (తులం.)

ఉపయోగములు - హృద్రోగము, శ్వయథు, గుల్మము, ప్లీహాభివృద్ధి, అర్శస్సు, ఉదరము, విషూచిక, ఉదావర్తము, వాతాష్ఠీల, ఇవిశమించును.

4. గుడపిప్పలి - (భైషజ్య - ప్లీహ, యకృద్వృద్ధి.) మాత్ర 5 యవలు.

ఉపయోగములు - ప్లీహాభివృద్ధి, యకృద్వృద్ధి, గుల్మము, ఉదరము, జీర్ణజ్వరము, శోథ, కాసము, ఇవి శమించును. ఇది బాలురకు మిగుల శ్రేష్ఠము.

5. పిప్పల్యాద్యాసవము - (భైషజ్య. గ్రహణి) మాత్ర 1 ఔన్సు.

ఉపయోగములు - క్షయ, గుల్మము, ఉదరము, కార్శ్యము, గ్రహణి పాండు, అర్శస్సు ఇవి శమించును.

6. పిప్పలీఖండము. బృహత్పిప్పలీఖండము (భైషజ్య - అమ్లపిత్త.) మాత్ర 1 తులం.

ఉపయోగములు - అమ్లపిత్తము, శూల, అరోచకము, హృల్లాసము, ఛర్ది, అగ్నిమాంద్యము, శ్వాస, కాస, క్షయము, ఇవి శమించును. హృదయమునకు మిగుల హితకరము.

7. పిప్పల్యాద్యం తైలం - (భైషజ్య - అర్శ.)

ఉపయోగములు - ఇది వస్తిద్వారా నుపయోగింపబడును. అర్శస్సు, మూత్రాఘాతము, మూత్రకృచ్ఛ్రము, గుదభ్రంశము, శూల, ప్రవాహిక, వంక్షణ శూల, కటీశూల, వాతవర్చోవిబంధము, ఇవి శమించును.

8. పిప్పల్యాద్యం చూర్ణం - (భైషజ్య - శ్లీపద.) మాత్ర 1 కర్షం.

ఉపయోగములు - శ్లీపదము, వాతరోగము, ప్లీహవృద్ధి ఇవి శమించును. జాఠరాగ్ని వృద్ధిబొందును.

9. కృష్ణాదిమోదకం - (భైషజ్య. శ్లీపద.) మాత్ర 5 యవలు.

ఉపయోగములు - శ్లీపదము శమించును.

10. కణాదిలోహము - (యో - ర. అతీసార.) మాత్ర $\frac{1}{8}$ తులం.

ఉపయోగములు - అతీసారము, గ్రహణియు శమించును.

11. పిప్పల్యాది కషాయం - (చ- ద - జ్వర.) మాత్ర 1 పలం.

ఉపయోగములు - వాతజ్వరము, కఫజ్వరమును శమించును.

## (ఖ) పిప్పలీమూలము.

విశేషాంశములు -

(1) ప్రసిద్ధనామములు:—

పరిచయబోధకములు:— గ్రంథికము, ఊషణము.

(2) శబ్దార్థములు:— గ్రంథికము - గ్రంథులు (కణుపులు) గలది. ఊషణము - కారముగ నుండునది. తాపమును గలిగించునది.

(3) ప్రయోగములు:—

1. క్రిమిరోగమునందు పిప్పలీమూల ప్రయోగము.

"పిబేద్వా పిప్పలీమూల మజామూత్రేణ సంయుతం।

క్రిమిరోగమునందు పిప్పలికట్టె కల్కమును మేకమూత్రముతో సేవించిన హితము. (సు - ఉ - అ 54.)

2. స్తన్యవర్ధనార్థము పిప్పలీమూలప్రయోగము.

"మరిచం పిప్పలీమూలం క్షీరం క్షీరవివృద్ధయే॥"

మిరియాలు, పిప్పలికట్టె వీనిచూర్ణమును పాలతో గలిపి సేవించిన స్తన్యము వృద్ధి బొందును. (హా - సం - చి - అ - 52.)

3 నిద్రానాశమునందు పిప్పలీమూలప్రయోగము—

"గుడం పిప్పలిమూలస్య చూర్ణేనాలోడితం లిహన్।
చిరాదపి చ సంనష్టాం నిద్రామాప్నోతి మానవః॥"

చిరకాలమునుండి యు నిద్ర సరిగా పట్టనియెడల పిప్పలికట్టె చూర్ణమును బెల్లముతో జేర్చి సేవించిన హితము. (పం - సే)

4. విషమజ్వరమునందు పిప్పలీమూల ప్రయోగము.

"యః పిప్పలీమూలవిమిశ్రితాజ్య మధ్వన్వితం సుక్వథితం చ గవ్యం।
పయః పిబత్యాశు వినాశమేతి హృద్రోగకాసౌ విషమజ్వరాశ్చ॥"

పిప్పలికట్టెతో జేర్చి కాచిన పాలను మధుఘృతములతో జేర్చి పానము జేసిన విషమజ్వరము శమించును. మరియు హృద్రోగము, కాసము, గూడ శమించును.

(4) యోగములు:—

1. పిప్పలీ మూలాదిచూర్ణం - (చ - గ్రహణీ.) మాత్ర— $\frac{1}{8}$ తులం.

ఉపయోగములు:—శ్లేష్మజ గ్రహణి శమించును. బలము, అగ్ని, వర్ణము ఇవి వృద్ధిబొందును.

2. పిప్పలీ మూలాద్యరిష్టము - (గ-ని-యక్ష్మ.) మాత్ర:—1 ఔన్సు.

ఉపయోగములు:—క్షయ, కాసము, జ్వరము, ప్లీహాభివృద్ధి, కుష్ఠము, గుల్మము, అగ్నిమాంద్యము, శ్వేతకుష్ఠము, అశ్మరి, ఉదర్దము, విద్రధి, అంత్రవృద్ధి, పాండువు, ఉదరము, శుక్రదోషము, స్తన్యదోషము, నాడీవ్రణము, పిటిక, ధూతాపస్మారము ఇవి శమించును. రసాయనము.

## (గ) చవ్యము.

విశేషాంశములు:—

1. ప్రసిద్ధనామములు:—

పరిచయబోధకములు:—కోవిణము.

2. శబ్దార్థములు:—ఊషణము - కారముగ నుండునది. తాపమును గలిగించునది.

3. విశేషగుణములు:—కఫమును వృద్ధిబొందించును. (ధ-ని.,) మధుర రసమును గలిగియుండును. రుచినిబుట్టించును. శూలలనుబోగొట్టును. (రా-ని.)

(4) ప్రయోగములు:—

1. అర్శోరోగమునందు చవ్య ప్రయోగము.

"చవ్యం వా శీధు సంయుక్తం...పిబేత్॥"

చవ్యముయొక్క కల్కమును శీధువను మద్యముతో జేర్చి అర్శోరోగమునందు పానముచేసిన హితము. (చ-చి-అ-9.)

(5) యోగములు:—

1. చవ్యాదిఘృతము—(వా-కాస.) మాత్ర:—1 తులం.

ఉపయోగములు:—క్షతకాసము శమించును.

## (ఘ) ఏనుగపిప్పళ్లు.

విశేషాంశములు:—

1. విశేషగుణములు:—మధురరసమును గలిగియుండును. (ధ-ని.,) రూక్షగుణమును గలిగియుండును. స్తన్యమును, వర్ణమును వృద్ధిబొందించును. మలమును శోషింపజేయును. (రా-ని) శీతవీర్యమును, మధుర విపాకమును గలిగియుండును. కష్టముగ జీర్ణమగును. వాతమును బ్రకోపింపజేయును. రక్తపిత్తమును బోగొట్టును. (సు-సూ-అ-46.)

## పిప్పలిగల కొన్ని యోగములు

అకారకరభాదివటి, ఆనందభైరవి రసము, కటుభాది చూర్ణము, కనకాసవము, కర్పూరాదిచూర్ణము, కస్తూరిమాత్ర, కిరాతారిష్టము, ఖదిరారిష్టము, చంద్రప్రభావటి, చిత్రకాదివటి, చ్యవనప్రాశ, జాతీఫలాది చూర్ణము, జ్వరాంకుశరసం, తాళీసాది చూర్ణము, దశమూలారిష్ట, దాడిమాష్టక చూర్ణము, ద్రాక్షారిష్ట, నవాయస లోహము, పంచతిక్త గుగ్గులఘృతము, పిప్పల్యాసవము, పునర్నవాసవము, బిల్వాది లేహ్యము, బ్రాహ్మీఘృతము, భాస్కర లవణ చూర్ణము, లోహాసవము, వాతగజాంకుశరసము, వాసావలేహ్యము, శీతాంశు రసము, సితోపలాది చూర్ణము, సుకుమారఘృతము, సుదర్శన చూర్ణము, హింగ్వష్టక చూర్ణము.

Actions and uses:—Stimulant, Carminative, laxetive, and alterative; given in Chest affections, dyspepsia, chronic cough, enlargement of the spleen and other abdominal viscera, gout, lumbago etc., as a resolvent they are useful in reliving of symptoms due to obstructions of the liver and spleen. With Pákhánabheda a paste of them is applied to the breasts as a lactogogue.

I. N. Khory. II. P. 519.

## స్వానుభవము.

(మోతాదు:— 5 మొదలు 15 వడ్లగింజలఎత్తు చూర్ణమును తేనె లేక నేయి లేక నేయి చక్కెర వీనితో తీసుకొనవలెను.

లేక 10 మొదలు 60 వడ్లగింజలయెత్తుచూర్ణమును కషాయము బెట్టిగాని, పాలలో మరగించి గాని, ఈయవలెను.

వర్ధమానపిప్పలి ఇందు చెప్పబడెను. దాని ఉపయోగములు:— క్షయ, జలోదరము వీనిలో పిప్పలీచూర్ణమును ఆవుపాలలోగాని, మేకపాలలోగాని, వేసి కాచి ఇచ్చిన మంచిది. దీనిచే పాలు త్వరగా జీర్ణమగును. మూలవ్యాధికి నిని మజ్జిగతో నిచ్చిన మంచిది.

కడుపుయొక్క నొప్పి ఉబ్బరము వీనిని హరించుటలో నిది శొంఠి కలిగించునంత ఉద్రేకమును కలిగించదు. మిరియాలంత ఘాటు, కారమును దీనికి లేవు. సామాన్యముగా దీనినొక, దానినే యుపయోగింతురు గాని హెచ్చుగా గుణము కావలసినప్పుడు మిరియాలను పిప్పలినికలిపి యుపయోగించెదరు. దీనిని శొంఠితో కలిపి వాతహరముగాను, మిరియాలతో కలిపి కఫహరముగాను ఉపయోగింతురు ఇది యొక్కటియే పిత్తహరము. అందుచే కేవలము పిత్తవికారములలో దీని నుపయోగింతురు. శొంఠి, పిప్పళ్లు, మిరియాలు, (త్రికటుకములు) ఈ మూడింటిని సామాన్యముగా త్రిదోషములయందు ఉపయోగింతురు. (ఆ. ల.)

# 128

## పియ్రాలః - చారచెట్టు

భాషాంతర నామములు

హిందీ - చిరాంజీ. మరాఠి - చారోళీ. గుజరాతి - చారోళీ. మలయాళం - మూందిరి. కర్ణాటక - [illegible]. ద్రావిడం - ముందిరి.

నైసర్గిక స్వరూప వర్ణనము

Natural Order—Anoeardiaceae.

మామిడి కుటుంబము.

చారచెట్టు—Buchanania lati folia.

( ప్రథమ భాగమున 117 వ పుట చూడుము )

పర్యాయ పదములు

శ్లో॥ పియ్రాలస్తు ఖరస్కంధః చారో బహులవల్కలః ।
రాజాదనం తాపసేష్టః సన్నకద్రుః ధనుష్పటః ॥

పిప్రియాలము, ఖరస్కంధము, చారము, బహులవల్కలము, రాజాదనము, తాపసేష్టము, సన్నకద్రు, ధనుష్పటము, అనునవి పిప్రియాల నామములు.

## పిప్రియాల గుణములు.

శ్లో॥ చారఃపిత్తకఫాస్రఘ్నః ... ... ... ॥

చారచెట్టు పిత్తమును, కఫమును, శమింపజేయును. రక్తదోషమును బోగొట్టును.

## పిప్రియాలఫల గుణములు.

శ్లో॥ ... ... ... తత్ఫలం మధురం గురు ।
స్నిగ్ధం సరం మరుత్పిత్త దాహజ్వరతృషాపహం ॥

చారపండు మధురరసమును, గురుస్నిగ్ధసరగుణములను గలిగియుండును. వాతపిత్తములను శమింపజేయును దాహమును జ్వరమును తృష్ణను బోగొట్టును.

## పిప్రియాల మజ్జా (బీజ) గుణములు.

శ్లో॥ పిప్రియాలమజ్జా మధురా వృష్యా పిత్తానిలాపహా ।
హృద్యోఽతిదుర్జరః స్నిగ్ధో విష్టంభీ చామవర్ధనః ॥

చారపప్పు మధుర రసమును, స్నిగ్ధ గుణమును గలిగియుండును. వెంటనే శుక్రమును గలిగించును. హృదయమునకు హితమైనది. మిగుల కష్టముగ జీర్ణమగును. మలబద్ధమును గలిగించును. ఆమమును వృద్ధిపొందించును. పిత్తమును, వాతమును శమింపజేయును.

విశేషాంశములు ;

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయ బోధములు :—

ఖరస్కంధము, బహులవల్కలము, రాజాదనము, తాపసేష్టము, ధనుష్పటము. (స్నేహబీజ.)

(ఖ) గుణబోధకములు:—పిప్రియాలము.

(2) శబ్దార్థములు:—

ఖరస్కంధము - కఠినముగనుండు మ్రానుగలది. బహులవల్కలము - దళసరిగనుండు పట్టను గలది. రాజాదనము - రాజులచే దినబడు బీజములు గల పండ్లను గలది. తాపసేష్టము - మునుల కిష్టమగునది. ధనుష్పటము-ధనస్సులకు వస్త్రమువలె చుట్టబెట్టుట కుపయోగించు పట్టను గలది. స్నేహబీజ - చమురుగల బీజములనుగలది. పియాలము - తృప్తిని గలిగించుటకు సమర్థమైనది.

N. B.—ఇది యెత్తుగ బెరుగ వృక్షజాతులందుత్పత్తి గలిగి ఫలవృక్ష వర్గములో గణింపబడినది. దీని స్వరూపమును స్పష్టముగ బోధించు విశేషము లంతగా గానరాకున్నవి. ఈ వృక్షములు కోంకణాది దేశములందు విశేషముగా బెరుగునని శాలిగ్రామ నిఘంటుకారునిచే జెప్పబడినది. దీని బీజములనుండి తైలమును గ్రహింతురు. ఈ పండ్లను బీజములను రాజులే గాకుండ 'తాపసేష్ట'యని చెప్పబడుటచే వనవులందు మునులు మొదలగువారు అతి ప్రేమతో భుజించుచుండిరని తెలియగలదు. దీని యితరాంగములలో చారపప్పు ఒక్కటియే బజారులందు విశేషముగా గానబడుచుండుటవలన యీ పప్పుకే హెచ్చుగ నుపయోగమున్నట్లు గానబడును.

(3) విశేషగుణములు:—

(క) గురు గుణమును, శీతవీర్యమును గలిగియుండును. వెంటనే శుక్రమును గలిగించును. వాతమును శమింపజేయును. (ధ - ని.) మధురరసమును, స్నిగ్ధగుణమును గలిగి యుండును. బృంహణము. (రా - ని.)

(ఖ) ఫలము- అమ్లానురసమును గలిగియుండును. కష్టముగ జీర్ణమగును. (ధ - ని) వెంటనే శుక్రమును గలిగించును. (రా - ని.) మలబంధమును గలిగించును. ధాతువులను వృద్ధిజేయును. కఫమును వృద్ధిబొందించును. క్షతక్షయమును రక్తదోషమును బోగొట్టును. (ని - ర.)

(గ) మజ్జ - దాహమును బోగొట్టును. (రా_ని.) శీతవీర్యమును గలిగి యుండును. (ని_ర.

(ఘ) తైలము - మధురరసమును, గురుగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. కఫమును వృద్ధి బొందించును. వాతపిత్తములను శమింపజేయును. (ని - ర.)

(చ) మూలము - కషాయరసమును గలిగి యుండును. కఫపిత్తములను శమింపజేయును. రక్తదోషమును పోగొట్టును.

(ఛ) నిర్యాసము- ఉదరమును, గ్రీవయందుగలుగు మాంసగ్రంథిశోఫను, పోగొట్టును. (నై - శ - పిం.)

(4) ప్రయోగములు:—

1 రక్తాతిసారమునందు ప్రియాలప్రయోగము

"శల్లకీ బదరీ జంబూ ప్రియాలామ్రార్జునత్వచః ।
పీతాః క్షీరేణ మధ్వాఢ్యాః పృథక్ శోణితనాశనాః ॥"

చారపట్టచూర్ణమును తేనెలో గలిపి పాలతో సేవించిన రక్తాతిసారము శమించును. (చ-ద.)

2 రక్తపిత్తమునందు ప్రియాలప్రయోగము.

"... ... ... ప్రియాల మధుకేన వా ।
... ... ... రక్తజిత్సాధితం పయః ॥"

చారపట్ట అతిమధురము వీనికషాయముతో గాచిన పాలను సేవించిన రక్తపిత్తము శమించును. (భా - ప్ర.)

(5) యోగములు;—

1. ప్రియాలాదిఘృతము - (సు - ఉ.) మాత్ర 1 తులం.

ఉపయోగములు - కఫజకుష్ఠము శమించును.

---

# 129

# ప్రియంగుః - ప్రేంఖణము

హిందీ - ప్రియంగు, ఫూలప్రియంగు, ఫూలఫేరంగ, ఫూలఫేన. మరాఠీ-గవ్హాలా. గుజరాతీ-ఘఉంలా, ఘఉలా. మలయాళీ - న్యాజల్ప్పూ. కర్ణాటకం - నిర్పలగు. ద్రావిడం - న్యాజల్పూ.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Meliaceae

వేపకుటుంబము

### ప్రేంఖణము - Aglaia Roxburghina

( 733 వ పేజీ చూడుము )

### పర్యాయ పదములు

శ్లో॥ ప్రియంగుః ఫలినీ కాంతా లతా చ మహిలాహ్వయా।
గుందా్రి గంధఫలీ శ్యామా విష్వక్సే నాంగనాప్రియా॥

ప్రియంగు, ఫలిని, కాంత, లత, మహిలాహ్వయ, గుంద్రి, గంధఫలీ, శ్యామ, విష్వక్సేన, అంగనాప్రియ యనునవి ప్రియంగు నామములు.

### ప్రియంగుగుణములు

శ్లో॥ ప్రియంగుః శీతలా తిక్తా తువరానిలపిత్తజిత్।
రక్తాతిసార దౌర్గంధ్య స్వేద దాహజ్వరాపహా॥
గుల్మతృడ్విషమేహఘ్నీ...............॥

ప్రేంఖణము తిక్తరసమును, కషాయాను రసమును. శీతవీర్యమును గలిగి యుండును. వాతపిత్తములను శమింపజేయును. రక్తాతిసారము, దౌర్గంధ్యము, అతిస్వేదము, దాహము, జ్వరము, గుల్మము, తృష్ణ, విషము. ప్రమేహము అనునీవ్యాధులను బోగొట్టును.

### ప్రియంగుఫలగుణములు

శ్లో॥ తత్ఫలం మధురం రూక్షం కషాయం శీతలం గురు।
విబంధాధ్మాన బలకృత్ సంగ్రాహి కఫ పిత్తజిత్॥

ప్రేంఖణఫలము మధురరసమును, కషాయాను రసమును, రూక్ష గురు గుణములను, శీతవీర్యమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. స్రోతోబంధమును, ఆధ్మానమును గలిగించును. బలమును వృద్ధిబొందించును. కఫపిత్తములను శమింపజేయును.

## గంధప్రియంగుగుణములు

శ్లో॥ ... ... ... ... తద్వద్గంధ ప్రియంగుకా॥

సుగంధ ప్రేంఖణము పైనిజెప్పిన ప్రేంఖణ గుణములనే గలిగియుండును.

## వి శే షాం శ ము లు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—ఫలిని, లత, గంధఫలి, శ్యామ, అంగనాప్రియ, (గోవందని.)

(ఖ) గుణబోధకములు:—(ప్రియకము.)

(2) శబ్దార్థములు:—

ఫలిని - గంధఫలి - పరిమళముతో గూడిన ఫలములతో నొప్పియుండునది. లత - లతారూపమున భూమిపై విస్తరించునది. శ్యామ - నల్లని వర్ణముగల ఫలములనుగలది. అంగనాప్రియ - స్త్రీలకు ఇష్టమగునది. గోవందని - భూమికి నమస్కరించు చున్నట్లు లతారూపమున నుండునది. ప్రియకము - ప్రియమును (లేక) తృప్తిని గలిగించునది.

(3) పరిచయబోధకలక్షణము:—

"అద్రౌ మహీరుహాః ప్రియంగుః వకులాభాసదలః తన్మంజరీతనుః॥"

ప్రేంఖణపుచెట్టు బొగడ పత్రములవంటి పత్రములను గలిగి పర్వతములపై నుత్పత్తియగును. దీనికాయలు చిన్నవిగను గుత్తులు గుత్తులుగాను నుండును. (శి-ద.)

(4) భేదములు:—

ఇది సాధారణ ప్రేంఖణము, గంధయుత ప్రేంఖణము అని రెండు విధములుగా నున్నట్లు తెలియగలదు. పైవర్ణమునుబట్టి యిదివృక్షజాతిలోనిదని తెలియుచున్నది. పర్యాయ పదములనుబట్టి చూడగా లతాజాతిలోనిదని తెలియుచున్నది. అయితే నీదప్రెన్యమునందు పైనిజెప్పినట్టుగ రెండుభేదము లున్నట్లుగనబడుచుండుటచే నందొకటి లతాజాతిలోనిదనియు, మరియొకటి వృక్ష

జాతిలోనిదనియు నూహింపవచ్చును. కాని బజారులందు దొరకు ప్రేంఖణము ఏజాతి సంబంధమైనదియు దెలియకున్నది. ఇది రేణుకములవంటి యాకారమునుగలిగి నల్లనివర్ణముతో నొప్పియుండును. ఇది కొద్దిగ సువాసనతో గూడియునుండును. కావుననే యీద్రవ్యము సుగంధ ద్రవ్యములలో గణింపబడుచున్నది. మరియు తృణధాన్య జాతులలోని యొకవిధమగు ధాన్యము ప్రియంగు అనునామమున వ్యవహరింప బడుచున్నది. ఇది ధాన్యభేదములలోని దగుటచే ధాన్యప్రసంగమున దీనినిగురించిన విశేషములు దెలియవగినది.

(5) విశేషగుణములు:—

(క) ప్రియంగు - రక్తప్రసాదనము జేయును. మోహమును, వాంతిని పోగొట్టును. (ధ-ని.,) రక్తపిత్తమును, భ్రాంతిని, వక్త్రజాడ్యమును పోగొట్టును. (రా-ని.,) కాంతిని గలుగజేయును. (మ-ని.)

(ఖ) గంధప్రియంగు - కషాయరసమును, తిక్తానురసమును, శీతవీర్యమును గలిగియుండును. వెంటనే శుక్రమును గలిగించును. కేశములను వృద్ధి పొందించును. వాతమును వాంతి, భ్రాంతి, దాహము, రక్తపిత్తము, జ్వరము, మోహము, స్వేదము, కుష్ఠము, ముఖజాడ్యము, తృష్ణ, గుల్మము, విషము, మేదోవృద్ధి వీనిని పోగొట్టును. (వై-ని.)

(గ) గంధప్రియంగుబీజము - కషాయరసమును, మధురానురసమును, రూక్ష గురు గుణములను, శీతవీర్యమును, గలిగి యుండును. మలాదులను నిరోధించును. బలమును గలిగించును. ఆధ్మానమును గలుగ జేయును. పిత్తకఫములను శమింపజేయును. (వై-ని.)

(6) ఉత్తమప్రియంగులక్షణము:—

"యా కించిత్పాండురా శ్యామా కీటదోష వివర్జితా ।
సా ప్రియంగుస్మృతా భద్రా విపరీతా తు నిందితా॥"

కొద్దిగ తెల్లని వర్ణమును హెచ్చుగ నల్లని వర్ణమును గలిగి కీటాదుల సంబంధము లేక యుండునది యుత్తమముగను పై వానికి విరుద్ధలక్షణములు గలది నీచమైనదిగను నెంచబడును. (భైషజ్య.)

(7) ప్రయోగములు:—

1. రక్తపిత్తమునందు ప్రియంగు ప్రయోగము.

"కోవిదార ప్రియంగూనాం ... ... ... ।
పుష్పచూర్ణాని మధునా లిహ్యాద్రక్తపైత్తికః"

ప్రేంఖణపుష్పముల చూర్ణమును తేనెతో గలిపి సేవించిన రక్తపిత్తమును శమించును. (చ - చి - అ - 4.)

2. రక్తపిత్తాతిసారమునందు ప్రియంగు ప్రయోగము.

"పీతః ప్రియంగుకాకల్కః సక్షౌద్రస్తండులాంబునా ।
రక్తస్రావం జయేచ్ఛీఘ్రం ధన్వమాంసరసాశినః॥"

ప్రేంఖణపుకల్కమును తేనెతో గలిపి బియ్యపుకడుగుతో సేవించుచు, జాంగలమాంసరసముతో నాహారమును భుజించుచుండిన రక్తాతిసారము శీఘ్రముగ శమించును. (చ - చి - అ 10.)

3. కఫజవిసర్పమునందు గంధప్రియంగు ప్రయోగము.

"శైవాలం నలమూలాని వీరా గంధప్రియంగుకా।
పృథగాలేపనం కుర్యాత్ ద్వంద్వశః సర్వశోఽపి వా॥
ప్రదేహాః సర్వఏవైతే దేయాః స్వల్పఘృతప్లుతాః॥"

గంధప్రియంగువును మెత్తగానూరి కొద్దిగా నేయి జేర్చి లేపనముజేసిన కఫజవిసర్పము శమించును. (చ - చి - అ- 11)

4. పరిణామశూలయందు ప్రియంగుప్రయోగము.

"ప్రియంగుపత్రక్వాథేన వమనం పరిశస్యతే"

ప్రేంఖణపత్రముల కషాయముతో పరిణామశూలయందు వమనకర్మ జేసిన హితము. (వం - సే)

5. గరాదులందు వమనకర్మకై ప్రియంగుప్రయోగము.

"తండులసలిలపిష్టాం యః పీత్వా వమతి నరః పూర్వాహ్ణే।
ఫలినీవల్కలముష్ణం హంతి గరం స కఫపిత్తజం॥"

ప్రేంఖణపుపట్టను బియ్యపుకడుగుతో నూరి యుష్ణోదకముతో పూర్వాహ్ణమున పానముజేసి వమనము జేసినయెడల గరవిషము, కఫపిత్తజ వికారములును శమించును. (బృం.)

(8) యోగములు:—

1. ప్రియంగ్వాద్యతైలము - (వా_శా_కర్ణరో.)
ఉపయోగములు:—కర్ణపూరణము జేసినపూయ స్రావము శమించును.

2. ప్రియంగ్వాది చూర్ణము - (భైషజ్య - ముఖరో.)
ఉపయోగములు:—ప్రతిసారణము జేసిన ముఖరోగములు శమించును.

3. ప్రియంగ్వాదితైలము - (భైషజ్య - ప్రద.) మాత్ర:-¼ ఔన్సు.
ఉపయోగములు:—ప్రదరము, యోనిరోగము, గ్రహణి, అతీసారము ఇవి శమించును. గర్భరక్షణమగును.

4. ప్రియంగ్వాది గణక్వాథము (వా_సూ_అ_15.) మాత్ర:—1పలం.
ఉపయోగములు:—పక్వాతీసారము, పిత్తజరోగములును శమించును. భగ్నసంధానము జేయును. వ్రణరోపణము జేయును.

---

# 130

## పుత్రజీవః - పుత్రజీవపుచెట్టు

---

### భాషాంతర నామములు

హింది - మలయాళం - పుత్తిలఞి. కర్ణాటకం - పుత్రజీవ. ద్రావిడం.

Natural Order—Euphorbiaceae

ఆముదపు కుటుంబము

పుత్రజీవపుచెట్టు - Putrajiva Roxburghii

(ప్రథమ భాగమున 131_వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ పుత్రజీవో గర్భకరో యష్టీ పుష్పోఽర్థ సాధకః॥

పుత్రజీవము, గర్భకరము, యష్టీపుష్పము; అర్థసాధకము అనునవి పుత్రజీవ నామములు.

## పుత్రజీవగుణములు

శ్లో॥ పుత్రజీవో గురుర్వృష్యో గర్భదః శ్లేష్మవాతజిత్।
సృష్ట మూత్రమలో రూక్షో హిమః స్వాదుః పటుః కటుః॥

పుత్రజీవపుచెట్టు మధురరసమును, లవణ కటుకానురసములను, గురు రూక్షగుణములను, శీతవీర్యమును గలిగియుండును. సద్యశ్శుక్రమును జేయును. గర్భధారణ శక్తిని గలిగించును. మూత్రములములను శోధించును. కఫవాత ములను శమింపచేయును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—యష్టీపుష్ప, అర్థసాధక.

(ఖ) గుణబోధకములు:—పుత్రజీవ, గర్భకర, శ్లీపదాపహ.

(2) శబ్దార్థములు:—

యష్టీపుష్ప - యష్టిమధుక పుష్పములవంటి పుష్పములను గలది. అర్థసాధక - పురుషార్థమును సాధింప జేయునది. పుత్రజీవ - పుత్రుని జీవించునట్లు జేయునది. (గర్భస్రావ గర్భపాతములను నిలిపి తిరిగి గర్భమునకు శక్తిని గలిగించునది.) గర్భకర - గర్భమును ధరించుటకు తగినశక్తిని గర్భాశయమునకు గలిగించునది. శ్లీపదాపహ - శ్లీపదమును బోగొట్టును.

(3) పరిచయబోధకలక్షణము:—

“పుత్రం జీవః మధ్యవర్తులః తీక్ష్ణాగ్రఫలః జంబీరపత్రో వృక్షః॥

సు-సూ-అ-31, శ్లో 8. (డల్హణవ్యాఖ్యా)

పుత్రజీవపు వృక్షముయొక్క కాయలు మధ్య గుండ్రముగాను, అగ్రభాగములందు తీక్ష్ణత్వము (సన్నని మొనను) గలిగియుండును. నిమ్మ యాకులవంటి యాకులను గలిగియుండును.

**N. B:**—ఇది యెత్తుగా బెరుగు వృక్షజాతులలో నుత్పత్తిగలిగి గర్భస్థాపన_గర్భకర ద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగా నెంచబడుచున్నది. ఈ వృక్షమును గురించిన విశేషములంతగా గానరావు. కాని సుశ్రుత వ్యాఖ్యానకారకుడగు డల్హణటీకనుబట్టి ఈ వృక్షముయొక్క ఆకులు నిమ్మాకులను బోలియుండుననియు కాయలుమధ్యభాగమున గుండ్రముగానుండి ఊర్ధ్వాధోభాగములందు సన్నని మొనలతోగూడి యుండుననియు తెలియగలదు. మరియు "కొల్హాపుర దేశే తన్నామ్నా ప్రసిద్ధే వృక్షవిశేషే।" అని వైద్యకశబ్దసింధు కారవచనమునుబట్టి ఈ వృక్షములు కొల్హాపూరు ప్రాంతములలో నుత్పత్తిగలిగి యుండునట్లును దెలియగలదు. ఈద్రవ్యమునకు గర్భస్థాపకాది గుణములు చెప్పినప్పటికి వైద్యమునందిది విశేషముగా శ్లీపదాదు లందుపయోగింపబడినట్లుగా దెలియగలదు. మరియు "సతతం ధారయేచ్చాపి కృతం వా పౌత్రంజీవకం॥" (సు-శా అ-31.) అని సుశ్రుత వాక్యమునుబట్టి యీవృక్ష సంబంధమైన ఉంగరమును చేతి గ్రహదోషమునందు ఎప్పుడును హస్తమునందు ధరించి యుండవలెను. అని గ్రహములందు ప్రయోగింప బడినట్లును, "పుత్రంజీవఫలమజ్జానం శీతతోయేన పేషయేత్। భోజనే చాంజనే పానే లేపః సర్వవిషాపహః॥" (రస-రత్నాకర-విష) ఈవాక్యమునుబట్టి పుత్రజీవఫల బీజములను శీతలోదకముతో నూరి సర్వవిషశమనమునకై భోజనాంజన పానలేపనములుగా నుపయోగించవలెను. అని విషమునందు ప్రయోగింపబడినట్లును దెలియగలదు

(4) విశేషగుణములు:—

(క) నేత్రములకు హితమైనది. కఫమును వృద్ధిపొందించును. పిత్తమును శమింపజేయును. దాహమును తృష్ణను బోగొట్టును. (రా-ని.)

(5) ప్రయోగములు:—

1. శ్లీపదమునందు పుత్రజీవప్రయోగము.

"అన్నేనైవ విధానేన పుత్రంజీవకజం రసం।
ప్రయుంజీత భిషక్ ప్రాజ్ఞః కాలసాత్మ్యవిభాగవిత్।"

పుత్రజీవష్టరసము మాత్రాప్రమాణము ననుసరించి కాలసాత్మ్యాదులను దెలిసికొని సేవించినచో శ్లీపదము శమించును. (సు-చి-అ-19.)

2. విస్ఫోటకమునందు పుత్రజీవప్రయోగము.

"పుత్రంజీవస్య మజ్జానం జలే పిష్ట్వా ప్రలేపయేత్।
కాలస్ఫోటం విస్ఫోటం చ సర్వోహంతి సవేదనం॥"

పుత్రజీవబీజములను నీళ్లతో నూరి లేపనము జేసిన వేదనతో గూడిన స్ఫోటకము వెంటనే శమించును. (భా-ప్ర.)

3. ఊరోగ్రహమునందు పుత్రజీవప్రయోగము.

"పుత్రంజీవకశిగ్రూత్థాః ... ... ... రసాః।
ఏకైకశః కోష్ణా ద్విశో వా రామఠాన్వితాః॥"

పుత్రజీవరసమును, శిగ్రురసమును, ప్రత్యేకముగగాని, రెండింటినికలిపిగాని, గోరువెచ్చజేసి అందు శుంఠిచూర్ణమును జేర్చి పానము జేసినచో ఊరోగ్రహము (రొమ్ము పట్టుట) శమించును. (వం - సే.)

---

# 131

# పూగః - పోకచెట్టు

---

## భాషాంతర నామములు

హింది-సుపారీ. మలయాళం-అడక. కర్ణాటకం-అడకె. ద్రావిడం-పాక్.

## నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order—Palmeæ**

కొబ్బరి కుటుంబము.

పోకచెట్టు - **Araca Catechu (Eng Betal nutpalm)**

(603-వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ "ఘోంటా పూగీ చ పూగశ్చ గువాకః క్రముకశ్చ తు।
ఫలం పూగీఫలం ప్రోక్తం ఉద్వేగం చ తదీరితం॥

ఘోంట, పూగి, పూగము, గువాకము, క్రముకము అనునవి క్రముక నామములు. పూగీఫలము, ఉద్వేగము అనునవి క్రముకఫలనామములు.

## క్రముకఫలగుణములు

శ్లో॥ ఫలం గురు హిమం రూక్షం కషాయం కఫపిత్తజిత్ ।
మోహనం దీపనం రుచ్యం ఆస్యవైరస్యనాశనం॥

పోకపండు కషాయరసమును, గురురూక్షగుణములను, శీతవీర్యమును గలిగియుండును. మూర్ఛనుగలిగించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. రుచిని బుట్టించును. కఫపిత్తములను శమింపజేయును. ముఖవైరస్యమును బోగొట్టును.

## వి శే షాం శ ము లు

(1) ప్రసిద్ధనామములు.

(క) పరిచయ బోధకములు:—(వృక)- క్రముక, దీర్ఘపాదప దృఢవల్కల, తంతుసార.

(ఖ) గుణబోధకములు:— (వృక్షము) - ఘోంట, పూగ, గువాక, సురంజన, ఖపుర. (ఫలము)- ఉద్వేగ, శ్లక్ష్ణక.

(2). శబ్దార్థములు:—

క్రముక - జనులను దగ్గరగా ఆక్రమించునట్లు జేయు వృక్షము. దీర్ఘపాదప - మిక్కిలి పొడవుగా నుండునట్టి వృక్షము. దృఢవల్కల - మిక్కిలి దృఢముగానుండు పట్టలను గలది. తంతుసార-తంతువులవలె సారమును విడుచునట్టిది. ఘోంట భ్రమను గలిగించునది. పూగ-ముఖమును పవిత్రముగా జేయునది. సురంజన-వర్ణమును గలిగించునది. ఖపుర-ఇంద్రియములను ప్రీతినొందించునది. గువాక-మలమునకు స్రంసనము జేయునది. ఉద్వేగ- ఇంద్రియములకుత్తేజనము గలిగించునది. శ్లక్ష్ణక-శ్లక్ష్ణగుణము గలది.

N. B:— ఈ వృక్షము ఎత్తుగా బెరుగు తృణజాతులలో నుత్పత్తిగలిగి విషమువలె నింద్రియములకుత్తేజనము గలిగించు ఫలవర్గములో నొకటిగాగణింపబడుచున్నది. ఈ వృక్షమునుండి ఫలములే గ్రహింపదగినవి. ఇది తాటి కొబ్బరి

చెట్లవలె మిగుల నెత్తుగా బెరుగునట్టి వృక్షము. దీని యాకృతికూడా దూరము నుండి చూచిన తాటిచెట్టువలెనే ఉండును. దీనియాకులు మొదట విశాలమైన పట్టనుగల్గి దీర్ఘముగా నుండి మ్రానును అంటియుండును ఈ పట్టను గ్రహించి వానితో దొప్పలను తయారుచేయుదురు. ఇవి వస్తునిక్షేపణమునకై ఉపయోగింపబడును. మరియు ఈపట్టలనుండి నారనుగ్రహించుదురు, ఈ చెట్టుయొక్క ఆకు ఆకు మధ్యనుండి తాటిగెలలవలె గుత్తులుగా పోకకాయలు క్రిందకువ్రేలాడును. ఇందుండిముదిరిన కాయలను పండినకాయలను ఇట్లు రెండుతరగతులుగా గ్రహించుదురు. ఈ కాయలు జాజికాయలవలె నుండును. ఇట్లు గ్రహించిన ముదిరినకాయలను ఆరబెట్టి సేద్యగాండ్రు అమ్మకమునకు జాపుదురు. పండిన కాయలను రెండుగాకోసి వానిని బాగుగానుడకబెట్టి ఎండించి పిమ్మట అమ్మకమునకు జాపుదురు. బజారులందు అట్లు ఉడకబెట్టి ఎండించి అమ్మబడునవి పోకచెక్కలనియు, కాయలుగా అమ్మబడునవి పోకకాయలనియు రెండువిధములుగాదొరకును. కొన్నిప్రాంతములందుపోకచెక్కలకును, కొన్నిప్రాంతములందుకాయలకును, విశేషముగాచలామణి యుండును. ఇటులదేశభేదమునుబట్టి ఏర్పడుచుండును.

మరియు దేశభేదమునుబట్టి పోకకాయలలో ననేకజాతు లున్నట్లుగా రాజనిఘంటువునుండి తెలియగలదు. అందు శైలి, శైల్వణ, గౌల్య, ఘోంట, చేఊల, వల్లీగుల, చంద్రాపురీయ, చౌల్యము లని యెనిమిది జాతులు వివరింపబడినవి. వీనిలో చేఊల, వల్లీగులములను నవి కోంకణ దేశమునందును కౌల్యము ఆంధ్రదేశమందును, ప్రసిద్ధములని తెలియగలదు. కాని వీనిని గురించిన విశేషములు గానరావు. అందు వల్లీగులము గ్రామ్యమని చెప్పబడుటచేత చేఊలమనునది ఆరణ్యముగా నూహింపబడుచున్నది. పోకచెక్కలను తమలపాకులతో చేర్చకుండ భక్షించినచో పాండు, వాత శోషాది వ్యాధులుకలుగునని రాజనిఘంటువునుండియే తెలియగలదు. కావున వీనిని తమలపాకులతో జేర్చి తినుటయే విశేషప్రచారమునందు గలదు. కావున తమలపాకులనుపయోగించు ప్రతివానికి నిది యవసరమగుటచే తమలపాకులవలె పోకచెక్కలకును వర్తకము

నాడు విశేషవ్యాప్తి కలదు. పోకచెక్కలు మిక్కిలి వగరుగా నుండును. ఇవి మిగుల కసతో గూడి యుండును. ఈ కసయే ఇంద్రియములకట్లు ఉత్తేజనము గలిగించి పిమ్మట భ్రమాదులకు కారణమగును. అందుచేతనే కస పోవువరకు నీళ్లతో నుడకబెట్టుదురు. అయినను కొన్నిజాతి పోకచెక్కలు భ్రమాదులను గలిగించుచునే యుండును.

"గవ్యకరీషఘ్రాణాత్ జలపానాత్ లవణభక్షణాద్వాపి। శామ్యతి పూగీఫలమదః చూర్ణగజశర్కరాకవలాత్॥" (గ-ని.) పిడకను వాసన జూచినను, నీటిని త్రాగినను, ఉప్పును నమిలినను, సున్నపుతేటనుగాని, చక్కెరకలిపిన నీళ్లనుగాని, పుక్కిలించినను పోకచెక్కల వలన గలిగిన భ్రమణాది వికారములు శమించునని గదనిగ్రహమునందుదహరింపబడినది. మరియు "దృఢమధ్యం తదుత్తమం" అని భావమిశ్ర నిరూపణమునుబట్టి పోకచెక్కలలో మధ్యభాగమున దృఢముగా (గట్టిగా) నుండునవియే శ్రేష్ఠమైనవి యని దెలియగలదు. బజారులో మనకు దృఢమధ్యములు, అదృఢమధ్యములు ఇట్లు రెండువిధములుగా నుండి యవి ప్రత్యేకముగను, కొన్ని రెండును కలిసి నవిగను, దొరుకుచుండును. కావున దృఢమధ్యములు గానుండువానినే గ్రహించుట యుత్తమము. అదృఢమధ్యములగు చెక్కలనుతినునప్పుడే తరచు భ్రమాదులు గలుగుచుండుటయు గలదు. కావున వానిని విసర్జించుట యుక్తము. వైద్యమునందిది మలనిస్సారణము చేయు వానితో జేర్చి ప్రయోగింపబడినట్లు దెలియగలదు.

(3) విశేషగుణములు:—

(క) క్రముకఫలము—కొద్దిగ మధురాను రసమును, సరగుణమును గలిగి యుండును. (సు-సూ-అ-45.,) మలభేదనము జేయును. (అ-సం.) రసాయనము. అభిష్యంది, మూత్రమును నిరోధించును. జాఠరాగ్నిని నశింపజేయును. వాతమును వృద్ధి పొందించును. (రా-వ.)

(ఖ) బాలక్రముకఫలము (లేతకాయ)-ఘోరమైన విషముతో సమానమైన గుణములను గలిగియుండును. (రా-వ.)

(గ) మధ్యమ క్రముకఫలము-(ముదిరినకాయ) - గురుగుణమును గలిగి యుండును. అభిష్యంది, జాఠరాగ్నిని దృష్టిని నశింపజేయును. (భా-ప్ర.) కషాయరసమును, సరగుణమును గలిగియుండును. కంఠమును శోధించును. కఫపిత్తములను శమింపజేయును. ఆస్యమలమును, రక్తదోషమును, ఆమమును, ఉదరాధ్మానమును బోగొట్టును. (రా-ని.) కష్టముగ జీర్ణమగును. మలభేదనము జేయును. (రా-వ.)

(ఘ) స్విన్న క్రముకఫలము - (ఉడకబెట్టి ఎండబెట్టినది) - త్రిదోషములను శమింపజేయును. (భా-ప్ర.) ఆమపాచనముజేయును. రుచిని బుట్టించును. మలరేచనము జేయును. కంఠరోగమును బోగొట్టును. (రా-ని.)

(చ) క్రముకపుష్పము - కషాయరసమును, మధురానురసమును, గురుగుణమును గలిగియుండును. (ము-పా.)

(ఛ) క్రముక శిరసు (మొవ్వు) - మలభేదనము జేయును. మత్తును గలిగించును. (చ-ద.) మధురరసమును, తిక్తకషాయానురసములను గలిగి యుండును. బలమును, శుక్రమును వృద్ధి నొందించును. మూత్రరోగమును బోగొట్టును. (రా-వ.)

(జ) క్రముకనిర్యాసము - లవణరసమును, అమ్లానురసమును, గురుగుణమును, శీతవీర్యమును, ఉష్ణవిపాకమును గలిగి యుండును. మోహమునుగలిగించును. పిత్తమును వృద్ధిపొందించును. వాతమును శమింప జేయును. (భా-ప్ర.) కృములను బోగొట్టును. (రా-ని.)

(ఝ) శైలీక్రముకఫలము - మధురరసమును, కటుకషాయామ్లానురసములను, గలిగియుండును. రుచిని బుట్టించును. (రా-ని.)

(ట) శ్రైల్వాణక్రముకఫలము - మధురరసమును - లఘుగుణమును గలిగి యుండును, జాఠరాగ్నిని వృద్ధిబొందించును. (రా-ని.)

(ఠ) గొల్లకక్రముకఫలము - కటురసమును, కషాయానురసమును, లఘుగుణమును గలిగియుండును. ఆమపాచనము జేయును. కఠినముగానుండువానిని ద్రవింపజేయును. (రా-ని.)

(ద) ఘోంటాక్రిముకఫలము - కటురసమును, కషాయానురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. (రా-ని.)

(ధ) చేఉలక్రిముకఫలము - మిక్కిలిస్వాసముతోగూడి యుండును. పరిమళమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. ఆమమును పచింపజేయును. పుష్టిని కలిగించును. (రా-ని.)

(న) వల్లీగులక్రిముకఫలము - జాఠరాగ్నిని వృద్ధిబొందించును. త్రిదోషములను శమింపజేయును. (రా-ని.)

(త) చంద్రాపురీయక్రిముకఫలం - మధురరసమును, కటుకషాయానురసములను, గలిగి యుండును. రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమమును పచింపజేయును. (రా-ని.)

(థ) చౌల్యక్రిముకఫలము - కషాయరసమును, మధురానురసమును, గలిగి యుండును. (రా-ని.)

(4) ప్రయోగములు:—

1. రక్తపిత్తమునందు క్రిముక ప్రయోగము.

"కిరాతతిక్తం క్రిముకం సమస్తం।
... ... ... పృథక్ పృథక్ చందనయోజితాని।
తేనైవ కల్కేన హితాని తత్ర ... ... ...॥"

పోకచెక్కలను చందనముతో జేర్చి కల్కముగాజేసి సేవించిన రక్తపిత్తము శమించును. (చ-చి-అ-4)

2. వస్త్యనులోమనమునకై క్రిముక ప్రయోగము.

"తతః క్రిముకకల్కాఢ్యం పాయయేత్తామ్లసంయుతం।
ఔష్ణ్యాత్ తైక్ష్ణ్యాత్ సరత్వాచ్చ వస్తిం చాస్యానులోమయేత్॥"

ప్రయోగించినవస్తి బయటకురాక లోపలనే అడ్డుపడియున్నచో అక్షప్రమాణము క్రిముకఫలకల్కమును అమ్లరసవిశిష్టమైన ద్రవముతో జేర్చి పానముజేయించిన ఉష్ణతీక్ష్ణసరగుణములచే శీఘ్రముగా వస్తికి అనులోమగతి యేర్పడును. (చ-సి-అ-7.)

3. వాతవ్యాధియందు క్రముక ప్రయోగము.

"శల్లకీ చిక్కణత్వక్చ క్వాథః తైలేన సంయుతః।
కుర్యాద్వాతార్దితం స్వస్థ మేకవింశతి నైర్జ్వరం॥"

అందుగుచెక్క, పోకచెట్టుయొక్కపట్ట వీనికషాయమునందు తైలమును జేర్చి పానము జేయుచుండిన నిరువదియొక్కదినములలో వాతవ్యాధిశమించును (హా-సం.)

4. ఉపదంశమునందు క్రముక ప్రయోగము.

"లేపః పూగఫలేనాశ్వమారమూలేన వా తథా॥"

పోకకాయలను నూరి లేపనము జేసిన ఉపదంశము శమించును. చ.ద.

(5) యోగములు:—

1. పూగఖండము- (భైషజ్య-శూల) మాత్ర 1 తులం.

ఉపయోగములు - శూల, అజీర్ణము, అతీసారము, రక్తాతిసారము, అమ్లపిత్తము, రాజయక్ష్మ, తృష్ణ, ఛర్ది, మూర్ఛ, పాండు, మలమూత్రబంధము ఇవి శమించును. వంధ్యాత్వము పోవును. అగ్నిదీపనము, బలవర్ణకరము, నేత్రములకు హితవు.

2. క్రముకాది రసాయనము - (బ-రా-జ్వర) మాత్ర 1 తులం.

ఉపయోగములు - జ్వరము, దాహము, రక్తపిత్తము, యక్ష్మ, బలక్షయము, అగ్నిమాంద్యము, ఛర్ది, ప్రమేహము, అర్శస్సు, మూత్రాఘాతము, ఇవి శమించును. రసాయనము. శుక్రము, బలము, గర్భము ఇవి గలుగును.

(6) Actions and uses:—Fresh nuts are intoxicating and produce giddiness. Dried ones are gentle stimulant, astringent and Vermifuge. They increase the flow of saliva, lessen perspiration, sweeten the breath strengthen the gums, remove bad taste from the mouth and produce mild exhileration. It is recommended in worms, diarrhoea, dysentery and as an ingredient in the Preparation of a masticatory of great antiquity Known as betel. The Powder obtained by calcing the nut is known as areca charcoal and used as a tooth powder The dried expanded leaf stalks are used as splints. The extrant is used for the same purpose as that obtained from acacia catechu.

# 132

# బదరీ - రేగుచెట్టు (క)

---

## భాషాంతర నామములు

హింది - పైమండీ, బేగ, బేంర, బేకీ. మరాఠి-శయబోర, ఉన్నాబ. గుజరాతి-బోర. మలయాళం - లంగ. కర్ణాటకం - ఎరను. ద్రావిడం - ఇలందే.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Rhamnaceae

రేగు కుటుంబము

రేగుచెట్టు - Zyziphus jujuba

( ప్రథమ భాగమున 341-వ, పుట చూడుము )

## పర్యాయ పదములు

శ్లో॥ పుంసి స్త్రియాం చ కర్కంధూ ర్బదరీ కోలమిత్యపి।
ఫేనిలం కువలం ఘోంటా సౌవీరం బదరం (మహత్)॥
అజప్రియా కుహా కోలి విషమో భయకంటకా॥

కర్కంధు, బదరి. కోలము, ఫేనిలము, కువలము, ఘోంట, సౌవీరము, బదరము. అజప్రియ, కుహా, కోలి, విషమోభయకంటక యనునవి బదరీ నామములు.

## పచ్యమానబదరము—గుణములు

శ్లో॥ పచ్యమానం సు మధురం సౌవీరం బదరం మహత్।
సౌవీరం బదరం శీతం భేదనం గురుశుక్రలం॥
బృంహణం పిత్తదాహాస్రక్షయ తృష్ణా నివారణం॥

పండుచున్నట్టి రేగుకాయ పెద్దదిగనుండి సౌవీరమని వ్యవహరింప బడును. ఇది మధురరసమును, గురుగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. మలభేదనము జేయును. శుక్రమును వృద్ధి పొందించును. బృంహణము, పిత్తమును శమింప జేయును. దాహము, రక్తదోషము, క్షయ, తృష్ణ అను వ్యాధులను బోగొట్టును.

## పక్వబదరము—గుణములు

శ్లో॥ సౌవీరం లఘు సంపక్వం మధురం కోలముచ్యతే।
కోలం తు బదరం గ్రాహి రుచ్యముష్ణం చ వాతలం॥
కఫపిత్తకరం చాపి గురు సారక మీరితం॥

పైనిజెప్పిన సౌవీరనామక బదరఫలము పండినప్పుడు చిన్నదిగనుండి కోలమని జెప్పబడును. ఇది మధురరసమును, గురుసర గుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. మలాదులను నిరోధించును. రుచిని బుట్టించును. త్రిదోషములను వృద్ధి బొందించును.

## క్షుద్రబదరము

శ్లో॥ కర్కంధూః క్షుద్రబదరః కథితం పూర్వసూరిభిః॥

మిగుల చిన్నదిగనుండు రేగు కర్కంధువని వ్యవహరింప బడును.

## క్షుద్రబదరగుణములు

శ్లో॥ అమ్లం స్యాత్ క్షుద్రబదరం కషాయం మధురం మనాక్।
స్నిగ్ధం గురు చ తిక్తం చ వాతపిత్తాపహం స్మృతం॥

చిన్నరేగుపండు అమ్లరసము, కషాయతిక్తానురసములను, కొద్దిగ మధురానురసమును, స్నిగ్ధ గురు గుణములను గలిగియుండును. వాతపిత్తములను శమింపజేయును.

## శుష్కబదరఫల గుణములు

శ్లో॥ శుష్కం భేద్యగ్నికృత్సర్వం లఘు తృష్ణా క్లమాస్రజిత్॥

ఎండిన యన్నిజాతుల రేగుపండ్లును లఘుగుణమును గలిగి యుండును. మలభేదనము జేయును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. తృష్ణను, క్లమను, రక్తదోషమును బోగొట్టును.

## ప్రాచీనామలకః - బదరఫలభేదము (ఖ)

హిందీ- మరాఠీ- గుజరా- మలయాళం-నిర్ నెల్లి. కర్ణాటకం-ద్రావిడం

**Flacourtia Gataphracta (N. O. Bixineae).**

శ్లో॥ ప్రాచీనామలకం లోకే పానీయామలకం స్మృతం।

ప్రాచీనామలకము, పానీయామల కమనివ్యవహరింపబడుచున్నది.

### ప్రాచీనామలక గుణములు

శ్లో॥ ప్రాచీనామలకం దోషత్రయఘ్నం జ్వరఘాతి చ।

ప్రాచీనామలకమను బదరఫలభేదము త్రిదోషములను శమింపజేయును. జ్వరమును బోగొట్టును.

## వికంకతః - అడవిరేగు (గ)

హిందీ- మరాఠీ- గుజరాతీ- మలయాళం-వయ్యంకతను. కర్ణాటకం-ఫలమాణిక. ద్రావిడం-నరుమురుంగెయ్.

**Gymnosporia Montana (N. O. Celastrineae).**

శ్లో॥ వికంకతః స్రువా వృక్షో గ్రంధిలః స్వాదు కంటకః।
స ఏవ యజ్ఞవృక్షశ్చ కంటకీ వ్యాఘ్రపాదపః॥

వికంకతము- స్రువావృక్షము, గ్రంధిలము, స్వాదుకంటకము, యజ్ఞవృక్షము, కంటకి, వ్యాఘ్రపాదపము, అనునవి వికంకత నామములు.

### వికంకతఫల గుణములు

శ్లో॥ వికంకతఫలం పక్వం మధురం సర్వదోషజిత్।

అడవిరేగుపండు మధురరసమును గలిగి యుండును. త్రిదోషములను శమింపజేయును.

## సేవం - ఆపిలుపండు (సీమరేగు - బదరభేదము) (ఘ)

హిందీ - సేవ్. మరాఠీ - మోతేంబో. గుజరాతీ - సేన్ ఫల్. మలయాళం - కర్ణాటకం - సేవ. ద్రావిడం.

శ్లో॥ ముష్టిప్రమాణబదరం సేవం పించితికాఫలం॥

ముష్టిప్రమాణబదరము, సేవము, పించితికాఫలము, అనునవి సేవ నామములు.

## సేవగుణములు

శ్లో॥ సేవం సమీరపిత్తఘ్నం బృంహణం కఫకృద్గురు।
రసే పాకే చ మధురం శిశిరం రుచి శుక్రనుత్॥

ఆపిలుపండు మధురరసమును, గురుగుణమును, శీతవీర్యమును, మధురవిపాకమును, గలిగి యుండును. బృంహణము, రుచిని బుట్టించును. శుక్రమును వృద్ధి బొందించును. కఫమును వృద్ధిజేయును. వాతపిత్తములను శమింపజేయును.

## కరమర్దః - వా(వో)క చెట్టు (బదరభేదము) (చ)

హింది - మరాఠి - కరౌందా, కరౌందీ. గుజరాతి - కరవంద, కరమదాం. మలయాళం - కర్ణాటకం - కరజిగె. ద్రావిడం.

Carissa Carandas. Eng. Jasmine flowered carissa

శ్లో॥ కరమర్దః సుషేణస్స్యాత్ కృష్ణపాకఫలస్తథా॥

కరమర్దము, సుషేణము, కృష్ణపాకఫలము, అనునవి కరమర్ద నామములు.

## కరమర్దికా - చిన్నవా (వో) క

శ్లో॥ తస్మాల్లఘుఫలా యా తు సా జ్ఞేయా కరమర్దికా॥

పైవానికంటె చిన్నదియగు ఫలములు గవాకకరమర్దికమని వ్యవహరింపబడును.

## కరమర్దద్వయ ఆమఫల గుణములు

శ్లో॥ కరమర్దద్వయం త్వామ మమ్లం గురు తృషాపహం।
ఉష్ణం రుచికరం ప్రోక్తం రక్తపిత్తకఫప్రదం॥

పెద్దది చిన్నదియగు వాకచెట్ల పచ్చికాయలు అమ్లరసమును, గురుగుణమును, ఉష్ణవీర్యమును, గలిగి యుండును. రుచిని బుట్టించును. రక్తపిత్తమును గలిగించును. కఫమును వృద్ధిబొందించును. తృష్ణను బోగొట్టును.

## కరమర్దద్వయ పక్వఫల గుణములు

శ్లో॥ తత్పక్వం మధురం రుచ్యం లఘుపిత్తసమీరజిత్॥

పెద్దది చిన్నది యగు వాకచెట్లపండ్లు మధురరసమును, లఘుగుణమును గలిగి యుండును. రుచిని బుట్టించును పిత్తమును వాతమును శమింపజేయును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—

(బదరి_బదర) కర్కంధు, ఫేనిలము, అజప్రియ, కోలి, విషమోభయ కంటక, కోలము, (గుడఫలము, బాలేష్టము, దృఢబీజ, ఫలశైశిర, వృత్తఫల) (వికంకత) - స్రువావృక్షము, యజ్ఞవృక్షము, కంటకి, వ్యాఘ్రపాదపము. (మృదుఫల, దంతకాష్ఠ, పృథుబీజ,) (సేవ)-ముష్టిప్రమాణబదరము, (కరమర్ద) సుషేణము, కృష్ణపాకఫలము. (జాతిపుష్ప)- క్షీరఫల గుచ్ఛ, బహుదల.

(ఖ) గుణబోధకములు:— (బదరి_బదర) - బదరి, కువలము, ఘోంట పిచ్ఛిల, (వికంకత) - స్వాదుకంటక - (మధుపర్ణి) (కరమర్ద) - కరమర్దము.

(2) శబ్దార్థములు:—

కర్కంధు - విషమోభయకంటక - విషమముగ రెండు రెండుచొప్పున గలిసియున్నట్టి ముండ్లను గలిగి యుండునది. ఫేనిలము_నురుగునుగలిగియుండు పండ్లతోగూడి యుండునది. అజప్రియ - మేకలకిష్టమగు పత్రములను గలిగి యుండునది. కోలి - ఘనీభవించినట్టి స్వరసముతోగూడిన పండ్లను గలది. కోలము_ద్రవ్యములయొక్క తూకమును, మాత్రల పరిమాణమును సూచించు నట్టి మానముగా వ్యవహరింపబడు పండ్లను గలది. గుడఫలము - బెల్లముతో సమముగ మధురముగనుండు ఫలములను గలది. బాలేష్టము - బాలురచే విశే షముగా దినబడునట్టి ఫలములనుగలది దృఢబీజ_ దృఢముగనుండు గింజలనుగలది. ఫలశైశిర - శిశిరర్తువునందు ఫలించునట్టిది. వృత్తఫల - గుండ్రముగనుండుఫలము లతోగూడియుండునది. స్రువావృక్షము - యజ్ఞవృక్షము- హోమపాత్రముగ యజ్ఞాదులందుపయోగింపబడునట్టి కాష్ఠములను గలది. కంటకి- ముండ్లనుగలది. వ్యాఘ్రపాదపము- వ్యాఘ్రముయొక్క పాదములవంటి వేళ్లనుగలది. మృదు ఫల - మెత్తగనుండు ఫలములను గలది. పృథుబీజ - పెద్దవియగు బీజములను గలఫలములను గలది. దంతకాష్ఠ - దంతములను తోముటకుపయుక్తమగు కాష్ఠములను గలది. ముష్టిప్రమాణబదరము - పిడికిలియంత పరిమాణము గల పండ్లను గలది. సుషేణము - మంచిసేనతో గూడియుండునది అనగా తాకు టకు వీలులేనట్టి తీక్ష్ణమగు ముండ్లతోగూడియుండునది యని భావము.

కృష్ణపాకఫలము - నల్లగనుండునట్టి ఫలములను గలది. జాతిపుష్పము- జాజిపువ్వులవంటి పువ్వులను గలది. క్షీరఫల - పాలతో గూడిన పండ్లనుగలది. గుచ్ఛి - గుత్తులు గుత్తులుగా నుండు పండ్లను గలది. బహుకల - విశేషముగా పత్రములతో గూడి యుండునది. బదరి- స్థైర్యమును గలిగించునది. కువలము- పీడనము జేయునది. ఘోంట-ఘ్రాణను గలిగించునది. పిచ్ఛిల-పిచ్ఛిల (జిగట) గుణము గలది. స్వాదుకంటక - మధురరసముగల ముండ్లను గలది. మధువర్ణి- మధురరసముగల పత్రములను గలది. కరమర్దము - పండ్లను వేళ్ళతో తాకినప్పుడు పిచ్ఛిలగుణముగల పాలచే వేళ్ళను అంటుకొనునట్లు జేయునది.

(3, భేదములు:—

ఇది "బదరము, ముష్టిప్రమాణబదరము, వికంకతము, కరమర్దము, అని నాలుగు విధములుగా నుండును. అందు మొదటిది సాధారణబదరము, రాజబదరము, హస్తిబదరము, క్షుద్రబదరము, భూబదరము, వారిబదరము అని తిరిగి యారు విధములుగా నుండును. కరమర్దమును బదరభేదము గూడ తిరిగి మహాక్షుద్రభేదముచే రెండు విధములుగా నుండును.

ఇట్లు బదరజాతు లనేకవిధములుగా నుండి కొన్ని పొడుగా పెరుగు వృక్షజాతిలోను, గొన్ని క్షుపజాతిలోను, గొన్ని లతాజాతిలోను నుత్పత్తి గలిగి యమ్లరసఫలవర్గములో గణింపబడు చున్నవి. ఇందు కొన్ని జాతులు తప్ప మిగిలిన వన్నియు ప్రతిచోట నుత్పత్తి యగుచుండును. ఈ వృక్షములు విశేషముగా ముండ్లను గలిగి గుండ్రని యాకులతోను, గచ్చకాయలంతగాని, యంతకు హెచ్చగునట్టిగాని ప్రమాణము గల పండ్లతోను నొప్పియుండును. ఈ యన్నిజాతుల ఫలములను విశేషముగా నెల్లవారును దినుచుందురు. ఇందలి రాజబదరము, హస్తిబదరము అనునవి పైని జెప్పిన ప్రమాణముకంటె కొంచెము హెచ్చుగ పెద్దవిగనే యుండునట్లు దెలియగలదు. బజారులందు కొంచెము పెద్దవిగ నుండి కుక్కుటాండముయొక్క ఆకృతిని గలిగియుండు బదరజాతి ఫలములు విక్రయింపబడుచుండును. ఇందలి బీజములు కోలగను పెద్దవిగను నుండును. ఈ జాతి యొకవేళ రాజబదరముగాని, హస్తిబదరముగాని యై యుండునో లేక పృథుబీజ యను శబ్దమును బట్టి వికంకతమై యుండునో తెలియకున్నది. కాని యివి కాశీరేగుపండ్లు అని వ్యవహరింపబడుచు ప్రతివారిచే విశేషముగా దినబడుచుండును. ఇవి మధురముగను, కొంచెముకషాయ

రసము గలవిగను నుండును. అయితే నీ రాజబదర మనునది నృపేష్ట, పృథుఫల, తనుబీజయను నామములనుబట్టి పెద్దవిగ నుండుననియు, మిగుల సూక్ష్మమగు బీజములను గలిగి యుండుననియు, రాజుల కత్యంత ప్రియముగ నుండుననియును దెలియుచున్నది. కాని ఈ ఫలములయొక్కగాని, వృక్షముయొక్కగాని స్వరూప మెట్లుండునదియు దెలియకున్నది.

హస్తిబదరమనునది శాలిగ్రామ నిఘంటుకారునిచేతనే గానియితరులచే గ్రహింపబడినట్లు గానరాదు. హస్తిశబ్దమునే నిది పైదానికంటె కొంచెము పెద్దదిగ నుండునట్లు దెలియుచున్నను, రాజబదరముకు వలెనే దీనికి గూడ స్వరూపాదులను బోధించు విశేషములు గానరావు. వీనిలో సామాన్యబదరమునకే గాని ఈ రాజహస్తిబదరములకు వైద్యమునందు ప్రయోగ మున్నటుల గూడ గానరావు. అందు సామాన్య బదరముయొక్క యంగములలో గూడ పత్రఫలములకే విశేషముగా బ్రయోగము లున్నటులు గానబడును. క్షుద్రబదరము అనునది పైని జెప్పిన బదరవృక్షమువలెనే పత్రములు మొదలగు వానిని గలిగి యుండునుగాని యిది చిన్నతుప్పవలె భూమిపై పొట్టిగా బెరుగును. ఆకులు, ఫలములును మిగుల చిన్నవిగ నుండును. ఇది "శబరాహారము" అని చెప్పబడుటచే విశేషముగా నడవులలో బెరుగుననియు, వీని ఫలములను అడవులలో వసించువారలు మిగుల ప్రీతితో భుజించుదురనియును దెలియుచున్నది.

భూబదరము అనునది లతారూపమున నుండి పుల్లరేగు అని వ్యవహరింపబడునదిగా దెలియగలదు. ఇది వల్లీబదరి, బహుఫలిక, సూక్ష్మబదరి మొదలగు నామములతో వర్ణింపబడుటవలన చిన్న చిన్న పండ్లను విశేషముగా గలిగిన లతాజాతియని బోధపడుచున్నది. ఈ లతలు సామాన్యముగ నూరి బయట కంపలలో బెరుగుచుండును. దీనిపండ్లు నల్లగనుండి మిగుల నమ్లరసముతో నొప్పియుండును. ఈ రెండువిధములగు క్షుద్ర-భూబదరములకు వైద్యమునందంతగా బ్రయోగము లున్నటుల గానరావు.

వారీబదరము అనునది పానీయామలకమని నిఘంటుకారులచే వ్యవహరింపబడినది. దీనిని బట్టి యిది జలప్రాంతములందు వృద్ధిపొందునదిగా దెలియగలదు. కాని దీని స్వరూప మెట్లుండునదియు దెలియకున్నది. అయితే నిది ధన్వంతరి నిఘంటుకారునిచే నామలకభేదముగాను, ఇతరులచే బదరభేదము

గను గ్రహింపబడినది. ఇది పైవానిలో నెట్టి భేదమైనదియు వివరించుటకు తగిన యాధారములు గానరాకున్నవి.

ముష్టిప్రమాణబదరము అనునది ప్రతి పట్టణము లందలి పండ్లయంగళ్ళలో ఆపిలుపండు అను నామముతో విక్రయింపబడునదిగా దెలియగలదు. ఇం దనేకజాతు లున్నట్లుగా గూడ దెలియుచున్నది. అయితే నా యా దేశ భేదముల ననుసరించి యుత్పత్త్యాదులం దట్టి భేదములను గలిగియున్నట్లు గ్రహింపవచ్చును. ఈ వృక్షములు విశేషముగా కాశ్మీర-కాబోలు ప్రాంతములందు బెరుగునని శాలిగ్రామ నిఘంటుకారునిచే చెప్పబడినది. కాని యిది తదితరప్రాంతములందుగూడ భారతవర్షమున విరివిగా బెరుగుచున్నట్లు తెలియగలదు. అయితే నిది వైద్యమునం దంతగా ప్రయోగింపబడుచున్నట్లు దెలియరాదు.

వికంకతము అనునది యడవిరేగు అని వ్యవహరింపబడుచుండుటచే నిది యడవులందు బెరుగునదిగా దెలియగలదు. ఇది స్రువావృక్షము, యజ్ఞవృక్షము అని చెప్పబడుటను బట్టి హోమములందు దీని కాష్ఠములను హోమపాత్రలుగా జేసి యుపయోగించుదురని తెలియుచున్నది. మరియు దీని కాష్ఠములను దంతములను తోముటకుపయోగించెదరని దెలియగలదు. కాని ఈ వృక్షముయొక్క గాని ఫలముయొక్క గాని స్వరూపమెటులుండునదియు దెలియకున్నది.

కరమర్దము అనునది వాకయని వ్యవహరింపబడుచున్నది. ఇది తీక్ష్ణమగు ముండ్లను, పొడవుగను గుండ్రముగనుండు పత్రములను గలిగి లతారూపమున వృద్ధిబొందును. దీనికాయలు గుండ్రముగను, కొంచెము కోలగనుండి గుత్తులు గుత్తులుగా నుత్పత్తియగును. ఈకాయలును పర్వతద్రాక్షకాయలును ఒకే విధముగా నుండునని జెప్పబడినది. వీనిని గోసినప్పుడు పాలను స్రవించును. ఈ పాలు పిచ్చిల గుణము గలవగుటచే చేతులకు బంకవలె నంటుకొనును. పచ్చిగనున్నప్పుడు ఆమ్లరసమును గలిగియుండును. వీనిని సామాన్యముగబదరఫలములవలె విశేషముగా దినరు. కాని యాహారమునందు శాకాదులుగా జేసి యుపయోగించుచుందురు. పండ్లు నల్లగ నుండును. పండినప్పుడు కొంచెము మధురముగ నుండును. ఇందుచిన్నజాతి మరొకటిగలదు, వీనికాయలు పైవానివలె నుండును. కాని మిగుల చిన్నవిగనుండును. మరియు నిది లతారూపమున నుండక తుప్పవలె (గుబురుగా బెరుగు మొక్కవలె) బెరుగును. ఇది ప్రా

ప్రాంతములందును అడవులందును విశేషముగా పెరుగుచుండును. ఈ ఫలములను కూడ పైవానివలె శాకాదులుగా నుపయోగించుదురు. వైద్యమునందు వీనికంత ప్రయోగమున్నట్లు తెలియరాదు.

(4) విశేషగుణములు:—

(క) పచ్చనూన బదరము - స్నిగ్ధగుణమును గలిగి యుండును. వాతపిత్తములను శమింపజేయును. (ధ.ని) కషాయామ్లానురసములను గలిగి యుండును. రా.ని. తిక్తానురసమును, రూక్షగుణమును గలిగి యుండును. (ని.ర)

(ఖ) పక్వబదరము - స్నిగ్ధగుణమునుగలిగి యుండును. పిత్తవాతములను శమింపజేయును. ధ.ని. అమ్లానురసమును గలిగియుండును. అతీసారము శోషను, శ్రమను బోగొట్టును.(రా.ని) బలమునుగలిగించును. మదమును ఛర్దిని, తృష్ణను బోగొట్టును. (శా.ని) లఘుగుణమును గలిగి యుండును. రక్తదోషమును బోగొట్టును. (ని.ర)

(గ) పురాతన - శుష్క-బదరము-జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమమును పచింపజేయును. (ధ.ని) పిత్తమును వృద్ధిబొందించును. కఫవాతములను శమింపజేయును. (చ-సూ.-౨-27)

(ఘ) బదరఫలమజ్జ - కషాయరసమును, మధురానురసమును గలిగి యుండును. శుక్రమును, బలమును గలిగించును. వెంటనే శుక్రమును గలుగ జేయును. వాతపిత్తములనుశమింపజేయును. కాసను, శ్వాసను, తృష్ణను,ఛర్దిని, దాహమును బోగొట్టును. (ని.ర)

(చ) బదరపత్రాది-(పత్రము) లేపనము జేసిన జ్వరమునందలి దాహమును బోగొట్టును. (త్వక్కు-) విస్ఫోటమును బోగొట్టును. (బీజ)- నేత్రరోగములను బోగొట్టును. (రా.ని)

(ఛ) ఆమఫలము- పిత్తకఫములను శమింపజేయును. (ధ.ని) అమ్లాను రసమును గలిగియుండును. (రా.ని)

(జ) క్షుద్రబదరము-పక్వఫలము-సరగుణమును గలిగియుండును. (ధ.ని) రుచిని బుట్టించును. క్రిములను గలిగించును. కఫవాతములను శమింప జేయును. పిత్తవికారములను, శోషను, దాహమును బోగొట్టును. (రా.ని)

(ఝ) రాజబదరము-మధురరసమును, శీతవీర్యమును గలిగి యుండును. వెంటనే శుక్రమును గలిగించును. వీర్యమును వృద్ధిబొందించును. పిత్తవాతములను శమింపజేయును. దాహమును, శోషను, శ్రమను, బోగొట్టును. రా-ని.

(ట) హస్తిబదరము-మధురరసమును, గురుస్నిగ్ధగుణములను శీతవీర్యమును గలిగియుండును. మలాదులను నిరోధించును. లేఖనము జేయును. పుష్టిని గలిగించును. మలబంధమును జేయును. ఆధ్మానమును గలిగించును. వాత పిత్తములను శమింపజేయును. (రా-ని)

(ఠ) భూబదరము-మధురరసమును, అమ్లానురసమును గలిగి యుండును. పథ్యకరము. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. అన్నమును పాకము జేయును. రుచిని బుట్టించును. పిత్తమును రక్తమును కొద్దిగ దూషింపజేయును. కఫవాత వికారములను బోగొట్టును. (రా-ని)

(డ) ఆమ వారిబదరము (ప్రాచీనామలక)- కృత్రిమవిషమును బోగొట్టును. (చ-సూ-అ-27.) మధురరసమును అమ్లానురసమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. ముఖమును శోధించును. (రా-ని,) గురుగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. (ని-ర)

(ఢ) పక్వ-వారిబదరము-విశేషముగ కఫపిత్తములను వృద్ధిబొందించును. (ని-ర) కష్టముగ జీర్ణమగును. వాతమును శమింపజేయును. (ధ-ని.

(ణ) ముష్టిప్రమాణబదరము-వెంటనే శుక్రమును గలిగించును. (మ-ని.) వ్రణమును బోగొట్టును. (ని-ర) కషాయరసమును మధురానురసమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. చ-సూ-అ-27.

(త) వికంకతము - తిక్తరసమును శీతవీర్యమును గలిగి యుండును. శోఫను బోగొట్టును. (ధ-ని.) అమ్లరసమును, లఘుగుణమును, మధురవిపాకమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. అన్నమును పాకము జేయును. కామిలను రక్తదోషమును బోగొట్టును. (రా-ని.) దాహమును, శోషను, వ్రణమును, లూతావిషమును, అర్శస్సును, నేత్రపుష్పమును బోగొట్టును. (శా-ని.)

(థ) కరమర్దము - ఆమఫలము- పిత్తమును వృద్ధిబొందించును. (ధ-ని.) తిక్తానురసమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. దాహమును

గలిగించును. (రా-ని.) మలభేదనము జేయును. పిత్తకఫములను వృద్ధిబొందించును. వాతమును శమింపజేయును. (శో-ని.) మలాదులను నిరోధించును. (శా-ని.)

(ద) కరమర్దము-పక్వఫలము-శీతవీర్యమును గలిగి యుండును. రక్తపిత్తమును బోగొట్టును. (ధ-ని.) త్రిదోషములను శమింపజేయును. విషమును బోగొట్టును. (రా-ని.) వాతరోగములను బోగొట్టును. (శా-ని.)

(ధ) కరమర్దము - శుష్కఫలము - మధురరసమును, లఘుగుణమును శీతవీర్యమును గలిగి యుండును. రుచిని బుట్టించును. త్రిదోషములను శమింపజేయును. రక్తపిత్తములను, విషమును, వాతరోగములను బోగొట్టును. (శా-ని.)

(న) కరమర్దమూలము - సరగుణమును గలిగి యుండును. క్రిములను బోగొట్టును. (శో-ని.)

(5) ప్రయోగములు:—

1. అర్శోరోగమునందు బదర ప్రయోగము.

"కోలోత్క్వాథేఽథవా కోష్ణే...తం శూలార్తముపవేశయేత్" ॥

బదరఫలముల కషాయమునందు గోరువెచ్చగ నున్నప్పుడు అర్శోరోగిని గూర్చుండబెట్టి యవగాహస్వేదము చేసిన శూల శమించును.

(చ-చి-అ-8.)

8. అతీసారమునందు బదర ప్రయోగము.

"యూషేణ బదరాణాం మధవాపి వా ॥

దధిదాడిమసిద్ధేన బహుస్నేహేన యోజయేత్" ॥

రేగుపండ్లను, పెరుగును, దానిమ్మపండ్ల రసమును గలిపి యూషము జేసి అందు అధికముగా స్నేహము జేర్చి సేవించిన అతిసారము శమించును.

(చ-చి-అ-10.)

3. మదాత్యయమునందు బదర ప్రయోగము.

"బదరీ పల్లవోత్థాశ్చ తథైవారిష్టకోద్భవాః ।

ఫేనిలాయాశ్చ యః ఫేనః తైర్దాహే లేపనం శుభం" ॥

రేగుచిగుళ్ళు వేపచిగుళ్లు వీనిని మెత్తగా నూరి పుంపుడుకాయల నురుగుతో జేర్చి లేపనము జేసిన మదాత్యయమునందలి దాహము శమించును. (చ-చి-అ-12.)

4. కాసమునందు బదర ప్రయోగము.

"బదరీపత్రకల్కం వా ఘృతభృష్టం స సైంధవం।
స్వరభేదే చ కాసే చ లేహమేతత్ప్రయోజయేత్॥"

రేగాకుకల్కమును సైంధవలవణచూర్ణమును గలిపి నేతితో భర్జనచేసి సేవించిన స్వరభేదము, కాసయు శమించును. (చ-చి-అ22)

5. ప్లీహయందు బదరప్రయోగము.

"తైలోన్మిశ్రైః బదరకపత్రైః సమ్మర్దితైః సముపనద్ధః।
ముసలేన పీడితోఽనుయాతి ప్లీహా పయోభుజో నాశం॥"

రేగాకులను మెత్తగానూరి తైలముజేర్చి ప్లీహవృద్ధిపైని యుంచి యుపనాహస్వేదముజేసి పిమ్మట ప్లీహమును ముసలముతో నదమవలెను. ఈవిధముగ జేయుచు పాలను సేవించుచుండిన ప్లీహాభివృద్ధి శమించును. (వా-చి-అ-15)

6. రక్తాతిసారమునందు బదరప్రయోగము.

"... ... ... ... శల్లకీ బదరీ త్వచః।
పీతాః క్షీరేణ మధ్వాఢ్యాః పృథక్ శోణితనాశనాః॥"

అందుగుపట్ట, రేగుపట్ట వీనిచూర్ణమును తేనెతో గలిపి పాలతో సేవించిన రక్తాతిసారము శమించును. (చ-ద.)

7. మసూరికయందు బదరప్రయోగము:—

"లిహేద్వా బాదరం చూర్ణం పాచనార్థం గుడేన తు।
అనేనాశు విపచ్యంతే వాతపిత్తకఫాత్మికాః॥"

రేగుపండ్లచూర్ణమును గుడముతో జేర్చి సేవించిన త్రిదోషజమగు మసూరిక శీఘ్రముగ పాకమును బొందును. (చ-ద.)

8. ప్రదరమునందు బదరప్రయోగము.

"గుడేన బదరీచూర్ణం ... ... ... ప్రదరనాశనం॥"

రేగుపండ్ల చూర్ణమును బెల్లముతో గలిపి సేవించిన ప్రదరము శమించును.

9. స్థౌల్యమునందు బదరప్రయోగము. (చ.ద)

"బదరీపత్ర కల్కేన పేయా కాంజిక సంయుతా।
" ... ... ... ... స్థౌల్యనుత్॥"

రేగాకుకల్కమును కాంజికమునందు జేర్చి పేయను సిద్ధము జేసి సేవించిన స్థౌల్యము శమించును. (చ-ద)

10. ప్రవాహికయందు బదరప్రయోగము.

"ధాతకీ బదరీపత్ర .. ... ...।
ఏకతో దధ్నా పిబేత్ ప్రవాహికార్దితః॥"

ఆరెచెట్టాకులను రేగాకులను మెత్తగా నూరి పెరుగునందు జేర్చి సేవించిన ప్రవాహిక శమించును. (భా-ప్ర)

11. భస్మకాగ్నియందు బదరప్రయోగము.

"కోలాస్థిమజ్జకల్కస్తు పీతో వా వృద్ధకేన వై।
అచిరాద్వినిహంత్యేష ప్రయోగో భస్మకం నృణాం॥"

రేగుగింజలకల్కమును జలముతో సేవించిన శీఘ్రముగ భస్మకాగ్ని శమించును. (వం-సే,)

12. శిరోరోగమునందు బదర ప్రయోగము.

"లలాటే బదరీమూల పిప్పలీనాం ప్రలేపనం।
హంతి సర్వశిరోలగ్నా రుజో దైన్యమివవ్యథాం॥"

రేగుచెట్టువేరు పిప్పళ్ళను గలిపి మెత్తగానూరి లలాటమునందు లేపనము జేసిన శిరశ్శూల శమించును. (గ-ని)

(6) యోగములు:—

1. కోలాదిచూర్ణము (శా - గ్రహణి.) మాత్ర $\frac{1}{4}$ తులము.

ఉపయోగములు - గ్రహణి, కాస, అజీర్ణము, అరుచి, శ్వాస, పార్శ్వశూల, ఇవి శమించును.

2. వికంకతాదిలేపము - (భైషజ్య - గలగండాది,)

ఉపయోగములు - లేపనము జేసిన గ్రంధిశమించును.

(7) Actions and uses:—(బదరి) "Braudis states that durning the famine of 1869, which drove large numbers of the inhabitants of Marvar and other parts of western Rajaputana from their homes, it served as food for thousand "In the winter 1869-70," he writes "The crop of these berries had been plentiful and when I marched through Rajaputana from Agra to Gujarat in December 1869 and January 1870 I found the shrubs completely stripped off their fruits wherever the flocks of hungry emigrants from Marvar had passed through" The leaves form a most valuable fodder for camels, goats, buffaloes and cows and are highly esteemed in the sandy districts of Sind, the Punjab and Baluchistan. They are supposed to be heating and to promote the secretion of milk"

## స్వానుభవము.

[ ఎండిన రేగుపండ్లగుజ్జును ఉన్నాబ్ అను పేర లేహ్యములలో యూనానివైద్యులు ఎక్కువఉపయోగింతురు. శుక్రవర్ధకముగా నెంచబడుచున్నది. ఆంధ్రదేశము నందలి వైద్యులు కూడ మన దేశమున విస్తారముగా లభించునట్టియు, ఎండబెట్టి నిలువజేయుటకు అవకాశము గలిగినట్టియు నీ రేగు పండ్లను బృంహణ ద్రవ్యముగా ఎక్కువగా నుపయోగింపవలెనని నా యభిప్రాయము విదేశములనుండి వచ్చు కృత్రిమాహారములకు బదులు రేగుపండ్ల చూర్ణముతో చేసిన కషాయము, పానకము, లేహ్యములు అగ్నిబలమునుబట్టి ఉపయోగింప వచ్చును. మలమూత్ర శోధన కూడ చేయునని నా యభిప్రాయము. ఆ. ల. ]

---

# 133

## బలా - చిట్టాముట్టి (క)

---

### భాషాంతర నామములు

హింది - ఖరైంటీ, ఖిరైంటీ, బరియూరా. (లా) మరాఠి - చికణా. గుజరాతి - ఖరేటీ, బలదాణా, బలా. మలయాళం - కురుంతోటి. కర్ణాటకం - బలా. ద్రావిడం - చిట్టాముట్టి.

### నైసర్గిక స్వరూప వర్ణనము

(Natural Order—Malvaceae.)

బెండ కుటుంబము

చిట్టాముట్టి - Sida Cardifolia.

(ప్రథమ భాగమున 78-వ పుట చూడుము.)

### పర్యాయ పదములు

శ్లో॥ బలా వాట్యాలికా వాట్యా సైవ వాట్యాలకాపి చ ॥

బల, వాట్యాలిక, వాట్య, వాట్యాలక యనునవి బలానామములు.

### మహాబలా (ఖ)

Sida rhomlifolia.

శ్లో॥ మహాబలా పీతపుష్పా సహదేవీ చ సాస్మృతా॥

మహాబల, పీతపుష్ప, సహదేవి యనునవి మహాబలానామములు.

### అతిబలా (గ)

Abutilon Indicum.

శ్లో॥ తతోఽన్యాతిబలా ఋష్యప్రోక్తా కంకతికా సహ ॥

అతిబల, ఋష్యప్రోక్తా, కంకతిక యనునవి యతిబలానామములు.

# నా గ బ లా (ఘ)

## Grewia Populi.

## Natural Order-Tiliacea.

శ్లో॥ గాంగేరుకీ నాగబలా ఝుషా హ్రిస్వగవేధుకా ॥

గాంగేరుకీ, నాగబల, ఝుష, హ్రిస్వగవేధుక యనునవి నాగబలా నామములు.

శ్లో॥ బలా తిక్తాతిమధురా పిత్తాతీసారనాశని ॥
బలా వీర్యవృష్టిదాత్రి కఫరోధవిరోధనీ ॥ (రా-ని)

### బలాచతుష్టయ గుణములు

శ్లో॥ బలాచతుష్టయం శీతం మధురం బలకాంతికృత్ ।
స్నిగ్ధం గ్రాహి సమీరాస్రి పిత్తాస్రిక్షతనాశనం॥

నాలుగు విధములగు బలలు మధురరసమును, స్నిగ్ధగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. బలమును, కాంతిని గలిగించును. వాతమును శమింపజేయును. రక్తపిత్తమును, రక్తదోషమును, ఉరఃక్షతమును బోగొట్టును.

### వి శే షాం శ ము లు

(1) ప్రసిద్ధనామములు:—

(క) బరిచయబోధకములు:—(బల) - వాట్యాలక, (ఖరయష్టిక. రక్తతండుల, ఫణిజిహ్వక,) (మహాబల,) పీతపుష్ప - (వర్షపుష్ప, మహాగంధ.) (అతిబల)-కంకతిక-(వాట్యపుష్పిక, ఘంటు,) (నాగబల) - హ్రిస్వగవేధుక, (చతుష్ఫల, మహాపత్రి, మహాశాఖి, మహాఫల.)

(ఖ) గుణబోధకములు:—(బల)-బల. (శీతపాకి, వాతఘ్ని.) (మహాబల)-మహాబల. (మృగాదని. కేశవర్ధని,) (అతిబల)-అతిబల. (శీత-శీతపుష్ప.) (నాగబల)-నాగబల, ఝుష.

(2) శబ్దార్థములు:—

వాట్యాలక - గృహములందలి దొడ్లలో నలంకరించునది (ఉత్పత్తి యగునది). ఖరయష్టిక - కఠినముగనుండు కాండమును గలిగి యుండునది. రక్తతండుల - ఎఱ్ఱని బీజములతో గూడిన ఫలములను గలది. ఫణిజిహ్వాక - పాము నాలుకవంటి కేసరములతో గూడిన పుష్పములనుగలది. పీతపుష్ప-పసపు పచ్చని పుష్పములనుగలది. వర్షపుష్ప - వర్షాకాలమునందు పుష్పించునది. మహాగంధ - విశేషముగ పరిమళముతో గూడియుండు పుష్పములను గలది. కంకతిక - దువ్వెన్న పళ్లను బోలు కోతలతో గూడిన ఫలములను గలది. వాట్యపుష్పిక - గృహములందలి దొడ్లలో పుష్పములతో నొప్పి యుండునది. ఘంట - గంటయొక్క ఆకృతిగల పుష్పములతో నొప్పియుండునది. హ్రస్వగవేధుక - భూమిపై పాటిగ నెదుగునది. చతుష్ఫల - నాలుగుచొప్పున గలిసి యుండు ఫలములతో గూడియుండునది. మహాపత్రి - విశాలమగు పత్రములతో నొప్పియుండునది. మహాశాఖ - పొడవుగనుండు కొమ్మలతో నొప్పి యుండునది. మహాఫల - పెద్దవియగు ఫలములతో నొప్పియుండునది. బల - బలమును గలిగించునది. శీతపాకి - శీతగుణవిశిష్టమగు పాకమును గలది. వాతఘ్ని - వాతమును శమింపజేయునది. మహాబల - విశేషముగ బలమును గలిగించునది. మృగాదని - క్రిములను బోగొట్టునది. కేశవర్ధని - కేశములను వృద్ధి పొందించునది. అతిబల - విశేషముగ బలమును గలిగించునది. శీత - శీత వీర్యమును గలది. శీతపుష్ప - శీతలస్పర్శగల పుష్పములను గలది. నాగబల - గజములంత బలమును గలిగించునది. ఝష - వాతమును శమింపజేయునది.

(3) భేదములు:—

ఇది సాధారణబల, మహాబల, అతిబల, నాగబల యని నాలుగువిధములుగా నుండి క్షుపజాతిలో నుత్పత్తి గలిగి వాతహరగణద్రవ్యములలో గణింపబడుచున్నది. మరియు నిది రాజబలయను మరియొక భేదముతో నైదువిధములుగా నుండునట్లు గూడ వర్ణింపబడినది. కాని ఈ రాజబల యనునది యొకవేళ ప్రసారిణి యని వ్యవహరింపబడుచున్న ద్రవ్యాంతరమై యుండునేమో యని తోచుచున్నది. ఏల యనగా రాజబల, భద్రబల యని ప్రసారిణికి పర్యాయ పదములుగా జెప్పబడినవి. మరియు నీ రాజబల యనునది నిఘంటుకారులలో కొద్దిమందిచేతనే గాని యందరిచేతను గ్రహింపబడినట్లు గాన

రాదు. ఇంతియేగాక యీ రాజబల అమరకోశమునందు సరణ, ప్రసారిణి, మొదలగు పర్యాయ పదములతో వర్ణింపబడినది. ఇందలి సరణ, ప్రసారిణి యను పదములు లతాస్వభావమును బోధించుచుండుటచే నిది పైనిజెప్పినట్లు ప్రసారిణి యను లతారూపక ద్రవ్యమై యుండవలెను. (లేక) లతారూపముగ నుండు మరియొక జాతిగనైన నుండవలెను. కావున నిది క్షుపరూపమున నుండు బలాజాతులలో గణింపబడుట కవకాశము గానుపించకున్నది.

బల, యనునది ఖరయష్టిక, రక్తతండుల, ఋషిజిహ్వక యనియు, మహాబల యనునది పీతపుష్ప, వర్షపుష్ప, మహాగంధయనియు వర్ణింపబడినవి. దీనిని బట్టి యివి కొంచెము హెచ్చుతక్కువగ సామాన్యముగ ప్రతి గృహారామములందు పెంచబడు నిత్యమల్లియను నొక పుష్పజాతియగు మొక్కలతో సమానముగ నుండునట్లు దోచగలదు. ఎలాగన నీ నిత్యమల్లియొక్క కొమ్మలు, పుష్పాలు మొదలగునవి పైని జెప్పినట్టి ఖరత్వాదిలక్షణములను గలిగి యుండును. దీని కాయలందలి గింజలు ఎఱ్ఱగ నుండును. పుష్పములు పసుపుపచ్చగను, తెల్లగను వర్షాకాలమునందు పుష్పించుచుండును. దీని యాకులు కొంచెము వెడల్పును, చివరకోణమును, చుట్టును కోతలుగోసినట్టి చిహ్నములను గలిగి యుండును. కొందరిచే నిదియే బలయని జెప్పబడునట్టి మొక్కలకును, పైని వివరించినట్టి నిత్యమల్లి మొక్కలకును భేదము గానుపించకున్నది. ఇదియును గాక యీ బల మహాబలలకు జెప్పబడిన వాట్యాలిక యను పర్యాయపదమును బట్టి గూడ పైవిధముగ గ్రహించుట కవకాశము గలుగుచున్నది. కాని మలబారు ప్రాంతములందు వ్యవహరింపబడుచున్న బల పైని జెప్పినట్టి లక్షణములనే గలిగి యుండినను నిత్యమల్లి యంత పొడవు లేక పొట్టిగను గుబురుగను పెరుగునవిగ నుండునట్లు దెలియగలదు. మరియు గొందరు ఈ రెండును సమానలక్షణములనే గలిగి యుండుననియును, కాని యందలి బల తెల్లని పుష్పములను, మహాబల పచ్చని పుష్పములను గలిగియుండుననియును జెప్పుదురు.

అతిబల యనునది “కంకతిక, వాట్యపుష్ప, ఘంటా” యను పర్యాయ పదములనుబట్టి సామాన్యముగ నింటిదొడ్లలో పెరుగు దువ్వెన్నచెట్టు (లేక) తుత్తురుబెండయని వ్యవహరింపబడునట్టిదిగా దెలియగలదు. నాగబల యనునది బలుసు అని వ్యవహరింపబడు దానినిగా జెప్పుదురు. అయితే హ్రస్వగవేధుక

యను శబ్దమును బట్టి భూమిపై పొట్టిగా బెరుగునదిగా దెలియగలదు. కాని మహాశాఖ, మహాపత్రి, చతుష్ఫలయను శబ్దములను బట్టి యిదియొక వృక్ష జాతిలోనిదని దెలియుచున్నది. కాని బలుసాకులు చిన్నవిగ నుండుటను బట్టియు, దీనికి ముండ్లుండుటను బట్టియు నిది బలుసుగాదని దెలియుచున్నది. మరియు విశ్వదేవయను పర్యాయ పదమును బట్టి బలుసాకును విశ్వేదేవప్రీతి యని పితృకార్యములం దుపయోగించు చుండుటజేసి యొకవేళ నిది బలుసై యుండునేమో యనియు దెలియగలదు. నిజముగా నిది బలుసే యైనచో బలుసుచెట్టు ముండ్లను గలిగియుండును గాన అట్టి లక్షణములను బోధించు నట్టి పర్యాయపద మొక్కటియు దీనికి ప్రయోగింపబడినట్లు గానరాదు. ఇంతియేగాక శాలిగ్రామ నిఘంటుకారకుడు ఇందు బృహన్నాగబలయను మరియొక భేద మున్నట్లుగా జెప్పి దీని గుణములనే గాని పర్యాయపదములను జెప్పి యుండలేదు.

ఇటుల బలాజాతుల స్వరూపవిజ్ఞానమునందు అనేక సందేహములు గలుగుచున్నవి. హెచ్చుగ విమర్శించిన గాని వీనియొక్క స్వరూపము లిట్టివి యని నిరూపించుట కవకాశము గానుపించకున్నది. ఈ బలాజాతులు విశేషముగా వాతరోగములందు బ్రయోగింప బడుచున్నవి. అందును విశేషముగా మొదటి రెంటికే హెచ్చు ప్రయోగము లున్నటుల గానబడును. గాని మిగిలిన వాని కంతగా నున్నట్లు గానరాదు.

(4) విశేషగుణములు:—

(క) బల – మధురరసమును, స్నిగ్ధగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. వెంటనే శుక్రమును గలిగించును. బలమును, ఓజస్సును వృద్ధి పొందించును. త్రిదోషములను శమింపజేయును. రక్తపిత్తమును క్షయను బోగొట్టును. (ధ-ని.) విశేషముగ తిక్తరసమును, మధురానురసమును గలిగి యుండును. బలమును, వీర్యమును, పుష్టిని గలిగించును. కఫరోధమును శోధించును. పిత్తాతిసారమును బోగొట్టును. (రా-ని.) రుచిని బుట్టించును. మలామలను నిరోధించును. వాతపిత్తములను శమింపజేయును. (రా-వ.)

(ఖ) బలాఫలము-కషాయరసమును, మధురానురసమును, గురుగుణమును శీతవీర్యమును, మధురవిపాకమును గలిగి యుండును. స్తంభనము జేయును. విశేషముగ లేఖనము జేయును. విబంధమును, ఆధ్మానమును గలిగించును.

వాతమును వృద్ధిబొందించును. పిత్తకఫములను శమింపజేయును. రక్తదోషమును బోగొట్టును. (ని-ర.)

(గ) మహాబల-శుక్రమును వృద్ధిబొందించును వాతమును శమింపజేయును. హృద్రోగమును, అర్శస్సును, శోషను, విషమజ్వరమును బోగొట్టును. (ధ-ని.) మధురరసమును గలిగి యుండును. వాతుప్రకృతిని, బలమును గలిగించును. వెంటనే శుక్రమునుగలుగ జేయును దోషములను శోధించును. జ్వరమును, ప్రమేహములను. బహుమూత్రమును, దాహమును బోగొట్టును. (శా-ని.)

(ఘ) నాగబల - మధురరసమును, ఆమ్లకషాయకటుతిక్తానురసములను, గురుగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. వాతమును శమింపజేయును. వ్రణమును పిత్తవికారములను బోగొట్టును. (ధ - ని.) కండువును కుష్ఠమును బోగొట్టును.(రా. ని)మూత్రకృచ్ఛ్రమును, క్షతక్షైణ్యమునుబోగొట్టును.(రా-వ) కఫవాతములను శమింపజేయును. (శో-ని)

(చ) నాగబలాఫలము - కషాయరసమును, మధురానురసమును, రూక్ష గురుగుణములను, శీతవీర్యమును గలిగియుండును. లేఖనమును, స్తంభనమును, విబంధమును, ఆధ్మానమును గలిగించును. వాతమును వృద్ధిబొందించును. (శో-ని.)

(ఛ) బృహన్నాగబల - ఆమ్లరసమును, మధురానురసమును, గలిగియుండును. త్రిదోషములను శమింపజేయును. దాహజ్వరమునుబోగొట్టును. (ని-ర)

(జ) అతిబల - మలాదులను నిరోధించును. బలమును గలిగించును. వెంటనే శుక్రమును గలిగించును. వాతపిత్తములను శమింపజేయును. (ధ-ని) తిక్తరసమును కటుకషాయానురసమును గలిగియుండును. వాతమునుశమింపజేయును. క్రిములను, దాహమును,తృష్ణను,విషమును, ఛర్దిని, క్లేదమును బోగొట్టును. (రా-ని) మధురరసమును అమ్లానురసమును గలిగి యుండును. త్రిదోషములను శమింపజేయును. (శో-ని)

(5) ప్రయోగములు:—

(క) బల - మహాబల-

1, రక్తపిత్తమునందు బలా ప్రయోగము.

"గవ్యంపయః ... ... బలా శృతం గోక్షురకైః శృతం వా॥"

బలామూలముతో గాచిన గోక్షీరమును పానము జేసిన రక్తపిత్తము శమించును. (చ-చి-అ-4)

2. రక్తార్శస్సునందు బలాప్రయోగము.

"హంత్యాశు రక్తరోగం తథా బలా పృశ్నిపర్ణిభ్యాం॥"

బలామూలము, ముయ్యాకుపొన్న, వీనితో గాచిన గోక్షీరమునుపానము జేసిన రక్తార్శోరోగము శమించును. (చ-చి-అ-9)

3. కఫజవిసర్పమునందు బలాప్రయోగము.

"... ... ... బలాం పృథగా లేపనం కుర్యాత్॥"

బలామూలమును మెత్తగా నూరి లేపనము జేసిన కఫజవిసర్పము శమించును. (చ-చి-అ-11.)

4. మదాత్యయమునందు బలాప్రయోగము.

"తృష్యతే సలిలం చాస్మై దద్యాత్ ... ... బలాయా శృతం॥"

బలామూలముతో గాచిన జలమును మదాత్యయరోగమునందిచ్చిన తృష్ణ శమించును. (చ-చి-అ12)

5. వ్రణమునందు బలాప్రయోగము.

"బలామూలం ... ... ఆలేపనం ... ... నిర్వాపణం॥"

బలామూలమును మెత్తగానూరి లేపనము జేసిన వ్రణనిర్వాపణమగును. (చ-చి-అ- 13.)

6. వాతరక్తమునందు బలాప్రయోగము.

"బలాకషాయకల్కాభ్యాం తైలం క్షీరసమం తథా।
సహస్రశతపాకం వా వాతాసృగ్వాతరోగనుత్॥"

బలామూలముయొక్క కషాయకల్కములను, గోక్షీరమును, తైలమును గలిపి వెయ్యిమార్లుగాని, నూరుమార్లుగాని, పాకము జేసి పానాభ్యంగాదులందుపయోగించిన వాతరక్తమును వాతరోగములును శమించును. (చ-చి-అ-29.)

7. రసాయనమునకై బలాప్రయోగము.

"యథోక్తమాగారం ప్రవిశ్య బలామూలార్ధపలం పలంవా పయసాలోడ్య పిబేత్, జీర్ణే పయస్సర్పిరోదన ఇత్యాహారః॥ ఏవం ద్వాదశరాత్రి

ముపయుజ్య ద్వాదశవర్షాణి వయస్తిష్ఠతి॥ ఏవం దివసశతముపయుజ్య వర్షశతం వయస్తిష్ఠతి"

రసాయనవిధిననుసరించి బలామూల చూర్ణమును అర్ధపలమునుగాని, యొకపలమునుగాని, పాలయందుజేర్చి తీసికొని యది జీర్ణమైన పిమ్మట పాలు నెయ్యి వీనితో జేర్చి యన్నమును భుజించవలెను. ఇటుల పదిరెండు రోజులు చేసిన పదిరెండువర్షములును, నూరుదినములు చేసిన నూరువర్షములును ఆయువు వృద్ధిబొందును. (సు-చి-అ-27.)

8. రాజయక్ష్మయందు బలా ప్రయోగము.

"బలాగర్భం ... ... ...
సక్షీరదధి సాయసా సిద్ధం సర్పిః దశగుణేన వా॥"

బలామూలకల్కము నాల్గవభాగమును, ఘృతమొకభాగమును, పాలు పదిభాగములును గలిపి పాకము జేసినట్టి ఘృతమును తేనెతోజేర్చి సేవించిన రాజయక్ష్మ శమించును. (వా-చి-అ-5.)

9. అపబాహుకవాతమునందు బలాప్రయోగము.

"మూలం బలాయాః......పిబేద్వా ।
......మాసాదిసౌ వజ్రసమానబాహుః "॥

బలామూలచూర్ణమును ఒకమాసము సేవించిన అపబాహుకవాత రోగము శమించి బాహువు వజ్రముతో సమానముగ నగును. (చ-ద.)

10. అంత్రవృద్ధియందు బలా ప్రయోగము.

"తైలమేరండజం పీత్వా బలాసిద్ధం పయోన్వితం ।
ఆధ్మానశూలోపచితా నరాంత్ర వృద్ధిం జయేన్నరః "॥

బలామూలముతో గాచినట్టి పాలయందు ఏరండతైలమును జేర్చి పానముజేసిన ఆధ్మానము, శూల వీనితో గూడిన అంత్రవృద్ధి శమించును. (చ-ద.)

11. ప్రదరమునందు బలా ప్రయోగము.

"ప్రదరం హన్తి బలాయాః మూలం దుగ్ధేన మధుయుతం పీతం"॥

బలామూల చూర్ణమును తేనెతోగలిపి పాలతో సేవించిన ప్రదరము శమించును. (చ-ద.)

12. ఉన్మాదమునందు బలా ప్రయోగము.

"సితకుసుమ బలాయాః సార్ధకర్షత్రియం యః ।
శిఖరి చరణకోలం క్షీరపాకేనపక్వం ।
పిబతి తదను శీతం పాత్రమాత్రం నిత్యం ।
జయతి ఝటితి ఘోరం నూన మున్మాదముగ్రం" ॥

తెల్లపువ్వులతో గూడిన బలామూలము మూడున్నర కర్షములును, ఉత్తరేణిమూలము కోలప్రమాణమును గ్రహించి పాలయందు జేర్చి క్షీరపాక విధి ననుసరించి పాకముజేసి సాంగశీతలమైన పిమ్మట యనువ పానము జేయుచుండిన నుగ్రమగు ఉన్మాదవ్యాధి శమించును. (వం-సే.)

13. సర్వవాతరోగములందు బలా ప్రయోగము.

"బలానిఃక్వాథకల్కాభ్యాం తైలం పక్వం పయో ఽన్వితం ।
సర్వవాతవికారఘ్నం........." ॥

బలామూలకల్కకషాయములను, పాలను, తైలమును గలిపి తైలపాకవిధి ననుసరించి పాకముజేసి పానాభ్యంజన నస్యములుగ నుపయోగించిన సర్వ వాతరోగములను శమించును. (వం-సే.)

14. ఉరోగ్రహమునందు బలా ప్రయోగము.

"మూర్వ్యా వా బలయా వాపి ।
రసాః ఏకైకశః క్వాథాః స్యుర్వా రామఠాన్వితాః" ॥

పాలచెట్టుతీగెల చెట్టుమూలము, బలామూలము వీనియొక్క కషాయ ములను ప్రత్యేకముగ గాని, రెండింటిని గలిపిగాని కొద్దిగా వెచ్చగ నున్నప్పుడు అందు ఇంగువముజేర్చి సేవించిన ఉరోగ్రహము శమించును. (వం-సే.)

15. అర్దితవాతమునందు బలా ప్రయోగము.

"బలామూలః క్షీరం వాతాత్మకే హితం" ॥

బలామూలముతో గాచిన పాలను సేవించిన అర్దితవాతము శమించును. (భా-ప్ర.)

16. మూత్రాతిసారమునందు బలా ప్రయోగము.

"బలామూలత్వచ శ్చూర్ణం పీతం సక్షీరశర్కరం ।
మూత్రాతిసారం హరతి దృష్టమేత న్నసంశయః" ॥

బలామూలత్వక్చూర్ణమును శర్కరాక్షీరములతో గలిపి సేవించిన నిశ్చయముగ మూత్రాతిసారము శమించును. (భా-ప్ర.)

17. గర్భిణీశూలయందు బలా ప్రయోగము.

"గర్భిణీతు బలాక్వాథసిద్ధం పాయసం ప్రగే ఽపిబేత్" ॥

బలామూలకషాయముతో గాచిన స్నాతమును ఉదయ సాయంత్రములందు సేవించిన గర్భిణీశూల శమించును. (వై-మ.)

18. శ్లీపదమునందు మహాబలా ప్రయోగము.

"అసాధ్యమపి యాత్యస్తం శ్లీపదం చిరకాలజం।
మూలేన సహదేవాయాః తాలమిశ్రేణ లేపితం" ॥

మహాబలామూలమును, తాళకమును మెత్తగానూరి లేపనము జేసిన చిరకాలజమును, అసాధ్యమును అగు శ్లీపదము శమించును. (వం-సే.)

19. విషమజ్వరమునందు మహాబలా ప్రయోగము.

"మహాబలా మూల మహౌషధాభ్యాం।
క్వాథో నిహన్యా ద్విషమజ్వరం హి,
శీతం సకంపం పరిదాహయుక్తం।
వినాశయేత్ ద్వి త్రి దిన ప్రయోగాత్" ॥

మహాబలామూలము, శుంఠి వీనితో గాచినట్టి కషాయమును రెండు మూడు దినములు సేవించిన మిగుల కంపము, దాహము వీనితో గూడిన విషమజ్వరము గూడ శమించును. (భా-ప్ర.)

20. మూత్రకృచ్ఛ్రమునందు మహాబలా ప్రయోగము.

"హరేన్మహాబలా కృచ్ఛ్రం భవేద్వాతానులోమనీ" ॥

మహాబలామూల కషాయమును పానముజేసిన మూత్రకృచ్ఛ్రము శమించును. వాతానులోమనము గలుగును. (భా-ప్ర.)

(4) అతిబల:—

21. రసాయనమునకు అతిబలా ప్రయోగము.

"బలాతిబలా...పునర్నవాంతా శ్చౌషధయో దశ యే వయస్థాపనాః వ్యాఖ్యాతాః తేషాం స్వరసాః నాగబలావత్ ప్రయోజ్యాః"

అతిబలా మూలస్వరసమును రసాయనప్రయోగవిధి ననుసరించి పాలతో సేవించుచు జీర్ణమైన పిదప పాలు, నెయ్యి, అన్నమును గలిపి భుజించుచుండిన వ్యాధులు లేక చిరకాలజీవిత్వము సిద్ధించును. (చ-చి అ-1.)

22. మూత్రకృచ్ఛ్రమునందు అతిబలా ప్రయోగము.

"కషాయో ఽతిబలా మూలసాధితః సర్వకృచ్ఛ్రజిత్" ॥

అతిబలా మూలకషాయమును పానము జేసిన మూత్రకృచ్ఛ్రము శమించును. (చ-ద.)

23. రక్తప్రదరమునందు అతిబలా ప్రయోగము.

"బలా కంకతికాఖ్యా యా తస్యా మూలం సుచూర్ణితం ।
లోహితప్రదరే ఖాదేత్ శర్కరా మధుసంయుతం" ॥

అతిబలా మూలచూర్ణమును మధుశర్కరలతో జేర్చి సేవించిన రక్తప్రదరము శమించును. (భా-ప్ర.)

24. ప్రమేహమునందు అతిబలా ప్రయోగము.

"హన్యాదతిబలా మేహం పయసా సితయాసహ" ॥

అతిబలా మూలచూర్ణమును చక్కెరతో జేర్చి పాలతో సేవించిన ప్రమేహము శమించును. (భా-ప్ర.)

(గ) నాగబల:—

25. రసాయనమునకు నాగబలా ప్రయోగము.

"నాగబలామూలాని...పయసా మధుసర్పిర్భ్యాం వా సంయోజ్య భక్షయేత్ । జీర్ణేచ క్షీరసర్పిర్భ్యాం శాలిషష్టిక మశ్నీయాత్ । సంవత్సర ప్రయోగాత్ అస్య వర్షశతమజర మాయుస్తిష్ఠతి ఇతి సమానం పూర్వేణ" ॥

నాగబలామూలచూర్ణమును మధుఘృతములందు గలిపి పాలతో సేవింపుచు జీర్ణమైన పిమ్మట పాలతోను, ఘృతముతోను షష్టికధాన్యాన్నమును భుజించుచు నిటుల ఒక సంవత్సరమాచరించిన నూర్లు వర్షములు వ్యాధులులేక జీవింపగలుగును. (చ-చి-అ 1.)

26. క్షతక్షయమునందు నాగబలా ప్రయోగము.

"పిబేన్నాగ బలామూలస్యార్ధ కర్ష వివర్ధనం ।
పలం క్షీరయుతం మాసం క్షీరవృత్తి రనన్నభుక్ ।
ఏష ప్రయోగః పుష్ట్యాయుః బలారోగ్యకరః పరః" ॥

నాగబలామూలచూర్ణమును అర్ధతులమునుండి యొక తులమువరకు హెచ్చింపుచు తిరిగి అర్ధతులము చొప్పున తగ్గిం పుచు నీ విధముగ నారోహావరోహణప్రక్రియ ననుసరించి పాలతో నొకమాసము సేవింపుచు అన్నమును విడిచి కేవలము పాలనే యాహారముగా దీసుకొనుచుండిన క్షతక్షయము శమించును. పుష్టి, ఆయుర్వృద్ధి, ఆరోగ్యము, బలమును గలుగును.

(చ-చి-అ-16.)

27. హృద్రోగమునందు నాగబలా ప్రయోగము.

"మూలం నాగబలా యాస్తు చూర్ణం దుగ్ధేన పాయయేత్ ।
హృద్రోగ శ్వాసకాసఘ్నం......" ॥

నాగబలామూలచూర్ణమును పాలతో సేవించిన హృద్రోగము, శ్వాస, కాసములు శమించును.

(చ-ద.)

28. సద్యోవ్రణమునందు నాగబలా ప్రయోగము.

"ఖడ్గాదిభిన్న గాత్రస్య తత్కాలపూరితో వ్రణః ।
గాంగేరుకీ మూలగసై జాయతే గతవేదనః" ॥

ఖడ్గాదులవలన గలిగిన క్షతవ్రణమునందు నాగబలామూల స్వరసమును పూరణము జేసిన వెంటనే వేదన శమించును.

(శా-ధ.)

29. క్షయమునందు నాగబలా ప్రయోగము.

"చూర్ణం నాగబలాయాస్తు ఘృతమాక్షిక మిశ్రితం ।
ప్రలిహ్యాత్ప్రాతరుత్థాయ క్షయవ్యాధి నివారణం" ॥

నాగబలామూల చూర్ణమును మధుఘృతములతో గలిపి ప్రతి యుదయమున సేవింపుచుండిన క్షయరోగము శమించును.

(గ-ని.)

(6) ప్రయోగములు:—

1. బలాదిఘృతము - (చ-జ్వర.) మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—జ్వరము, క్షయ, కాస, శిరశ్శూల, పార్శ్వశూల, అంసతాపము ఇవి శమించును.

2. బలాతైలము (వా-వాతరోగ.) మాత్ర:-$\frac{1}{2}$ పలం.

ఉపయోగములు:—పానలేపన నస్యాదులుగ నుపయోగించిన వాతరోగము, కాస, శ్వాస, జ్వరము, ఛర్ది, మూర్ఛ, గుల్మము, క్షతక్షయము, ప్లీహ, శోష, అపస్మారము ఇవి శమించును.

3. నాగబలాఘృతము-(వా-కాస.) మాత్ర:-1 తులం.

ఉపయోగములు:— రక్తపిత్తము, క్షతక్షయము, తృష్ణ, భ్రమ, దాహము ఇవి శమించును. వలీపలితములు రాకుండ యుండును. బలము, పుష్టి, ఆయుర్వృద్ధి, ఓజోవృద్ధి, శుక్రవృద్ధి ఇవి గలుగును.

4. మహాబలాతైలము-(భైషజ్య-వాతరోగ.) మాత్ర:-$\frac{1}{2}$ పలం.

ఉపయోగములు:—పానాభ్యంజన నస్యాదులుగ నుపయోగించిన వాతరోగము, సూతికారోగము, అభిఘాతము, హిక్క, కాస, అధిమంథము, గుల్మము, శ్వాస, అంత్రవృద్ధి యివి శమించును. గర్భప్రదమును, శుక్రదోషశోధనమును అగును.

5. బలారిష్టము-(భైషజ్య-వాతరోగ.) మాత్ర:-1 ఔన్సు.

ఉపయోగములు:—వాతరోగములు శమించును. బలము, ధాతుపుష్టి, అగ్నిదీపనము గలుగును.

6. నాగబలాతైలము-(చ-ద-వాతరక్త.)

ఉపయోగములు:—అభ్యంగము జేసిన వాతరక్తము శమించును.

## బలగల మరికొన్ని యోగములు

కకుభాదిచూర్ణము, చ్యవనప్రాశలేహ్యము, నారాయణతైలము, మాషతైలము, రాస్నాదిక్వాథచూర్ణము, రాస్నాదితైలము, శివామోదకము, క్షీరబలాతైలము.

(7) Constituents:—(అతిబలా) The leaves contain mucilage, tánuin, organic acid and traces of as paragin and ask containing alkaline sulphates, chlorides, magnesium phosphate and calcium carbonate.

Actions and uses.—Seeds demulcent, the bark diuretic and cooling; used like althea in gonorrhoea strangury etc.

R. N. Khory Part II. Page 92.

## స్వానుభవము

బలామూలమును ఆయుర్వేద వైద్యులు ఎక్కువగా వాడుచున్నారు. ఈ ద్రవ్యమునకీగుణములు యెట్లు కలిగెనో చెప్పుట ఆధునికశాస్త్రరీత్యా కష్టతరముగా నున్నది. కాని ఆయుర్వేదానుసారముగా స్నిగ్ధమధురము అను గుణములు దీని యందు స్పష్టముగా కనబడుచున్నందున ఆ గుణములను బట్టియే బలము కలుగుటయు వాతము శమించుటయు నేర్పడును. శీతవీర్యమగుటచే రక్తపిత్తము శమింపజేయునని చెప్పుటసరిగా నున్నది. నవీనపరిశోధకులు కేవలము ఔషధద్రవ్యములయందుండెడి మూలధాతువులపరీక్షచే తృప్తినొందక సజీవ(Biological) యుక్తమగు శోధనలచే రోగులయందుపయోగించి, బలా మొదలగు మహౌషధముల గుణగణముల తెలుసుకొనవలెనని స్పష్టపడుచున్నది. బలా (చిట్టాముట్టి) ఆంధ్రదేశమునందు అన్నిప్రాంతములయందును దొరకును. నేలను బట్టి ఆకులు చిన్నవి పెద్దవిగ నుండును. చిట్టాముట్టియనుదానికి పల్లెటూళ్లలో లంజపుర్నాల చెట్టు అని చెప్పుదురు. లేతకాయలు శనగలంత పరిమాణముగలిగి తియ్యగానుండును. పశువులకాచు పిల్లలు రుచిగానున్నవని తినెదరు. ఆకుకూడ నమిలినప్పుడునోటి నిండా నురుగువచ్చుచు పిచ్ఛిలముగా నుండును. ఈ ఆకులను ఎండబెట్టి వరుగుచేసి కూడ కూర వండుకొనవచ్చును. పచ్చని పువ్వులుపూచెడి బల ఆంధ్రదేశమున మరుభూములలో ఎక్కువగా నున్నది. దీని ఎండుకంపకు పెరిగకంపయని పేరు. నేల యొక్క స్వభావమును బట్టి పొట్టిగగాని, పొడుగుగగాని, పెరు

గును. దీనినే మలబారులో కురుందొట్టి యనెదరు. దీని ఆకుల చూర్ణముతో తలంటుకొనెదరు. మిక్కిలి పిచ్ఛిలత్వము గలదై జిడ్డును మలిన్యమును వదల్చివేయును. వెంట్రుకలు మెత్తగ నుండును. ఈ చూర్ణము ఆంధ్రదేశమున మలబారులోవలె హెచ్చుగా నుపయోగింపదగియున్నది.

[అతిబల-అతిబల అనేది దువ్వెనకాయలచెట్టు లేకతుత్తురు బెండ లేక తుత్తియాకు అను దానికి యుపయోగించుచున్నారు. దీనిని అర్శస్సునందును, మలబద్ధమునందును కూర వండి తిను ఆచారము దక్షిణదేశమున హెచ్చుగా కలదు. దీనినే అతిబలగా గ్రహింపవచ్చునని నా యుద్దేశము. రస వీర్యగుణప్రభావములు సరిపోవుచున్నవని నా యభిప్రాయము.]

[నాగబల-కీ॥ శే॥ భిషగ్రాజ మాంటలిక వెంకటేశ్వరరావు గారు బలుసుచెట్టును నాగబలయనిగుర్తించియున్నారు కొంచెము చేదు, వాసన, యున్నను పిచ్ఛిలత్వ బృంహణాది గుణములచే నిది బలాభేదమని అంగీకరించుటకు సందేహము కనబడదు. బలుసాకులు దేశమునుబట్టియు నేలలోని తడినిబట్టియు చిన్నవి పెద్దవిగనుండును. చెట్లుకూడ గట్టినేలలో జానెడును సారవంతమగు ప్రదేశములలో 15 మొదలు 20 అడుగులు ఎత్తుగల చెట్లును గలవు. ఈ మధ్య హిమాలయములలో క్షయవ్యాధికి మందు కని పెట్టినామని ఒకరు ప్రచురించినారు. దానికి అరవములో కారై అని పేరు చెప్పియున్నారు. అదిచూడగా బలుసాకు. లషింగ్టన్ 1521 Camthium. చూడుడు. ఇందనేకరకములుగలవు. "బతికి ఉంటే బలుసాకుతిని జీవించవచ్చునని" సామెతగలదు బృంహ

ణత్వ పిచ్ఛిలత్వ గుణములచే నిది మానవులకు సంపూర్ణమైన ఆహారము కాగలదని చెప్పవచ్చును. కాబట్టి బలాఅను దీనికి పేరు సార్థకనామము కావచ్చునని అంగీకరింపవచ్చును. ఆ. ల.]

---

# 134

# బ్రాహ్మీ - సరస్వతియాకు

---

## భాషాంతర నామములు

హింది - బగహ్మీ, బ్రహ్మీ, బ్రాహ్మీ. మరాఠి - బ్రాహ్మీ. గుజరాతి - విద్యాబ్రాహ్మీ. మలయాళం - బ్రహ్మి. కర్ణాటకం - బ్రహ్మీ. ద్రావిడం - వల్లారై.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Umbelliferae

కొత్తిమేర కుటుంబము

సరస్వతియాకు - Hydrocotyle asiatica (Eng-Indian Penny wort)

(580-వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ బ్రాహ్మీ కపోతవం (బ) కాచ సోమవల్లీ సరస్వతీ॥

బ్రాహ్మి, కపోతవంక, సోమవల్లి, సరస్వతి యనునవి బ్రాహ్మీనామములు.

## బ్రాహ్మీగుణములు

శ్లో॥ బ్రాహ్మీ హిమా సరా తిక్తాలఘుర్మేధ్యా చ శీతలా ।
కషాయా మధురా స్వాదుపాక వృష్యా రసాయనీ॥
స్వర్యా స్మృతిప్రదా కుష్ఠ పాండు మేహా స్రకాసజిత్ ।
విషశోథ జ్వరహారీ..........................॥

సరస్వతియాకు తిక్తరసమును, కషాయ మధురానురసములను, సర లఘు గుణములను, శీతవీర్యమును, మధురవిపాకమును గలిగి యుండును. శీతలస్పర్శమును గలిగియుండును. మేధాశక్తిని వృద్ధి పొందించును. వెంటనే శుక్రమును గలిగించును. రసాయనము, స్వర్యమును, స్మరణశక్తిని గలిగించును. కుష్ఠము, పాండు, ప్రమేహము, రక్తదోషము, కాస, విషము, శోఫ, జ్వరము అను నీవ్యాధులను పోగొట్టును.

## మాండూకపర్ణి—సరస్వతీయాకు భేదము (ఖ)

శ్లో॥ మండూకపర్ణీ మండూకీ త్వాష్ట్రీ దివ్యా మహౌషధీ॥
మండూకపర్ణి, మండూకీ, త్వాష్ట్రీం, దివ్య, మహౌషధి యనునవి మండూకపర్ణీ నామములు.

## మండూకపర్ణి గుణములు

శ్లో॥ తద్వన్మండూకపర్ణికా॥
ఈ మండూకపర్ణి బ్రాహ్మీ గుణములనే గలిగియుండును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయ బోధకములు:—బ్రాహ్మీ - సోమవల్లి. (మత్స్యాక్షి, మహౌషధి, కపోతవేగ.) (మండూకపర్ణి) - మండూకపర్ణి, మహౌషధి.

(ఖ) గుణబోధకములు:—బ్రాహ్మీ - సరస్వతి. (వయస్థ, మేధ్య.)

(2) శబ్దార్థములు:—

సోమవల్లి - చంద్రగమనము ననుసరించి విస్తరించునట్టి లత. మత్స్యాక్షి - మత్స్యముయొక్క నేత్రములవంటి పుష్పములను గలది. మహౌషధి - ఓషధుల లోను శ్రేష్ఠమైనదిగ గణింప బడునది. కపోతవేగ - పావురముయొక్క వేగము వంటి వేగముగలది అనగా నంత శీఘ్రముగ శరీరమునందు ప్రవేశించు స్వభావముగలది. మండూకపర్ణి - మండూకము (కప్ప) వంటి యాకృతుల పత్రములతో నొప్పియుండునది. సరస్వతి - వాక్కును శుద్ధపరచునది. వయస్థ - వయస్సు స్థిరముగ నుంచునది. మేధ్య - మేధాశక్తిని వృద్ధిపొందించునది.

(3) భేదములు:—

ఇది బ్రాహ్మి, బ్రహ్మమండూకియని రెండువిధములుగా నుండును. అందు మొదటిది లతారూపమునను, రెండవది క్షుపరూపమునను నుత్పత్తిగలిగి రసాయన ద్రవ్యములలో గణింప బడుచున్నవి. బ్రాహ్మి యనునది జలప్రాంతములందు వృద్ధిపొందును దీనియాకులు మిగుల చిన్నవిగను, కొంచెము కోలదనముతో గూడి గుండ్రముగను, దళసరిగను నుండును. ఈ యాకుల యందు కొంచెము పిచ్ఛిల గుణముండును. ఈలత విశేషముగా రసాయనము నకును, మానసిక వ్యాధులకును ప్రయోగింప బడుచున్నది. మరియు దీనియొక్క స్వరసాదులు బాలుర యుత్పత్తి మొదలుకొని వాక్సంస్కృతి మేధాదులు గలుగుటకై యుపయోగింప దగినవిగా నిరూపింప బడినవి.

మండూకపర్ణి (లేక) బ్రహ్మమండూకి యనునదికూడ పైదానివలెనే జలప్రాంతము లందుత్పత్తి గలిగి చిన్న చిన్న మొక్కల రూపమున వృద్ధి పొందును. దీనియాకులు గుండ్రముగను, విశాలముగను, చుట్టూన నచ్చుటచ్చుట నొక్కులు గలవిగను, కొంచెము హెచ్చుతక్కువగ విసినకఱ్ఱవంటి యాకృతి గలవిగను నుండును. ఈ యాకులను గొందరు శాకముగాజేసి యుపయోగించు దురు. ఈ క్షుపము పైదానివలెనే రసాయనాదులకై ప్రయోగింప బడుచు న్నది. అయితే నిది పైదాని యభావము నందుపయోగింప బడుచున్నట్లుగా దెలియగలదు.

(4) విశేషగుణములు:—

(క) బ్రాహ్మీ - వాతకఫములను శమింపజేయును. ప్లీహమును బోగొట్టును. (ధ-ని.) కషాయరసమును గలిగియుండును. వాతరక్తమును బోగొట్టును. (రా-ని.) గురుగుణమును గలిగియుండును. మలశోధనము జేయును.

పిత్తకఫములను శమింప జేయును. (రా-వ.) జాఠరాగ్నిని వృద్ధి పొందించును. కంఠశోధనము జేయును. హృదయమునకు హితమైనది. అరుచి, శ్వాసను, శోషను బోగొట్టును. (ని-క.) పిచ్ఛిల గుణమును, కటువిపాకమును గలిగి యుండును. ఉన్మాదమును బోగొట్టును, (కై-ని.)

(ఖ) మండూకపర్ణి - ఉష్ణవీర్యమును గలిగియుండును. వాతమును శమింపజేయును. ఆమమును బోగొట్టును. (రా-ని.)

(5) ప్రయోగములు:—

1. అపస్మారమునందు బ్రాహ్మీ ప్రయోగము.

"పయసా వా బ్రాహ్మీరసం" ॥

బ్రాహ్మీపత్ర స్వరసమును పాలయందుగలిపి సేవించిన అపస్మారము శమించును. (చ-చి-అ-10.)

2. ఉదరమునందు మండూకపర్ణి ప్రయోగము.

"త్రివృన్మండూకపర్ణ్యాశ్చ శాకం స్వరసోదక సాధితం ।
నిరమ్లలవణస్నేహం స్విన్నస్విన్న మనన్నభుక్ ।
మాసమేకం తతశ్చైవ తృషిత స్స్వరసం పిబేత్ "॥

తెగడ, మండూకపర్ణి వీనియొక్క పత్రములను వీని స్వరసముతోను జలముతోను అమ్లలవణస్నేహ వర్జితముగ పలుమారు ఉడికించి శాకముగాజేసి యొక మాసము నిరన్నాహారుడై సేవింపుచు దప్పికకలిగిన పైవాని స్వరసమునే పానము జేయుచుండిన ఉదరరోగము శమించును. (చ-చి-అ-13.)

3. రసాయనార్థమై బ్రాహ్మీ ప్రయోగము.

"హృతదోష ఏవాగారం ప్రవిశ్య ప్రతిసంసృష్ట భక్తో బ్రాహ్మీస్వరసమాదాయ సహస్రసంపాతాభిహుతం కృత్వా యథాబల ముపయుంజీత । జీర్ణౌషధశ్చాపరాహ్ణే యవాగూమలవణాం పిబేత్ । క్షీరసర్పిర్భ్యాం వా పయసా భుంజీత । ఏవం సప్తరాత్రముపయుజ్య బ్రహ్మవర్చసీ మేధావీ భవతి, ద్వితీయం సప్తరాత్ర ముపయుజ్య గ్రంథమీప్సిత ముత్పాదయతి । నష్టంచాస్య ప్రాదుర్భవతి । తృతీయం సప్తరాత్రముపయుజ్య ద్విరుచ్చారితం శతమప్యవధారయతి । ఏవమేకవింశతి రాత్రముపయుజ్య అలక్ష్మీః అపకర్షతి । మూర్తిమతీ చైనం వాగ్దేవీ అను ప్రవిశతి । సర్వాశ్చైనం శ్రుతయః ఉపతిష్ఠంతి" ॥

ఊర్ధ్వాధశ్శోధనము జేసికొని సంసర్జనక్రియ నాచరించి పిమ్మట రసాయన సేవకై యథావిధిగ నిర్మింపబడిన గృహమును ప్రవేశించి మంత్రపూతమైన బ్రాహ్మీ స్వరసమును యథాబలముగ పానము జేయవలెను. ఇది జీర్ణమైన పిమ్మట నపరాహ్ణ కాలమున లవణవర్జితముగు యవాగును ఆహారముగ దీసికొనవలెను. క్షీరసాత్మ్యుడైనచో క్షీరమును జేర్చి యవాగును దీసికొనవలెను ఈవిధముగ నేడుదినములు ఆచరించిన బ్రహ్మవర్చస్సును, మేధాశక్తియు గలవాడగును. పదునాలుగు రోజులాచరించిన గ్రంథములను రచించుశక్తిగల వాడగును. ఇదివరకు నశించినట్టివి తిరిగి గలుగును. ఇరువదియొక దినము లాచరించిన నూరుమాటలను రెండుమార్లుచ్చరింపగనే గ్రహింపగల సమర్థుడగును. లక్ష్మీ సంపన్నుడై మూర్తిమంతమగు వాగ్దేవిని వశపరచుకొన గలుగును. సర్వశ్రుతి సంపన్నుడై విరాజిల్లును. (సు-చి-అ-28.)

4. రసాయనార్థమై మండూకపర్ణీ ప్రయోగము.

"హృతదోష ఏవ ప్రతిసంసృష్టభక్తః యథాక్రమ మాగారం ప్రవిశ్య మండూకపర్ణీ స్వరసమాదాయ సహస్రసంపాతాభిహుతం కృత్వా యథాబలం పయసా ఆలోడ్య పిబేత్ పయోఽనుపానం వా। తస్మిం జీర్ణే యవాన్నం పయసా ఉపయుంజీత, తిలైర్వా సహ భక్షయిత్వా త్రీన్ మాసాన్ పయోఽనుపానం । జీర్ణే పయః సర్పిరోదన ఇత్యాహారః । ఏవముపయుంజన్ బ్రహ్మవర్చసీ శ్రుతనిగాదీ భవతి, శతవర్షమాయురవాప్నోతి। త్రిరాత్రోపోషితశ్చ త్రిరాత్ర మేనాం భక్షయేత్ । త్రిరాత్రమూర్ధ్వం పయః సర్పిః ఇతిచోపయుంజీత। బిల్వమాత్రం పిండం వా పయసాఽఽలోడ్య పిబేత్। ఏవం దశరాత్రముపయుజ్య మేధావీ వర్షశతాయుర్భవతి॥"

ఊర్ధ్వాధశ్శోధనము జేసికొని సంసర్జన క్రియనాచరించి రసాయన సేవకై యథావిధిగ నిర్మింపబడిన గృహమును బ్రవేశించి మంత్రపూతమైన మండూకపర్ణీస్వరసమును యథాబలముగ పాలతో గలిపి పానముచేసి పాలనే యనుపానముగా సేవించి యిది జీర్ణమైన పిమ్మట యవాన్నమును పాలతో గలిపి యాహారముగా దీసికొనవలెను. (లేక) మండూక పర్ణీస్వరసమునందు తిలలనుజేర్చి సేవించి పాలను అనుపానముగా దీసికొని జీర్ణమైన పిమ్మట పాలు నెయ్యి వీనితో జేర్చి యన్నమును భుజించవలెను. ఇట్లు మూడుమాసములు సేవించిన బ్రహ్మవర్చస్సు గలిగి శ్రుతిసంపన్నుడై నూరువర్షములు

జీవింప గలవాడగును. మరియు మూడుదినములు నిరాహారుడై మండూక పర్ణీకల్కమును బిల్వప్రమాణమున పాలయందు గలిపి సేవించి పిమ్మట పాలు నెయ్యి వీనితో జేర్చిన యాహారమును దీసికొనవలెను. ఇటుల పదిదిన ములు ఆచరించిన మేధాసంపన్నులై నూరువర్షములు జీవింపగలుగును.
(సు-చి-౨-28.)

5. ఉన్మాదమునందు బ్రాహ్మీ ప్రయోగము.
"బ్రాహ్మీరసాదష్టాంశే......స్వరాః
ఉన్మాదంకృతాః దృష్టాః పృథగేతే కుష్ఠ మధుమిశ్రాః॥"

బ్రాహ్మీస్వరసమునందు చంగల్వకోష్ఠు చూర్ణమును తేనెను గలిపి సేవించిన నిశ్చయముగ నున్మాదము శమించును. (చ-క.)

6. మసూరికయందు బ్రాహ్మీ ప్రయోగము.
"సక్షౌద్రం పాయయేత్ బ్రాహ్మ్యాః రసం"॥

బ్రాహ్మీస్వరసమునకు తేనెజేర్చి సేవించిన మసూరిక శమించును.
(వం-సే.)

7. పిటికయందు మండూకపర్ణి ప్రయోగము.
"రసో మండూకపర్ణ్యాస్తు ప్రలేపాత్ పిటికామయం।
.........................సంప్రణాశయేత్"॥

మండూకపర్ణి స్వరసమును లేపనముజేసిన పిటిక శమించును. (గ-ని.)

8. అశ్మరియందు బ్రాహ్మీప్రయోగము.

"శ్వదంష్ట్రా యష్టికా బ్రాహ్మీకల్కం వాఽక్షసమం పిబేత్"4

పల్లేరు యష్టిమధుకము, బ్రాహ్మీపత్రము వీని కల్కమును అక్ష ప్రమాణము సేవించిన అశ్మరి శమించును. (సు-చి-అ-7.)

(6) యోగములు:—

1. బ్రాహ్మీఘృతము-(వా-ఉ-ఉన్మాద.) మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—ఉన్మాదము, కుష్ఠము, అపస్మారము, వంధ్యాత్వము ఇవి శమించును. వాక్కు, స్వరము, స్మృతి, మేధ యివి గలుగును.

2. మండూకపర్ణ్యాది రసాయనము.-(వా - ఉ-రసాయన.) మాత్ర:- యథాబలం.

ఉపయోగములు:—సర్వరోగములు శమించును. ఆయుష్యము, బలము, వర్ణము, జాతరాగ్ని, స్వరము, మేధాశక్తి యివి వృద్ధిబొందును.

3. సారస్వతారిష్టము-(భైషజ్య-రసాయన.) మాత్ర:-1 ఔన్సు.

ఉపయోగములు:—ఆయుష్యము, వీర్యము, ధృతి, మేధ, బలము, కాంతి యివి వృద్ధిపొందును. వాక్శుద్ధి గలుగును. హృద్యము, రసాయనము, ఓజస్యము, స్మృతికరము, రజోదోషము, శుక్రదోషము, అధ్యయన గీతాదిజ శోష ఇవి శమించును.

(7) Actions and uses:—An alterative tonic, Diuretic and local stimulant. It has a special influence on the urino-genital tract. It sets up urinary and ovarian irritation and itching over the whole body.

Khory P. 263.

## స్వానుభవము

మోతాదు:— పచ్చిసరస్వతియాకు $\frac{1}{4}$ తులము మొదలు 1 తులమువరకు తెచ్చి చింతపండుతోగాని నిమ్మకాయరసముతోగాని కలిపి ఉప్పు మున్నగునవికలిపి పచ్చడిగా తయారుజేసి తినవలయును.

స్వరసము 1 చెంచాడు మొదలు $\frac{1}{2}$ ఔన్సువరకు తేనెతో కలిపి తీసుకొనవచ్చును. తేచా యెండినయాకునకు ఎనిమిదిరెట్లు నీళ్లుబోసి కషాయము కాచి $\frac{1}{2}$ ఔన్సు మొదలు 2 ఔన్సుల వరకు తీసికొనవలెను.

తేయాకును పానీయముగా తయారుచేయునట్లు ఎండిన ఆకులో ఉడుకుచున్న నీళ్లుపోసి తరువాత వడగట్టి అందులో పాలు చక్కెర జేర్చి తీసుకొనవలెను.

ఈయాకుతో ఘృతమునుగాని పానకమునుగాని తయారు జేసి $\frac{1}{4}$ తులము తీసుకొనునది.

గుణము:— కొంచెముగా మూత్రమును జారీ చేయును. బుద్ధి వర్ధకము.

ఉపయోగములు:- చదువుట; ఆలోచనమున్నగు మెదడుకు సంబంధించిన పని జేసినతరువాత మెదడుకు అలసటకలిగినప్పుడు దీనిని తరచుగ ఉపయోగింతురు. మరియు జ్ఞాపకశక్తి తగ్గినవారలకు మంచిరసాయనము. మాటలు సరిగా రానివారికి వాక్కును అభివృద్ధిజేయుననియు, కవిత్వముజెప్పుశక్తి పెంపొందించుననియు అష్టకవీయమను గ్రంథములో జెప్పబడియున్నని. అపస్మారము ఉన్మాదము మున్నగు మనోవ్యాధులన్నిటిలోను, ఉపయోగింపబడుచున్నది. (ఆ. ల.)

---

# 135

## బిల్వః – మారేడుచెట్టు

### భాషాంతర నామములు

హింది – బేల. మరాఠి – బేల. గుజరాతి–బీలీ. మలయాళం–కువళం. కర్ణాటకం – బిల్వ. ద్రావిడం – విల్వం.

### నైసర్గిక స్వరూప వర్ణనము

### Natural Order—Rutaceae

నారింజ కుటుంబము

## మారేడుచెట్టు - Aegle Marmelops

( ప్రథమ భాగమున 268_వ, పుట చూడుము )

## పర్యాయ పదములు

శ్లో॥ బిల్వః శాండిల్య శైలూషౌ మాలూర శ్రీ ఫలావపి ॥

బిల్వము, శాండిల్యము, శైలూషము, మాలూరము, శ్రీఫలము, అనునవి బిల్వనామములు.

## బిల్వ గుణములు

శ్లో॥ శ్రీఫలస్తువర స్తిక్తః గ్రాహీ రూక్షో ఽగ్నిపిత్తకృత్ ॥
వాతశ్లేష్మ హరో బల్యో లఘురుష్ణశ్చ పాచనః ॥

మారేడుచెట్టు కషాయరసమును, తిక్తానురసమును, రూక్షలఘుగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమమును పాకముజేయును. బలమును గలిగించును. పిత్తమును వృద్ధిబొందించును. వాతశ్లేష్మములను శమింపజేయును.

## ఆమబిల్వఫల గుణములు

శ్లో॥ బాలం బిల్వఫలం గ్రాహీ దీపనం పాచనం కటు ।
కషాయోష్ణం లఘుస్నిగ్ధం తిక్తం వాతకఫాపహం॥

మారేడుకాయ కటురసమును, కషాయతిక్తానురసములను, లఘుస్నిగ్ధగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. ఆమమును పాకముచేయును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. వాతకఫములను శమింపజేయును.

## పక్వబిల్వ ఫలగుణములు

శ్లో॥ పక్వం గురు త్రిదోషం స్యాత్ దుర్జరం పూతిమారుతం ॥

మారేడుపండు గురుగుణమును గలిగి యుండును. కష్టముగ జీర్ణమగును. అపానవాతమునకు దుర్గంధమును గలిగించును. త్రిదోషములను వృద్ధిబొందించును.

## బిల్వపేశికా గుణములు

శ్లో॥ గ్రాహిణీ కఫవాతామశూలఘ్నీ బిల్వపేశికా॥

మారేడుకాయలోని గుజ్జు కఫవాతములను శమింపజేయును. గ్రాహిణిని, ఆమదోషమును, శూలను బోగొట్టును.

## విశేషాంశములు

**(1) ప్రసిద్ధనామములు:—**

(క) పరిచయబోధకములు:—శ్రీఫలము, (మాంగల్య-త్రిశిఖ, మహాఫల, శివేష్ట, పత్రశ్రేష్ఠ, త్రిపత్ర, గంధపత్ర, గంధఫల, సదాఫల, కంటకాఢ్య. పీతఫల)

(ఖ) గుణబోధకములు:—బిల్వము, (పూతివాత. శల్య, హృద్యగంధ.)

**(2) శబ్దార్థములు:—**

శ్రీఫలము- లక్ష్మీదేవికి యిష్టమగు ఫలములను గలది. (లేక) లక్ష్మిని గలిగించునట్టి ఫలములనుగలది. మాంగల్య-మంగళకరమగునది. త్రిశిఖ-త్రిపత్ర-త్రిశూలమువలె మూడు మూడు చొప్పున గలిసి యున్నట్టి పత్రములనుగలది. మహాఫల - పెద్దవియగు ఫలములను గలది. శివేష్ట-ఈశ్వరునికి యిష్టమగు పత్రములనుగలది. పత్రశ్రేష్ఠ - శ్రేష్ఠములగు పత్రములను గలది. గంధపత్ర-పరిమళము తోగూడిన పత్రములను గలది. గంధఫల-పరిమళముగల కాయలనుగలది. సదాఫల-ఎల్లప్పుడును కాయలతో గూడియుండునది. కంటకాఢ్య విశేషముగ ముండ్లను గలిగి యుండునది. పీతఫల - పసుపుపచ్చగనుండు ఫలములను గలది. బిల్వము - వ్యాధులను బోగొట్టునది. పూతివాత - వాతమునను పూతిగంధ (దుర్గంధ)మును గలిగించునట్టి పండ్లను గలది. శల్య - శల్యమువలె కంటకములతో శరీరమును బాధించునది. హృద్యగంధ - పరిమళముతో హృదయమునకు హితమైనది.

N. B: -ఇది యెత్తుగా బెరుగు వృక్షజాతులలో నుత్పత్తిగలిగి దశమూలములం దొకటిగా గణింపబడు చున్నది. మరియు "బిల్వంసంగ్రాహక దీపనీయ వాతకఫ ప్రశమనానాం" (చ-సూ-అ-27.) ఇది మలాదులను నిరోధించునట్టియు, జాఠరాగ్నిని వృద్ధిబొందించునట్టియు, వాతకఫములను శమింప

జేయు నట్టియు ద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగ నెంచబడుచున్నది. ఈ వృక్షమెల్ల చోటుల నుత్పత్తి యగుచుండును. ఇది ఈశ్వర ప్రియాకర మగుటచే విశేషముగా దీనిని శివాలయారామములందు పెంచుచుందురు. దీనికి వాడియగు ముండ్లుండును. పత్రములు మూడు మూడు చొప్పున గలిసియుండి మిగుల పరిమళమును గలిగి యుండును. కాయలలో గొన్ని వెలగకాయలంతయు, మరికొన్ని యంతకన్న హెచ్చుగు పెద్దవిగను నుండును. మరియు గొన్ని యండాకారముగను, మరికొన్ని గుండ్రముగను నుండును. మ్రాను కొంచెము గోవర్ణము గలిగియుండును.

వ్యవహారములో దీని పత్రములను విశేషముగా నీశ్వరార్చనకై యుపయోగించుదురు. వీనితో నీశ్వరుని నెంత హెచ్చుగ బూజించిన యంత త్వరితముగ భక్తులపై ప్రేమగలిగి వారికి మోక్షమును గలిగించునని వేదములందు వర్ణింపబడినది. ఇందుచేతనే యీశ్వరుని యథాశక్తిగ లక్షపత్రములతో గాని, కోటిపత్రములతో గాని భక్తులు యథావిధిగ బూజించుట వాడుకలో గలదు. బాగుగా పండిన ఫలములను సంపాదించి గృహములందు సమంత్రముగ విభూతినుంచి దానిని త్రిసంధ్యలందు ధరించుచుందురు. ఇటుల జేయుటవలన మంగళప్రదమనియు, భూతగ్రహాదులవలన నెట్టి బాధలును గలుగవనియు సిద్ధాంతము.

ఇటుల బిల్వవృక్షము మిగుల మంగళప్రదమనియు, మోక్షదాయకమనియు, ఇందుచే దీని నెల్లప్పుడును సేవింపవలెననియు వేదాదులందు వర్ణింపబడినది.

వైద్యమునందు దీని ప్రతి యంగమునకును బ్రయోగము కలదుగాని విశేషముగా మూలమునకు బ్రయోగమున్నట్లు గానబడును. ఇది వాతశ్లేష్మహరమని జెప్పబడినను దశమూలములలోని మిగిలిన ద్రవ్యములతో జేరినప్పుడు త్రిదోషహరమే యగును. అయితే దీని పచ్చికాయలకే ప్రయోగము గలదు గాని పండుకాయకు నిషిద్ధము జెప్పబడినది.

(3) విశేషగుణములు:—

(క) మధురరసమును, కషాయానురసమును, గురుగుణమును గలిగి యుండును. హృదయమునకు హితమైనది. రుచిని బుట్టించును. పిత్తకఫములను శమింపచేయును. జ్వరమును, అతీసారమును బోగొట్టును. (రా. ని.)

(ఖ) ఆమఫలము - అమ్లరసమును, తీక్ష్ణగుణమును కలిగి యుండును. (ధ-ని.) శూల, ఆమవాతము, గ్రహణి, అతీసారము వీనిని బోగొట్టును. ని-ర.)

(గ) తరుణఫలము - కషాయరసమును, అమ్లకటుకానురసములను, స్నిగ్ధ తీక్ష్ణ, లఘుగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమమును పాకముజేయును. హృదయమునకు హితమైనది, కఫవాతములను శమింపజేయును. (ని-ర.)

(ఘ) పక్వఫలము - మధురానురసమును గలిగియుండును. విదాహమును గలిగించును విష్టంభమును జేయును. దోషములను బోగొట్టును, (ధ-ని.) కటుతిక్తకషాయానురసములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. త్రిదోషములను శమింపజేయును. (రా-ని.) అగ్నిమాంద్యమును గలిగించును. (ని-గ.)

(చ) కాంజికసబిల్వఫలము - జాఠరాగ్నిని వృద్ధిబొందించును. హృదయమునకు హితమైనది. రుచినిబుట్టించును. ఆమవాతమును బోగొట్టును (ని-ర.)

(ఛ) పుష్పము-అతీసారమును, తృష్ణను, వాంతిని బోగొట్టును. (ని-ర.

(జ) పత్రము - మలాదులను నిరోధించును. రుచినిబుట్టించును. కఫవాతములను శమింపజేయును. ఆమదోషమును, శూలను బోగొట్టును (ని-ర.)

(ఝ) మూలము - మధురరసమును, లఘుగుణమును గలిగియుండును. త్రిదోషములను శమింపజేయును. ఛర్దిని బోగొట్టును. (ధ-ని) శూలను మూత్రకృఛ్రమును బోగొట్టును. (ని-ర.)

(ట) మజ్జాభవతైలము - ఉష్ణవీర్యమును గలిగియుండును. విశేషముగా వాతమును శమింపజేయును. (ని-ర.)

(4) ఆమ-శుష్క-బిల్వఫలములకు గుణాధిక్యతానిరూపణము:—

"ఫలేషు పరిపక్వం యత్ గుణవత్తదుదాహృతం।
బిల్వాదన్యత్ర విజ్ఞేయం ఆమం తద్ధి గుణాధికం ॥
దాడిమాబిల్వ శివాదీనాం ఫలం శుష్కం గుణాధికం" ॥

ఫలములలో బాగుగా బండినవి మిగుల గుణదాయకములగును. కాని మారేడుకాయలలో పచ్చివి మాత్రము గుణాధిక్యమును గలిగి యుండును. అనగా బిల్వఫలము అని ప్రయోగించినప్పుడు పండునకు బదులు పచ్చికాయనే

గ్రహించవలెనని దెలియనగును. మరియు ద్రాక్షపండు, మారేడుకాయ, కరకకాయ యివి యెండినచో మిగుల గుణదాయకములగును. (భా-ప్ర.)

(5( ప్రయోగములు:—

1. ఆర్శోరోగమునందు బిల్వ ప్రయోగము.

"సుఖోష్ణే । తం శూలార్త ముపవేశయేత్ "॥

అర్శోరోగికి అభ్యంగముజేసి సుఖోష్ణముగనుండు బిల్వకషాయము నందు అవగాహస్వేదము జేసిన శూల శమించును. (చ-చి-అ-9.)

2. ప్రవాహికయందు బిల్వ ప్రయోగము.

"కల్కః స్యాత్ బాలబిల్వానాం తిలకల్కశ్చ తత్సమః ।
దధ్నః సరోఽమ్లస్నేహాఢ్యః ఖడోహన్యా త్ప్రవాహికాం "॥

మారేడుపిందెల కల్కము, తిలకల్కము వీనిని సమభాగములుగ గ్రహించి పెరుగుమీదితేట, అమ్లరసద్రవము వీనియందుజేర్చి ఖడపాకము జేసి అందు ఘృతమునుజేర్చి సేవించిన ప్రవాహిక శమించును. (చ-చి-అ10.)

3. అతీసారమునందు బిల్వ ప్రయోగము.

"బిల్వమధ్యం సమధుకం శర్కరాక్షౌద్ర సంయుతం ।
తండులాంబుయుతో యోగఃపిత్తరక్తాతీసం జయేత్ "॥

మారేడుకాయలోనిగుజ్జు, యష్టిమధుకచూర్ణము, చక్కెర, తేనె వీని నొకటిగా గలిపి బియ్యపుకడుగుతో సేవించిన పిత్తరక్తజాతీసారము శమించును. (సు-చి-అ-40 )

4. శరీరదౌర్గంధ్యమునందు బిల్వ ప్రయోగము.

"బిల్వపత్రరసై ర్వాపి గాత్ర దౌర్గంధ్య నాశనః "॥

మారేడుపత్రముల స్వరసమును శరీరమునకు బూసుకొనిన దౌర్గంధ్యము శమించును. (చ-ద.)

5. గ్రహణియందు బిల్వ ప్రయోగము.

"శ్రీఫలశలాటుకల్కో నాగరచూర్ణేన మిశ్రితః సగుడః ।
గ్రహణీగదమత్యుగ్రం తక్రభుజా శీలితో జయతి "॥

మారేడుకాయల కల్కమునందు శుంఠిచూర్ణమును జేర్చి బెల్లముతో గలిపి తీసికొనుచు, తక్రముతో జేర్చిన యాహారమును సేవించుచుండిన అత్యుగ్రమగు గ్రహణీవ్యాధి శమించును. (చ-ద.)

6. శోథయందు బిల్వప్రయోగము.

"బిల్వపత్రరసం పూతం సోషణం శ్వయథౌ త్రిజే,
పిత్తరోగే చైవ దుర్నామ్ని విదధ్యాత్కామలాస్వపి॥"

బిల్వపత్రకషాయమునందు త్రికటుచూర్ణమును జేర్చి సేవించిన త్రిదోషజ శోథ శమించును. మరియు మలబంధము, అర్శస్సు, కామిల, ... శమించును. (చ-ద.)

7. బాధిర్యమునందు బిల్వప్రయోగము.

"ఫలం బిల్వస్య మూత్రేణ పిష్ట్వా తైలం విపాచయేత్,
సాజక్షీరం తద్ధరేద్బాధిర్యం కర్ణపూరణే॥"

మారేడుకాయలను గోమూత్రముతో నూరి కల్కముగా జేసి తిల తైలము, మేకపాలు వీనియందు జేర్చి తైలపాకవిధి ననుసరించి పాకముజేసి కర్ణపూరణము జేసిన బాధిర్యము శమించును. (చ-ద.)

8. ఆమశూలయందు బిల్వ ప్రయోగము.

"గుడేన భక్షయేద్బిల్వం రక్తాతీసారనాశనం।
ఆమశూల విబంధఘ్నం కుక్షిరోగ హరంపరం"॥

మారేడుకాయల చూర్ణమును బెల్లముతో జేర్చి సేవించిన రక్తాతీసారము, ఆమశూల, విబంధము, కుక్షిరోగమును శమించును. (భా-ప్ర.)

9. శిశువులకుజనించు ఛర్ద్యతీసారములందు బిల్వ ప్రయోగము.

"బిల్వమూలకషాయేణ లాజాశ్చైవ సశర్కరాః॥
ఆలోడ్య పాయయేద్బాలం ఛర్ద్యతీసారనాశనం"॥

మారేడువేరు కషాయమునందు పేలాలచూర్ణమును చక్కెరను జేర్చి యిచ్చిన శిశువులకుజనించు ఛర్ది, అతీసారమును శమించును. (వం-సే.)

10. రసాయనమునకు బిల్వ ప్రయోగము.

"త్వచం బిల్వస్య మూలస్య మూలక్వాథం దినే దినే ।
ప్రాశ్నీయాత్ పయసా సార్థం స్నాత్వాహుత్వా సమాహితః ।
దశసాహస్రి మాయుష్యం స్మృతం యుక్తరథం భవేత్ "॥

మారేడువేరుపట్ట చూర్ణమును మూలక్వాథమునందు గలిపి పాలతో ప్రతిదినమున యథావిధిగ స్నానమును, హోమాదులను నాచరించి సేవించు చుండిన పదివేల వత్సరముల ఆయువుగలవాడగును. (సు-చి-అ28.)

(6) యోగములు:—

1. బిల్వాదితైలము - (వా-హృద్రోగ.)

ఉపయోగములు:—నస్య,పాన, వస్తిరూపముగ నుపయోగింపవలెను. హృద్రోగము శమించును.

2. బిల్వతైలము - (భైషజ్య-గ్రహణి.) మాత్ర:-½ ఔన్స.

ఉపయోగములు:—అగ్నిమాంద్యము, గ్రహణి, అతీసారము, అరుచి, సంగ్రహగ్రహణి, అర్శస్సు, క్షీపదము, అంత్రవృద్ధి, శోథ, జ్వరము, కాస, శ్వాస, గుల్మము, పాండు, మకి,-ల్లకూ, మూత్రకృచ్ఛ్రరోగము, మూఢగర్భము శిరోరోగము, యోనిరోగము, శుక్రదోషము, మూఢవాతము, వంధ్యాత్వము, ఇవి శమించును.

3. బిల్వాదిచూర్ణము - (భైషజ్య-వృద్ధి.) మాత్ర:-½ తులం.

ఉపయోగములు:—బ్రధ్నము శమించును.

4. బిల్వాంజనము-(భైషజ్య-నేత్రరోగ.)

ఉపయోగములు:—అంజనము వేసిన అభిష్యందము, అధిమంథము, రక్తస్రావము ఇవి శమించును.

5. బిల్వాదిలేహ్యము-(బ-రా-పిత్తరోగ.)మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—ఛర్ది, హృద్రోగము, కామిల, గుల్మము, గ్రహణి, అరుచి, పీనసము, హిక్క, కాస, క్రిమిరోగము, శ్వాస, ప్లీహాభివృద్ధి, ఆనాహము, కృత్రిమవిషము, అర్శస్సు, పాండు, ఇవి శమించును.

6. బిల్వాదికషాయము - (చ-చి-జ్వర.) మాత్ర:-1 పలం.

ఉపయోగములు:—వాతజ్వరము శమించును.

7. బిల్వాదిగుటిక-(సహస్రయోగ-గుటికాప్రకరణ.) మాత్ర:-5యవలు.

ఉపయోగములు:—అంజనపాన నస్యములుగ నుపయోగించిన స్థావర జంగమవిషములు, విషూచిక, అజీర్ణము, గరవిషము, జ్వరము, అపస్మారము, ఇవి శమించును.

---

# 136

# బృహతీ - పెద్దములక (క)

---

## భాషాంతర నామములు

హింది- మలయాలం- చెరువఝతిన. కర్ణాటకం-హేగ్గులు. ద్రావిడం- చెరువఝతిసై.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## (Natural Order—Solanaceae)

వంగ కుటుంబము

పెద్దములక - Solanum Xantho-Carpum.,

(ప్రథమ భాగమున 67-వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ వార్తాకీ క్షుద్రభంటాకీ మహతీ బృహతీ కులీ ।
హింగులీ రాష్ట్రికా సింహీ మహోటీ దుష్ప్రధర్షిణీ॥

వార్తాకి, క్షుద్రభంటాకి, మహతి, బృహతి, కులి, హింగులి, రాష్ట్రిక సింహి, మహోటి, దుష్ప్రధర్షిణి యనునవి బృహతి నామములు.

## బృహతీ గుణములు

శ్లో॥ బృహతీ గ్రాహిణీ హృద్యా పాచనీ కఫవాతహృత్।
కటుతిక్తాస్య వైరస్య మలారోచక నాశనీ॥
ఉష్ణా కుష్ట జ్వర శ్వాస శూల కాసాఽగ్నిమాంద్యజిత్॥

పెద్దములక కటురసమును, తిక్తానురసమును, ఉష్ణవీర్యమును కలిగి యుండును. మలమును నిరోధించును. హృదయమునకు హితమైనది. ఆమమును పచింపజేయును. కఫవాతములను శమింపజేయును. ముఖవైరస్యము, ముఖమలము, అరుచి, కుష్ఠము, జ్వరము, శ్వాస, శూల, కాస, అగ్నిమాంద్యము, అను నీవ్యాధులను బోగొట్టును.

## శ్వేతబృహతీ - తెల్లపెద్దములక (ఖ)

శ్లో॥ శ్వేతాక్షుద్రా చంద్రహాసా లక్ష్మణా క్షుద్రదూతికా,
గర్భదా చంద్రభా చంద్రా చంద్రపుష్పా ప్రియంకరీ॥

శ్వేతక్షుద్ర చంద్రహాస, లక్ష్మణ, క్షుద్రదూతిక, గర్భద, చంద్రభ, చంద్ర, చంద్రపుష్ప, ప్రియంకరి, యనునవి శ్వేతబృహతీ నామములు.

## శ్వేతబృహతీ గుణములు

శ్లో॥ తద్వత్ప్రోక్తా సితా క్షుద్రా విశేషాద్గర్భకారిణీ।

తెల్లపెద్దములక సామాన్యములకయొక్క గుణములనే కలిగియుండును. విశేషముగా గర్భధారణశక్తిని కలిగించును.

## కంటకారీ - చిన్నములక - లేక (వాకుడు) (గ)

శ్లో॥ కంటకారీ తు దుస్పర్శా క్షుద్రా వ్యాఘ్రీ నిదిగ్ధికా।
కంటారికా కంటకినీ ధావనీ బృహతీ తథా॥

కంటకారి, దుస్పర్శ, క్షుద్ర, వ్యాఘ్రి, నిదిగ్ధిక. కంటారిక, కంటకిని, ధావని, బృహతి యనునవి కంటకారీ నామములు.

## కంటకారీ గుణములు

శ్లో॥ కంటకారీ సరా తిక్తా కటుకా దీపనీ లఘుః।
రూక్షోష్ణా పాచనీ కాస శ్వాస జ్వర కఫానిలాన్।
నిహంతి పీనసం పార్శ్వపీడా కృమి హృదామయాన్॥

వాకుడు తిక్తరసమును, కటుకానురసమును, సర లఘు రూక్ష గుణము లను, ఉష్ణవీర్యమును గలిగియుండును, జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమ మునుపచింపజేయును. కఫవాతములను శమింపజేయును. కాస, శ్వాస, జ్వరము, పీనసము, పార్శ్వపీడ, కృములు, హృద్రోగము, అనునీవ్యాధులను బోగొట్టును.

## వృంతాకం - వంగచెట్టు (సామాన్యము) (ఘ)

శ్లో॥ వృంతాకం స్త్రీ తు వార్తాకుః భంటకీ భంటకాపి చ॥

వృంతాకము, వార్తాకువు, భంటాకి, భంటక యనునవి సామాన్య వృంతాక నామములు.

## వృంతాక గుణములు

శ్లో॥ వృంతాకం స్వాదు తీక్ష్ణోష్ణం కటుపాకమపిత్తలం।
జ్వరవాతబలాసఘ్నం దీపనం శుక్రలం లఘు॥

వంగచెట్టు మధురరసమును, తిక్తానురసమును, లఘుగుణమును, ఉష్ణ వీర్యమును, కటువిపాకమును, గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. శుక్రవృద్ధి జేయును. కొద్దిగ పిత్తమును వృద్ధిబొందించును. వాతకఫములను శమింపజేయును. జ్వరమును బోగొట్టును.

## శ్వేతవృంతాకం - తెల్లవంగచెట్టు (చ)

శ్లో॥ అపరం శ్వేతవృంతాకం కుక్కుటాండసమం భవేత్॥

తెల్లవంకాయ కుక్కుటాండముతో సమమైన ఆకృతిని వర్ణమును గలిగి యుండును.

## శ్వేతవృంతాక గుణములు

శ్లో॥ తదర్శస్సు విశేషేణ హితం హీనం చ పూర్వతః॥

తెల్లవంగ సామాన్యవంగకంటె హీనమైన గుణములను గలిగియుండును. ఇది యర్శోరోగమున హెచ్చుగ హితమగును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరియబోధకములు:—(బృహతి) - దుష్ప్రధర్షణి, కంటతను, కంటఫల, వనవృంతాకి, సింహి. (శ్వేతబృహతి) - చంద్రపుష్ప, శ్వేతఫల. (కంటకారి) - దుష్పర్శ, వ్యాఘ్రి, కంటకిని, బహుకంట, క్షుద్రఫల. (వృంతాక) - మహాబృహతి, శాకబిల్వ, కంటపత్రిక, కంటఫల, మాంసలఫల, మిశ్రవర్ణఫల, నీలఫల, నృపప్రియఫల, రక్తఫల, వృత్తఫల, శాకశ్రేష్ఠ.

(ఖ) గుణబోధకములు:—(బృహతి)-వార్తాకి. (శ్వేతబృహతి)-గర్భద. (కంటకారి) - కాసఘ్ని.

(2) శబ్దార్థములు:—

దుష్ప్రధర్షణి - కష్టముగ గ్రహింపదగినది. కంటతను - అన్ని భాగములందు ముండ్లతో నిండియుండునది. కంటఫల - విశేషముగ కాయలందు ముండ్లనుగలది. సింహి - ముండ్లచే సింహమువలె భయమును గలిగించునది. వనవృంతాకి - అడవివంగయని వ్యవహరింపబడునది. చంద్రపుష్ప - తెల్లని పుష్పములనుగలది. శ్వేతఫల - తెల్లని కాయలను గలది. దుష్పర్శ- తాకశక్యము కానిది. వ్యాఘ్రి - పులిగోళ్ళవంటి ముండ్లనుగలది. కంటకిని - ముండ్లుకలది. బహుకంట - హెచ్చుగ ముండ్లచే వ్యాప్తమైనది. క్షుద్రఫల - బృహతికంటె చిన్నవియగు ఫలములనుగలది. మహాబృహతి - బృహతికంటె పెద్దవియగు కాయలనుగలది. శాకబిల్వ - మారేడుకాయలతో సమానమై శాకమున కుపయోగించు కాయలనుగలది. కంటపత్రిక - ఆకులయందు ముండ్లుగలిగినది. మాంసలఫల - విశేషముగ గుజ్జుగల ఫలములనుగలది. మిశ్రవర్ణఫల - రెండు మూడు వర్ణములుగలసిన వర్ణముగల ఫలములను గలది. నీలఫల - నీలవర్ణముగల ఫలములను గలది. నృపప్రియఫల - రాజుల కిష్టమైనట్టి ఫలములనుగలది. రక్తఫల - ఎఱ్ఱని వర్ణముగల ఫలములను గలది. వృత్తఫల - గుండ్రముగనుండు ఫలములనుగలది. శాకశ్రేష్ఠ-ఫలశాకములలో శ్రేష్ఠమైనది. వార్తాకివ్యాధులు లేకుండ చేయునది. గర్భద-గర్భధారణశక్తిని గలిగించునది. కాసఘ్ని - కాసమును బోగొట్టునది.

(3) భేదములు:—

ఇది గ్రామ్య, అరణ్యభేదముచే రెండువిధములుగా నుండి, క్షుపజాతులలో నుత్పత్తిగలిగి, దశమూలాంతర్గతమై ఫలశాకవర్గములోజేరి వాతకఫహర ద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగా చెప్పబడుచున్నది. అందు గ్రామ్యము వంగ యనియు, అరణ్యము ములకయనియు ఆంధ్రమున వ్యవహరింప బడుచున్నవి. వీనిలో నారణ్యము ఔషధములందును, గ్రామ్యము శాకములందును గ్రహింపబడుచున్నవి. అయితే అరణ్యముకూడ శాకములందును, గ్రామ్యముకూడ నౌషధములందును ప్రయోగింపబడక పోవుటలేదు. కాని విశేషముగ మొదట నుదహరించినట్టి ప్రయోజనములను గలిగి యున్నట్లుగా దెలియగలదు వీనిలో గ్రామ్యమగు వంగలో వర్ణభేదమునుబట్టి, ప్రమాణమును బట్టియు, ముండ్లను బట్టియు నిట్టుల ననేక భేదములు గలవు. పై నుదహరింపబడిన పదములనుబట్టి నీలవర్ణము, మిశ్రవర్ణము, రక్తవర్ణము, శ్వేతవర్ణము అని యిట్లు వర్ణభేదము లున్నట్లు దెలియగలదు. కాని నీలవర్ణమును, శ్వేతవర్ణమును గల వంగకాయలే విశేషముగా గానుపించును. ఈ శ్వేతవర్ణము గూడ సకృత్తుగానే అంత స్వచ్ఛముగా నుండునుగాని, శ్వేతముతో మిశ్రమైన పచ్చని వర్ణమే హెచ్చుగా గానుపించును. ఈ వర్ణముగల కాయలు గుండ్రముగా నుండును. ముచికలయందు చిన్న చిన్న ముండ్లుండును. వీని యాకులందు గూడ ముండ్లుండును. బీజభేదమును బట్టి చిన్నవి పెద్దవి యను రెండురకము లిందేర్పడును. అందు చిన్నవి మిగుల రుచిగా నుండును. పెద్దవానిలో గూడా క్షేత్రభేదమును బట్టి కొన్ని రుచిగానే యుండును. వీనినే మెట్టవంగయని గూడ వ్యవహరించుదురు. అనగా వీనికంత జల మవసరము లేదని భావము. నీలివర్ణము గల కాయలలో గూడ కోలగా నుండునవి గుండ్రముగా నుండునవి యను రెండురకములు గానుపించును. వీనికి విశేషముగా జలము కావలెను. అందుచే వీనిని నీటివంగయని వ్యవహరించుదురు. ఈ రెండు రకములును రుచిగానే యుండును. ఈ వంగజాతులనెల్ల మానవు లతి ప్రియముగా పలువిధములుగా శాకములుజేసి భుజించుదురు. అందుచే నిత్యశాకములలో నిదియొక పదార్థమై యొప్పుచున్నది. మరియు వంగకాయలు లేతవి జ్వరాదిరోగములలో పథ్యముగా గూడ నుపయోగింప బడుచున్నవి. మరియు వీని మూలము గూడ నౌషధ యోగములందు జేర్చబడుచున్నది. ఇటుల వంగ ప్రతివారికి విశేషముగా నాహార యోగ్యమైన దగుటచే వీనిని గ్రామములందు పైరుజేసి విక్రయించు చుందురు.

ఆరణ్యమగు ములక బృహతీ-క్షుద్ర-వల్లీభేదముచే మూడు విధములుగా నుండును. ఇవి యడవులలోనే విశేషముగా బెరుగును. కాని యచ్చటచ్చట గ్రామబహిః ప్రదేశములందలి కట్టవులలో గూడ బెరుగుచుండుటయుగలదు. వీని కన్నింటికిని కొమ్మలందును, ఆకులందును కాయలందును విశేషముగా వాడియైన ముండ్లుండును. వీనిలో పెద్దములక వంగచెట్టువలెనే పైకి యెత్తుగా బెరుగునట్టిదియే. దీని యాకృతియంతయు వంగచెట్టును బోలియే యుండును. కాని సర్వాంగములందును ముండ్లుండును. కాయలు గుండ్రముగా నుండును. కాని వంగకాయలకంటె చిన్నవిగా నుండును. ఈ పెద్దములకలో క్షుద్రిక యనియు, శ్వేతమనియు రెండుభేదములున్నట్లుగా తెలియగలదు. అందు క్షుద్రిక యనునది వైద్యకశబ్ద సింధువునందు "బృహతీ క్షుపభేదే" యని చెప్పబడుటచేసి ఇది ప్రతిగృహారామమునందును శాకార్థమై పెంచబడుచు వంగ మొక్కల యాకృతినే గలిగి గుండ్రముగను ఉసిరికాయలంత పరిమాణము గలవిగను నుండు కాయగుత్తులతో నొప్పియుండు కాశీయుస్తియని వ్యవహరింపబడునదియేమో విమర్శింప దగినది. ఈ క్షుద్రిక యనునది "పీతతండులు, బహుఫల" యని చెప్పబడుటచే దీని గింజలు పసుపుపచ్చగ నుండుననియు, కాయలు విశేషముగా నుండుననియు దెలియగలదు. అయితే వైద్యమునందుపయోగింప బడునదియు, దశమూలములలో చేరినట్టిదియు శ్వేతబృహతి యనియే దెలియదగినది. దీని మూలమే గ్రాహ్యాంశము. ఇది "గర్భస్థాపనక స్త్రీ పాదస్య నియామకా" యని చెప్పబడుటచే గర్భస్రావమును నిలిపి గర్భమునకు స్థిరత్వమును గలిగించుననియు, పాదమునకు నియమనసంస్కారమును గలిగించునది యనియు దెలియగలదు. ఇదు క్షుద్రబృహతియే కంటకారియని వ్యవహరింప బడుచున్నది. ఇది క్షుపజాతులలో జేరినదియేగాని భూమిమీదనే అలుపలె చుట్టును విస్తరించి యుండునది. దీనియందు కంటకములు మెండుగా నుండును. స్పృశింప శక్యముగాక యుండును. దీని కాయలుగూడ గుండ్రముగా నుండును. పెద్దములకకాయలకంటె కొంచెము చిన్నవిగా నుండును. వీనిని గూడా శాకములలో జేర్చుకొనెదరు. కాని విశేషముగా చేదుగానుండును. అందుచే నంతికరముగా నుపయోగింపబడవు. ఇందు గూడ సామాన్యము, శ్వేతము అని రెండు భేదము లున్నట్లు దెలియుచున్నది. ఇందు శ్వేతకంటకారి "శుక్లపుష్పకంటకార్యాం" అని వైద్యకశబ్దసింధువునందు చెప్పబడుటంజేసి దీని పువ్వులు తెల్లవిగా నుండునని దెలియగలదు కాని మనకు విశేషముగా

గానుపించునట్టియు, వైద్యమునందు వాడబడు చున్నట్టియు కంటకారియొక్క పువ్వులు నీలివర్ణమును గలిగియుండును. దీనికే విశేషప్రచార మున్నట్లు గానుపించును. శ్వేతమలభ్యమేమో తెలియకున్నది. ఈ కంటకారిగూడ దశమూలములలో నొకటియై యున్నది. ఇది మిగిలినవానివలె గాక సమూలముగా గ్రహింపబడుచున్నది. వలీజాతిగూడ నీ కంటకారివలె విశేషముగా నుండచే వ్యాప్తమై యుండును. ఇది కంచెలపై ప్రాకును. దీని కాయలు గుండ్రముగా నుండి గుత్తులు గుత్తులుగా వ్రేలాడును. ఇవి గూడ మిక్కిలి చేదుగా నుండును. కాని కంటకారికాయలవలె గాక నీ కాయలను తరచు శాకములలో జేర్చుకొని భుజించుచుందురు. ఇదియే యాంధ్రమున "ఉస్తి" యని వ్యవహరింపబడుచున్నది. చిన్నపిల్లలకు దగ్గు, జలుబు మొదలగునవి కలిగినప్పుడు ఉస్తి పండ్లను ఏరండతైలములో వేసి మరగకాచి యా తైలమును పిల్లలకు పట్టుదురు. కఫసహితముగా రెండు మూడు విరేచనములై చిన్నపిల్లల కందువలన ఆరోగ్యము గలుగును. ఈ వైద్యము పల్లెటూళ్ళలో నిప్పటికిని ప్రచారమునందు గలదు. ఇటుల నీ జాతులలో గొన్ని కేవలము శాకములందును, కొన్ని వైద్యమునందును విశేషప్రయోగమును గలిగి యున్నవి. అందును విశేషించి పెద్దములక, చిన్నములక యనునవియే యట్టి వైద్యోపయోగము లందున్నవి.

(4) విశేషగుణములు:—

(క) బృహతీసామాన్యము-వాతమునుమాత్రము శమింపజేయును. (రా-ని)

(ఖ) బృహతీఫలము - కటురసమును, తిక్తానురసమును, లఘుగుణమును గలిగి యుండును. కఫవాతములను శమింపజేయును. కండువును, దుష్ఠమును, కృమిని బోగొట్టును. (భా-ప్ర.) జాఠరాగ్నిని వృద్ధిబొందించును. విసర్పమును, జ్వరమును, కామిలను అరుచిని బోగొట్టును. (అత్రి-సం.)

(గ) శ్వేతబృహతి - తిక్తరసమును గలిగియుండును. రుచిని బుట్టించును. కఫవాతములను శమింపజేయును. అంజనము వేసిన నేత్రరోగములను బోగొట్టును. (రా-ని.)

(ఘ) క్షవికాబృహతి - తిక్తరసమును, కటుకానురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. (రా-ని.)

(చ) కంటకారి (సామాన్య) - కటురసమును, తిక్తానురసమును గలిగి యుండును. అరుచిని ఆమదోషమును బోగొట్టును. (ధ-ని.)

(ఛ) కంటకారీఫలము - తిక్తరసమును కటుకానురసమును, లఘురూక్ష గుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. వాతకఫములను శమింపజేయును. శ్వాసను, కాసమును, జ్వరమునుబోగొట్టును. (భా-ప్ర.)

(జ) శ్వేతకంటకారి - కటురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. నేత్రములకు హితమైనది. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. కఫవాతములను శమింపజేయును. (రా-ని.)

(ఝ) వల్లీకంటకారి - కటురసమును, రూక్షగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. హృదయమునకు హితమైనది. వాతకఫములను శమింపజేయును. గుల్మమును, ప్లీహవృద్ధిని బోగొట్టును. (రా-ని.)

(ట) వృంతాకము- కటురసమును, మధురానురసమును, గురుగుణమును గలిగియుండును. రుచిని బుట్టించును. బలమును, పుష్టిని గలిగించును. వాతమును వృద్ధి బొందించును. పిత్తమును వృద్ధి బొందించును. (రా-ని.)

(ఠ) బాలవృంతాకఫలము - (లేతవంకాయ) - కఫపిత్తములను శమింపజేయును. (భా-ప్ర.)

(డ) మధ్యమ వృంతాకఫలము - (ముదిరినవంకాయ) - త్రిదోషములను శమింపజేయును. రక్తపిత్తములను, కండువును, కచ్ఛువునుబోగొట్టును. (రా-ని)

(ఢ) పక్వవృంతాకఫలము - (వంగపండు) - గురుగుణమును గలిగియుండును. క్షారముతో గూడియుండును. పిత్తమును వృద్ధి బొందించును. (రా-ని.)

(ణ) అంగారతప్త వృంతాకఫలము - (కాల్చినవంకాయ) - లఘుగుణములను గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. కొంచెము పిత్తమును వృద్ధి జేయును. కఫవాతములను శమింపజేయును. మేదోవృద్ధిని, ఆమమును బోగొట్టును. (భా-ప్ర.,) సరగుణమును గలిగియుండును. (రా-ని.)

(త) తైల లవణాన్విత తప్తవృంతాకఫలము - (కాల్చినవంకాయకు సంస్కారముజేసిన) - గురుస్నిగ్ధ గుణములను గలిగియుండును. (భా-ప్ర.)

(5) ప్రయోగములు:—

(కంటకారి - బృహతి).

1. అర్శోరోగమునందు కంటకారీ ప్రయోగము.

"కంటకార్యాః శృతంవాపి......... ।
అనుపానంభిషగ్దద్యాత్ వాతవర్చోఽనులోమనం॥"

కంటకారితోగాచిన కషాయమును అనుపానముగా సేవించిన అర్శోరోగికి వాతమలములకు అనులోమగతి యేర్పడును. (చ-చి-అ-9.)

2. తృష్ణయందు కంటకారీ ప్రయోగము.

"తృష్యతే సలిలం చాస్మై, కంటకార్యాఽథవా శృతం॥"

కంటకారీ కషాయమును పానము జేసిన తృష్ణ శమించును. (చ-చి-అ-12.)

3. కాసయందు కంటకారీ ప్రయోగము.

"కంటకారీరసే సిద్ధోముద్గయూషః సుసంస్కృతః।
సగౌరామలకః సామ్లః సర్వకాస భిషగ్జితం॥"

కంటకారీ కషాయముతో సిద్ధముజేసిన ముద్గయూషను సంస్కరించి ఆమలకాద్యమ్లమును జేర్చి సేవించిన కాస శమించును. (చ-చి-అ-22.)

4. అశ్మరియందు కంటకారీ ప్రయోగము.

"........బృహతీద్వయంచ ।
ఆలోడ్య దధ్నా మధురేణ పేయం దినాని సప్తాశ్మరిభేదనాయ॥"

పెద్దములక, చిన్నములక వీనికల్కమును తియ్యగనుండు పెరుగుతో కలిపి యేడుదినములు సేవించిన యశ్మరీ భేదనమగును. (చ-చి-అ-26.)

5. అలసమునందు కంటకారీ ప్రయోగము.

"సిద్ధంరసే కంటకార్యాః తైలం వా సార్షపం హితం॥"

కంటకారీ రసముతో ఆవనూనెనుకల్పి తైలపాకముజేసి లేపనము జేసిన అలసము శమించును. (సు-చి-అ-30.)

6. శ్వాసయందు కంటకారీ ప్రయోగము.

"నిదిగ్ధికాం చామలక ప్రమాణాం హింగ్వర్ధయుక్తాం మధునాసయుక్తాం
లిహేన్నరః శ్వాసనిపీడితోఽపి శ్వాసంజయత్యేవ బలాత్ త్ర్యహేణ॥"

కంటకారీ కల్కమును ఆమలక పరిమాణమంత గ్రహించి అందుకు సగభాగము ఇంగువను గలిపి తేనెతో సేవించిన శ్వాస మూడు దినములలో శమించును, (సు-ఉ-అ-51.)

7. మూత్రదోషమునందు కంటకారీ ప్రయోగము.

"నిదిగ్ధికాయాః స్వరసం పిబేత్ కుడవసమ్మితం।
మూత్రదోషహరం కల్కమథవా క్షౌద్రసంయుతం॥"

కంటకారీస్వరసమునుగాని, కల్కముగాని తేనెతోజేర్చి సేవించిన మూత్రదోషము శమించును. (సు-ఉ-అ-58.)

8. సన్నిపాత జ్వరమునందు బృహతీ ప్రయోగము.

"ఏకం బృహత్యాః ఫలపిప్పలీకం శుంఠీయుతం చూర్ణమిదం ప్రశస్తం।
ప్రధ్మాపయే ఘ్రాణపుటే విసంజ్ఞః చేష్టాం కరోతి క్షవథు ప్రబుద్ధః॥"

పెద్దములకకాయ గింజలను శుంఠిని చూర్ణించి నిస్సంజ్ఞతో పడియున్న సన్నిపాత రోగియొక్క నాసా పుటమునందుంచి లోపలికిపోవునట్లూదినచో వెంటనే తుమ్ములువచ్చి సంజ్ఞతో గూడినవాడగును. (గ-ని.)

9, ఇంద్రలుప్తమునందు బృహతీ ప్రయోగము.

"ఇంద్రలుప్తాపహో లేపో మధునా బృహతీరసః॥"

పెద్దములకరసమునందు తేనెగలిపి శిరస్సుకులేపనముజేసిన ఇంద్రలుప్తము శమించును (గ-ని)

10 ంటిపిల్లలకుగలిగిన కాసయందు కంటకారీ ప్రయోగము.

"...వ్యాఘ్రీకుసుమ సంజాత కేసరైః అవలేహికా।
జగ్ధ్వాపి చిరజం జాతం శిశోః కాసం వ్యపోహతి॥"

కంటకారి పుష్పకేసరములతో అవలేహికను జేసి యిచ్చిన చం... లకు చిరకాలమునుండి యనుసరించుచున్న కాసము శమించును. (... -సే)

(6) యోగములు:—

1. బృహత్యాదివర్తి - (చ-త్రిమర్మీయ.)

**ఉపయోగములు:—అంజనముచేసిన సర్వనేత్రరోగములు శమించును.**

2. కంటకారీఘృతము-(వా-కాస.) మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—కాస, శ్వాస, హిక్క యివి శమించును.

3. కంటకారీలేహ్యము-(వా-కాస.)మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—కాస, శ్వాస, గుల్మము, హృద్రోగము, అర్శస్సు ఇవి శమించును

4 వ్యాఘ్రీహరీతకి - (భైషజ్య-కాస.) మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—కాస, క్షతకాస, పీనసము, శ్వాస, ఉరఃక్షతము, రాజయక్ష్మ యివి శమించును. రసాయనము.

5 వార్తాకుగుటిక - (భైషజ్య-గ్రహణి.) మాత్ర:-5 యవలు.

ఉపయోగములు:-కాస, శ్వాస, అర్శస్సు, విషూచిక, ప్రతిశ్యాయము, హృద్రోగము ఇవి శమించును. ఆమపాచనము, అగ్నిదీపనము అగును.

6. కంటకారీఘృతము - (చ-ద-స్వరభేద.) మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—స్వరభేదము, కాస, శమించును.

7. కంటకార్యాదికషాయము - (చ-ద-జ్వర.) మాత్ర:-1 పలము.

ఉపయోగములు:—పిత్తశ్లేష్మజ్వరము శమించును.

8. బృహత్యాదికషాయము - (చ-ద-జ్వర.) మాత్ర:-1 పలము.

ఉపయోగములు:—సన్నిపాతజ్వరము, కాసయు శమించును.

## కొన్ని యోగములు

కనకాసవము, చ్యవనప్రాశలేహ్యము, దశమూలక్వాథచూర్ణము, దశమూలారిష్ట, నారాయణతైలము, పునర్నవాసవము, పుష్యానుగచూర్ణము, వాసాకంటకారిపానకము, సుదర్శనచూర్ణము.

(7) Actions and uses:—(బృహతి-కంటకారి) A perient, corminative, expectrant and diuretic. The confection (కంటకారి అవలేహము.) is given in asthma, cough, catarrhal affections of the lungs, fever, flatulence and Pain in the chest. As a diuretic the decoction is given in dysuria, cystic calculi and dropsy; also given in constiveness. A paste of the seeds is locally applied to promote suppuration in boils, buboes, and other indolent chronic abscesses. Fumigation of the fruits is largely used by the natives as sialogogue and applied for the relief of pain in caried teeth

R. N. Khory II P. 450.

# 137

# బంధూకః – మంకెనచెట్టు

---

## భాషాంతర నామములు

హిందీ – గోజునియా, దుపహరియా, బంధూక. మరాఠీ – తాంబడీ, దుపార్. గుజరాతీ_బపోరియా. మలయాళం_ఉచ్చమలరి. కర్ణాటకం బందురే. ద్రావిడం_ఉచ్చితిలకం.

## నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order—Malvaceae**

బెండ కుటుంబము

మంకెనచెట్టు – **Hibiscus hirtus**

(ప్రథమ భాగమున 78_వ పుట చూడుము)

## పర్యాయ పదములు

శ్లో॥ బంధూకో బంధుజీవశ్చ రక్తో మాధ్యాహ్నికోఽపిచ॥

బంధూకము, బంధుజీవము, రక్తము, మాధ్యాహ్నికము అనునవి బంధూక నామములు.

## బంధూక గుణములు

శ్లో॥ బంధూకః కఫకృద్గ్రాహీ వాతపిత్తహరోలఘుః ॥

మంకెనపువ్వు లఘుగుణమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. కఫమును వృద్ధిబొందించును. వాతపిత్తములను శమింపజేయును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—రక్త(క)ము, మాధ్యాహ్నికము, బంధుజీవము, (అర్కవల్లభ, శరత్పుష్పము, ఓష్ఠపుష్పము.)

(ఖ) గుణబోధకములు:—బంధూకము, (జ్వరఘ్న).

(2) శబ్దార్థములు:—

రక్తము - ఎఱ్ఱగనుండు పుష్పములను గలది. మాధ్యాహ్నికము - మధ్యాహ్నకాలమున వికసించునట్టి పుష్పములను గలది. బంధుజీవము - బంధువువంటి జలమునుగలది. అనగా బంధువువలె వ్యాధులం దత్యంతోపయోగకరమగు స్వరసమును గలది. అర్కవల్లభ - సూర్యునకు బ్రియమైనది. శరత్పుష్పము - శరత్కాలమున పుష్పించునది. ఓషపుష్పము - ఓష్ఠము (పెదవి)వలె నెఱ్ఱని పుష్పములను గలది. బంధూకము - మనస్సును బంధించునది. అనగా రమ్యమగు నెఱ్ఱని వర్ణముగల పుష్పములచే మనస్సుకు వికాసమును గలిగించునది. జ్వరఘ్న - జ్వరమును బోగొట్టునది.

(3) భేదములు:—

ఇది తెలుపు, నలుపు. పసపు, ఎరుపు వర్ణముల గల పుష్పములతో నాలుగు విధములుగా నుండునట్లు వైద్యకశబ్దసింధువునందు జెప్పబడినది. అయితే ఇందు నెఱ్ఱని పుష్పములు గలదియే విశేషముగా గానబడుచున్నది.
"రమ్యం పుష్పం మధ్యాహ్నే వికసతి, పరాహ్ణే సూర్యోదయేచ శుష్యతి"॥
అని యిట్లు వైద్యకశబ్ద సింధువునందు వర్ణింపబడుటనుబట్టి యీ చెట్టు యొక్క పుష్పము మధ్యాహ్నకాలమున వికసించుననియు, నుదయాస్తమయకాలములందు వాడిపోవుననియును దెలియగలదు. మరియు నిది "శరత్పుష్ప"యని జెప్పబడుటచే శరదృతువునందు పుష్పించుననిగూడ దెలియుచున్నది. ఈ పుష్పము చూచుట కందముగను కోమలముగను నుండును. సూర్యారాధనకై వీనిని విశేషముగ నుపయోగించుదురు.

(4) విశేషగుణములు:—

మనస్సునకాహ్లాదమును గలిగించును. గ్రహబాధను, జ్వరమును బోగొట్టును. (రా-ని.)

గురుగుణమును, కొద్దిగ నుష్ణవీర్యమును గలిగియుండును. (ని-ర.)

(5) ప్రయోగములు:—

1. అంజనము విషసంస్పృష్టమైనప్పుడు బంధూక ప్రయోగము.
"ఏకైకం కారయేత్పుష్పం బంధూకాం కోలయోరపి"॥

మంకెనపుష్పరసమును, ఊడుగపుష్పరసమును నేత్రములకంజనము వేసిన విషసంస్పృష్టమగు నంజనముచే గలిగినవికారము శమించును. (సు-క-అ10)

2. విషమునందు బంధూక ప్రయోగము.

"శిరోగతే విషే నస్తః కుర్యాన్మూలాని బుద్ధిమాన్।
బంధుజీవస్య భార్గ్యాశ్చ సురసస్యాసితస్య చ" ॥

మంకెనచెట్టు, గంటుభారంగి, నల్లతులసి వీనియొక్క వేళ్ళ రసమును నస్యముజేసిన శిరోగతవిషవికారము శమించును. (చ-చి-అ 25.)

---

# 138

# భార్గీ - గంటుభారంగి

---

## భాషాంతర నామములు

హింది - భడంగీ, భారంగి. మరాఠి - భారంగ. గుజరాతి - భారంగి, భారంగీ. మలయాళం - చెరుతేక్కు. కన్నడం - కిరుదేగు. ద్రావిడం - కంఢుపారంగి.

## నైసర్గిక స్వరూప వర్ణనము

Natural Order—Verbenaceae

టేకు కుటుంబము

గంటుభారంగి - Cleodendron Serratum

(ప్రథమభాగమున 12-వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ భార్గీ భృగుభవా పద్మా ఫంజీ బ్రాహ్మణయష్టికా
బ్రాహ్మణ్యంగారవల్లీ చ ఖరశాఖాచ హంజికా॥

భార్గి, భృగుభవ, పద్మ, ఫంజి, బ్రాహ్మణయష్టిక, బ్రాహ్మణి, అంగారవల్లి, ఖరశాఖ, హంజిక, అనునవి భార్గీ నామములు,

## భార్గీ గుణములు

శ్లో॥ భార్గీ రూక్షా కటుస్తిక్తా రుచ్యోష్ణా పాచనీ లఘుః।
దీపనీ తువరా గుల్మరక్తజిన్నాశయేద్ధ్రువమ్॥
శోథకాస కఫశ్వాస పీనసజ్వర మారుతాన్॥

గంటుభారంగి కటురసమును తిక్త కషాయాను రసములను, రూక్ష లఘుగుణములను, ఉష్ణవీర్యమును కలిగియుండును. రుచిని పుట్టించును. ఆమమును పచింప చేయును. జఠరాగ్నిని వృద్ధి పొందించును. కఫవాతములను శమింప చేయును. గుల్మము, రక్తదోషము, శోఫ, కాసము, శ్వాస, పీనసము, జ్వరము, అను నీవ్యాధులను పోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయ బోధకములు:—పద్మ, అంగారవల్లి, ఖరశాఖ.

(ఖ) ఉత్పత్తి బోధకము:—భృగుభవ.

(గ) గుణబోధకము:—భార్గి.

(2) శబ్దార్థములు:—

పద్మ - తామరపుష్పమువంటి పుష్పముగలది. అంగారవల్లి - అగ్నివంటి తీగెలుగలది. ఖరశాఖ - గట్టిగనుండు లతగలది. భృగుభవ - కొండచరియల యందుత్పన్నమగునది. భార్గి - దోషములను పోగొట్టునది.

(3) భేదములు:—

ఇది శ్వేతపుష్ప - నీలపుష్ప భేదముచే రెండువిధములుగ నుండునని వైద్యశబ్ద సింధువునందు జెప్పబడినది. కాని యట్టిభేదములను సూచించునట్టి నామములుగాని, గుణాదులు గాని ప్రత్యేకముగ దీనికి వర్ణింపబడుట గానరాదు.

(4) విశేషగుణములు:—

(క) రాజయక్ష్మను బోగొట్టును. (ధ-ని.,) వ్రణమును, దాహమును, క్రిములను బోగొట్టును. (రా-ని.)

(ఖ) పత్రగుణములు:—త్రిదోషములను శమింపజేయును. జ్వరమును, దాహమును, హిక్కను బోగొట్టును. (ని-ర.)

(5) ప్రయోగములు:—

1. శ్వాసయందు భార్గీ ప్రయోగము.

"భార్గీ నాగరయోః కల్కం...। అంబునాపిబేత్॥"

గంటుభారంగి, శుంఠి వీని కల్కమును జలముతో సేవించిన శ్వాస శమించును. (చ-చి-అ-21.)

2. కాసయందు భార్గీ ప్రయోగము.

"క్షోష్ణేన భార్గీ నాగర మంబునా॥"

కాసయందు గంటుభారంగి, శుంఠి వీనికల్కమును కొద్దిగ నుష్ణముగ నుండు జలముతో సేవించిన హితము. (చ-చి-అ-22.)

3. గండమాలయందు భార్గీ ప్రయోగము.

"పిష్టం జ్యేష్ఠాంబునా మూలం లేపాత్ - బ్రాహ్మణయష్టిజం॥"

గంటుభారంగి వేరును బియ్యపు కడుగుతో నూరి లేపనముజేసిన గండమాల శమించును. (చ-ద.)

4. వాతజకాసయందు భార్గీ ప్రయోగము.

"భార్గీకల్కః ఘృతంచాథ పచేద్దధ్ని చతుర్గుణే।
భార్గీరసే ద్విగుణితం వాతకాస హరం పరం॥"

గంటుభారంగి కల్కము $\frac{1}{4}$ భాగము, ఘృతము 1 భాగము, పెరుగు 4 భాగములు, గంటుభారంగి కషాయము 2 భాగములు ఇటుల గ్రహించి ఘృతపాకమును జేసి సేవించిన వాతజ కాస శమించును. (వం-సే.)

5. కురండము (అండవృద్ధి) నందు భార్గీ ప్రయోగము.

"యవాంబునా తు సంపిష్టం మూలం భార్గ్యాః ప్రలేపనాత్॥"

పిల్లలకు గలుగు అండవృద్ధియందు గంటుభారంగి మూలమును యవజలముతో నూరి లేపనము జేసిన శమించును. (వం-సే.)

6. బ్రధ్నమునందు భార్గీ ప్రయోగము.

"భార్గీమూలస్య ఖండం తు పానాద్వంక్షణ వాతజిత్॥"

అంత్రవృద్ధియందు గంటుభారంగి యొక్క మూలకల్కమును సేవించిన హితము. (వం-సే.)

(6) యోగములు:—

1. భార్గ్యాది కషాయము - బృహద్భార్గ్యాది కషాయము - (భైషజ్య - జ్వర.) మాత్ర:—1 పలం.

ఉపయోగములు:—విషమజ్వరము, సన్నిపాతజ్వరము, శీతజ్వరము, జీర్ణజ్వరము, శ్వయథు, అగ్నిమాంద్యము అరోచకము, ప్లీహాభివృద్ధి, యకృద్వృద్ధి, గుల్మము ఇవి శమించును.

2. భార్గీగుడము - (భైషజ్య - శ్వాస.) మాత్ర:—2 తులములు.

ఉపయోగములు:—శ్వాస, కాస ఇవి శమించును. జాఠరాగ్ని వృద్ధి పొందును. సుస్వరము కలుగును.

## మరికొన్ని యోగములు

కనకాసవము, దశమూలారిష్ట, వాసాకూష్మాండ లేహ్యము, శివా మోదకము.

## స్వానుభవము

మోతాదు:— దీనికి యెనిమిదిరెట్లు నీళ్లు బోసి నూరి వడియగట్టిన స్వరసమును తేనెతో తీసికొనవచ్చును. లేక దీనికి సమము అల్లముజేర్చి పై విధముగనే స్వరసముతీసి పుచ్చుకొనవచ్చును. లేక చూర్ణమును తేనెతోగాని, నేతితోగాని, తీసికొనవచ్చును. మోతాదు 10 గ్రె. మొదలు ½ తులము వరకు.

గుణము:— ఉత్తేజకము, క్షోభహరము, రసాయనము.

ఉపయోగములు:— దీనిని యనేకవ్యాధులలో పాచనౌషధములు, కఫనిస్సారకౌషధములు- వాతహరౌషధములు, మున్నగువానితో జేర్చి యిత్తురు. ముఖ్యముగా జేసిఇచ్చునది. పిత్తనాడీవ్రణములకు దీనిగంధముతీసి పైన పూయుటకుపయోగింపవచ్చునని సుశ్రుతుడు చెప్పియున్నాడు. అరిష్టముగా జేసి అపస్మారములో నుపయోగింతురు. శ్వాసచేవచ్చు ఆయాసము పోగొట్టువానిలో శ్రేష్టమైనదనిదీనికి చాలప్రసిద్ధియున్నది. ఆ.ల.

# 139

# భూమిఖర్జూరికా - పొట్టిఖర్జూరము (క)

---

## భాషాంతర నామములు

హిందీ - ఖజూర్. మలయాళం - యీంత్థపుఴా. కర్ణాటకం-ఖర్జూర. ద్రావిడం - పేరీచ్చ్ఛ.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Palmeae

కొబ్బరి కుటుంబము

పొట్టిఖర్జూరము - Phoenix Sylvestris (Fng-Dater Palm)

(603-వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ భూమిఖర్జూరికా స్వాద్వీ దురారోహా మృదుచ్ఛదా।
తథా స్కంధఫలా కాకకర్కటీ స్వాదుమస్తకా॥

భూమిఖర్జూరిక, స్వాద్వీ, దురారోహ, మృదుచ్ఛద, స్కంధఫల, కాకకర్కటి, స్వాదుమస్తక యనునవి భూమిఖర్జూరికా నామములు.

### పిండఖర్జూరికా — ముద్దఖర్జూరము (ఖ)

శ్లో॥ పిండఖర్జూరికాత్వన్యా సా పిండా మధురస్రవా॥

పిండఖర్జూరిక, పిండ, మధురస్రవ యనునవి పిండఖర్జూరికా నామములు.

## గోస్తనాకారఖర్జూరి — పెద్దఖర్జూరము (గ)

శ్లో॥ ఖర్జూరీ గోస్తనాకారా పరద్వీపాదిహాగతా ।
జాయతే పశ్చిమే దేశే సా ఛోహారేతి కీర్త్యతే ॥

గోస్తనాకారఖర్జూరి, ఛోహారయనునవి గోస్తనాకారఖర్జూరీ నామములు.

## త్రివిధఖర్జూరీ గుణములు

శ్లో॥ ఖర్జూరీత్రితయం శీతం మధురం రసపాకయోః ।
స్నిగ్ధం రుచికరం హృద్యం క్షతక్షయహరం గురు ।
తర్పణం రక్తపిత్తఘ్నం పుష్టివిష్టంభశుక్రదం ।
కోష్ఠమారుతహృద్బల్యం వాంతివాతకఫాపహం ।
జ్వరాతీసార క్షుత్తృష్ణా కాస శ్వాస నివారకం ।
మదమూర్ఛామరుత్పిత్త మద్యోద్భూతగదాంతకృత్ ॥

మూడు విధములగు ఖర్జూరములు మధురరసమును, స్నిగ్ధగురుగుణములను, శీతవీర్యమును, మధురవిపాకమును గలిగి యుండును. రుచిపుట్టించును. హృదయమునకు హితమైనవి. తృప్తిని గలిగించును. పుష్టిని, శుక్రవృద్ధిని జేయును. మలబంధమును గలిగించును. బలమును జేయును. వాతకఫములను శమింపజేయును. రక్తపిత్తము, కోష్ఠవాతము, వాంతి, జ్వరము, అతిసారము, క్షుత్తు, తృష్ణ, కాస, శ్వాస, మదము, మూర్ఛ, వాతపిత్తజవ్యాధులు అను నీ వ్యాధులను బోగొట్టును.

## సునేపాలీ — ముద్దఖర్జూరభేదము (ఘ)

శ్లో॥ సునేపాలీతు మృదులా దలహీనఫలా చ సా ॥

సునేపాలి, మృదుల, దలహీనఫల యనునవి సునేపాలీనామములు.

## సునేపాలీ గుణములు

శ్లో॥ సునేపాలీ శ్రమభ్రాంతి దాహమూర్ఛాస్రపిత్తహృత్ ॥

ముద్దఖర్జూరభేదము శ్రమ, భ్రాంతి, దాహము, మూర్ఛ, రక్తపిత్తము అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(భూమిఖర్జూరిక)- భూమిఖర్జూరిక, దురారోహ, మృదుచ్ఛద, స్కంధఫల, (పిండఖర్జూరిక)-పిండ, (హయభక్ష్య,) (గోస్తనాకారఖర్జూరి)-(మహాఖర్జూరి)-(సునేపాలి)- దలహీనఫల.

(ఖ) గుణబోధకములు:—(భూమిఖర్జూరిక)-స్వాద్వి, స్వాదుమస్తక, (పిండఖర్జూరిక)-మధురస్రవ, (సునేపాలి)-మృదుల.

(2) శబ్దార్థములు:—

భూమిఖర్జూరిక-భూమిపైపొట్టిగా వృద్ధిపొందునది.దురారోహ-ఎక్కుటకు వీలులేనిది. మృదుచ్ఛద - మృదువైన పత్రములనుగలది. స్కంధఫల - మ్రానునంటి ఫలించునది. పిండ - ముద్దగానుండు ఫలములను గలది. హయభక్ష్య-గుర్రములచే తినదగిన ఫలములను గలది. మహాఖర్జూరి-పెద్దవిగాను పొడవుగానుండు ఫలములను గలది. దలహీనఫల - దళములులేనట్టి ఫలములనుగలది. స్వాద్వి - మధురరసమును గలది. మధురస్రవ - మధురరసము గల ద్రవమును స్రవించునది. స్వాదుమస్తక-మధురరసముగల శిరోభాగమును గలది. మృదుల - మృదుగుణముగలది.

(3) భేదములు:—

ఇది క్షుద్ర - మహా - పిండభేదముచే మూడు విధములుగా నుండి, ఎత్తుగా బెరుగు తృణజాతులలో నుత్పత్తిగలిగి, మధుర స్కంధములోజేరి, బృంహణములగు ఫలములలో శ్రేష్ఠమైనదిగా గణింప బడుచున్నది. ఈ చెట్లు ఈతచెట్లనుబోలి కొన్ని యెత్తుగాను, కొన్ని పొట్టిగాను బెరుగును. ఈతచెట్ల నుండి వలె నీఖర్జూరపు చెట్లనుండి గూడ మద్యమును గ్రహింతురు. ఇవి ఉత్తర భారతమున విశేషముగా బెరుగును. ఈతకాయలవలె నీచెట్లయొక్క శిరోభాగమునకు అడుగున మ్రానునంటి గుత్తులుగుత్తులుగా గాయలు గాచును. వీనిలో క్షుద్రఖర్జూరి యనునది భూమిఖర్జూరమని వ్యవహరింప బడుచున్నది. ఈ పదముచే నీవృక్షములు పొట్టిగాబెరుగునవి యని దెలియగలదు. ఇందు సునేపాలి యను మరియొక భేదము నిఘంటుకారులచే చేర్చబడినది. నేపాలియను పదముచే నిది నేపాళ దేశమున నుత్పత్తి యగునదిగా దెలియగలదు. మరియు

పిండఖర్జూరమనునది "సాదేశే పశ్చిమే భవేత్" అని భావమిశ్రుని నిర్దేశము ననుసరించి యిది పశ్చిమ దేశమునం దుత్పన్న మగునదిగా దెలియగలదు. ఇది రాజ ఖర్జూరియని గూడ వ్యవహారముగలదు. దీనినిబట్టి రాజులకిది యిష్ట మగునదిగా దెలియుచున్నది. కాని పర్యాయ పదములలో "హయభక్ష్య" యను పదమునుబట్టి యిది గుర్రములచే భక్షింప బడునదిగా దెలియగలదు. మహాఖర్జూరి యనునది గోస్తనాకార ఖర్జూరమే. ఇది ఆవుచనుకట్టువలె నుండి పొడవుగాను, శుష్కముగాను నుండును. మనకు బజారులో లభించు ఖర్జూరపు కాయలు ఈ పైని జేర్కొనబడినవే. ఇవి "పద్మాదిహరితా, జాయతే పశ్చిమే దేశే॥" యని భావమిశ్రనిఘంటువునుబట్టి పశ్చిమ భాగములందలి ద్వీపములలో నుత్పన్నము లగునని దెలియుచున్నవి. ఇటుల ఖర్జూరములలో నెన్ని భేదము లున్నను మనకు బజారులో శుష్కమై గోస్తనాకారముగ నుండునది యొకటియు, ఆర్ద్రతతో గూడి పిండాకారముగ నుండునది మరియొకటియు నిట్లు రెండువిధములుగా దొరకుచున్నది. వీనిలో మొదటిది దానాదులకును, ఫలాహారమునకును వ్యవహారమునందు ప్రచారము గలిగి యున్నది. ఇదియే వైద్యమునందు గ్రహింపబడుచున్నది. రెండవది కేవలము ఫలాహారమునకై యే యుపయోగింపబడుచున్నది. ఈ రెండువిధములగు ఫలములును మధురముగా నుండును. అందుచే నెల్లరును భక్షింతురు. అందు గోస్తనాకార ఫలములు కొంచెము కషాయరసమును గలిగి యుండును. ఈ ఖర్జూరవృక్షములనుండి గ్రహించిన మద్యమును కొందరు పానము జేయుదురు.

(4) విశేషగుణములు:—

(క) భూమిఖర్జూరిక—మధురరసమును, శీతవీర్యమును గలిగియుండును. పిత్తమును శమింపజేయును. దాహమును బోగొట్టును. (రా-ని.)

(ఖ) పిండఖర్జూరిక—మధురరసమును, గురుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. వీర్యవృద్ధిని జేయును. అగ్నిమాంద్యమును గలిగించును. పిత్తమును శమింపజేయును. దాహమును, శ్వాసను, విషమును బోగొట్టును. (రా-ని.)

(గ) గోస్తనాకారఖర్జూరిక — మధురరసమును, గురుగుణమును శీతవీర్యమును గలిగియుండును. పుష్టిని, బలమును గలిగించును. అగ్నిమాంద్యమును జేయును. రుచిని బుట్టించును. బలమును గలిగించును. సద్యశ్శుక్రమును జేయును. కఫమును వృద్ధిపొందించును. వాతజ్వరమును బోగొట్టును. (రా-ని.)

(ఙ) ఖర్జూరీమద్యము - రుచినిబుట్టించును. జఠరాగ్నిని వృద్ధి జేయును. బలమును, శుక్రమును గలిగించును. మత్తును గలిగించును. పిత్తమును వృద్ధిబొందించును. వాతకఫములను శమింపజేయును. (భా-ప్ర)

(చ) ఖర్జూరీమస్తిష్కము - మధురరసమును, తిక్తకషాయరసములను గలిగియుండును. బలమును, శుక్రమును వృద్ధిజేయును. మూత్రరోగమును బోగొట్టును. (రా-వ.)

(5) ప్రయోగములు:—

1. కాసశ్వాసలయందు ఖర్జూరికా ప్రయోగము.

"ఘృతం ఖర్జూరమృద్వీకా శర్కరాక్షౌద్ర సంయుతం।
స పిప్పలీకం వైస్వర్య్యకాస శ్వాస నిబర్హణం"॥

ఖర్జూరపుకాయలు ద్రాక్షపండ్లు వీటి స్వరసమునందు చక్కెర తేనె నెయ్యి, పిప్పలిచూర్ణమును గలిపి సేవించిన స్వరభంగము, కాస, శ్వాసయు శమించును. (చ-చి- అ 8.)

2. గ్రహణియందు ఖర్జూరికా ప్రయోగము.

"తద్వద్ద్రాక్షేక్షు ఖర్జూరస్వరసానాసుతాన్ పిబేత్"॥

ద్రాక్షపండ్లు, చెరకు, ఖర్జూరపుకాయలు వీటి స్వరసములను, ఆసవములను పానముజేసిన గ్రహణిశమించును. (చ-చి-అ 19.)

3. జ్వరమునందు ఖర్జూరికా ప్రయోగము.

"ద్రాక్షా ఖర్జూరయో స్తథా।
వైరస్యే ధారయేత్కల్కం గండూషం చ తథాహితం"॥

ద్రాక్షపండ్లు, ఖర్జూరపుకాయలు వీటి కల్కమును నోటియందుధరించి గండూషము జేసిన జ్వరమునందు గలిగిన అస్యవైరస్యము శమించును. (సు-ఉ-అ 39.)

4. హిక్కయందు ఖర్జూరికా ప్రయోగము.

"ఖర్జూరమధ్యం మాగధ్యం।
మధున్యేతయోః కర్తవ్యాః తే హిక్కాసు విజానతా"॥

ఖర్జూరబీజములను పిప్పళ్ళను చూర్ణించి తేనెగలిపి సేవించిన ఎక్కిళ్లు శమించును. (సు-ఉ-అ 50.)

5. రక్తపిత్తమునందు ఖర్జూరికా ప్రయోగము.

"హితం చ ఖర్జూరఫలం సమాక్షికం" ॥

ఖర్జూరఫలములచూర్ణమును తేనెతో గలిపి సేవించిన రక్తపిత్తము శమించును. (సు.ఉ-అ 45.)

(6) యోగములు:—

1. ఖర్జూరాదిలేహ్యము - (చ-రాజయక్ష్మ.) మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—కాస, శ్వాస, పార్శ్వశూల ఇవి శమించును.

2. ఖర్జూరాదిఘృతము - (వా-రాజయక్ష్మ.) మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—రాజయక్ష్మ, శ్వాస, కాస, స్వరభంగము, జ్వరము శమించును.

3. ఖర్జూరాదిక్వాథము - (గ-ని-ప్రమేహ.) మాత్ర:-1 పలము.

ఉపయోగములు:—రక్తమేహము శమించును.

4. ఖర్జూరాదిచూర్ణము - (బ-రా-తృష్ణారోగ.) మాత్ర:-$\frac{1}{4}$ తులము.

ఉపయోగములు:—అంగదాహము, లింగదాహము, మూత్రరోగము, శుక్రరోగము ఇవి శమించును. వృష్యము. బల్యము.

5. ఖర్జూరాదిరసాయనము-(వై-చిం-పిత్తరోగ.) మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—రక్తపిత్తము, అమ్లపిత్తము, శిరోభ్రమ, పిటికలు, స్ఫోటకము, జ్వరము, క్షయ, ఉన్మాదము, అగ్నిమాంద్యము, అరుచి, దాహము, తృష్ణ, కంఠశోష ఇవి శమించును.

(7) Actions and uses:—Khajur is nutritive, tonic and diuretic; used as desert food. Khareka is used as an ingredient in various aphrodisiac and tonic confections. Boiled with milk it is given during convalescence from fevers and small-pox. The juice or toddy obtained from the stem is a good diuretic, A spirit known as Kajur-no-daru is obtained by distillation of the fruits.

R. N. Khory. II. P. 626.

# భూర్జపత్రః - భుజపత్రిచెట్టు

## భాషాంతర నామములు

హింది - భోజపత్ర. మరాఠి - భూర్జపత్ర. గుజరాతి - భోజపత్ర. మలయాళం - భూర్జమరం. కర్ణాటకం - భూర్జపత్ర. ద్రావిడం - భూర్జపరం.

## Natural Order—Cupulifereae

భుజపత్రిచెట్టు - Betula utilis

## పర్యాయ పదములు

శ్లో॥ భూర్జపత్రః స్మృతో భూర్జః చర్మిబహులవల్కలః ॥

భూర్జపత్రము, భూర్జము, చర్మి, బహులవల్కము అనునవి భూర్జపత్రి నామములు.

## భూర్జపత్రి గుణములు

శ్లో॥ భూర్జోభూత గ్రహశ్లేష్మ కర్ణరుక్పిత్తరక్తజిత్ ।
కషాయో రాక్షసఘ్నశ్చ మేదో విషహరః వరః ॥

భుజపత్రిచెట్టు కషాయరసమును గలిగి యుండును. శ్లేష్మమును శమింపజేయును. భూతగ్రహదోషము, కర్ణశూల, రక్తపిత్తము, రాక్షసగ్రహ దోషము, మేదోవికారము, విషము అను వ్యాధులను పోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—బహులవల్కము. (బిందుపత్ర, రక్షాపత్ర, మృదుచర్మ, ఛత్రిపత్రి, స్థిరచ్ఛద, దలలిఖ్నోక, విద్యాదల.)

(ఖ) గుణబోధకములు:—(భూతఘ్న.)

(గ) ఉత్పత్తిబోధకములు:—(శైలేంద్రస్థ).

(2) శబ్దార్థములు:—

బహులవల్కలము - దళసరిగనుండు పట్టుగలది. బిందుపత్రి - బిందువులచే వ్యాప్తమైనట్లుండు పత్రములను గలది. రక్షాపత్రి - గ్రహశాంతికై రక్షాబంధనము చేయుట కుపయుక్తమగు పత్రములనుగలది. మృదుచర్మ-మెత్తగానుండు చర్మమునుగలది. ఛత్రిపత్రి - గొడుగువలె విస్తరించియుండు పత్రములను గలది. (లేక) గొడుగులు నిర్మించుటకై యుపయోగించునట్టి చర్మమును గలది. స్థిరచ్ఛద - చిరకాలము జీర్ణించకుండునట్టి త్వక్కును గలది. దలనిర్మోక - చిన్న చిన్న దళములవలె పైకి విడుచుచుండు చర్మమునుగలది. విద్యాదల - గ్రంథమును వ్రాయుటకై యుపయోగింపబడునట్టి చర్మమును గలది. భూతఘ్న - భూతవికారములను బోగొట్టునది. శైలేంద్రస్థ - పర్వతములపై వృద్ధిబొందునట్టిది.

N.B:—ఇది యెత్తుగా బెరుగు వృక్షజాతులలో నుత్పత్తిగలిగి రక్షోహర ద్రవ్యములలో గణింపబడుచున్నది. ఈ వృక్షముయొక్క నిజస్వరూపమును బోధించునట్టి లక్షణము లెచ్చటను గానరాకున్నవి. ఇది హిమాలయపర్వతమునం దుత్పత్తియగునని శాలిగ్రామ నిఘంటుకారుడు జెప్పియుండెను. పైవర్ణనమును బట్టి దీనిపట్ట మృదువుగను చిరకాలము జీర్ణింపకుండునట్లును దెలియగలదు. ఈ పట్ట పూర్వము (కాగితములు తయారుచేయుటకు పూర్వము) కాగితములకు బదులుగా విద్యావిషయకమైక సమస్త వ్యాపారమునకును నుపయోగింప బడుచున్నట్లు దెలియగలదు. ఇంతియేగాక ఉత్తర ప్రత్యుత్తరాది సమస్త రాజకార్యములకు గూడ వ్యవహరింప బడుచున్నట్లును దెలియగలదు. రక్షాపత్రి యను పదమునుబట్టి యీ చర్మమునందు గ్రహశాంతికరమగు మంత్రబీజములను వ్రాసి తాయెత్తుగా మడచి శరీరమునందు ధరింపబడుచుండినట్లు గూడ దెలియుచున్నది. "మంత్రకార్యేషు సిద్ధిదః" అను శాలిగ్రామ నిఘంటుకార నిరూపణమునుబట్టి యిది మంత్రకార్యములందు సిద్ధిని గలిగించునదిగా దెలియుచున్నది. గ్రహశాంతికై నీ పట్టను ధూపము జేయుట కుపయోగించుచున్నట్లు గ్రంథములం దచ్చటచ్చట గానవగును. ఇంతకంటె విశేష ప్రయోగము లెచ్చటను గానరాకున్నవి.

(3) విశేషగుణములు:—

కటురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. పథ్యకరము. త్రిదోషములను శమింపజేయును. (రా_ని.) బలమును గలిగించును. రక్తదోషములను బోగొట్టును. (రా_వ.)

(4) ప్రయోగములు:—

1. బాలగ్రహదోషమునందు భూర్జపత్రి ప్రయోగము.

“సర్షపానింబపత్రాణి... ।
భూర్జపత్రం ఘృతం ధూపః సర్వగ్రహ నివారణః ” ||

ఆవాలు, వేపాకులు, భుజపత్రియు వీని చూర్ణమును నేతితో గలిపి ధూపము వేసిన బాలుర సమస్త గ్రహదోషములు శమించును. (వా_ఉ అ3.)

2. గర్భసంగమునందు భూర్జపత్రి ప్రయోగము.

“భూర్జలాంగలకీ...పృథక్...యోనిలేపనధూపనం ” ||

భుజపత్రికల్కమును యోనికి లేపనము జేసినను, ధూపము వేసినను గర్భసంగముపోవును. (వా_శా_అ 1.)

(5) యోగములు:—

1. భూర్జగ్రంథ్యాదిలేపము – (చ_సు_అ 3.)

ఉపయోగములు:—కుష్ఠము, కిలాసము, ఇంద్రలుప్తము, భగందరము, అర్శస్సు, అపచి, కండూ ఇవి లేపనము జేసిన శమించును.

# 141

# భృంగరాజః – గుంటకలగర

## భాషాంతర నామములు

హింది – భకరైయా, భంగరా, భాంగిరా. మరాఠి – మాకా. గుజరాతి – భాంగరో. మలయాళం – కయ్యన్ని. కర్ణాటకం – గర్గ. ద్రావిడం – కరిశలాంగణి.

## నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order—Compositae**

చామంతి కుటుంబము

గుంటకలగర – **Eclipta alba (Eng - Trailing eclipta)**

(ప్రథమ భాగమున 100-వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ భృంగరాజో భృంగరజో మార్కవో భృంగ ఏవచ।
అంగారకః కేశరాజః భృంగారః కేశరంజనః॥

భృంగరాజము, భృంగరజము, మార్కవము, భృంగము, అంగారకము, కేశరాజము, భృంగారము, కేశరంజనము అనునవి భృంగరాజ నామములు.

## భృంగరాజ గుణములు

శ్లో॥ భృంగారః కటుకస్తిక్తో రూక్షోష్ణః కఫవాతనుత్।
కేశ్యస్త్వచ్యః కృమిశ్వాస కాసశోథామ పాండునుత్॥
దన్త్యో రసాయనో బల్యః కుష్ఠనేత్ర శిరోఽర్తినుత్॥

గుంటకలగర కటురసమును, తిక్తానురసమును, రూక్షగుణమును, ఉష్ణ వీర్యమును గలిగియుండును. కేశములను వృద్ధిపొందించును. త్వక్కునకు హితమైనది. దన్తములకు పటుత్వము గలిగించును. రసాయనము బలమునుగలిగించును. కఫవాతములను శమించును. క్రిములు, శ్వాస, కాస, శోఫ, ఆమము, పాండువు, కుష్ఠము, నేత్రరోగము, శిరోరోగము అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధ నామములు:—

(క) పరిచయబోధకములు:—భృంగరాజము, (అంగారకము.)

(ఖ) గుణబోధకములు:—కేశరాజము, కేశరంజనము, (నాగమారము.)

(2) శబ్దార్థములు:—

భృంగరాజము - తుమ్మెదలను రంజింపజేయునది. (లేక) కేశములను తుమ్మెదలవలె రంజింపజేయునది. అంగారకము - అగ్నివంటి వర్ణముగల పుష్పములను గలది. కేశరాజము - కేశరంజనము - కేశములను రంజింపజేయు నది. నాగమారము - సర్పములను చంపునది.

(3) భేదములు:—

ఇది శ్వేత-పీత-నీలభేదముచే మూడు విధములుగా నుండును. క్షుప జాతిలో నుత్పత్తిగలిగి జ్వరాదిరోగ హరద్రవ్యములలో ప్రశస్తమైనదిగా గణింపబడుచున్నది. ఇంతియేగాక యిది కేశములకు నల్లని వర్ణమును గలిగించి వృద్ధిపొందించుటలో నుత్తమమైనది. ఇందలి శ్వేతము విశేషముగాను, పీతము కొంచెము తక్కువగాను సాధారణముగ నెల్లచోటుల దొరకుచుండును. ఇవి జలప్రదేశములందు విరివిగా వృద్ధిబొందును. పీతభృంగరాజము "స్వర్ణభృంగారము - పసుపుపచ్చని వర్ణముగల పుష్పములను గలది. హరిప్రియము-విష్ణుమూర్తికి ప్రియకరమైనది పావనము - పవిత్రమైనది." అను మొదలగు నామముల చేతను, నీలభృంగరాజము "మహానీలము - నీలపుష్పము - విశేషముగ నల్లని వర్ణముగల పుష్పములనుగలది." యను మొదలగు నామములచేతను వ్యవహరింప బడుచున్నది. ఇందలి నీలభృంగరాజము దుర్లభద్రవ్యములలో నొకటిగా జెప్ప బడుచున్నది. ఇది నిఘంటుకారులచే మిగిలిన వానిలో శ్రేష్ఠమైనదిగను,

మిగుల రసాయనముగను వర్ణింపబడినది. మఱియు దీనితో పాదరసమునకు సంస్కారము జేసినయెడల నట్టి రసముతో సర్వకార్యములు సాధింపవచ్చునని జెప్పుదురు. మఱియు భృంగరాజమునందు లోహాంశము గలదనియు నందుచేనివి రక్తదుష్టివలన గలుగు వ్యాధులయందును, రక్తమును శుభ్రిపరచుటయందును మిగుల ప్రయోజనకారి యని గూడ కొందరు వచించెదరు. మొత్తముమీద నీ ద్రవ్యము ప్రతి వ్యాధియందును ప్రయోగింప బడుచున్నట్లు దెలియగలదు. కొందరు వీని చిగుళ్లను శాకముగా జేసి భుజించుటయును గలదు.

(4) విశేషగుణములు:—

(క) శ్వేతభృంగరాజము — తిక్తరసమును గలిగియుండును త్వగ్దోషమును, హృద్రోగమును, విషమును బోగొట్టును. (ధ—ని) నేత్రములకు హితమైనది. (రా—ని.)

(ఖ) పీతభృంగరాజము—తిక్తరసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును నేత్రములకు హితమైనది. కేశములను రంజింపజేయును. కఫమును శమింపజేయును. ఆమమును శోఫను బోగొట్టును. (రా—ని)

(గ) నీలభృంగరాజము—తిక్తరసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. నేత్రములకు హితమైనది. కేశములను రంజింపజేయును. రసాయనము. కఫమును శమింపజేయును. ఆమమును, శోఫను, శ్విత్రమును బోగొట్టును. (రా—ని)

(5) ప్రయోగములు:—

1. కఫజకాసయందు భృంగరాజ ప్రయోగము.

"భృంగరాజవార్తాకుజాః రసాః ।
సక్షౌద్రాః కఫకాసఘ్నాః"।

గుంటకలగర, ములక వీని స్వరసములందు తేనెజేర్చి సేవించిన కఫజకాస శమించును. (చ—చి—అ 22)

2. కాసశ్వాసలయందు భృంగరాజప్రయోగము.

"తైలం దశగుణే సిద్ధం భృంగరాజరసే శుభే।
సేవ్యమానం యథాన్యాయం శ్వాస కాసౌ వ్యపోహతి"

గుంటకలగరరసము పదిభాగములు, తైలము ఒకభాగము, రెండింటిని కలిసి తైలపాకము జేసి యథావిధిగ పానము జేసిన కాస శ్వాసలు శమించును. (సు-ఉ-అ-51)

3. రసాయనమునకై భృంగరాజప్రయోగము.

"యే మాసమేకం స్వరసం పిబంతి దినే దినే భృంగరజస్సముత్థం।
క్షీరాశినస్తే బలవీర్యయుక్తాః సమాశ్శతం జీవితమాప్నువంతి॥"

గుంటకలగరరసమును ప్రతిదినమును యథాప్రమాణముగ నొకమాసమువరకు సేవించుచు పాలతో జేర్చిన యాహారమును దీసుకొనుచుండిన మిగుల బలమును వీర్యమునుగలిగి నూరుసంవత్సరములు జీవింపగలుగును. (వా-ఉ-అ-39)

4. శ్విత్రమునందు భృంగరాజప్రయోగము.

మార్కవమథవా ఖాదేత్ భృష్టతైలేన లోహపాత్రస్థం।
బీజకశృతం చ దుగ్ధం తదను పిబేచ్ఛ్విత్రనాశాయ॥"

భృంగరాజమును సమూలముగ లోహపాత్రయందు తైలముతో భర్జనజేసి వేగిస కషాయమును పాలును అనుపానముగా చేర్చి సేవించిన శ్విత్రకుష్ఠము శమించును. (వా-చి-అ-20)

5. ఆమ్లపిత్తమునందు భృంగరాజప్రయోగము.

"పథ్యా భృంగరజశ్చూర్ణం యుక్తం జీర్ణగుడేన తు।
జయే దమ్లపిత్తజన్యాం ఛర్దిమన్నవిదాహజాం॥"

కరకకాయ, గుంటకలగర, వీని చూర్ణమును పాతబెల్లముతో జేర్చి సేవించిన ఆమ్లపిత్తమునగలుగు ఛర్దియు అన్నవిదాహము వలన గలిగిన ఛర్దియు శమించును. (చ-గ)

6. కేశకృష్ణీకరణమునకు భృంగరాజ ప్రయోగము.

"భృంగపుష్పం జపాపుష్పం మేషీదుగ్ధ ప్రపేషితం।
తేనైవాలోడితం లోహపాత్రస్థం భూమ్యన్తః కృతం॥
సప్తాహాదుద్ధృతం పశ్చాత్ భృంగరాజరసేన తు।
ఆలోడ్యాభ్యజ్య చ శిరోవేష్టయిత్వా విశేన్నిశాం।
ప్రాతస్తు క్షాలనం కార్యమేవం స్యాన్మూర్ధరంజనం"॥

గుంటకలగరపుష్పములను, మందారపుష్పములను గొర్రెపాలతో మెత్తగా నూరి లోహపాత్రియందుంచి అందు గొర్రెపాలను తగువాత్రిము పోసి దృఢముగ సంధిబంధనముజేసి భూమిలో నేడు దినములుగప్పి యుంచవలెను. పిమ్మట దీనిని గ్రహించి భృంగరాజరసమును గలిపి శిరస్సునకు బాగుగా నభ్యంగముజేసి యథావతుగ రాత్రి తలకు గాలి తగులకుండునట్లు వస్త్రముతో జుట్టబెట్టి జాగ్రత్తగా పరుండి మరునా డుదయమున స్నాన మాచరించవలెను. ఈ విధముగ ప్రతిదినము జేయుచుండిన కేశములకు చక్కని నలుపువర్ణము గలుగును. (చ-ద.)

7. నక్తాంధ్యమునందు భృంగరాజ ప్రయోగము.

"కేశరాజాన్వితం సిద్ధం మత్స్యాండం భక్షితం హన్తి ।
నక్తాంధ్యం నియతం నృణాం సప్తాహాత్ పథ్యసేవినాం" ॥

భృంగరాజరసముతో మత్స్యాండమును పాకముజేసి సేవించిన ఏడు దినములలో నక్తాంధ్యము నిశ్చయముగ శమించును. (చ-ద.)

8. ఉపదంశమునందు భృంగరాజ ప్రయోగము.

"అసాధ్యాపి వ్రజత్యస్తం లింగోత్థారుక్ ప్రలేపనాత్ ।
సమ్యక్ సమూలపత్రేణ మార్కవేణ ప్రయత్నతః" ॥

గుంటకలగర సమూలముగా గ్రహించి మెత్తగానూరి లేపనముజేసిన యసాధ్యమగు నుపదంశముగూడ శమించును. (గ-ని.)

9. గర్భస్రావనివారణార్థమై భృంగరాజ ప్రయోగము.

"మార్కవస్వరసంగవ్యం క్షీరం చ సదృశం పిబేత్ ।
అన్తర్వత్నీ భవేత్తస్యా నైవగర్భపరిచ్యుతిః" ॥

గుంటకలగరరసమును, ఆవుపాలను సమాంశములుగ గ్రహించి పానము జేసిన గర్భవతికి గర్భస్రావము శమించును. (వై-మ.)

10. సూర్యావర్తమునందు భృంగరాజ ప్రయోగము.

భృంగరాజరసచ్ఛాగక్షీరతుల్యో ఒగ్నితాపితః ।
సూర్యావర్తం నిహన్త్యాశు నస్యేనైవ ప్రయోగరాట్" ॥

గుంటకలగరరసమును, మేకపాలను సమాంశములుగ గ్రహించి ఎండలో నెండబెట్టి నస్యముజేసిన సూర్యావర్తమను శిరశ్శూల శీఘ్రముగా శమించును. (భా-ప్ర.)

11. సరక్తామాతీసారమునందు భృంగరాజ ప్రయోగము.

"కేశరాజసముద్భూతా జలేన గుటికా కృతా ।
జయేత్ సామమతీసారం స శూలం సాస్రమాశుచ" ॥

గుంటకలగరను జలముతో మెత్తగానూరి గుటికలుచేసి సేవించినరక్తముతోను, శూలతోనుగూడిన ఆమాతీసారము శీఘ్రముగ శమించును. (వం-సే.)

12. ప్రసవానంతరమునగలుగుయోనిశూలయందుభృంగరాజప్రయోగము.

"బిల్వమార్కవజం మూలం కల్కం మద్యేన పాయయేత్ ।
తేన యోనిగతం శూలం ఆశు శామ్యతి యోషితాం" ॥

మారేడు, గుంటకలగర వీని మూలములను మెత్తగా కల్కముజేసి మద్యముతో సేవించిన ప్రసవించిన పిమ్మట గలుగు యోనిశూల శీఘ్రముగ శమించును. (వం-సే.)

(6) యోగములు:—

1. భృంగరాజతైలము - (భైషజ్య-నేత్రరోగ.)

ఉపయోగములు:—నస్యాభ్యంగములు జేసిన వలీపలితములుశమించును. దృష్టిప్రసాదనమగును.

2. మహాభృంగరాజతైలము - (భైషజ్య-క్షుద్రరోగ.)

ఉపయోగములు:—నస్యాభ్యంగములు జేసిన కేశపాతము, మన్యాస్తంభము, గలగ్రహము, శిరోరోగము, కర్ణరోగము, నేత్రరోగము, ఖాలిత్యము, ఇంద్రలుప్తము ఇవి శమించును. కేశములు వృద్ధిపొందును.

3. భృంగరాజఘృతము - (భైషజ్య-క్షుద్రరోగ.)

ఉపయోగములు:—అభ్యంగముచేసినను, నస్యముజేసినను నేత్రరోగములు, కర్ణరోగములు, కంఠరోగములు, దంతరోగములు ఇవి శమించును. కేశములు నల్లబడును.

4. భృంగరాజాదిచూర్ణము_(బ_రా_పిత్తరోగ.) మాత్ర:_1 కర్షము.
ఉపయోగములు:—భ్రంశపిత్తము శమించును.

5. భృంగరాజాదిగుటిక - (బ_రా_శ్లేష్మరోగ.)
ఉపయోగములు:—నోటియందుధరించిన జిహ్వాశోధనగును. కాసము శమించును.

6. భృంగామలకతైలము - (వై_చిం_పిత్తరోగ.)
ఉపయోగములు:—నస్యాభ్యంగములు జేసిన శిరోరోగము, నేత్రరోగము, అపస్మారము, కర్ణశూల, ఉన్మాదము ఇవి శమించును. కేశములు వృద్ధిపొందును. కాంతికలుగును.

---

# 142
# మదనః - మ్రింగకాయ

---

## భాషాంతర నామములు

హింది_కరహార్, మేండఫల. మరాటి_గేళ, గేళఫల. మదన. గుజరాతి_మీంఢోళ, మీఢీయావళ, మీంఢళ. మలయాలం_మలంగార. కన్నడం_మదన. ద్రావిడ _మరుక్కారై.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Rubiaceæe

తొగరు కుటుంబము

మ్రింగకాయ _ Randia dumetorum (Eng. Bushygarolenia.)

ఈ కుటుంబము పెద్దదియై, దీనిలోఁ పెద్దవృక్షములు, గుబురుమొక్కలు, గుల్మములు కూడఁ గలవు. వీనియన్నిటి యాకులు అభిముఖచేరికగ నుండును. కణుపు పుచ్చములు రెండాకులకు మధ్యగానుండును. పువ్వులన్నియు సరాళములు. దళవలయమున కైదు తమ్మెలుగలవు, కింజల్కములు దీని కంటియుండును, అండాశయము నీచము. రెండుగదులు

గలవు. ఈ కుటుంబమును, అండాశయముయొక్క గదులలో ఒక్కొక్క గింజయో, ఎక్కువయో దళవలయపు తమ్మెలు తాకుచున్నవో, అల్లుకొనియున్నవో, కాయపగులునో, కండకాయయో, ఇట్టివానిని బట్టి జాతులుగను, తెగలుగను విభజించి యున్నారు.

## పర్యాయ పదములు

శ్లో॥ మదనశ్ఛర్దనః పిండీ రాఠః పిండీతకస్తథా।
కరహాటో మరుబకః శల్యకో విషపుష్పకః॥

మదనము, ఛర్దనము, పిండి, రాఠము, పిండీతకము, కరహాటము, మరుబకము, శల్యకము, విషపుష్పకము, అనునవి మదన నామములు.

## మదనగుణములు

శ్లో॥ మదనో మధురస్తిక్తో వీర్యోష్ణో లేఖనో లఘుః।
వాంతికృద్విద్రధిహరః ప్రతిశ్యాయ వ్రణాంతకః।
రూక్షః కుష్ఠకఫానాహ శోథగుల్మ వ్రణాపహః॥

మ్రంగకాయ మధురరసమును, తిక్తారసమును, లఘురూక్షగుణములను ఉష్ణవీర్యమును గలిగియుండును. లేఖనము, వాంతినిగలుగజేయును. కఫమును శమింపజేయును. విద్రధి, ప్రతిశ్యాయము, వ్రణము, కుష్ఠము, ఆనాహము, శోఫ, గుల్మము, అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:— పిండి, పిండీతకము, కరహాటము, శల్యకము, విషపుష్పకము.

(ఖ) గుణబోధకములు:— మదనము, ఛర్దనము.

(2) శబ్దార్థములు:—

పిండి, పిండీతకము-ఫలము పిండమువలె నుండునది. కరహాటము-చెట్టు చేతితో స్పృశింపశక్యముగానిది. శల్యకము-(చెట్టు) ముండ్లనుగలిగియుండునది. విషపుష్పకము-విషముగల పువ్వులనుగలది. మదనము-హర్షము (రోమహర్షము)ను, లేక గ్లాని (బడలిక)ని గలుగజేయునది. ఛర్దనము- వాంతిని గలిగించునది.

(3) పరిచయ ఉత్పత్తి బోధకలక్షణము:—

"రాటకోవృత్త పత్రోఽథ కంటకీ పర్వతాదిషు।
విటపీ మదనం తస్య ఫలం రేఖాఫలం స్మృతం॥"

మ్రింగ చెట్టు గుండ్రనియాకులను, ముండ్లనుగలిగి పర్వతములు మొదలగు ప్రదేశములందుత్పత్తియగును. దీని ఫలము రేఖలను గలిగి యుండును. (శ-ద)

(4) భేదములు:—

ఇది తెలుపు, నలుపు భేదముచే రెండువిధములుగా నుండును. అందు నల్లగనుండుఫలము చిన్న పెద్ద భేదముచే రెండు విధములుగా నుండును. ఈ రెండువిధములగు కృష్ణమదనములు శ్రేష్ఠములుగ నిఘంటువులందు వర్ణింపబడినవి. అయినను "నాతిహరిత పాండూని ... పక్వాని ... పాండూని" అని సుశ్రుత-వాగ్భటములందు కొంచెము హెచ్చుతక్కువగ శ్వేతమదనము శ్రేష్ఠమైనట్లుగ వర్ణింపబడినది. ఏది యెటులున్నను ఈ రెండు (శ్వేత-కృష్ణ)ను శోధనౌషధములగుట నిశ్చయము. కావున శోధనకర్మయందు నిరపాయకరముగ నుండు మదనఫలమును గ్రహించుట యుక్తము.

(5) విశేషగుణములు:—

(క) శ్వేత - కటురసమును గలిగి యుండును. వస్తికర్మయందుగూడ శ్రేష్ఠమైనదిగ నుండును. వాతమును శమింపజేయును. శ్లేష్మజజ్వరమును బోగొట్టును. (ధ-ని.)

(ఖ) కృష్ణ-(ద్వయ) - కటురసమును తిక్తానురసమును గలిగి యుండును. వమనకర్మయందు శ్రేష్ఠముగనుండును. పక్వాశయమును, ఆమాశయమును శోధించును. కఫమును శమింపజేయును. హృద్రోగమును బోగొట్టును. (రా-ని.) కషాయానురసమును గలిగియుండును. పిత్తమును శమింపజేయును. (వై-ని.)

(6) మదనకల్పము:—

"వమనద్రవ్యాణాం మదనఫలాని శ్రేష్ఠాని ఆచక్షతే అనపాయిత్వాత్। తానివసంత గ్రీష్మయోః అంతరే పుష్యాశ్వయుగ్యా మృగశిరసా వా గృహ్ణీయాత్ మైత్రే ముహూర్తే। యానిపక్వాని నాతిహరితాని పాండూని అకృ

మీని అస్పృష్టాని అహరితాని అజగ్ధాని తాని పరిగృహ్య కుశపుటే బధ్వా గోమయేనా లిప్య యవతుషమాషశాలికులుత్థ ముద్గపర్ణానా మన్యతమే నిదధ్యాత్ అష్టరాత్రం। అతఊర్ధ్వం మృదుభూతాని తాని మధ్విష్టగంధాని ఉద్ధృత్య శోషయేత్। సశుష్కాణాం ఫలానాంపిప్పలీ రుద్ధరేత్ తాసాం ఘృత దధి మధు పలల మృదితానాం పునః శుష్కాణాం తాసాం నవకలశం సుపరిమృష్ట వాలుకమురజస్కమాకంఠం పూరయిత్వా స్వవచ్ఛన్నం స్వనుగుప్తం శిక్యే అవసజ్య స్థాపయేత్ ॥" (కల్ప-అ1.)

వాంతిని జేయు ద్రవ్యములలో మదనఫలములు అపాయమును జేయనివి యగుటవలన నివి వమనకర్మకు శ్రేష్ఠమైనవిగ జెప్పబడును. వీనిని వసంత గ్రీష్మర్తువులకు మధ్యకాలమున పుష్యమి నక్షత్రముతో గాని, అశ్వినినక్షత్రముతో గాని, మృగశిరనక్షత్రముతో గాని గూడిన దివసమున మంచిముహూర్తము నందు గ్రహించవలెను. ఇవి పండి ఆకుపచ్చగను తెల్లగను నున్నప్పుడు అందు పురుగులు లేనట్టియు, కుళ్ళించనట్టియు, పొట్టివిగానట్టియు, పురుగులు మొదలగువానిచే దినబడనట్టియు ఫలములను దెచ్చి వానిని దర్భలతో జుట్టజుట్టి పైని ఆవుపేడ బూసి యెండించి యవలపొట్టు, మినుములు, శాలిధాన్యము, ఉలవలు, అవపెసలు అను వానిలో నేయొకదాని రాసియందైన నెనిమిదిరాత్రులు గప్పియుంచవలెను. పిమ్మట నవి మృదువుగనుండి తేనెవంటియు, హితమైనట్టియు వాసన గలిగిన మదనఫలములను గ్రహించి యెండబెట్టవలెను. అవి బాగుగ నెండినపిమ్మట వానిని పగులగొట్టి యందుండు బీజములను దీయవలెను. పిమ్మట నీ బీజములను ఘృతము, పెరుగు, తేనె, మాంసరసము వీనియందు నానబెట్టి, మెత్తబడిన తరువాత తిరిగి యెండబెట్టవలెను. ఇట్లు యెండిన మదనబీజములను బాగుగ తోమబడి యిసుక దుమ్ము మొదలగునవి లేకుండగ శుభ్రపరచబడిన యొక క్రొత్తపాత్రయందు నిండుగా పూరించి గాలి, దుమ్ము మొదలగునవి చొరకుండునట్లు పైని మూసి యా పాత్రను ఉట్టియందు వ్రేలాడదీసి జాగ్రత్తగా నుంచవలెను. (చ-కల్ప-అ 1)

N. B:—ఇట చరకమతమున మదనఫలములు హరిద్వర్ణమును, పాండు వర్ణమును గలిగి యుండవలెనని దెలియుచున్నది. సుశ్రుత-వాగ్భటమతములందు "నాతిహరిత పాండూనాం" హెచ్చుగ హరిద్వర్ణమును, పాండువర్ణమును గలిగి యుండనట్టివానిని గ్రహింపవలెనని దెలియగలదు. హెచ్చుగ ఆకు పచ్చనివర్ణమును గలిగియున్న నవి పచ్చివిగ నుండుననియు, హెచ్చుగపాండు వర్ణమును గలిగియున్న నవి మిగుల పండినవియనియు నందువలన ప్రయోగా లర్హములనియు, మధ్యస్థముగ నుండునవియే ప్రయోగార్హములనియు నందుచే జైవికముగ సుశ్రుతాదులచే మదనఫలగ్రహణవిధినియుక్తమైనట్లు బోధపడ గలదు. అయితే నిటుల విధినియామకము చరకమతమునకు భిన్నముగనున్నట్లు దోచుచున్నను, చరకునిచే హరిద్వర్ణము గలవియు, పాండువర్ణముగలవియు నని జెప్పుటవలన రెండు విధములగు వర్ణమును గలవి సుశ్రుతాదులచే నిరూ పింపబడినట్లు మధ్యేకముగనే యుండునుగాని యిందు మతభేదము లేనట్లు గ్రహింపనగును. ఇటుల చరకాదులచే మదనఫలములు హరిత్పాండువర్ణము లను గలవి శ్రేష్ఠమైనట్లుగ నిరూపింపబడినను నిఘంటుకారులచే "వరాహో ఽన్యః కృష్ణఫలో మహాపిండీతకో మహాన్। స్నిగ్ధపిండీతకశ్చాన్యః స్థూల వృక్షఫలంతథా॥ అశ్వోచమదనౌ (కృష్ణఫలౌ) శ్రేష్ఠౌ" నల్ల వర్ణముగల మదనఫలములు శ్రేష్ఠములని నిరూపింపబడినట్లు దెలియుచున్నది. అయితే నిటుల మదనఫల గ్రహణమునందలి భిన్న భిన్న మతములచే నిరూపింపబడిన శ్రేష్ఠాశ్రేష్ఠతలను అనుభవముపై నిశ్చయించుకొనుట యుక్తము.

మదనఫలప్రయోగమునందలి కల్పనా విశేషములు.

"అంతర్నఖముష్టిం ఉష్ణే యష్టీమధుకకషాయే కోవిదారాదీనాం అన్య తమేవా కషాయే ప్రమృజ్య రాత్రిపర్యుషితం మధుసైంధవయుక్తం ఉత్కారికాం సాంద్రమాత్రం పాయయేత। ... మదనఫలమజ్జచూర్ణం వా తతా, ... పరిభావితం మదనఫలకషాయేణ, మదనఫలమజ్జసిద్ధస్య వా పయసః సంతానికాం క్షౌద్రయుక్తాం మదనఫలమజ్జసిద్ధం వా పయః, మదనఫలమజ్జసిద్ధేన వా పయ సా యవాగూం అథోభాగాస్రుక్పిత్తహృద్దాహయోః మదనఫలమజ్జసిద్ధస్య వా

పయసః దధిభావముపగతస్య దధ్యుత్తరం దధి వా కఫప్రసేక ఛర్ది మూర్ఛా తమకేషు, మదనఫలమజ్జ రసం స్నేహం వా భల్లాతకస్నేహవదాదాయ ఫాణితీ భూతం లేహయేత్। ఆతపపరిశుష్కం వా మదనఫలమజ్జచూర్ణం జీవంతీకషాయేణ, పిత్తే కఫస్థానగతే, మదనఫలమజ్జకషాయం వా పిప్పల్యాది ప్రతీవాపం తచ్చూర్ణం వా నింబకూపికా కషాయయోరంతరేణ సంతర్పణంకఫజవ్యాధిహరం మదనఫలమజ్జచూర్ణం వా మధుకకాశ్మర్య ద్రాక్షాకషాయేణ।

మదనపుష్పప్రయోగవిధానము.

మదనపుష్పాణాం ఆతపపరిశుష్కాణాం అన్యతమేన ఆలోడ్య మధుసైంధవయుక్తాం పుష్పచూర్ణమాత్రాం పాయయిత్వా వామయేత్॥

పై విధముగ సిద్ధము జేసిన మదనఫలబీజములను ఒక ముష్టి ప్రమాణము గ్రహించి అతిమధుర కషాయమందు గాని, కోవిదారాది కషాయమందు గాని, జేర్చి కొద్దిగ వెచ్చజేసి యొకరాత్రియుంచి మరునాడు అందు తేనె, సైంధవ లవణమును జేర్చి వైద్యుడు ఉత్తరాభిముఖుడై రోగిని పూర్వాభిముఖునిగా గూర్చుండబెట్టి యథావిధిగ పానము జేయించవలెను. ఈ ప్రయోగము వలన బాగుగ వమనమగును. మరియు, మదనఫలమజ్జచూర్ణమును మదనఫల మజ్జ కషాయమునందు భావనజేసి మదనఫల కషాయముతో నిచ్చినను, లేక, మదనఫల మజ్జ కషాయముతో గాచిన పాలయందలి సంతానిక (మీగడ) ను తేనెతో జేర్చిగాని, మదనఫల మజ్జ కషాయముతో గాచిన పాలనుగాని ఇచ్చినను వమనమగును. మదనఫల మజ్జ కషాయముతో గాచిన పాలతో సిద్ధముజేసిన యవాగును అధోగ రక్తపిత్తము నందును, హృదయ దాహము నందును ఇయ్యవచ్చును. కఫప్రసేకము, ఛర్ది, మూర్ఛ, తమకశ్వాస వీనియందు మదనఫల మజ్జ కషాయముతో గాచిన పాలను తోడుబెట్టినట్టి పెరుగునుగాని, అట్టి పెరుగుపైని తేటనుగాని వమనార్థమై యియ్యవలెను. మరియు మదనఫల రసమునుగాని, అందుండి తైలమును జీడిగింజలనుండి తైలమును గ్రహించి నటుల గ్రహించి యీ తైలమునుగాని కొద్దిగ చిక్కబడువరకును గాచి యొసంగవలెను. పిత్తము కఫస్థానమును బొందినప్పుడు మదనఫల మజ్జ చూర్ణమును జీవంతీ కషాయముతో నొసంగవలెను. మదనఫల మజ్జ కషాయమునందు

పిప్పల్యాదిగణ చూర్ణమును జేర్చియు పై వికారమునం దీయవలెను. మదనఫల మజ్జ చూర్ణమును వేపచెక్క కషాయముతో గాని జిల్లేడువేరు కషాయముతో గాని యిచ్చిన నది సంతర్పణమును, కఫజవ్యాధిని బోగొట్టునదియు నగును. మరియు నందు మదనఫల మజ్జ చూర్ణమును యష్టిమధుకము, పెద్దగుమ్మిడి ద్రాక్ష వీని కషాయముతో గాని యీయవచ్చును.

మదన పుష్పములను ఎండబెట్టి మెత్తగా చూర్ణించి రొకపలము గ్రహించి ఉత్తరేణు, జిల్లేడు, వేప వీనిలో నే యొక కషాయము నందైన గలిపి అందు తేనె సైంధవ లవణమును జేర్చి పానము జేయించిన బాగుగా వమనమగును. (సు-సూ-అ-43.)

(7) ప్రయోగములు:—

1. శూలయందు మదనఫల ప్రయోగము.

"నాభిలేపాజ్జయేచ్ఛూలం మదనః కాంజికాన్వితః॥"

శూలయందు మదనఫలమును కాంజికముతో నూరి నాభికి లేపనము చేసిన శీఘ్రముగ శూల శమించును. (చ-ద.)

(8) యోగములు:—

1. మదనాది చూర్ణము (వ - ఉ - ఉదావర్త.)

ఉపయోగములు:—నాడిద్వారా గుదమునందుంచిన ఉదావర్తము శమించును.

2. మదనఫలాది లేపము (భైషజ్య - యోనిరోగ.)

ఉపయోగములు:—లేపనముజేసిన యోనిమార్దవమును జేయును. యోని గాఢీకరణ మగును.

3. మదనఫలాదివర్తి (బ - రా - ఉదరరోగ.)

ఉపయోగములు:—గుదమునందుంచిన మలబంధమును బోగొట్టును.

(9) Actions and uses:—A good substitute for Ipecacuanba The dry pulp is emetic, the thick shell and hard seeds are not emetic at all. The native Hakims give the pulp in Combination with aromatics in dysentery, fever (ague), head-ache etc. It Contains Valerianic acid hence the tincture (ethereal tincture I in 5 dose 15 to 60 ms) is used as a nervine calmative and antispasmodic in whooping Cough and mania. The shell and seeds are cathartic and anthelmintic, and used to remove biliousness and worms in children. The fruit is used to procure abortion and as a fish poison like coculus. A Paste of it is locally applied as a discutient to disperse swellings and abscesses.

R. N. Khory. II. P. 342.

---

# 143

## మధూకం - ఇప్పచెట్టు (స్థలజ) (క)

---

### భాషాంతర నామములు

హింది - మహువా, (అ) మొవా (అ). మరాఠీ - మోహడా. గుజరాతి - మహుడో. మలయాళం - ఇరుప్ప, ఇలుప్ప. కర్ణాటకం - ఇప్పె. ద్రావిడం - ఇలుప్పై.

### నైసర్గిక స్వరూప వర్ణనము

### Natural Order—Sapotaceae

పొగడ కుటుంబము

ఇప్ప - Bassia latifolia

**ఆకులు:**— ఒంటరిచేరిక, కుఱుచ తొడిమ. లఘుపత్రములు సమగోళాకారము, సమాంచలము, విషమరేఖపత్రము, కొన వాలముగలదు, పత్రము దిపసుగా నుండును. రోమములు లేవు.

పుష్పమంజరి:—కణుపునందులందుండి. సాధారణముగ నొకటికంటె నెక్కువయే పుట్టుచున్నవి. పువ్వులు చిన్నవి. సరాళములు.

పుష్పకోశము:—అసంయుక్తము. రక్షకపత్రములు రెండు వరుసలుగా నున్నవి. ఒక్కొక వరుసలో నాలుగేసి గలవు. పైవరుసలో నివి పెద్దవి. అవి మొగ్గలో నొకదాని నొకటి తాకుచుండును. రెండువ వలయములోనివి అల్లుకొనియుండును. నీచము.

దళవలయము:—సంయుక్తము. గొట్టము మిక్కిలి పొట్టిది. తమ్మెలు మూడు వలయములుగ నున్నవి. ఒక్కొకదానియందు ఎనిమిదేసి గలవు. మూడవ వలయమునందలి తమ్మెలు కింజల్కములపై కిరీటమువలె నేర్పడుచున్నవి. ఇవియే నిజమైన దళవలయపు తమ్మెలు. పైనున్న రెండువరుసలున్ను వీనినుండి పుట్టిన పొలుసులు. తెలుపురంగు. ఎండిన తరువాత గోధుమవర్ణము వచ్చును. మంచివాసన గలదు.

కింజల్కములు:—ఎనిమిది. వీనిమధ్య గొడ్డు కింజల్కములు గూడ గలవు. పుప్పొడితిత్తులు సన్నము. సంయోజకములు వీనిపైకి వచ్చుచున్నవి. గొడ్డువి పైవలయము, కావున కింజల్కములు దళవలయమున కెదురుగా నున్నవి.

అండకోశము:—అండాశయము ఉచ్చము. దీనిపై రోమము లున్నవి. 8 గదులు. కీలము ఒకటి. లావుగను పొట్టిగను నున్నది. కాయ కండకాయ, ఒకగది. ఒక గింజమాత్ర మున్నది.

ఈ కుటుంబము ఉష్ణదేశములందు మాత్రము గలదు. దీనిలో (చెట్లు, గుబురు మొక్కలును గలవు. ఆకులు ఒంటరిచేరిక; సమాంచలములు. వీని పువ్వులలో పుష్పకోశము రెండు వలయములుగ నున్నది. కొన్నిటిలో దళవలయపు తమ్మెల లోపలివైపునను; గొన్నిటిలో పైవైపునను పొలుసులు గలవు.

## పర్యాయ పదములు

శ్లో॥ మధూకో గుడపుష్పః స్యాత్ మధుపుష్పో మధుస్రవః ।
వానప్రస్థో మధుష్ఠీలః...... ॥

మధూకము, గుడపుష్పము, మధుపుష్పము, మధుస్రవము, వానప్రస్థము, మధుష్ఠీలము అనునవి స్థలజమధూక నామములు.

## స్థలజమధూక పుష్పగుణములు

శ్లో॥ మధూకపుష్పం మధురం శీతలం గురు బృంహణం।
బలశుక్రకరం ప్రోక్తం వాతపిత్తవినాశనం ॥

మెట్టమీదపుట్టిన యిప్పపువ్వు మధురరసమును, గురుగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. బృంహణము. బలమును, శుక్రమును వృద్ధి బొందించును. వాతపిత్తములను శమింపజేయును.

## జలమధూకం - నీటిఇప్ప (ఖ)

శ్లో॥ జలజోఽత్ర మధూలకః ॥
జలజమధూకము మధూలకమని వ్యవహరింపబడును.

## జలమధూక గుణములు

శ్లో॥ జ్ఞేయోజలమధూకస్తు మధురో వ్రణనాశనః ॥
వృష్యో హంతి హరః శీతః బలకారీ రసాయనః ॥

నీటియొద్దునబుట్టు ఇప్పచెట్టుపువ్వు మధురరసమును, శీతవీర్యమును గలిగి యుండును. వెంటనే శుక్రమును గలిగించును. బలమును గలిగించును. రసాయనము. వ్రణమును, వాంతిని బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(స్థలజమధూక) - గుణపుష్పము, మధుపుష్పము, మధుస్రవము, మధుష్ఠీలము, (లోధ్రపుష్పము, మాధవము.) (జలజమధూక - (దీర్ఘపత్త్రికము, మధుపుష్పము, కీరేష్టము.)

(ఖ) గుణబోధకములు:—(స్థలజమధూక) - మధుపుష్పము - (జలజమధూక) (మధుపుష్పము.)

(గ) ఉత్పత్తిబోధకములు:— (స్థలజమధూక) వానప్రస్థము (జలజమధూక) జలజమధూకము.

(2) శబ్దార్థములు:—

గుడపుష్పము - బెల్లమువలె తియ్యగానుండు పుష్పము. మధుపుష్పము - తేనెవంటి రసముగల పుష్పము (లేక) మధురరసమును గలిగినట్టి పుష్పము. మధుస్రవము - తేనెను స్రవించునట్టి పుష్పము. మధుష్ఠీలము - లోన తేనెవంటి స్రవముతో గూడిన పుష్పము, లోధ్రపుష్పము - లొద్దుగపువ్వుల వంటి యాకృతిగల పుష్పము. మాధవము వసంతకాలమున పుష్పించునట్టిది. దీర్ఘపత్త్రికము - పొడవుగనుండు పత్త్రములను గలది. కీరేష్టము - చిలుకలకు మిగుల నిష్టమగునది. వానప్రస్థము - అడవులం దుత్పన్నమగునది. జలజమధూకము - నీటియొద్దనుండుత్పన్నమగునది.

(3) భేదములు:—

ఇది స్థలజ-జలజ భేదముచే రెండు విధములుగా నుండి, మొత్తగా పెరుగు వృక్షజాతులలో నుత్పత్తిగలిగి మధురవర్గమునందును, సంధానద్రవ్యములందును గణింపబడు చున్నది. విశేషముగా నీ యిప్పచెట్ల పుష్పములే గ్రహింపబడి వాడబడుచున్నవి. ఈ పుష్పములు ఎల్లప్పుడును తేమగానుండి యొక విధమగు సువాసనతో గూడియుండును. వీని నెల్లరును భక్షించుదురు. ఇవి వనచరులచే గొనిరాబడి పట్నములందు విక్రయింప బడుచుండును. దీనివెల కొంచెము హెచ్చుగనే యుండును, అయితే పైనిజెప్పిన భేదములలో బజారులందు ఏది లభ్యమగుచున్నదో గనిపెట్టుట కష్టము. ఇది మిగుల మధురముగ నుండుటచే రాజులకు కానుకగా నిచ్చు వస్తువులలో నిది యొకటిగా వ్యవహరింప బడు చున్నది. వీనినుండి మద్యమును దీయుదురు. ఇది మిగుల హృద్యముగనుండును. ఇదియే పుష్పాసవమని గూడ వ్యవహరింప బడుచున్నది. ఇది యిట్టి స్వభావ మును గలదియగుటచేతనే సంధానద్రవ్యముగా జెప్పబడు చున్నది. మొత్తము మీద నీ పుష్పము వైద్యమునందు హెచ్చుగ నుపయోగింపబడు చున్నట్లుగ దెలియగలదు.

(4) విశేషగుణములు:—

(క) స్థలజమధూకపుష్పము - వెంటనే శుక్రమును గలిగించును. హృదయమునకు హితమైనది. పిత్తవిదాహమును బోగొట్టును. (రా-ని)

(ఖ) ఫలము - మధురరసమును, గురుగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. శుక్రమును వృద్ధిపొందించును. కొద్దిగ హృదయమునకు హితమైనది. వాతపిత్తములను శమింపజేయును. తృష్ణను, రక్తదోషమును, దాహమును, శ్వాసను, క్షతక్షయమును బోగొట్టును. (భా-ప్ర.)

(గ) తైలము - మధురరసమును, కషాయానురసమును, పిచ్ఛిలగుణ మును గలిగి యుండును. కఫపిత్తజజ్వరమును, పిత్తజదాహమును బోగొట్టును. (భా-ప్ర-టీ.)

(ఘ) మధూకత్వక్ - వ్రణశోధనమును, వ్రణరోపణమును జేయును. రక్తపిత్తమును బోగొట్టును. (రా-వ)

(చ) మధూకఫాణిత - మధుర రసమును, రూక్షగుణమును గలిగి యుండును. వాతపిత్తములను వృద్ధి బొందించును. కఫమును శమింప జేయును. వస్తిని దూషింప జేయును. (సు-సూ-అ-45.)

(5) ప్రయోగములు:—

1. రక్తపిత్తమునందు మధూకప్రయోగము.

"తథా మధూకస్య తథాసనస్య క్షారాః ప్రయోజ్యాః విధినైవ తేః॥"

ఇప్పచెక్క, వేగిసచెక్క, కానియొక్క క్షారములను గ్రహించి యథా విధిగ ప్రయోగించిన రక్తపిత్తము శమించును. (చ-చి-అ-4)

2. గ్రహణియందు మధూక ప్రయోగము.

"మధూక పుష్పస్వరసం శృతమర్ధ క్షయీకృతం।
క్షౌద్రపాదయుతం శీతం పూర్వవత్ సన్నిధాపయేత్।
తంపిబన్ గ్రహణీ దోషాన్ జయేత్సర్వాన్ హితాశినః॥"

ఇప్పపువ్వు స్వరసమును గ్రహించి సగము మిగులువరకు గాచి అందు నాల్గవవంతు తేనెను జేర్చి సంధి బంధనముజేసి యొక మాసముంచి పిమ్మట యథాప్రమాణముగ పానముజేయుచు హితాహారమును సేవించుచుండిన గ్రహణి శమించును. (చ-చి-అ-19.)

3. శిరోరోగమునందు మధూకప్రయోగము.

"నావనం శర్కరా ద్రాక్షా మధూకైర్వాపి పిత్తజే॥"

ఇప్పపువ్వు స్వరసము చక్కెర, ద్రాక్షరసము. వీనితో నస్యముజేసిన పిత్తజ శిరోరోగము శమించును. (చ-చి-అ-26.)

4. శుక్రవైవర్ణ్యమునందు మధూకప్రయోగము.

"మధూకసారం మధునా యోజయేచ్చాంజనే సదా॥"

ఇప్పసారమును తేనెతో గలిపి యంజనమువేసిన నేత్రశుక్రవైవర్ణ్యము శమించును. (సు-ఉ-అ-12.)

5. హిక్కయందు మధూక ప్రయోగము.

"క్షౌద్రం సితాం నాగరకేసరం చ పిబేద్రసేనేక్షు మధూకజేన॥"

చెరకురసము, ఇప్పపువ్వులరసము వీనియందు తేనెను, చక్కెరను, నాగకేసర చూర్ణమును గలిపి సేవించిన హిక్క శమించును. (సు-ఉ-అ-50.)

6. ఛర్దియందు మధూక ప్రయోగము.

"మధూక మధ హ్రీబేరం ఉత్పలాని మధూలికా।
లీఢ్వా చూర్ణాని మధునా సర్పిషా చ వమిం జయేత్॥"

ఇప్పపువ్వు, కురువేరు, కలువగడ్డలు, తీటియిప్పపువ్వు, వీనిని మెత్తగా చూర్ణించి మధుఘృతములతో సేవించిన ఛర్ది శమించును. (సు-ఉ-అ-39.)

7. కర్ణరోగమునందు మధూక ప్రయోగము.

"రసమామ్ర కపిత్థానాం మధూకః ధవ శాలజం।
పూరణార్థం ప్రశంసంతి తైలం వా తైః విపాచితం॥"

ఇప్ప స్వరసమునుగాని, దీనితో గాచిన తైలమునుగాని కర్ణపూరణము జేసిన కర్ణరోగము శమించును. (సు-ఉ-అ-21.)

8. అపచియందు మధూక ప్రయోగము.

"మధూక సారశ్చ హితో ఽవపీడే॥"

ఇప్పసారమును నస్యము జేసిన అపచి శమించును. (సు-చి-అ-18.)

9. భగ్నాస్థియందు మధూక ప్రయోగము.

"మధూకస్య త్వచః...వా కుశార్థ ముపసంహరేత్॥"

ఇప్పపట్టను భగ్నాస్థికి కుశముగా (పైనివేసి కట్టబడునది) నుపయోగించిన శీఘ్రముగా నస్థి సంధాన మగును. (సు-చి-అ-3.)

10. విషమునందు మధూక ప్రయోగము.

"సమ్యక్ మధూక సారేణ గోమూత్ర భావితేన తు।
దద్యా ద్విషాపహం నస్యం సిద్ధం చాపి ప్రలేపనం॥"

ఇప్పసారమును బాగుగా గోమూత్రముతో భావనజేసి నస్యమును, లేపనమును జేసిన విషము శమించును. (గ-ని.)

11. ఆయుర్వృద్ధికి మధూక ప్రయోగము.

"సద్యశ్చ్యుతం స్థూల మధూకపుష్పం సంశోధితం కేసరధూళివర్జితం।
సంపాచితం శుభ్రసితాఘృతాభ్యాం సజీరకం జీవనదం హి జీవినాం॥"

అప్పుడే చెట్టునుండి జారిపడిన లావుగానుండు ఇప్పపువ్వులను కేసరములు రజస్సు మొదలగునవి లేకుండునట్లు శుభ్రపరచి నేతిలో భర్జనజేసి అందు చక్కెర జేర్చి సేవించిన ఆయుర్వృద్ధి యగును. (క్షే-కు.)

(6) యోగములు:—

1. పుష్పాసవము (మధూక) - (వా - గ్రహణి.)

మాత్ర:—1 పలం.

ఉపయోగములు:—గ్రహణి, శోష, కుష్ఠము, కిలాసము, ప్రమేహము, రక్తపిత్తము ఇవి శమించును. మిగుల బృంహణము.

---

# 144

# మయూరశిఖా - నెమలిజుట్టుమొక్క

---

## భాషాంతర నామములు

హింది - మలయాళం - మయిలోశిఖా. కర్ణాటకం - హాతేనుమువ. ద్రావిడం -

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Chenopodiaceae

ఉపోదకీయ కుటుంబము

నెమలిజుట్టుమొక్క - Celosia Cristata (Eng-Garden Cockscomb)

ఈ కుటుంబమునందు కొయ్యపిప్పలి, సాకంటపూవులు, కొయ్యలకూర, రేవుకాడ, చిలకూర, మొదలగునవి కలవు. ఇది చిన్నగుబురు మొక్క. ఉత్తర సర్కారుల యందును తూర్పు సముద్ర తీరమందును పశ్చిమ సముద్ర తీరమందును దొరకునని లషింగ్టన్‌లో 89 నంబరున వర్ణింపబడి యున్నది.

## పర్యాయ పదములు

శ్లో॥ మయూరాఖ్యా శిఖాప్రోక్తా సహస్రాంఘ్రిర్మధుచ్ఛదా॥

మయూరశిఖ, సహస్రాంఘ్రి, మధుచ్ఛద యనునవి మయూరశిఖా నామములు.

## మయూరశిఖా గుణములు

శ్లో॥ నీలకంఠశిఖా లఘ్వీ పిత్త శ్లేష్మాతిసారజిత్॥

నెమలిజుట్టు మొక్క లఘుగుణమును గలిగి యుండును. పిత్తకఫములను శమింపజేయును. అతిసారమును బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—మయూరశిఖ. సహస్రాంఘ్రి.

(ఖ) గుణబోధకములు:—మధుచ్ఛద.

(2) శబ్దార్థములు:—

మయూరశిఖ - నెమలిజుట్టును బోలిన పుష్పములను గలది. సహస్రాంఘ్రి - విశేషముగా వేళ్లతో గూడినది. మధుచ్ఛద - పత్రములందు మధురరసమును గలది.

N. B:— ఇది వైద్యకశబ్ద సింధువునుబట్టి క్షుపజాతిలో నుత్పత్తి గలిగి నట్టిదిగా దెలియగలదు. పైని వివరించిన నెమలి జుట్టును బోలిన పుష్పములను గలిగి యుండుట, విశేషముగా వేళ్లు గలిగియుండుట, పత్రములందు మధుర రసమును గలిగియుండుట యనే విషయములు దప్ప దీనిని గురించిన యితర విశేషము లెందును గానరాకున్నవి. గర్భధారణ శక్తిని గలిగించుటకై ఉప యోగింపబడు లక్ష్మణా మూలమువంటి శక్తిగలది యనియు, విషమును హరింప జేయునది యనియు దీని ప్రయోగములను బట్టి దెలియగలదు.

(3) విశేషగుణములు:—

మధురరసమును గలిగియుండును. వశీకరణము జేయును. మూత్రకృచ్ఛ్రమును, బాలగ్రహ దోషములను బోగొట్టును. (రా-ని.,) అమ్లరసమును, కషాయ రసమును, శీతవీర్యమును, అమ్లవిపాకమునుగలిగియుండును. (ని-ర.)

(4) ప్రయోగములు:—

1. గర్భధారణకై మయూర శిఖాప్రయోగము.

"మూలం భుజంగారి శిఖాసముత్థం దుగ్ధేన సంయుక్త మృతౌ నిపీతం
గర్భస్య హేతుః ప్రమదా జనస్య స్యాల్లక్ష్మణా మూల మపీత్థ మేవ॥"

నెమలిజుట్టు మొక్క వేరును కల్కముగా నూరి పాలలో గలిపి ఋతుకాలమున స్త్రీ సేవించినచో గర్భధారణశక్తి కలదియగును. (గ-ని.)

2. సర్పవిషమునందు మయూరశిఖా ప్రయోగము.

"సాజ్యా మయూర చూడా తు పీతా తండుల వారిణా।
సర్వసర్పవిషం హన్యాత్ కాకజంఘాథవా ధ్రువం॥"

నెమలిజుట్టు మొక్క కల్కమునందు నెయ్యిజేర్చి బియ్యపు కడుగుతో సేవించినచో సమస్త సర్పవిషములు శమించును. (గ-ని.)

---

# 145

# మరిచం - మిరియము (కి)

---

## భాషాంతర నామములు

హింది - గోలమిరచ్, కాలీమిర్చ్, కాలామిర్చ్, మరాఠి - మిరేం, మిరీం, గుజరాతి-కాళా, మరీ, తీఖూం, మరీ, మరచాం. మలయాళం - కురుముళగ. కన్నడం - కరిమెణసు. ద్రావిడం - మిళహు.

(Eng-Black pepper)

## నైసర్గిక స్వరూప వర్ణనము

(Natural Order—Piperaceae

మిరియపు కుటుంబము

మిరియము - Piper Nigrum

( 612 వ పేజీ చూడుము )

## పర్యాయ పదములు

శ్లో॥ మరిచం వేల్లజం కృష్ణం ఊషణం ధర్మపత్తనం ॥

మరిచము, వేల్లజము, కృష్ణము, ఊషణము, ధర్మపత్తనము అనునవి మరిచనామములు.

## మరిచ గుణములు

శ్లో॥ మరిచం కటుకం తీక్ష్ణం దీపనం కఫవాతజిత్ ।
ఉష్ణం పిత్తకరం రూక్షం శ్వాసశూల క్రిమీన్ హరేత్ ॥

మిరియము కటురసమును, తీక్ష్ణరూక్షగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. పిత్తమును ప్రకోపింపజేయును. కఫవాతములను శమింపజేయును. శ్వాసమును, శూలను, క్రిములను బోగొట్టును.

## ఆర్ద్రమరిచ గుణములు

శ్లో॥ తదార్ద్రం మధురం పాకే నాత్యుష్ణం కటుకం గురు,
కించిత్తీక్ష్ణగుణం శ్లేష్మప్రసేకి స్యాదపిత్తలం॥

పచ్చిగనుండు మిరియములు కటురసమును, గురుగుణమును, కొద్దిగ తీక్ష్ణగుణమును, కొద్దిగ ఉష్ణవీర్యమును, మధురవిపాకమును గలిగి యుండును కొద్దిగ పిత్తమును వృద్ధిపొందించును. శ్లేష్మమును బయటకు వెడలింపజేయును.

## వి శే షాం శ ము లు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—కృష్ణము, ఊషణము.

(ఖ) గుణబోధకములు:—మరిచము.

(గ) ఉత్పత్తిబోధకము:—ధర్మపత్తనము.

(2) శబ్దార్థములు:—

కృష్ణము - నల్లగనుండునది. ఊషణము,- కారముగ నుండునది. తాపమును గలిగించునది. మరిచము - విషమును నశింపజేయును. ధర్మపత్తనము-ధర్మపురి (Dellhi) యందుత్పన్నమగునది.

(3) భేదములు:—

మిరియాలు కృష్ణ - శ్వేత (నలుపు - తెలుపు) భేదముచే రెండు విధములుగా నుండును. అందు తెల్లమిరియము "శో భాంజనకబీజం సితమరిచ మితివృద్ధ వైద్యాః॥" మునగగింజయని కొందరు చెప్పుదురు. మరియు, "కటువీర మిరపకాయ" యనునది మిరియపుజాతిలోనిదిగా వ్యవహరింపబడుచున్నది.

(4) విశేషగుణములు:—

(క) తిక్తానురసమును గలిగి యుండును. (ధ-ని.) హృద్రోగమును బోగొట్టును. (రా-ని.)

(ఖ) శ్వేతమరిచగుణములు:—

"కటూష్ణం శ్వేతమరిచం విషఘ్నం భూతనాశనం" ॥
అవృష్యం దృష్టిరోగఘ్నం యుక్త్యాచైవ రసాయనం" ॥

తెల్లని మిరియములు కటురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. కొద్దిగ వృష్యముగ నుండును. యుక్తిగ నుపయోగించిన రసాయనముగను. విషమును, భూతవికారమును, నేత్రరోగమును బోగొట్టును. (రా-ని.)

మరియు,

"కటూష్ణం లఘుతత్ శుష్కం అవృష్యం కఫవాతజిత్ ।
నాత్యుష్ణం నాతిశీతం చ వీర్యతో మరిచం సితం ॥
గుణవన్మరిచేభ్యశ్చ చక్షుష్యం చ విశేషతః" ॥

ఎండిన తెల్లమిరియాలు కటురసమును, లఘుగుణమును గలిగియుండును. ఎక్కువ యుష్ణముగానట్టియు, నెక్కువ శీతముగానట్టియు వీర్యమును గలిగి యుండును. కొద్దిగ వృష్యముగ నుండును. విశేషముగ నేత్రములకు హితకారిగ నుండును. ఇది యితర మిరియములకంటె శ్రేష్ఠమైనదిగ నుండును. (సు-సూ-అ 46.)

(గ) కటువీరాగుణములు:—

"కటువీరాగ్నిజననీ బలాసఘ్నీచ దాహినీ ।
హంత్యజీర్ణం విషూచీం చ వ్రణం క్లిన్నంసుదారుణం॥
తంద్రాం మోహం ప్రలాపం చ స్వరభేద మరోచకం ।
నరం లుప్తధనం క్షీణం సన్నిపాతనిపీడితం ।
నష్టేంద్రియగణం తీక్ష్ణం మృత్యోః ఆకృష్యజీవయేత్" ॥

మిరపకాయ తీక్ష్ణగుణమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. దాహమును గలుగజేయును. కఫమును శమింపజేయును. అజీర్ణము, విషూచిక, క్లిన్నమును దారుణము (దుష్ట) అగు వ్రణము, తంద్ర, మోహము, ప్రలాపము, స్వరభంగము, అరుచి అను నీ రోగములను బోగొట్టును. మరియు

సన్నిపాతరోగముచే పీడింపబడును మిగుల శుష్కించి యింద్రియపటుత్వమును, ధారణాశక్తియు లేనివాడై మరణమునకు ఆసన్నమగువానిని జీవింపజేయును.
(ఆత్రేయసంహిత.)

(5) ప్రయోగములు:—

1. కాసమునందు మరిచ ప్రయోగము.

"లిహ్యాన్మరిచచూర్ణం వా సఘృత క్షౌద్రశర్కరం।
సర్వకాసహరం శ్రేష్ఠం లేహం కాసార్దితో నరః"॥

మిరియాలచూర్ణము, చక్కెర, నెయ్యి, తేనె వీనిని ఏకముగజేసి కాసరోగికిచ్చిన సర్వకాసలు బోవును. (చ-కాసచికిత్స.)

2. అపతానకవాతమునందు మరిచ ప్రయోగము,

అభుక్తవతా పీత మమ్లం దధి మరిచ వచా యుతం అపతానకం హంతి

అపతానక వాతమునందు నిరాహారుడై పుల్లని పెరుగును మిరియాలు, వస వీని చూర్ణమును ఏకముగాజేసి పానముజేసిన హితము. (సు-చి-అ 5.)

3. ప్రతిశ్యాహికయందు మరిచ ప్రయోగము.

"పిబతః సూక్ష్మం రజో మరిచజన్మ వా।
చిరకాలానుషక్తాపి నశ్యత్యాశు ప్రవాహికా"॥

మిరియాలచూర్ణమును సేవించిన చిరకాలమునుండి బాధించెడు ప్రవాహిక గూడ శీఘ్రముగ శమించును. (వా-చి-అ 9.)

4. రాత్ర్యంధమునందు మరిచ ప్రయోగము.

"దధ్నా విఘృష్టం మరిచం రాత్ర్యంధ్యాంజన ముత్తమం"॥

రాత్ర్యంధము (రేచీకటి) నందు మిరియమును పెరుగుతో నూరి యంజనము వేసిన హితము. (వా-ఉ-అ 13.)

5. ఘృతపానపాకార్థము మరిచ ప్రయోగము.

"సర్పిః। మరిచాదపి తచ్ఛీఘ్రం పాకం యాత్యేవ"॥

ఘృతమును బానముజేసిన పిమ్మట మిరియాలను సేవించిన యది శీఘ్రముగ జీర్ణమగును. (భా-ప్ర.)

6. అధిక నిద్రాప్రశమనమునకై మరిచ ప్రయోగము.

"క్షౌద్రాశ్వలాలా సంఘృష్టైః మరిచైః నేత్రాంజనాత్ ।
అతినిద్రా శమం యాతి తమస్సూర్యోదయాదివ" ॥

మిరియాలను తేనె, గుఱ్ఱపుచొంగ వీనితో నరుగదీసి నేత్రములకు అంజనము వేసిన అధిక నిద్ర తగ్గును. (భా-ప్ర.)

7. పీనసమునందు మరిచ ప్రయోగము.

"సర్వేషు సర్వకాలం పీనసరోగేషు జాతమాత్రేషు ।
మరిచం గుడేన దధ్నా భుంజానః సుఖం లభతే" ॥

పీనసరోగములందు అన్ని కాలములయందును మిరియాలను బెల్లము, పెరుగు వీనితో సేవించిన హితకరముగ నుండును. (భా-ప్ర.)

8. నిద్రగలుగుటకై మరిచ ప్రయోగము.

"మరిచం లాలయాఘృష్టం కస్తూర్యాంజనమిష్యతే ।
త్రిరాత్రాదపి సన్నష్టాం నిద్రామాప్నోతి మానవః" ॥

మరియాలను మనుష్యలాలతో నూరి యందు కస్తూరిని జేర్చి యంజనము వేసిన మూడు దినములనుండియు లేనట్టి నిద్ర సుఖముగా గలుగును. (వం-సే.)

9. శిశువుల శోథరోగమునందు మరిచ ప్రయోగము.

"మరిచం నవనీతాఢ్యం శోథఘ్నం భక్షయేత్ శిశుః" ॥

మిరియాలను అధికముగా వెన్నతో జేర్చి సేవించిన శిశువుల శోథ రోగము శమించును. (వం-సే)

10. కృశునకు మరిచ ప్రయోగము.

"మాసద్వయం ప్రమరిచాన్దశమరిచో పేతమేక తాంబూలం ।
ఖాదిత్వా మహిషముంభః పిబేత్ కృశః స్యాద్భవతి స్థూలః" ॥

పది మిరియాలచొప్పున రెండు మాసములు ప్రతిదినమును తాంబూలముతో సేవించి శీతలోదకపానము జేసిన కృశించినట్టివాడు స్థూలుడగును. (వై-మ.)

11. పాండువునందు మరిచ ప్రయోగము.

"అభినవ గోమూత్రేణ మరిచస్య రజః పిబతాం ॥
హుతవహ దేశకాల బలదోషసాత్మ్యవతాం ।

జనునకరాంగులి వివరకూర్పర జానుభవాః ।
కంగుహా బాంధవాః సపది యాంతి రుజశ్శమనం ॥

మిరియాలచూర్ణము అప్పుడే గాచిన ఆవునేతితో గలిపి అగ్నిని దేశకాలాదుల ననుసరించి సేవించిన శరీరమునం దెల్లెడల బుట్టిన గజికురుపులు వెంటనే శమించును.

(వై-మ.)

12. నేత్రకండూ - తిమిరములయందు మరిచ ప్రయోగము.

"చించాస్వరసనిష్పిష్టం మరిచం సాయంతనే తథా సాక్షం।
అక్షినిషిక్తం శమయతి కండూం తిమిరం చ వాతోత్థం" ॥

మిరియాలను చింతాకుస్వరసముతో నూరి ప్రతిదినము సాయంకాలమున నేత్రములకు అంజనము వేసిన వాతముచే నేత్రములకుగలుగు దురదలు, తిమిర రోగమును శమించును.

(వై-మ.)

(6) యోగములు:—

1. మరిచాదిచూర్ణం - (చ-గ్రహణి.) మాత్ర:-$\frac{1}{8}$ తులం.

ఉపయోగములు:—వాతజగ్రహణి, అరుచియు శమించును.

2. గుగ్గులుమరిచాద్యంలేపం - (వా-కుష్ఠ.)

ఉపయోగములు:—చక్రికతైలముతో లేపనముజేసిన సర్వకుష్ఠములు శమించును.

3. మరిచాద్యంఘృతం - (భైషజ్య-గ్రహణి.) మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—అగ్నిమాంద్యము, గ్రహణి. విష్టంభము, ఆమదోషము, ప్లీహాభివృద్ధి, కాస, శ్వాస, క్షయము, అర్శస్సు, భగందరము ఇవి శమించును.

4. కోలాదిమండూరం - (భైషజ్య-శూల.) మాత్ర:-5 యవలు.

ఉపయోగములు:—వాతకఫజశూల, పరిణామశూల ఇవి శమించును.

5. మరిచాద్యాఖ్యతైలం - బృహన్మరిచాద్యతైలం - (భైషజ్య-కుష్ఠ.)

ఉపయోగములు:—దీని నభ్యంగము జేసిన పామ, విచర్చిక, దద్రు, కండు, విస్ఫోటము, వలీపలితములు, నీలిక, వ్యంగము ఇవి శమించును.

6. తేకరాజ(భృంగరాజ) మరిచం -(సహస్రయోగ-చూర్ణ ప్రకరణం) మాత్ర: $\frac{1}{8}$ తులం,

ఉపయోగములు: —కాస, శ్వాసయు శమించును.

## మిరియములుగల కొన్ని యోగములు

అమృతారిష్ట, అశ్వగంధారిష్ట, ఆనందభైరవిరసవటి, ఇచ్ఛాభేదివటి, కర్పూరాద్యాసవము, కస్తూరిమాత్ర, కాంచనారగుగ్గులు, గోక్షురాదిచూర్ణము, చిత్రకాదివటి, జాతీఫలాది చూర్ణము, తాళిసాది చూర్ణము, ద్రాక్షారిష్ట, పిప్పల్యాసవము, భాస్కరలవణ చూర్ణము, శంఖవటి, శీతాంశురసం, సుదర్శన చూర్ణము, హింగ్వష్టక చూర్ణము మొదలగునవి.

(7) Actions and uses:—It is a local irritant, causing inteuse burning on the skin. In medicinal doses it stimulates the heart, the kidreys and the mucous membrane of the urinary and intestinal fracts. It is eliminated in the urine and foeces. In large doses it causes abdominal pain, vomitting, irritation of the bladder and urethra, and urticaria on the skin. As a gastic stimulant it is chiefly used in flatulance, dyspepsia and atony of the stomach; like cubebs it is given in gonorrhoea, glut and haeworvhoides and other rectal disorders. Piperin acts as an anti periodic and anti pyretic. It rehives intermittent fevers by causing perspiration—The oil is applied to muscular rhenmatic Pains, headache, and to pain of haemorrhoides.

R. N. Khory II P 521.

---

## స్వానుభవము

[ ఉపయోగములు:—జ్వరములయొక్క ప్రారంభావస్థలలో ఇది తరుచుగా నుపయోగింప బడుచున్నది. మరియు దగ్గు, రొంప, పడిశెము, తలభారము వీనిలో కూడ జ్వరాములు రాకుండ ఆపుటకు ఉపయోగింప బడుచున్నది. ఇన్‌ఫ్లూయెంజా జ్వరముయొక్క ప్రారంభములో దీని నుపయోగించుచున్నారు. ఇది బాగుగా జీర్ణశక్తిని వృద్ధిజేయును. అందుచే అతిసారము; అజీర్ణము, కడుపులోనొప్పులు, అగ్నిమాంద్యము, మున్నగువానిలో తరుచుగా నుపయోగింప బడుచున్నది. ఇది

చెమటను పట్టించి విషమజ్వరములను పోగొట్టును. ఊపిరితిత్తులలో చెడుపుడుండి దగ్గు, పడిశెము, శ్వాస మున్నగునవి వచ్చునపుడు దీని చూర్ణమును నెయ్యి, చక్కెర, తేనె వీనితో కలిపి ఇత్తురు. లేక దీని కషాయములో పాలుపోసి కాఫీవలెజేసి ఇత్తురు. ఇది హృదయమునకు ఉత్తేజనమును గలిగించి కఫ్లెను తెంపి వెడలగొట్టును. ఇతర ఔషధములతో జేర్చి కృమిహారముగా నుపయోగింతురు. దీని చూర్ణమును 5 గ్రైనులు గాడిదగడప (Aristolochia dracteata) ఆకులు ఒక గోళీ కాయంత ముద్దతో కలిపి సవాయిరోగములో అన్ని అవస్థల లోను లోనికిత్తురు. బృహదాంత్రము వద్దనుండు ఉండుక-పుచ్ఛమను (Appendix) దానిలో నొక పరికోపము కలిగినప్పుడును (Appendicitis) విషూచిక (Cholera) లోను పైనిజెప్పిన ఔషధమునే అనేక వైద్యులు రహస్యప్రక్రియగా ప్రయోగింతురు. పాలలో మిరియాలువేసి కాచి రాత్రి త్రాగినయెడల రక్తవృద్ధికి చాలమంచిదని చెప్పబడినది. ("మరిచక్వాథితం దుగ్ధం పానే రాత్రౌ ప్రశస్యతే, రసానాం తేన వృద్ధిఃస్యాత్" (హారీతసంహిత) ఈ పాలను బోదకాలు గలవానికి నిత్యము నుపయోగించుట మంచిది. సెగరోగములో తెల్లనిసారవము పడుచున్నప్పుడు దీనిని పాలతోను కలకండ చూర్ణముతోనుకలిపియిచ్చిన కృమిహారముగాను ఉత్తేజకము గాను పనిజేయును.

దీనిని చర్మముపై పట్టువేసినచో మంటను పుట్టించును. తలనొప్పి తగ్గుటకై దీని గంధమునుగాని దీనికి సమము బియ్యమును కలిపి నూరి ఉడికించి ఓర్చదగిన వేడిమి యుండునపుడు గాని నుదుటను పూయుదురు. నరములయందలి ప్రకోపముచే కలిగిన నొప్పులకు దీనిని పైన పూసినచో నొప్పులు తగ్గును. రేచీకటికి మిరియాలను పెరుగుతో నూరి కండ్లలో కలికము వేయవలసినదనియు కంటిచుట్టు పట్టు వేయవలయుననియు వాగ్భటుడు చెప్పియున్నాడు. గజ్జి మున్నగు చర్మవ్యాధులకు మిరియాలచూర్ణమును నేతితోగాని, మూర్కొండాకు రసముతోగాని, గాడిదగడపాకుముద్ద, వెన్న వీనితోగాని కలిపి పైన పూయవచ్చును. ఆ. ల. ]

---

# 146

# మంజిష్ఠా - మంజిష్ట

---

### భాషాంతర నామములు

హిందీ - మజీఠ. మరాటి - మంజిష్ట. గుజరాతీ - మజీఠ. మలయాళం - మంజెట్టి. కన్నడం - మాంజీష. ద్రావిడం - మంజెట్టు.

### నైసర్గిక స్వరూప వర్ణనము

### Natural Order—Rubiaceae

తొగరు కుటుంబము

మంజిష్ట - Rubia Cardifolia (Eng-Madderroot)

(915_వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ మంజిష్ఠా వికసా జింగీ సమంగా కాలమేషికా,
మండూకపర్ణీ భండీరీ భండీ యోజన వల్ల్యపి॥
రసాయన్యరుణా కాలా రక్తాంగీ రక్తయష్టికా,
భండీతకీ చ గండీరీ మంజూషా వస్త్రరంజనీ॥

మంజిష్ఠ, వికస, జింగి, సమంగ, కాలమేషిక, మండూకపర్ణి, భండీరి, భండి, యోజనవల్లి, రసాయని, అరుణ, రక్తాంగి, రక్తయష్టిక, భండీతకి, గండీరి, మంజూష, వస్త్రరంజని అనునవి మంజిష్ఠానామములు.

## మంజిష్ఠా గుణములు

శ్లో॥ మంజిష్ఠా మధురా తిక్తా కషాయా స్వరవర్ణకృత్ ।
గురురుష్ణా విషశ్లేష్మ శోథ యోన్యక్షి కర్ణరుక్॥
రక్తాతిసార కుష్ఠాస్ర వీసర్ప వ్రణ మేహనుత్ ॥

మంజిష్ఠమధురరసమును, తిక్తకషాయానురసములను, గురుగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. శ్లేష్మమును శమింపజేయును. స్వరమును, వర్ణమునుగలుగజేయును. విషము, శోఫ, యోనిశూల, నేత్రశూల, కర్ణశూల, రక్తాతీసారము, కుష్ఠము, రక్తదోషము, విసర్పము, వ్రణము, వ్రమేహము అనునీ వ్యాధులను బోగొట్టును.

## వి శే షాం శ ము లు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—మంజిష్ఠ, వికస, జింగి, సమంగ, మండూకపర్ణి, యోజనవల్లి, అరుణ, రక్తాంగి, రక్తయష్టిక, వస్త్రరంజని.

(ఖ) గుణబోధకములు:—రసాయని.

(2) శబ్దార్థములు:—

మంజిష్ఠ – మనోహారమగు వర్ణమును గలిగియుండునది. వికస, జింగి, సమంగ, అంతటను విస్తరించి ప్రాకునది. మండూపర్ణి – మండూకపర్ణి (సరస్వతియాకు) వంటి యాకులనుగలది. యోజనవల్లి – ఒక యామడదూరము పాడవుగవ్యాపించుతీగె. అరుణ, రక్తాంగి, రక్తయష్టిక – ఎఱ్ఱని వర్ణముగల

పుడకవలె నుండునది. వస్త్రరంజని- వస్త్రములకు ఎర్రనివర్ణమును గలిగించునది. రసాయని - రసాయనగుణముగలది.

(3) భేదములు:—

ఇందు కృత్రిమముగ తయారుచేయబడి బజారునందు విక్రయింపబడు చుండు మరియొక భేదము గలదు. అది మంజిష్ఠకాష్ఠముతో సమముగనుండు ఇతరకాష్ఠములను గ్రహించి. ఎర్రరంగును నీళ్లయందుగలిపి అందు పైకాష్ఠములను కొన్నిరోజులవరకు నూరబెట్టినగాని, లేక యట్టి రంగునీళ్లయందు కాష్ఠములను నుడకబెట్టిన గాని తయారగుచుండును. ఒక్కొక్కప్పుడు మనము కొనెడి మంజిష్ఠయందు అట్టి కృత్రిమము చేరియుండును. కావున జాగ్రత్తగ నట్టి హీనమంజిష్ఠను గనిపెట్టి శ్రేష్ఠమగుదానినే గ్రహించుట యుక్తము.

(4) విశేషగుణములు:—

(క) మూత్రకృచ్ఛ్రము బోగొట్టును. (రా-వ.)

(ఖ) శాకగుణములు:—

మధురరసమును, లఘుస్నిగ్ధగుణములను గలిగియుండును. అగ్నిదీప్తిని గలిగించును. వాతపిత్తములను శమింపజేయును. (తంత్రాంతరము.)

(గ) ఫలగుణములు:—

యకృద్దోషమును బోగొట్టును. (తంత్రాంతరము)

(5) ప్రయోగములు:—

1. మంజిష్ఠామేహమునందు మంజిష్ఠా ప్రయోగము.

"మంజిష్ఠా చందనకషాయం మంజిష్ఠామేహినం పాయయేత్ ॥"

మంజిష్ఠామేహమునందు మంజిష్ఠ, చందనము వీనికషాయమును సేవించిన హితము. (సు-చి-అ-11.)

2. వ్యంగమునందు మంజిష్ఠా ప్రయోగము.

"మంజిష్ఠా చ సమాక్షికా" ॥

వ్యంగమునందు మంజిష్ఠచూర్ణమును తేనెతో గలిపి సేవించిన హితము. (చ-ద.)

(6) యోగములు:—

1. మంజిష్ఠాదిఘృతము-(వా-శా-బాలరోగ.) మాత్ర:-1/16 తులము.

ఉపయోగములు:—దంతములు బుట్టునప్పుడు శిశువులకు గలుగు రోగములు శమించును.

2. మంజిష్ఠాది తైలము-(భైషజ్య-సద్యోవ్రణ.)

ఉపయోగములు:—అభ్యంగముజేసిన వ్రణములు మానిన పిమ్మట అందు గలుగు మచ్చలయందు రోమములు బుట్టును.

3. మంజిష్ఠాది తైలము(ద్వితీయ) (భైషజ్య-క్షుద్రరోగ.)

ఉపయోగములు:—అభ్యంగముజేసిన నీలిక, పిటక, వ్యంగము విశమించును. వలీపలితములు బోవును. కాంతిగలుగును.

4 మంజిష్ఠాదికషాయము (మహా)-(గ-ని-కుష్ఠరోగ.)మాత్ర:-1 పలము.

ఉపయోగములు:—సమస్తకుష్ఠములు శమించును.

5. మంజిష్ఠాదికషాయము(లఘు)-(శార్ఙ్గధర-మ-అ 2.) మాత్ర:-1 పలం.

ఉపయోగములు:—వాతరక్తము,పామ, కపాలిక, మండలకుష్ఠము ఇవి శమించును.

## మంజిష్టగల కొన్ని యోగములు.

అశ్వాగంధారిష్ట, కళ్యాణఘృతం, చందనాసవము, చందనాదితైలము, ద్రాక్షారిష్ట, దశమూలారిష్ట, పంచతిక్తగుగ్గులు ఘృతము, పిండతైలము, మంజిష్ఠాదిక్వాథచూర్ణము మూర్ఛితతిలతైలము.

## స్వానుభవము

[మోతాదు:— 10 మొదలు 30 గ్రేనుల చూర్ణమును 1 లేక 2 ఔన్సుల నీళ్ళతోగాని, ఇతరౌషధములతోగాని జేర్చి ఇచ్చునది. గుణము:-రక్తశోధకము.

ఉపయోగములు:— ఇది రక్తమును శుద్ధిజేయు ఔషధములలో ప్రసిద్ధమైనది. అందుచే చర్మవ్యాధులయందును, కుష్ఠము, శ్విత్రము మున్నగు వానియందును ఉపయోగింప

బడుచున్నది. దీనిని లోపలికిచ్చుటచే శరీరకాంతి, లావణ్యము హెచ్చుగునని చెప్పబడియున్నది. (వ్యంగేషు మంజిష్టా- చక్రదత్త) విషమును శరీరమునుండి తోసివేయగల శక్తి దీనికి బాగుగా కలదని చెప్పబడియున్నది. మంజిష్టామేహములో దీని కషాయమును చందనముతో కలిపి ఈయవచ్చునని శుశ్రుతుడు చెప్పియున్నాడు. ఇది క్రిమిహరముగాను, తలనూనెలు, లేపములు మున్నగువానికి రంగు కలిగించుటకు ఉపయోగింపబడుచున్నది. ఆ. ల.]

# 147

## మాతులుంగః - మాదీఫలము (క)

### భాషాంతర నామములు

హిందీ - మరాఠీ - గుజరాతీ - మలయాళం - మాతులుంగ. కర్ణాటకం - మాఫల. ద్రావిడం - తురుంజి,

### నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order—Rutaceae**

నారింజ కుటుంబము

మాదీఫలము - **Citrus medica**

(ప్రథమ భాగమున 268-వ పుట చూడుము.)

### పర్యాయ పదములు

శ్లో॥ బీజపూరో మాతులుంగో రుచకః ఫలపూరకః ॥

బీజపూరము, మాతులుంగము, రుచకము, ఫలపూరకము అనునవి మాతులుంగ నామములు.

## మాతులుంగ గుణములు

శ్లో॥ బీజపూరఫలం స్వాదు రసేఽమ్లం దీపనం లఘు ।
రక్తపిత్తహరం కంఠజిహ్వా హృదయశోధనం ।
శ్వాసకాసారుచిహరం హృద్యం తృష్ణాహరం స్మృతం।

మాదీఫలము అమ్లరసమును, మధురానురసమును, లఘుగుణమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. కంఠమును, జిహ్వను, హృదయమును శోధించును. హృదయమునకు హితమైనది. రక్తపిత్తము, శ్వాస, కాస, అరుచి, తృష్ణ యను నీ వ్యాధులను బోగొట్టును.

## మధుకర్కటీ—తియ్యమాదీఫలము (ఖ)

శ్లో॥ బీజపూరోఽపరః ప్రోక్తో మధురో మధుకర్కటీ ॥

తియ్యగనుండు మాదీఫలము మధుకర్కటియని వ్యవహరింపబడును.

## మధుకర్కటీ గుణములు

శ్లో॥ మధుకర్కటికా స్వాద్వీ రోచనీ శీతలా గురుః।
రక్తపిత్తక్షయ శ్వాసకాస హిక్కా భ్రమాపహా॥

తియ్యమాదీఫలము మధురరసమును, గురుగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. రుచిని బుట్టించును. రక్తపిత్తమును, క్షయను, శ్వాసను, కాసను, హిక్కను, భ్రమను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(మాతులుంగ) - బీజపూరము. (అంబుకేసరము. దంతుఘదము.)

(ఖ) గుణబోధకములు:—(మాతులుంగ) - రుచికము. (అమ్లకేసరము జంతుఘ్నము.) (మధుకర్కటి) - మధురబీజపూరము.

(2) శబ్దార్థములు:—

బీజపూరము - విశేషముగా గింజలతో నిండియుండునది. అంబుకేసరము - విశేషముగా స్వరసముతో గూడిన కేసరములను గలది. (లేక) జలబిందువులవంటి కేసరములను గలది. దంతురఛదము - గరుసుగ హెచ్చుతగ్గులుగ నుండు పైతోలును గలది. రుచికము - రుచిని గలిగించునది. అమ్లకేసరము - అమ్లరసమునుగల కేసరములతో గూడియుండునది. జంతుఘ్నము - క్రిములను బోగొట్టునది. మధురబీజపూరము - మధురరసమును గలది.

(3) భేదములు:—

ఇది యమ్ల-మధురములను రసభేదముచే రెండు విధములుగా నుండి యెత్తుగా బెరుగు వృక్షజాతులలో నుత్పత్తిగలిగి విశేషముగా నమ్లఫలవర్గము నందు గణింపబడుచున్నది. ఈ ఫలములు గుండ్రముగను, కోలగను, పెద్దవిగను నుండును. వీని పైతోలు మిగుల దళసరిగ నుండును. ఈ వృక్షములను ఇతర యమ్లఫలవృక్షములవలె బెంచుటకు గాని ఫలములు అంత విశేషముగ లభింపవు. ఇవి జంబీర - మహాజంబీరాదిఫలములవలె గాక కేవలము వైద్యమునందే యుపయోగముగలవి యగుటచే నీ వృక్షములను బెంచుటలోను, ఫలములు లభించుట లోను పైని జెప్పినట్లు తక్కువప్రచార మున్నట్లు దెలియగలదు. అయితే అమ్లరసముగల ఫలవర్గములో నీ ఫలములే శ్రేష్ఠములైనవని శాస్త్రసమ్మతము. అందుచేతనే ఇవి యగ్నిమాంద్యాదివ్యాధులందు ధారాళముగా నుపయోగింపబడుచున్నవి. వీనిలో మధురరసముగలవిగూడ నున్నవిగాని వైద్యమునందు విశేషముగా నమ్లరసముగలవానికే విశేష ప్రయోగము గలదు. ఖనిజౌషధముల భావమునకును, అనుపానమునకును, స్వరసాది ప్రయోగమునకును నీ యమ్లరసముగలవియే గ్రహింపబడుచున్నట్లు దెలియగలదు. ఇవి జ్వర-రక్తపిత్త-గుల్మ-అగ్నిమాంద్య-గర్భిణీవ్యాధి-హృద్రోగాదులందు విశేషముగా వాడబడుచున్నవి. ఇందువలన బీజపూరమునకు మరొక భేదము గూడ నున్నట్లు గానుపించుచున్నది.

(4) విశేషగుణములు:—

(క) మాతులుంగ (సామాన్య) ము ఉష్ణవీర్యమును గలిగి యుండును. (ధ-ని.) కటుకొనురసమును గలిగి యుండును. అరుచిని శాకముజేయును. (రా-ని.)

(ఖ) బాలఫలము- రక్తమును దూషింపజేయును. త్రిదోషములను వృద్ధి బొందించును. (రా-ని.)

(గ) మధ్యమఫలము- రక్తమును దూషింపజేయును. త్రిదోషములను వృద్ధిబొందించును. (రా-ని.)

(ఘ) పక్వఫలము - వర్ణమును గలిగించును. హృదయమునకు హిత మైనది. పుష్టిని గలిగించును. బలమును గలుగజేయును. వాతకఫములను శమింప జేయును. శూల, అజీర్ణము, విబంధము, శ్వాస, అగ్నిమాంద్యము, కాస, అరుచి. శోఫ అను నీ వ్యాధులను బోగొట్టును. (రా-ని.)

(చ) త్వక్కు-తిక్తరసమును గలిగియుండును. కష్టముగ జీర్ణమగును. వాతకఫములను శమింపజేయును. క్రిములను బోగొట్టును. (ధ-ని.)

(ఛ) కటాహక * - మధురరసమును, గురుస్నిగ్ధగుణములను, శీతవీర్య మును గలిగియుండును. వాతపిత్తములను శమింపజేయును. (ధ-ని) వాతమును శమింపజేయును. ఉదరమును బోగొట్టును. (రా-ని.) కష్టముగ జీర్ణమగును. కఫమును వృద్ధిబొందించును. (అ-సం.)

(జ) ఫలమజ్జ - కఫమును శమింపజేయును. శూలను అరుచిని బోగొట్టును. (ధ-ని.) స్నిగ్ధగుణమును, ఉష్ణవీర్యమును, మధురవిపాకమును గలిగి యుండును. బలమును గలిగించును. పిత్తమును శమింపజేయును. (సు-సూ-అ 46) మధురరసమును, తిక్తానురసమును గలిగి యుండును. జాఠ రాగ్నిని వృద్ధిబొందించును. వాతపిత్తములను శమింపజేయును. (శో-ని.)

(ఝ) కేసరము - లఘుగుణమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. మలాదులను నిరోధించును. హృదయమునకు హితమైనది. వర్ణ మును, రుచిని గలిగించును. రక్తమును, మాంసమును, బలమును వృద్ధిచేయును. గుల్మమును, అర్శస్సును బోగొట్టును. (ధ-ని.) ఆమ్లరసమును గలిగియుండును. వాతమును శమింపజేయును. ఉదరమును బోగొట్టును. (రా-ని.)

(ట) స్వరసము - కఫవాతములను శమింపజేయును. శూలను, అజీర్ణ మును, విబంధమును, అగ్నిమాంద్యమును, అరుచిని, శ్వాసను, కాసను బోగొ

N. B:— * కటాహక - మాతులుంగము మొదలగు ఫలముల యొక్క లోపలనుండు అంతర్భాగమువంటి భాగము. (వై-శా-సిం.)

ట్టును. ధ-ని.) పార్శ్వశూలను, వస్తిశూలను బోగొట్టును. (శో-ని) మిగుల మధురరసమును గలిగి యుండును. హృదయమునకు హితమైనది. అరుచిని బోగొట్టును. (మ-ని.)

(ఠ) బీజము - గుల్మమును బోగొట్టును. (ధ-ని.) తిక్తరసమును గలిగి యుండును. కఫమును శమింపజేయును. అర్శస్సును, శోఫను బోగొట్టును. (రా-ని) ఉష్ణవీర్యమును గలిగియుండును. కష్టముగ జీర్ణమగును. గర్భమును గలిగించును. వాతశ్లేష్మములను శమింపజేయును. మదమును, మూర్ఛను, భ్రమను గలిగించును. క్రిములను బోగొట్టును. (శో-ని.) గురుగుణమును గలిగి యుండును. (మ-ని.)

(డ) పుష్పము - గుల్మమును బోగొట్టును. (ధ-ని.) శీతవీర్యమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. వాతమును శమింపజేయును రక్తపిత్తమును బోగొట్టును. (శో-ని.) తిక్తరసమును గలిగియుండును. (అ-సం.) లఘు గుణమును గలిగియుండును. వాతమును వృద్ధిబొందించును. శూలను, అజీర్ణమును విబంధమును అగ్నిమాంద్యమును బోగొట్టును. (మ-ని.)

(ఢ) మూలము - అధిక మధురరసమును, కటువిపాకమును గలిగి యుండును. కష్టముగ జీర్ణమగును. హృదయమునకు హితమైనది. వీర్యమును క్షీణింపజేయును. కఫమును వృద్ధిబొందించును. వాతపిత్తములను శమింపజేయును. క్రిములను బోగొట్టును. (ధ-ని) విషూచికను, అర్శస్సును, శూలను, విబంధమును బోగొట్టును. (శో-ని)

(ణ) మధుకర్కటీమూలము-విషూచికను,కర్ణశోఫనుబోగొట్టును.(మ-ని)

(త) వనబీజపూరకము - అధికామ్లరసమును, కటుకామ్లరసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. రుచిని బుట్టించును. వాతకఫములను శమింపజేయును. క్రిములను శ్వాసను బోగొట్టును. (రా-ని)

(5) ప్రయోగములు:—

గుల్మ ఆనాహములందు మాతులుంగ ప్రయోగము.

"చూర్ణాని మాతులుంగస్య భావితేన రసేన వా।
కుర్యాద్వర్తీః సగుడికా గుల్మానాహార్తి శాంతయే"॥

మాదీఫల చూర్ణమును బెల్లమును మాదీఫలముతో భావనచేసి వర్తిజేసి గుదమునందుంచిన గుల్మము ఆనాహము వీనియందుగలుగు శూల శమించును.

(చ-చి-అ 5.)

2. పిత్తము స్వాశయమునకుదిగువచ్చుటకై మాతులుంగ ప్రయోగము.

"మాతులుంగరసం క్షౌద్రం పిప్పలీమరిచాన్వితం।
సనాగరం పిబేత్ పిత్తం తథాస్యైతి స్వమాశయం"॥

మాదీఫలరసమునందు త్రికటుచూర్ణమును తేనెను గలిపి సేవించిన అన్యస్థానగతమగు పిత్తము వెంటనే స్వాశయమును బొందును. (చ-చి-అ 21)

3. జ్వరమునందలి ఆస్యవైరస్యమునకు మాతులుంగ ప్రయోగము.

"కేసరం మాతులుంగస్య మధుసైంధవ సంయుతం।
వైరస్యే ధారయేత్కవళం... ......"॥

మాదీఫలకేసరములు, సైంధవలవణము, తేనె వీనిని మెత్తగానూరి నోటి యందు ధరించిన జ్వరమునందు గలిగిన ఆస్యవైరస్యము శమించును. (సు-ఉ-అ 39)

4. రక్తపిత్తమునందు మాతులుంగ ప్రయోగము.

"మూలాని పుష్పాణి చ మాతులుంగ్యాః।
పిష్ట్వా పిబేత్ తండులధావనేన॥

మాదీఫలపుచెట్టుయొక్క మూలములను, పుష్పములను బియ్యపుకడుగులో నూరి సేవించిన రక్తపిత్తము శమించును. (సు-ఉ-అ 47)

5. కర్ణశూలయందు మాతులుంగ ప్రయోగము.

"రసేనబీజపూరస్య...పూరయేత్"॥

మాదీఫలరసముతో కర్ణపూరణముజేసిన కర్ణశూల శమించును. (వా-ఉ-అ 18)

6. పిత్తజ జ్వరమునందు గలుగు తృష్ణయందు మాతులుంగ ప్రయోగము.

"కేసరం మాతులుంగస్య మధుసైంధవ సంయుతం।
పేష్యమాణం తాలులేపః సద్యః పిత్తతృషాపహః"॥

మాదీఫలకేసరములను తేనెను, సైంధవలవణమును మెత్తగానూరి తాలువులకు లేపనముజేసిన పిత్తజజ్వరమునందు గలుగు తృష్ణ శమించును. (హా-చి-అ 2)

7. శర్కరయందు మాతులుంగ ప్రయోగము.

"యోమాతులుంగికామూలం పిబేత్ పర్యుషితాంబునా ।
తస్యాంతశ్శర్కరోద్భూతం దుఃఖం సద్యో విలీయతే" ॥

మాదీఫలపుచెట్టుయొక్క మూలమును కాచి యొక రాత్రి నిలువయుంచి నట్టి జలముతో నూరి సేవించిన శర్కర శీఘ్రముగా శమించును. (హా-సం)

8. వాతజవిసర్పమునందు మాతులుంగ ప్రయోగము.

"మాతులుంగ రసేనాపి ధావనం వాతసర్పిషు" ॥

మాదీఫల స్వరసముతో (ధావనము-క్షాళనము) జేసిన వాతజవిసర్పము శమించును. (హా-సం)

9. పిత్తజశిరోరోగమునందు మాతులుంగ ప్రయోగము.

"కేసరైర్మాతులుంగస్య పిత్తజే శిరలేపనం" ॥

మాదీఫలకేసరములను మెత్తగా నూరి తలకు లేపనముజేసిన పిత్తజశిరో రోగము శమించును. (హా-సం)

10. గర్భిణికి గలుగు అరుచియందు మాతులుంగ ప్రయోగము.

.........."సకటుకం మాతులుంగస్య కేసరం ।
మార్దనం దంతజిహ్వాసు గండూషశ్చోష్ణ వారిణా ॥
గుర్విణీనాంచ సర్వాసాం అరుచిం చ నియచ్ఛతి" ॥

మాతులుంగకేసరములను త్రికటుకములను మెత్తగా నూరి జిహ్వాదంతము లందు రుద్ది పిమ్మట వేడినీళ్లతో గండూషముజేసిన గర్భిణికి గలుగు అరుచి శమించును. (హా-సం)

11. వాతజశూలయందు మాతులుంగ ప్రయోగము.

"బీజపూరక మూలస్య ఘృతేన సహ పాయయేత్ ।
జయేద్వాతభవం శూలం కర్షమేకం ప్రమాణతః" ॥

మాతులుంగమూల కల్కమును ఒక కర్షము గ్రహించి నేతితో సేవించిన వాతజశూల శమించును. (చ-ద)

12. పార్శ్వ, హృదయ, వస్తి శూలలందు మాతులుంగ ప్రయోగము.

"మాతులుంగరసో వాపి సక్షారో మధునాయుతః।
... ... ... పార్శ్వహృద్వస్తి శూలనుత్"॥

మాదీఫలరసమునందు యవక్షారమును తేనెను గలిపి సేవించిన పార్శ్వశూల, హృదయశూల, వస్తిశూలయును శమించును. (చ-ద)

13. మసూరికయందు మాతులుంగ ప్రయోగము.

"సౌవీరేణ తు సంపిష్టం మాతులుంగస్య కేసరం।
ప్రలేపాత్ పాచయత్యాశు దాహం చాశు నియచ్ఛతి"॥

మాదీఫలకేసరములను సౌవీరము (అమ్లద్రవ్యము) తో నూరి లేపనము జేసిన శీఘ్రముగ మసూరికలకు పాచనమును, దాహశమనమును గలుగును. (చ-ద)

14. హిక్కయందు మాతులుంగ ప్రయోగము.

"మధుసౌవర్చలోపేతం మాతులుంగరసం పిబేత్"॥

మాదీఫలరసమునందు తేనెను, సౌవర్చలలవణమును జేర్చి పానము జేసిన హిక్క శమించును. (భా-ప్ర)

15. వమనమునందు మాతులుంగ ప్రయోగము.

"మాతులుంగ రసో లాజా శర్కరామధుసంయుతః।
పిప్పలీచూర్ణసంయుక్తః శ్లేష్మఛర్దినివారణః"॥

మాదీఫలరసమునందు పేలాలచూర్ణమును, చక్కెరను, తేనెను పిప్పళ్ళ చూర్ణమును జేర్చి సేవించిన ఛర్ది శమించును. (వం-సే)

16. క్రిమిదంతమునందు మాతులుంగ ప్రయోగము.

బీజపూరకమూలస్య నాకుచీనాం తథైవచ।
భాగాభ్యాం తు సమం కృత్వా పిష్ట్వా వర్తిం తు కారయేత్।
ఏషా రదస్థవర్తిస్తు దన్తైర్దన్తైర్నిపీడయేత్।
సద్యోఽవసితమాత్రా తు కృమిదన్తరుజాపహా"॥

మాతులుంగమూలము, బావంచాలు వీనిని సమభాగములుగ గ్రహించి మెత్తగానూరి వర్తి జేసి దంతములతో నములుచుండిన కృమిదంతమునందు గలుగు శూల వెంటనే శమించును. (వం-సే)

(6) యోగములు:—

1. మాతులుంగాదిచూర్ణము - (వా-గ్రహణి) మాత్ర:-$\frac{1}{2}$ తులం.

ఉపయోగములు:—బలమును, వర్ణమును గలుగును. జాఠరాగ్ని వృద్ధి బొందును.

2. మాతులుంగాదిలేపము - (వా-ఉ-కీటలూతాది.)

ఉపయోగములు:—లేపనముజేసిన వృశ్చికవిషము శమించును.

3. బీజపూరాద్యఘృతము - (భైషజ్య-శూల.) మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—శూల, యకృచ్ఛూల, గుల్మము, ప్లీహావృద్ధి, హృచ్ఛూల, పార్శ్వశూల ఇవి శమించును. హృదయమునకు హితమగును. బలము, వర్ణమును గలుగును. జాఠరాగ్ని వృద్ధిబొందును.

4. ఆర్ద్రకమాతులుంగాదిలేహ్యము.(వై-చిం-అరోచక.) మాత్ర:-1తు.

ఉపయోగములు:—అరుచి, క్షయము, కామిల, పాండు, శోఫ, కాస, శ్వాస, ఆధ్మానము, ఉదరము, గుల్మము, ప్లీహ, శూల ఇవి శమించును. జాఠరాగ్ని వృద్ధిబొందును.

5. మాతులుంగరసాయనము.(అనుభూత.) మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—గర్భిణికి గలుగు అరుచి, ఛర్ది పాండు మొదలగునవి శమించును. గర్భము చక్కగా వృద్ధిబొందును. జాఠరాగ్ని వృద్ధియగును. శూల శమించును.

(7) Actions and uses:—The juice, rind of the fruits and volatile oil are used in medicine. The peel is bitter tonic and stomachic, used for flavouring tinctures and infusions. It is also stimulent and carminative, given in indigestion, flatulence and as a corrective to purgetives. It is also extensively used to disguise the taste of medicines such as quinine etc. The lemon juice is refrigerent, cooling and antiscorbutic analogus to orange juice, but it contains more citric acid, less syrup and hence called acid of lemons. The juice taken internally enters the blood as alkaline citrates, potassium salts and phospharic acid. The citrates are partly oxidised in to carbonic acid and water. The potassium salts and phospharic acid act up on the red corpuscles. They precipitate uric acid and thus promote the formation of calculi. If long continued the juice or citric acid impairs digestion and impoverishes the blood. It is supposed to dissolve

organic matters in the system; hence used in the treatment of atheroma. The fresh juice is use-ful in scurvy. It is an ingredient in many refrigerent and diuretic effervescing drinks, used allaying febrile heat and thirst in saponing restlessness promoting the action of the skin and kidneys. It is given in inflammatory affections and in dyspepsia with vomitting. Its power of conveying alkalies in to the blood renders it use-ful in acute reheumatic affections, sciatica, lumbago etc; also given in obesity in large quantitie with good results. It is often nsed with potassium bicarbonates and honey by the natives as a gargle in diphtheria and sore-throat. Externally it relieves itching if applied in sun burn, and to check post-partem haemorrhage. The essentiel oil is a stimulating liniment for the relief of rheumatic pains. The juice of baked lemon is used in bilious affections and to stop diarrhoea.

(R. N. Khory. II. P, 125.26.

## స్వానుభవము.

[మాదీఫలము పిత్తశమనముగను, అరుచి, వమనము, హిక్క మొదలగువ్యాధులందు చాలాఉపయోగకరమని ప్రసిద్ధి చెందియున్నది. పక్వఫలములను గ్రహించి అల్లపురసమును చక్కెరను జేర్చి మాదీఫలరసాయనమని యొకయోగమును తయారుజేసి నేను ఎక్కువగా నుపయోగించుచున్నాను. ఒక రి ఒక స్త్రీకి అమితముగా వాంతులబాధ కలిగినప్పుడు 10చుక్కలుమాదీఫలరసాయనమును నెమ్మదిగా చప్పరించుటచే ఆశ్చర్యముగ బోయినది. కేవలము మాదీఫలరసము తేనె జేర్చి కూడ నుపయోగింపవచ్చును. పిప్పలిచూర్ణముగాని లవణముగాని, దోషభేదములననుసరించి చేర్చుకొనవచ్చును. పైన వివరించిన అనేకయోగములు ఉపయోగించి చూడదగినవి. మాదీఫలరసాయనమును తయారుచేయు విధానమును నీక్రింద నిచ్చుచున్నాము. జ్వరములందుగూడ తృష్ణాహరముగను, జ్వరహరముగను, మాదీఫలరసాయనము నుపయోగించుట చే మాత్రి

వృద్ధియు దాహతాపోపశమనమును గలుగును. మాదీఫలములు దొరకనికాలమున మాదీఫలరసాయనమునందు కొంతవరకు గాని, పూర్తిగా గాని, నిమ్మపండ్లరసమును జేర్చి తయారుజేయనచ్చును. జంబీరరసాయనమని ఈ యోగమును పై విధముగనే ఉపయోగింపవచ్చును. కాని మాదీఫలము హెచ్చుగా సౌమ్యము. ప్రశస్తము. ఆ. ల.]

**మాదీఫలరసాయనము తయారుచేయు విధానము.**

మాదీఫలములు ముక్కలుగాకోసి 12పా, నిమ్మకాయలు ముక్కలుగా జేసి3పా, అల్లము1పా, గ్రహించి రోటిలో కొంచెముగా నలియగొట్టి 72పానుల నీరుగల పాత్రయందు వైచి 18 పా, కషాయము మిగులు వరకును కాచుకొని బాగుగా రెండు మూడుసార్లు వడియగట్టి అందు 18పా, చక్కరవేసి పాకము జేయవలెను. తేనె పాకము రాగానే దించి వడియగట్టుకొనవలెను. 1 డ్రాము మొదలు 4 డ్రాములవరకు రెట్టింపునీటితో కలిపి దినమునకు రెండు మూడు సార్లు సేవించవలెను. దీనిలో సైంధవలవణము½పా, కూడ కొందరు జేర్చెదరు.

---

# 148

# మాధవీ - మాధవీలత

---

## భాషాంతర నామములు

హిందీ_మాధవీ. మరాఠీ_మధుమాలతీ, హళదవేల. గుజరాతీ_మాధవీలతా, రక్తపిత్తి. మలయాళం_ మాధవి. కర్ణాటకం_ ఇంద్రగోచె, ద్రావిడం_మాధవి.

నైసర్గిక స్వరూప వర్ణనము

Natural Order—Malpighiaceae

మాధవీలత-Hiptage madablota (Eng. Clustered hiptage)

## పర్యాయ పదములు

శ్లో॥ మాధవీ స్యాత్తు వాసంతీ పుండ్రికో మండపోఽపిచ।
అతిముక్తశ్చా విముక్తః కాముకో భ్రమరోత్సవః॥

మాధవి, వాసంతి, పుండ్రికము, మండపము, అతిముక్తము, అవిముక్తము కాముకము, భ్రమరోత్సవము అనునవి మాధవీ నామములు.

## మాధవీ గుణములు

శ్లో॥ మాధవీ మధురా శీతా లఘ్వీ దోషత్రయాపహా॥

మాధవీలత మధురరసమును, లఘుగుణమును, శీతవీర్యమును కలిగి యుండును. త్రిదోషములను శమింపజేయును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధ నామములు:—

(క) పరిచయబోధకములు:—మాధవి, వాసంతి, మండపము, అతిముక్తము, కాముకము, భ్రమరోత్సవము, (పరాశ్రియ, చంద్రవల్లి, భూమిమండప భూషణ, వసంతదూతి.)

(ఖ) గుణబోధకములు:—(సుగంధ.)

(2) శబ్దార్థములు:—

మాధవి-వాసంతి-వసంతదూతి - వసంతకాలమును తెలియపరచునదిగాన, వసంతఋతువునందే పుష్పించునట్టిలత. మండపము - భూమిమండప భూషణ- శీతలవాయువును సేవించుటకై పుష్పవనములందు నిర్మింపబడునట్టి మంటపములకు అలంకారముగా నుండునది. అనగా నట్టి మంటపముల చుట్టును పాతిపెట్టబడి గుబురుగా నల్లుకొని మనోవికాసమును గలిగించునది. అతిముక్తము-ముత్యముల కంటె హెచ్చుగ తెల్లనగు పుష్పముకుళము (మొగ్గ) లతో నొప్పునది. కాముకము - కాముకులచే (ప్రేమాభిలాషులచే) కోరబడునది. భ్రమరోత్సవము-తుమ్మెదలకు ప్రియమైనట్టి పుష్పములతో గూడియుండునది. పరాశ్రయ-ఇతరముల నాశ్రయించి అనగా కొయ్యలు, అల్లికలు మొదలగు వాని నాశ్రయించి యల్లుకొనునది. చంద్రవల్లి - చంద్రునివలె చల్లదనము గలిగించునట్టిలత. సుగంధ - పరిమళముతో గూడియుండునది.

N. B:—ఇది పైపదములను బట్టి వసంతఋతువునందు పుష్పించులతగా తెలియగలదు. దీని పుష్పములు మంచిముత్యములకంటె హెచ్చుగ తెల్లనివిగ నుండును. మిగుల పరిమళమును గలిగి యుండును. ఈలతలను తుమ్మెదలు విశేషముగా నాశ్రయించి యుండును. దీనిని సామాన్యముగ పుష్పవనములందు మండపములపై పాకించుదురు. ఇది కాముకులకొక్కింతను ప్రీతిని గలిగించునదిగ నుండునని కాళిదాసాది కవులచే వర్ణింపబడినది. మరియు "ధమ్మిల్లామోదిని, మందమదనోన్మాదదాయిని" యని రాజనిఘంటుకారుని వర్ణనమునుబట్టి యీ పుష్పములను స్త్రీలు విశేషముగా భోగించి వారి కేశపాశములందు ధరించుచుందురనియు, నీ లతక్రింద నుపవసించిన కొద్దిపాటి మదనవికారము గలుగుననియు గూడ తెలియగలదు. అయితే మాధవియన గురివెందలతగా వర్ణింపబడినట్లు అమరకోశమునందు గానవగును. ఒకవేళ నిది పత్రములు మొదలగువానితో గురివెందలత ననుకరించుటం జేసి యట్లు వర్ణింపబడి యుండవచ్చునని తెలియగలదు. కాని యిది గురివెందజాతిలోని లతగాదని చెప్పవచ్చును.

(3) విశేషగుణములు:—

కటురసమును, తిక్తకషాయానురసములను గలిగి యుండును. మహాగంధమును గలిగి యుండును. పిత్తమును శమింపజేయును. కాస, వ్రణము, దాహము, శోఫ కీని బోగొట్టును. (రా-ని.)

(4) ప్రయోగములు:—

1. రక్తపిత్తమునందు మాధవీ ప్రయోగము.

"వటాతిముక్తాంశుగ సింధువారజం ।
హితం చ శాకం ఘృతసంస్కృతం సదా" ॥

మర్రి, మాధవీలత, వావిలిపీని యొక్క మొలకలను శాకముగాజేసి ఘృతముతో సంస్కరించి సేవించిన రక్తపిత్తమునందు హితమగును. (సు-ఉ-అ-45.)

2. స్త్రీరోగమునందు మాధవీ ప్రయోగము.

"నుతను కరోతి మధ్యం పీతం మథితేన మాధవీమూలం" ॥

మాధవీలతామూల కల్కమును తక్రముతో సేవించిన విశేషముగా బలియుచున్న స్త్రీలయొక్క నడుముసన్నమై యందముగా నుండును. (చ-ద)

---

## 149

# మారిషః (శ్వేత-రక్త)-తోటకూరచెట్టు (కు)

## (తెలుపు-ఎరుపు)

---

### భాషాంతర నామములు

హిందీ - మారసా (సా). మరాఠీ - మాత, చౌళీ. గుజరాతీ - చోళా మలయాళం - చిరుచీర. కర్ణాటకం - కిరుసాలె. ద్రావిడం - చిరుకీరె.

### పర్యాయ పదములు

శ్లో॥ మారిషో బాష్పికో మర్షః శ్వేతో రక్తశ్చ సంస్మృతః॥

మారిషము, బాష్పిక, మర్షము అనునవి శ్వేతరక్తమారిష నామములు.

### శ్వేత మారిష గుణములు

శ్లో ॥ మారిషో మధురశ్శీతో విష్టంభీ పిత్తనుద్గురుః,

వాతశ్లేష్మకరో రక్తపిత్తను ద్విషమాగ్నిజిత్॥

తెల్లతోటకూరచెట్టు మధురరసమును, గురుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. మలబంధమును గలిగించును. వాతకఫములను వృద్ధిపొందించును. పిత్తమును శమింపజేయును. రక్తపిత్తమును, విషమాగ్నిని బోగొట్టును.

### రక్త మారిష గుణములు

శ్లో॥ రక్తమర్షో గురుర్నాతి సక్షారో మధురస్సరః॥

శ్లేష్మలః కటుకః పాకే స్వల్పదోష ఉదీరితః॥

ఎఱ్ఱతోటకూరచెట్టు మధురరసమును, కొద్దిగ గురుగుణమును, సారగుణమును, కటువిపాకమును గలిగి యుండును. క్షారముతో గూడియుండును. కొద్దిగ దోషములను దూషింప జేయును. విశేషముగ కఫమును వృద్ధి బొందించును.

## తండులీయః - మొక్కతోటకూర (చిర్రికూర) (ఖ)

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Amaranthus

### మొక్కతోటకూర - Amaranthus Poligamous

శ్లో॥ తండులీయో మేఘనాదః కాండేర స్తండులీయకః
భండీ ర స్తండులీబీజో విషఘ్నశ్చాల్ప మారిషః॥

తండులీయము, మేఘనాదము, కాండేరము, తండులీయకము, భండీరము, తండులీబీజము, విషఘ్నము, అల్పమారిషము అనునవి తండులీయ నామములు.

## తండులీయ గుణములు

శ్లో॥ తండులీయో లఘుశ్శీతో రూక్షః పిత్తకఫాస్రజిత్।
సృష్ట మూత్రమలో రుచ్యో దీపనో విషహారకః॥

మొక్క తోటకూర లఘురూక్ష గుణములను, శీతవీర్యమును గలిగి యుండును. రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. మలమూత్రములను శోధించును. పిత్తకఫములను శమింప జేయును. రక్తదోషమును, విషమును బోగొట్టును.

## జలతండులీయః - కొయ్యతోటకూర (గ)

శ్లో॥ పానీయ తండులీయో య స్తత్కంచట ముదాహృతం॥

పానీయ తండులీయము. కంచటము అనునవి జలతండులీయ నామములు.

## జలతండులీయ గుణములు

శ్లో॥ కంచటం తిక్తకం రక్తపిత్తానిల హారం లఘు॥

కొయ్యతోటకూర తిక్తరసమును, లఘుగుణమును గలిగి యుండును. వాత పిత్తములను శమింపజేయును. రక్తదోషమును బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(మారిష - (దీర్ఘనాల) - (తండులీయ- తండులీయము, మేఘనాదము, అల్పమారిషము, (సుశాకము.) జలతండులీయ) పానీయ తండులీయము.

(ఖ) గుణబోధకములు:-(మారిష)-మారిషము. (తండులీయ) విషఘ్నము.

(2) శబ్దార్థములు:—

దీర్ఘనాల - పొడవుగనుండు నాళరూపమున వృద్ధి బొందునది. తండులీయము - బియ్యపుగింజలను బోలిన బీజములను గలది. మేఘనాదము - మేఘము ఉరుముగనే యుత్పన్న మగునది. అల్పమారిషము - మారిషమువంటి యాకృతిగలిగి పొట్టిగా వృద్ధి బొందునది. సుశాకము - శాకములలో శ్రేష్ఠమైనది. పానీయ తండులీయము - జలమునందుత్పన్న మగునది. మారిషము - వ్యాధులను శమింప జేయునది. విషఘ్నము - విషమును బోగొట్టునది.

(3) భేదములు:—

తోటకూర- దీర్ఘ హ్రస్వభేదముచే రెండువిధములుగా నుండి శాకవర్గ ద్రవ్యములలో గణింప బడుచున్నది. ఇది దీర్ఘముగ నుండునది శ్వేత రక్త భేదముచే రెండువిధములుగా నుండును. హ్రస్వముగా నుండునది. స్థలజ జలజభేదముచే రెండువిధములుగా నుండును. జలజమనగా కేవలము నీటియందు త్పన్నమగునది యని యర్థముగాదు.

అనగా తరుచు నీరుపోసి తడిపిననేగాని వృద్ధిపొందదని గ్రహింపవలసి యున్నది. మిగిలిన జాతులన్నియు మెట్టయందుత్పన్న మగుచుండును. ఈ జాతు లన్నిటిని సేద్యగాండ్రు పెంచి కూరల యంగళ్లయందు విక్రయించు చుందురు. వీనిని ప్రతివారును శాకములుగా జేసి భుజించుచుందురు. విశేషముగ వీటికి శాకరూపముననే ప్రయోగములు గానవచ్చుచున్నవి. అయితే వీనిలో తండులీయకము ప్రశస్తమైనదిగా వర్ణింపబడినది. పొట్టిగాబెరుగు తోట కూరలో నీ పైని జెప్పినవియేగాక ఇంకను భేదము లున్నట్లు దెలియగలదు.

కాని యవి గ్రహింప బడకపోవుటచే గారణ మూహింపవలసి యున్నది. పొడవుగానుండు ఎర్రజాతిలో ముండ్లతో గూడియుండు మరియొక భేదము గానవచ్చుచున్నది. ఇది మిగుల క్షారముతో గూడియుండును. ఇందుచేతనే గాబోలు సిది శాకరూపమున నుపయోగింప బడుచున్నట్లు దెలియగలదు. ఇది వ్రణశోథలకు దారణకర్మమును లోహముల భస్మీకరణమునకును నుపయోగింప బడుచున్నది.

(4) విశేషగుణములు:—

(క) మారిష సామాన్యము—గురుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. రుచిని బుట్టించును. త్రిదోషములను శమింపజేయును. మేదోవృద్ధిని బోగొట్టును. (మ-ని.)

(ఖ) తండులీయము—మధురరసమును మధురవిపాకమును గలిగియుండును. మత్తును, రక్తపిత్తమును బోగొట్టును. (చ-సూ-అ 27.) దాహమును, భ్రమను బోగొట్టును. (రా-ని) తృష్ణను బోగొట్టును. (ని-ర.)

(గ) తండులీయమూలము - మధురరసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. రజోరోధమును గలిగించును. కఫమును శమింపజేయును. రక్తపిత్తమును, ప్రదరమును బోగొట్టును. (అ-సం.)

(ఘ) తండులీయపత్రము - మధురరసమును, శీతవీర్యమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. రుచిని బుట్టించును. అర్శస్సు, రక్తపిత్తము, విషము, కాసము, దాహము, శోష వీనిని బోగొట్టును. (రా-ని.)

(చ) జలతండులీయము - శీతవీర్యమును గలిగి యుండును. (రాజ వ.)

(5) ప్రయోగములు:—

1. సమస్తవిషములందు తండులీయ ప్రయోగము.

"తండులీయక జీవంతీ...హితం" ॥

మొక్కతోటకూర, జీవంతి వీని శాకములను సేవించిన సమస్త విషములు శమించును. (చ-చి-అ 25)

2. ప్రదరమునందు తండులీయ ప్రయోగము.

"తండులీయక మూలంచ సక్షౌద్రం తండులాంబునా" ॥

తండులీయమూలకల్కమును తేనెతోఁజేర్చి బియ్యపుకడుగుతో సేవించిన ప్రదరము శమించును. (చ-చి-అ 30)

3. అర్శస్సునందు తండులీయ ప్రయోగము.

"యథాదోషం శాకైః వాస్తుక తండులీయక...అర్శస్వినః"॥

తండులీయ శాకమును దోషానుగుణ్యముగ సంస్కరించి సేవించిన అర్శస్సు శమించును. (సు-చి-అ 6)

4. మూషికవిషమునందు తండులీయ ప్రయోగము.

"తండులీయక కల్కం తు లిహ్యాత్తత్ర సమాక్షికం"॥

తండులీయక కల్కమును తేనెతో గలిపి సేవించిన ఎలుకవిషము శమించును. (సు-క-అ 5)

5. రక్తపిత్తమునందు తండులీయ ప్రయోగము.

"శాకార్థే శాకసాత్మ్యానాం తండులీయాదయో హితాః"॥

శాకములు సాత్మ్యముగా గలవారు తండులీయము మొదలైనవాని శాకములను భుజించినచో రక్తపిత్తము శమించును. (భా-ప్ర)

6. సర్పవిషమునందు తండులీయ ప్రయోగము.

"తండులీయక మూలంతు పీతం తండులవారిణా।
తక్షకేనాపి సందష్టం నిర్విషం కురుతే నరం"॥

తండులీయమూలకల్కమును బియ్యపుకడుగుతో సేవించిన సర్పవిషము శమించును. (గ-ని)

7. కుకూణకమునందు తండులీయ ప్రయోగము.

"సీమంతినీ పయసా మేఘరవస్య మూలం।
సంసృష్య తేన పరిషేచనముత్తమం చ"॥

తండులీయమూలమును చనుబాలతో నూరి యందుండి రసముగ్రహించి నేత్రములందు సేచనము జేసిన చిన్నపిల్లలకు గలుగు కుకూణకమను వ్యాధి శమించును. (వై-మ)

8. సమస్తప్రదరమునందు తండులీయ ప్రయోగము.

"మధునా రక్తజ సంయుక్తం మూలం స్యాత్తండులీయకం।
తండులాంబుయుతం పీతం సర్వప్రదర నాశనం"॥

తండులీయమూలమును, రసాంజనమును మెత్తగా నూరి యందు తేనె కలిపి బియ్యపుకడుగుతో సేవించిన సమస్త ప్రదరములు శమించును. (గ-ని)

(6) యోగములు:—

1. తండులీయాది తైలము - (సు-ఉ-కర్ణరోగ.)

ఉపయోగములు:—కర్ణ పూరణము జేసిన శూల శమించును.

2. తండులీయకఘృతము - (వా-ఉ-మూషికా విష.) మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—మూషికావిషము శమించును.

3 తండులీయాదికల్కము - (శార్ఙ్గ-మ-అ 5.) మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—రక్తప్రదరము శమించును.

---

# 150

# మాషః - మినుము (క)

---

## భాషాంతర నామములు

హింది - ఉడద్, ఉర్ద. మరాఠి - ఉడీద. గుజరాతి - ఉడద. మలయాళం - ఉఴున్ను. కర్ణాటకం - ఉద్దు, ద్రావిడం - ఉళుందు.

## నైసర్గిక స్వరూప వర్ణనము

Natural Order—Leguminosáe

(చిక్కుడు కుటుంబము)

మినుము - Phaseolus radiatus(Eng- Kidney bean)

(ప్రథమభాగమున 23-వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ మాషస్తు కురువిందః స్యా ద్ధాన్యవీరో వృషాంకురః.
మాంసలశ్చ బలాఢ్యశ్చ పిత్ర్యశ్చ పితృభోజనః॥

మాషము, కురువిందము, ధాన్యవీర, వృషాంకురము, మాంసలము, బంగాధ్యము, పిత్ర్యము, పితృభోజనము అనునవి మాష నామములు.

## మాష గుణములు

శ్లో॥ మాషోగురుః స్వాదుపాకః స్నిగ్ధో రుచ్యోఽనిలాపహః
స్రంసన స్తర్పణో బల్యః శుక్రలో బృంహణః పరః॥
గుదకీలార్దిత శ్వాస పక్తిశూలాని నాశయేత్।
భిన్న మూత్ర మలః స్తన్య మేదః పిత్తకఫ ప్రదః॥

మినుము గురుస్నిగ్ధ గుణములను మధుర విపాకమును గలిగియుండును. రుచిని బుట్టించును. మలస్రంసనము జేయును. తర్పణము, బలమునుగలిగించును. శుక్రమును వృద్ధి పొందించును. బృంహణము. మలమూత్రమును శోధించును. స్తన్యమును, మేదస్సును వృద్ధిచేయును. పిత్త కఫములను వృద్ధి పొందించును. వాతమును శమింపజేయును. అర్శస్సు, అర్దితరోగము, శ్వాస, పరిణామశూల అను నీవ్యాధులను బోగొట్టును.

## రాజమాషః - పెద్దమినుము (లేక) బొబ్బర (ఖ)

శ్లో॥ రాజమాషో మహామాష శ్చపల శ్చవలః స్మృతః॥

రాజమాషము, మహామాషము, చపలము, చవలము అనునవి రాజమాష నామములు.

## రాజమాష గుణములు

శ్లో॥ రాజమాషో గురుః స్వాదుః తువర స్తర్పణః సరః।
రూక్షో వాతకరో రుచ్యః స్తన్యభూరి మలప్రదః॥

పెద్దమినుము (లేక) బొబ్బర మధురరసమును, కషాయాను రసమును, గురుసర రూక్షగుణములను గలిగియుండును. తర్పణము, రుచిని బుట్టించును. స్తన్యమును, మలాధిక్యతను గలిగించును: వాతమును వృద్ధి పొందించును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధ నామములు:—

(క) పరిచయ బోధకములు:—(మాష) - ధాన్యవీర పితృభోజనము.

(బీజరత్న.) (రాజమాష) - రాజమాషము. మహామాషము. ద్విజసప్త (శప్త) దీర్ఘబీజ, (సితమాష.)

(ఖ) గుణబోధకములు:— (మాష) - మాంసలము, బలాఢ్యము, (రాజమాష) - (మరుత్కర, క్షుధాభిజనక.)

(2) శబ్దార్థములు:—

ధాన్యవీర - ధాన్యజాతులలో వీరునివలె ప్రకాశించునది. పితృభోజనము - పితృదేవతలచే భుజింపబడునది. బీజరత్న - రత్నములవలె ప్రకాశించునట్టి బీజములను గలది. రాజమాషము - మహామాషము- మాషములలో పెద్దదిగనుండి శ్రేష్ఠమైనదిగ నొప్పునది. ద్విజసప్త (శప్త)- దంతములవలె ప్రకాశించునటి యేడు బీజములతో నొప్పియుండు కాయలను గలది. (లేక) బ్రాహ్మణులచే నీచమైనదిగ శపించబడినట్టిది. దీర్ఘబీజ - పొడవుగనుండు బీజములనుగలది సితమాష- తెల్లగ నుండునట్టిబీజములను గలది. మాంసలము- మాంసమును వృద్ధిపొందించునది. బలాఢ్యము-అధికముగ బలమును గలిగించునది. మరుత్కర వాతమును వృద్ధిపొందించునది. క్షుధాభిజనక- ఆకలినిబుట్టించునది.

(3) భేదములు:—

ఇది చిన్న పెద్ద భేదముచే రెండు విధములుగా గాని, నలుపు, తెలుపు, ఎరుపు అను వర్ణభేదములచే మూడు విధములుగా గాని యుండునని చెప్పవచ్చును. అయితే నిందలి చిన్నది నలుపువర్ణమును, పెద్దది తెలుపు ఎరుపు వర్ణములను గలిగి యుండును. ఇవి శింబీధాన్యజాతులలో నుత్పత్తిగలిగి భోజ్యపదార్థములలో గణింపబడుచున్నవి. ఇవి సామాన్యముగ ప్రతి వ్యవసాయదారునిచేతను ఆ యా కాలములందు పైరు చేయబడుచుండును. ఇందు నల్లని మాషములకే హెచ్చుగ నుపయోగమున్నట్లు గానబడును. అయితే నీ మాషజాతి "మాషోఽవరః సర్వేష్వవరః" ॥ (వా-సూ-అ 6) అని వాగ్భటునిచే జెప్పబడుటనుబట్టి శింబీధాన్యములలో నిది నీచమైనదిగ వ్యవహరింప బడుచున్నది. ఇది గురుస్నిగ్ధాదిగుణములను అమ్లవిపాకమును గలిగియుండి "కఫపిత్తకరా మాషాః" ॥ (భా-ప్ర) అని జెప్పబడుటనుబట్టి విశేషముగా కఫపిత్తములను ప్రకోపింపజేయునది యగుటచే నటుల నీచమైనదిగా వ్యవహరింపబడుచున్నట్లు దెలియగలదు. కాని యిది విశేషముగా వాతరోగములందును, వాజీ

కాణ చికిత్సయందును ప్రయోగింపబడుచున్నది. వ్యవహారమునందు గూడ దీని ప్రయోగము అనేక విధములుగా నున్నట్లు గానబడుచున్నది.

(4) విశేషగుణములు:—

(క) మాషము - మధురరసమును గలిగి యుండును. మలాధిక్యతను గలిగించును. శీఘ్రముగ శుక్రమును గలిగించును. (చ-సూ-అ-27.) ధాతువులను శోషింపజేయును. రక్తపిత్తములను శీఘ్రముగ ప్రకోపింపజేయును. శ్రమను బోగొట్టును. (రా-ని) అమ్లవిపాకమును గలిగి యుండును. (వృ-వా.) మాంసమును వృద్ధి పొందించును. శ్వాసను బోగొట్టును. (ని-ర.)

(ఖ) రాజమాషము - విశదగుణమును గలిగి యుండును. శుక్రమును వృద్ధి పొందించును. అమ్లపిత్తమును గలిగించును. కఫవాతములను వృద్ధి పొందించును. (చ-సూ-అ 27)

(గ) మాషయూషము - త్రిదోషములను వృద్ధి పొందించును. ఇది నిలువ యుంచబడి పులిసినచో తైలపానమునందు అనుపానముగా శ్రేష్ఠమైనది. (ఆ-సం)

(ఘ) మాషగోటికము - వాతమును వృద్ధి పొందించును. కఫపిత్తములను శమింపజేయును. (వై-శ-సిం.)

(ఙ) మాషాన్నము - కష్టముగ జీర్ణమగును. వెంటనే శుక్రమును గలిగించును. మాంసమును వృద్ధి పొందించును. వాతమును శమింపజేయును. (వై-ని)

(ఛ) రాజమాషసూపము - మధురరసమును, కషాయానురసమును, రూక్ష గుణమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. రుచిని బుట్టించును. స్తన్యమును గలిగించును. వాతమును వృద్ధి పొందించును. (ద్ర-గు)

(5) ప్రయోగములు:—

1. వాజీకరణమునందు మాష ప్రయోగము.

"మాషయూషేణ యోభుక్త్వా ఘృతాఢ్యం షష్టికౌదనం ।
పయః పిబతి రాత్రిం స కృత్స్నాం జాగర్తి వేగవాన్" ॥

షష్టికధాన్యపు అన్నమును మాషయూషముతోను, విశేషముగ నేయితోడను గలిపి భుజించి క్షీరమును పానము జేసిన యెడల మిగుల వాజీకరణమగును. (చ-చి-అ 2)

2. విశ్వాచీ వాతరోగమునందు మాష ప్రయోగము

“మూలం బలాయాః నస్యం తు యో మాషరసేన కుర్యాత్।

.........మాసాదసౌ వజ్రసమానబాహుః ”॥

బలామూలమును మాషరసముతో మెత్తగానూరి స్వరసమును గ్రహించి యొకమాసము నస్యముజేసినరోగుల విశ్వాచీ వాతరోగము శమించును.(బృని.)

(6) యోగములు:—

1. మాషాదివాజీకరణఘృతము - (చ-వాజీకరణ) మాత్ర: 1 తులము.

ఉపయోగములు:—అధికముగ శుక్రవృద్ధి కలుగును

2. మాషపటి - (భా-ప్ర.) మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—వృష్యము, బృంహణము, వాతము శమించును.

3 మాష తైలము - స్వల్పమాష తైలము - బృహన్మాష తైలము - మహామాష తైలము - నిరామిషమాష తైలము-(భైషజ్య-వాతవ్యాధి.)

ఉపయోగము:—అభ్యంగనస్యాది రూపముగ నుపయోగించిన అపబాహుకము, అర్ధాంగశోష, అర్ధ్వవాతము, ఆక్షేపకము, బాహుకంపము, శిరఃకంపము, కటిశూల, జనునశూల, జానుశూల, ఊర్ధ్వగాత్రగతవ్యాధులు, బాధిర్యము, కర్ణశూల, కర్ణనాదము, అర్దితవాతము, పంగువాతము, గృధ్రసీవాతము, పక్షాఘాతము ఇవి శమించును.

(7) Actions and uses:—The seeds are aphrodisiac, nutritive, also neruine tonic As a neruine tonic, the udida Dál and a compound confection known as Vrida-chá-ládu are much used in paralysis, rheumatism and affections of the nervous system. The Dál is also useful as a preventive of frequent attacks of cold which occur in winter. When parched it is eaten in uterine complaints. The root is said to possess some narcotic properties.

R. N. Khory.

———

# 151

# ముచుకుందః - ముచుకుందము
# (తె.) లోలుగు

---

## భాషాంతర నామములు

హిందీ - ముచకతకేఫూల్, ముచకుంద. మరాఠి - ముచకుంద. గుజరాతి - ముచకుంద. మలయాళం - కర్ణాటకం - ద్రావిడం.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Sterculiaceae

గుఱ్ఱపుబాదము కుటుంబము

ముచకుందము-Eng-Pterospermum Subarifolium or P. glabrescens

ఈకుటుంబ ముష్ణప్రదేశములలోఁ గలదు. దీనిలో చిన్న మొక్కలు మొదలు పెద్ద చెట్లవఱకు నున్నవి.

ఈకుటుంబపు ప్రతిమొక్క మొక్క లేఁత కొమ్మలమీఁదను లేఁత యాకులమీఁదను దట్టముగా గోధుమ వర్ణముగల రోమములుగలవు. ఈరోమములు ఆముదపాకుల మీఁదనున్న తెల్లని పొడివలె లేఁతయాకులను ఎండకు వాడిపోకుండఁ గాపాడును. వీనిలో ఆకులు అభిముఖచేరిక. లఘుపత్రములు. లేదా. తాళపత్రి వైఖరినున్న మిశ్రమపత్రములు. కణుపు పుచ్ఛములు గలవు. పువ్వులుచిన్నవి. ఆకర్షణ పత్రములు కొన్నిటియందు లేవు. కింజల్కములన్నియు గలసియుండును. పుప్పొడితిత్తులు రెండుగదులు. అండకోశము 5 గదులు. ఒక్కొక్కప్పుడు కాయలోని గదులు విడిగానుండును.

## పర్యాయ పదములు

శ్లో॥ ముచుకుందః క్షత్రవృక్షః చిత్రకః ప్రతివిష్ణుకః॥

ముచుకుందము, క్షత్రవృక్షము, చిత్రకము, ప్రతివిష్ణుకము అనునవి ముచకుంద నామములు.

## ముచుకుంద గుణములు

శ్లో॥ ముచుకుందః శిరః పీడాపిత్తాస్ర విషనాశనః॥

లోలుగుచెట్టు శిరశ్శూలను, రక్తపిత్తమును, విషమును పోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

పరిచయబోధకములు:—క్షత్రవృక్షము, చిత్రకము, (హరివల్లభము, అర్ఘ్యార్హము)

(2) శబ్దార్థములు:—

క్షత్రవృక్షము - వృక్షములలో శ్రేష్ఠమైనది. చిత్రకము - అనేకరంగులతో గూడిన పుష్పములను గలది. హరివల్లభము - విష్ణుమూర్తికి ప్రియకరమగు పుష్పములను గలది. అర్ఘ్యార్హము - అర్ఘ్యమిచ్చుటకు యోగ్యమైనది.

N. B:—ఇది వృక్షశబ్ద ప్రయోగముచే పెద్దగా పెరుగు వృక్షజాతులలో నున్నప్పటికిని పుష్పవర్గములో గణింపబడు చున్నట్లు దెలియగలదు. దీని పరిచయమును గూర్చి లక్షణము లెచ్చటను గానరాకున్నవి.

(3) విశేషగుణములు:—

కటురసమును, తిక్తానురసమును గలిగియుండును. కఫమును శమింపజేయును. కాస, కంఠదోషము, త్వగ్దోషము, శోఫ, వ్రణము, జీర్ణజ్వరము, పామ పీనసి బోగొట్టును. (రా-ని.,) ఉష్ణవీర్యమును గలిగియుండును. త్రిదోషములను శమింపజేయును. (ని-ర.)

(4) ప్రయోగములు:—

1. శిరః పీడయందు ముచుకుంద ప్రయోగము.

"శిరోఽర్ధం నాశయత్యాశు పుష్పం వా ముచుకుందజం"॥

ముచుకుంద పుష్పస్వరసమును నస్యముజేసిన శిరశ్శూల శీఘ్రముగ శమించును. (చ-ద.)

# 152

# ముద్గః - పెసర (క)

---

## భాషాంతర నామములు

హింది - మూంగ్. మరాఠి - మూగ. గుజరాతి - మగ. మళయాళం - చెఱుపయఱ. కర్ణాటకం - హెసరు. ద్రావిడం - పచ్చపయిరు.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Leguminoseae

చిక్కుడు కుటుంబము.

(ప్రథమ భాగమున 23- వ పుట చూడుము.)

## పర్యాయ పదములు

శ్లో॥ ముద్గో బలాఢ్యస్సుఫలః సూపశ్రేష్ఠో రసోత్తమః ॥

ముద్గము, బలాఢ్యము, సుఫలము, సూపశ్రేష్ఠము, రసోత్తమము అను నవి ముద్గనామములు.

## ముద్గ గుణములు

శ్లో॥ ముద్గో రూక్షో లఘుర్గ్రాహీ కఫపిత్తహరో హిమః ।
స్వాదురల్పానిలో నేత్ర్యో జ్వరఘ్నో...... ॥

పెసలు మధురరసమును, రూక్షలఘుగుణములను, శీతవీర్యమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. నేత్రములకు హితమైనది. కొద్దిగ వాతమును వృద్ధి బొందించును. కఫపిత్తములను శమింపజేయును. జ్వరమును బోగొట్టును.

## వనముద్గః — అడవిపెసర (ఖ)

శ్లో॥ మకుష్ఠో వనముద్గః స్యాన్మకుష్ఠక మకుష్ఠకౌ ॥

మకుష్ఠము, వనముద్గము, మకుష్ఠకము, మకుష్ఠకము అనునవి వనముద్గ నామములు.

## వనముద్గ గుణములు

శ్లో॥ మకుష్ఠో వాతలో గ్రాహీ కఫపిత్తహరో లఘుః ।
వాంతిజిన్మధురః పాకే కృమికృజ్జ్వరనాశనః ॥

అడవి పెసలు మధురరసమును, లఘుగుణమును, మధురవిపాకమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. క్రిములను గలిగించును. వాతమును వృద్ధిపొందించును. కఫపిత్తములను శమింపజేయును. జ్వరమును పోగొట్టును.

### విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—సుఫలము, సూపశ్రేష్ఠము, కటోత్తమము (వాజిభోజనము,) (వనముద్గ)-(వల్లీముద్గము.)

(ఖ) గుణబోధకములు:—బలాఢ్యము.

(2) శబ్దార్థములు:—

సుఫలము - అందముగనుండు (పొడవగు) కాయలను గలది. సూపశ్రేష్ఠము పప్పులలో శ్రేష్ఠమైనదిగ వ్యవహరింపబడునది. కటోత్తమము - కట్టుల (పెసరకట్టు)లో నుత్తమమైనదిగ జెప్పబడునది. వాజిభోజనము - గుర్రములకాహారముగ నుపయోగపడునది. వల్లీముద్గము - తీగరూపమున నుత్పత్తి గలిగినది. బలాఢ్యము - విశేషముగ బలమును గలిగించునది.

(3) భేదములు:—

ఇది గ్రామ్య - వన్యభేదముచే రెండు విధములుగా నుండి ధాన్య (శిబి) జాతిలో నుత్పత్తి గల్గి శమ్యక ద్రవ్యములలో గణింపబడుచున్నది. ఇందు మొదటిది—

"ముద్గో బహువిధః శ్యామో హరితః పీతకస్తథా ।
శ్వేతో రక్తశ్చ తేషాం తు పూర్వః పూర్వో లఘుః స్మృతః ।
సుశ్రుతేన పునః ప్రోక్తో హరితః ప్రవరో గుణైః,
చరకాదిభిరప్యుక్తః ఏష హ్యేవ గుణాధికః" ॥

కృష్ణవర్ణము గలది. ఆకుపచ్చని వర్ణముగలది, పసుపుపచ్చని వర్ణము గలది. తెల్లని వర్ణముగలది. ఎర్రని వర్ణముగలది యని యైదు విధములుగా

నుండును. వీనిలో నొకదానికంటె నొకటి లఘుగుణమువిశేషముగా గలిగి యుండును. కాని యందు ఆకుపచ్చని వర్ణముగల పెసలు అన్నింటిలోను శ్రేష్ఠమైనవిగా సుశ్రుత-చరకాదులచే నంగీకరింప బడినవి. (భా-ప్ర) ఇట్లు కృష్ణాది ముద్గభేదములలో హరితముద్గములే శ్రేష్ఠమైనవిగా పై దానినిబట్టి దెలియుచున్నది. వ్యవహారమునందు గూడ నీ పచ్చపెసలనే పైరుజేసి విశేషముగా నమ్ముచుందురు. వీనివలె నితరజాతులు పైరు చేయబడకపోయినను పచ్చ పెసలలో నీ జాతుల గింజ లచ్చటచ్చట గలిసి యొక్కొక్కప్పుడు లభ్యమగు చుండును.

ఈ పెసలు మెట్ట నేలలలోను, పంట నేలలలోను గూడ వృద్ధిపొందును. సాధారణముగా పెసలు మార్గశీర్షమాసములో నాటబడి మాఘ ఫాల్గుణమాసములలో ఫలితమునకు వచ్చును. వీనిని ప్రతి వ్యవసాయదారుడును పైరుచేయును. మరియు నిది ప్రతినిత్యమును నుపయోగపడు భోజ్యవస్తువులలో నొకటి యగుటచే ప్రతి గృహస్థుడును కొద్దిగనో గొప్పగనో వీనిని సంవత్సరమునకు సరిపడునట్లు సేకరించి జాగ్రత్త పెట్టుకొనును. ఈ పెసలను సామాన్యముగ సూపముగనే గాకుండ ననేక విధములగు భక్ష్యములుగా గూడ జేసి భుజింతురు. వీనిని మెత్తగా చూర్ణించి శరీరమున నుద్వర్తనముకై యుపయోగింతురు. ఇందువలన చర్మమునకు మృదుత్వమును వర్ణమును గలుగును. వైద్యమునందు సాధారణముగ ప్రతి వ్యాధియందును పథ్యముగా నుపయోగింప బడుచున్నది. అడవిపెసలలు స్వయముగనే లతారూపమున చేలగట్లపై నుత్పన్నమై సన్నముగ నొకటిన్నర యంగుళము పొడవుగల కాయలతో నొప్పి యుండును. ఇందలి గింజలు నల్లగ చిన్నవిగ నుండును. వీని నెవరును పైరు జేయరు. వ్యవహారమునందు గూడ వీని నుపయోగించు చున్నట్లు దెలియరాదు. వైద్యమునందు కొద్దిగా నుపయోగింప బడునట్లు గానబడును.

(4) విశేషగుణములు:—

(క) గ్రామ్యముద్గము - కషాయరసమును, మధురానురసమును, విశ

గుణమును, కటువిపాకమును గలిగి యుండును. (చ-సూ-అ 27) సరగుణ మును గలిగి యుండును. (అ-సం.)

(ఖ) ముద్గయూషము-లఘుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిపొందించును. పిత్తశ్లేష్మములను శమింపజేయును. వ్రణము లను, క్రిములను, తృష్ణను, దాహమును, కఫపిత్తజజ్వరమును, రక్తపిత్తమును బోగొట్టును. (భా-ప్ర) మధురసమును, కషాయానురసమును గలిగియుండును. మలాదులను నిరోధించును. శుక్రమును వృద్ధిబొందించును. నేత్రములకు హిత మైనది. తృప్తినిగలిగించును. సన్నిపాతజ్వరమును, గ్లానిని బోగొట్టును. (ద్ర-గు)

(గ) ముద్గామలకయూషము - మలాదులను నిరోధించును. పిత్తకఫము లను శమింపజేయును. (సు-సూ-అ46)

(ఘ) కృష్ణముద్గము - మధురరసమును, లఘుగుణమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. పథ్యకరము, బలమును, వీర్యమును, పుష్టిని గలిగించును. త్రిదోషములను శమింపజేయును. విశేషముగ వాతమును శమింప జేయును. (రా-ని)

(చ) వనముద్గము - కషాయరసమును, మధురానురసమును, గలిగి యుండును. పథ్యకరము, రుచిని బుట్టించును. త్రిదోషములను శమింపజేయును. రక్తపిత్తమును జ్వరదాహమును బోగొట్టును. (రా-ని.) శీతవీర్యమును గలిగి యుండును. అర్శస్సులను, గుల్మమును బోగొట్టును. (అ-సం.)

(ఛ) వనముద్గయూషము - లఘుగుణమును గలిగియుండును. స్వల్పముగ బలమును గలిగించును. ఆమమును పచింపజేయును. జాఠరాగ్నిని వృద్ధిపొందిం చును. నేత్రములకు హితమైనది. బృంహణము, వెంటనే శుక్రమునుగలిగించును. పిత్తశ్లేష్మములను శమింపజేయును. రక్తదోషమును బోగొట్టును. (ద్రి-గు.)

(జ) వనముద్గయూషము - వెంటనే శుక్రమును గలిగించును. ధాతువు లను బోషించును. పిత్తమును శమింపజేయును. రక్తపిత్తమును, జ్వరతాపమును, మూత్రకృచ్ఛ్రమును బోగొట్టును. (ద్రి-గు)

(5) ప్రయోగములు:—

1. జ్వరమునందు ముద్గ ప్రయోగము.

"ముద్గాద్యైః లఘుభిర్యూషైః... జ్వరాపహాః॥

పెసలు మొదలగు లఘుగుణముగల శింబీధాన్యములతో సిద్ధముజేసిన యూషమును సేవించిన జ్వరము శమించును. (వా-చి-అ 1)

2. శ్లేష్మాధికపిత్తజకాసయందు ముద్గ ప్రయోగము

"ముద్గాదియూషైః......ఘనశ్లేష్మణి"॥

పెసలు, ఉలవలు మొదలగు వానితో సిద్ధముజేసిన యూషమును సేవించిన కఫాధిక్యతగల పిత్తజకాసము శమించును. (వా-చి-అ 3)

(6) యోగములు:—

1. ముద్గమోదకము - (భా-ప్ర) మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—మధురరస - లఘుగుణ - శీతవీర్యములతో గూడి మలాదులను నిరోధించును. నేత్రములకు హితమగును. బలమును గలిగించును. రుచిని బుట్టించును. జ్వరమును బోగొట్టును.

2. ముద్గవటకము - (వై-ని.) మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—రుచిని బుట్టించును. శుక్రమును, బలమును, పుష్టిని గలిగించును. కఫమును వృద్ధిపొందించును. వాతపిత్తములను శమింపజేయును. రక్తదోషమును బోగొట్టును.

3. ముద్గార్ద్రవటకము - (భా-ప్ర.) మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—లఘుగుణముగలిగి రుచిని బుట్టించును. బలమును గలిగించును. జాఠరాగ్నిని వృద్ధిపొందించును. తృప్తిని గలిగించును. త్రిదోషములను శమింపజేయును.

# 153

# ముద్గపర్ణి - కారుపెసర,

(లేక) పిల్లిపెసర, (లేక) అడవిపెసర. (క)

---

## భాషాంతర నామములు

హిందీ - జంగలీమూంగ, ముగవన. మరాఠి - రానమూగ. గుజరాతి - అడవాడమగవేల. మలయాళం - కాట్టుప్పయరు. కర్ణాటకం - కాహేసరు. ద్రావిడం - కాట్టుపయరు.

## నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order—Leguminoseáe**

చిక్కుడు కుటుంబము

పిల్లి పెసర - **Phaseolus trilobus**

(ప్రథమభాగమున 23 వ పేజీ చూడుము)

## పర్యాయ పదములు

శ్లో॥ ముద్గపర్ణీ కాకపర్ణీ సూర్పపర్ణ్యల్పికా సహా,
కాకముద్గా చ సా ప్రోక్తా తథా మార్జారగంధికా॥

ముద్గపర్ణి, కాకపర్ణి, సూర్పపర్ణి, అల్పిక, సహ, కాకముద్గ, మార్జారగంధిక యనునవి ముద్గపర్ణి నామములు.

## ముద్గపర్ణీ గుణములు

శ్లో॥ ముద్గపర్ణీ హిమా రూక్షా తిక్తా స్వాద్వీ చ శుక్రలా।
చక్షుష్యా క్షతశోథఘ్నీ గ్రాహిణీ జ్వర దాహనుత్।
దోషత్రయహరా లఘ్వీ గ్రహణ్యర్శోఽతిసారజిత్॥

కారుపెసరి తిక్తరసమును, మధురానురసమును, రూక్షలఘుగుణములను, శీతవీర్యమును గలిగియుండును. శుక్రమును వృద్ధిపొందించును. నేత్రములకు హితమైనది. మందులను నిరోధించును. త్రిదోషములను శమింపజేయును. క్షతజశోఫ, జ్వరదాహము, గ్రహణి, అర్శస్సు, అతిసారము అను నివ్యాధులను బోగొట్టును.

## మాషపర్ణి కారుమినుము (లేక) అడవిమినుము (ఖ)

హింది - జంగలీఉడద్, వనఉడద్, ముషవన. మరాఠి - రావ,ఉడీద. గుజరాతి - ఉడదవేల, అడదవేల. మలయాళం - కాట్టుఉన్న, కర్ణాటకం - కాడుఉద్దు, ద్రావిడం - కొట్టు ఉళుంద.

## Natural Order—Leguminoseáe

కారుమినుము - Phaseolous — — ?

శ్లో॥ మాషపర్ణీ సూర్యపర్ణీ కాంభోజీ హయపుచ్ఛికా।
పాండులోమశపర్ణీ చ కృష్ణవృన్తా మహాసహా॥

మాషపర్ణి, సూర్యపర్ణి, కాంభోజి, హయపుచ్ఛిక, పాండురోమశపర్ణి, కృష్ణవృన్త, మహాసహ యనునవి మాషపర్ణి నామములు.

## మాషపర్ణీ గుణములు

శ్లో॥ మాషపర్ణీ హిమా తిక్తా రూక్షా శుక్రబలాసకృత్।
మధురా గ్రాహిణీ శోథవాతపిత్తజ్వరాస్రజిత్॥

కారుమినుము తిక్తరసమును, మధురానురసమును రూక్షగుణమును, శీతవీర్యమును గలిగియుండును. శుక్రమును వృద్ధిపొందించును. మందులను నిరోధించును. కఫమును వృద్ధిపొందించును. వాతపిత్తములను శమింపజేయును. శోఫము, జ్వరము, రక్తదోషమును బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(ముద్గపర్ణి) - సూర్యపర్ణి, కాకము

మార్జారగంధిక, (హ్రస్వ, క్షుద్రసహా.) (మాషపర్ణి) - హయపుచ్ఛిక, పాండులోమశపర్ణి, కృష్ణవృన్త, మహాసహా, (స్వయంభు, బహుఫల.)

(ఖ) ఉత్పత్తిబోధకములు:—(ముద్గపర్ణి) - వనముద్గ, (మాషపర్ణి) కాంభోజి.

(2) శబ్దార్థములు:—

కూర్పపర్ణి - చేటయొక్క ఆకృతిగల పత్రములతో గూడియుండునది. కాకముద్గ - నల్లనిరంగుగల బీజములతో గూడియుండునది. మార్జారగంధిక - పిల్లివాసనవంటి వాసనతో గూడి యుండునది. హ్రస్వ - క్షుద్రసహా - పర్ణద్వయములో చిన్నదిగా నగుపింపబడునది. హయపుచ్ఛిక - గుఱ్ఱపుతోకవలె రోమములతో గూడిన పత్రములనుగలది. పాండులోమశపర్ణి - తెల్లగనుండు రోమములతో గూడిన పత్రములనుగలది. కృష్ణవృన్త - నల్లగనుండు తొడిమెలతో గూడిన కాయలనుగలది. మహాసహ - పర్ణద్వయములో పెద్దదిగా నగపడునది. స్వయంభు - తనంతట నదియె యుత్పత్తియగునది. బహుఫల - విశేషముగ కాయలతో గూడియుండునది. వనముద్గ - అడవులం దుత్పత్తియగునది. కాంభోజి - కాంభోజి దేశమునం దుత్పత్తియగునది.

(3) పరిచయాబోధకలక్షణము:—

(క) ముద్గపర్ణి:—

"అరణ్య ముద్గజావల్లీ సశింబా పీతపుష్పకా।
ముద్గవల్ల్యాభ పర్ణాయా ముద్గపర్ణీతి సా స్మృతా॥"

కారుపెసర తీగెరూపమున నడవులం దుత్పత్తియై పసుపుపచ్చని పుష్పములతో నొప్పియుండును. సామాన్యపు పెసరమొక్కల యాకులవలె దీని యాకులును నుండుటంజేసి యిది ముద్గపర్ణియని వ్యవహరింపబడుచుండును. ([illegible])

(ఖ) మాషపర్ణి:—

"మాషపర్ణస దృక్పర్ణా రోమాలుః వనసంభవా।
మార్జారమోదనీ మాషసింహీ చ సక్రినాలకా॥
హయపుచ్ఛ సమాకారా మధురా పర్వతోద్భవా॥"

కారుమినుము సామాన్యపు మినపమొక్కల యొక్క యాకులవలె నాకులను, అందు రోమములను (దీర్ఘముగనుండు నూగును) గలిగి యడవులందును పర్వతములందును నుత్పత్తి యగుచుండును. మార్జాలమువంటి గంధమును, వంకరగనుండు నాళములను గలిగియుండును. మరియు దీనియాకులు దీర్ఘమగు నూగుతో గూడి యుండుటనుబట్టి హయవాలముతో సమానముగ నుండును. ఇది మధురరసముతో నొప్పియుండును. (శి_ద.)

N. B:—ఇవి లతాజాతులం దుత్పత్తిగలిగి పర్ణ్యయమని వ్యవహరింపబడు జీవనీయవర్గములో జేర్చబడినవి. ఇవి వరుసగా ముద్గమాషములందు భేదములుగా దెలియుచున్నను లతారూపమున నుత్పత్తి గలిగియుండుటను బట్టియు, జీవనీయద్రవ్యములలో క్షుద్రసహా, మహాసహాయని గ్రహింపబడుట వలన పైదానికంటె విశేషమగు గుణములు గలిగియుండుటను బట్టియు ముద్గ-మాషములనుండి ప్రత్యేకముగా గ్రహింపబడి నిఘంటుకారులచే వర్ణింపబడి నట్లు దెలియగలదు. మరియు నిందలి ముద్గపర్ణి యనునది "సామాన్యము, మార్జాగగంధి" యని రెండు విధములుగా నుండునని వైద్యశబ్దసింధుకారునిచే జెప్పబడినది. కాని వీనికి ప్రత్యేకముగా లక్షణగుణాదులందు విశేషమున్నట్లు దెలియజేయు విషయము లెచ్చటను గానరావు. మరి [illegible] నిది వనముద్గయని నిఘంటుకారులచే గ్రహింపబడినది. కాని ముద్గమునందు మకుష్టకము నొక జాతి వనముద్గముగా జెప్పబడుటచే నిది ద్వైవిధముగా వనముద్గము కాదేమో యని యూహింపవలసి యున్నది. అయితే సామాన్యముద్గము క్షుపజాతిలో నుత్పత్తిగలిగి యుండుటనుబట్టి తద్భేదమగు మకుష్టము వనముద్గము గూడ క్షుపరూపముననే నుత్పత్తి యగుననియు, ముద్గపర్ణి యనునది లతారూపమున వనములం దుత్పత్తి యగుననియు దెలియుచుండుటచే మకుష్టకముద్గపర్ణులకు స్వరూపమునందు కొంత భేద మున్నట్లు స్పష్టపడుచున్నది. ఒకవేళ స్వరూపము నందు భేదము గానుపించినను మిగిలిన లక్షణాదులందు ఒకింత సామ్యత జెప్ప బడుటవలన రెండును సమానములే యని గ్రహించుచున్నను మకుష్టకము నీచ మైనదిగా జెప్పబడుటవలన గుణములందు గూడ భేదము గాన్పించుచున్నది.

కావున ముద్గమునం దొక భేదమై వనములం దుత్పత్తిగలిగినమకుష్టమనుదానితో, విశేష లక్షణగుణాదులును వనములం దుత్పత్తియు గలిగిన ముద్గపర్ణి కొంచెము ముద్గముతో స్వరూపమున సామ్యత గలిగియున్నను భిన్నమైనదిగనే గ్రహించిన యుక్తముగా దోచగలదు.

ఈ ముద్గపర్ణియు, మాషపర్ణియును సమూలముగనే వైద్యమునందు ప్రయోగములు గలిగియున్నట్లు తెలియగలదు.

(4) విశేషగుణములు:—

(క) ముద్గపర్ణి - మధురరసమును గలిగి యుండును. కఫమును వృద్ధి పొందించును. పిత్తమును శమింపజేయును. వాతరక్తమును, క్రిములను బోగొట్టును. (ధ-ని.) కాసను, క్షయమును బోగొట్టును. (రా-ని.) రక్తస్తంభనము జేయును. (శా-ని.)

(ఖ) ముద్గపర్ణీయూషము-ధాతువులను వృద్ధి పొందించును. వెంటనే శుక్రమును గలిగించును. రక్తపిత్తమును, జ్వరతాపమును, పిత్తజమూత్రకృచ్ఛ్రమును బోగొట్టును. (ద్ర-గు.)

(గ) మాషపర్ణి - పిత్తమును వృద్ధిపొందించును. వాతమును శమింపజేయును. రక్తపిత్తమును, దాహమును బోగొట్టును. (ధ-ని.) బలమును గలిగించును. ధాతువులను బోషించును. (రా-ని.) వెంటనే శుక్రమునుగలిగించును. (రా-వ.) స్నిగ్ధగుణమును గలిగియుండును. బృంహణము, వర్ణమును గలిగించును. స్తన్యమును, కేశములను వృద్ధిపొందించును. (సో-ని)

(5) ప్రయోగములు:—

1. వాజీకరణమునకై మాషపర్ణి ప్రయోగము.

"మాషపర్ణభృతాం ధేనుం గృష్టిం పుష్టాం చతుస్తనీం,
సమానవర్ణవత్సాం చ జీవద్వత్సాం చ బుద్ధిమాన్ ॥
ఇక్ష్వాదాం వార్జునాదాం వా సాంద్రక్షీరాం చ ధారయేత్ ।
కేవలం తు పయస్తస్యాః శృతం వాఽశృతమేవ వా,
శర్కరామధుసర్పిర్భిః యుక్తం తద్వృష్యముత్తమం"॥

మాషపర్ణముచే బాగుగా మేపబడి బలిసినట్టియు, నాలుగు స్తనములు గలిగినట్టియు, అప్పుడే ప్రసవించినట్టియు, సమానమైన వర్ణముతో గూడి

జీవించియున్న దూడతో గూడియున్నట్టియు, చెఱుకుపరకలను గాని, మద్దియాకులను గాని మేయుచున్నట్టియు, గోవుయొక్క చిక్కగనుండు పాలను పిండి కేవల మిట్టి పాలయందుగాని, కాచినట్టి పాలయందుగాని చక్కెరను, తేనెను, నేయ్యిని జేర్చి పానముజేసిన మిగుల వాజీకరణమగును. (చ-చి-అ 2.)

2. మూషికవిషమునందు ముద్గపర్ణీ మాషపర్ణీ ప్రయోగము.

"సహే సనిన్ధువారే ... లిహ్యాత్ తత్ర సమాక్షికే"॥

కారుపెసర, కారుమినుము, వావిలి వీనిని సమూలముగ గ్రహించి మెత్తగ కల్కముచేసిగాని, చూర్ణముజేసిగాని తేనెతో గలిపి సేవించిన మూషికవిషము శమించును. (సు-క-అ 6.)

3. వాతాసృగ్దరమునందు మాషపర్ణీ ప్రయోగము.

"మాషపర్ణీకషాయేణ తైలేన పిచుధారణం।
కర్తవ్యం రక్తనాశాయ మార్దవాయ సుఖాయ చ"॥

కారుమినుమును సమూలముగ గ్రహించి దీనియొక్క కషాయకల్కములతో తైలముకాచి యిందు దూదినిగాని, మెత్తని పట్టుగుడ్డనుగాని తడిపి యోనియందు పిచుధారణముజేసిన వాతాసృగ్దరము శమించును. మరియు వాత వికృతిచే గలిగిన రూక్షాదిగుణములు పోయి యోనియందు మృదుత్వమేర్పడును. శూల మొదలగు బాధలు శమించును. (వం-సే.)

(6) యోగములు:—

1. ముద్గపర్ణ్యాదిక్వాథము - (భైషజ్య-ప్రమేహపిటిక.) మాత్ర:-1 పలం.
ఉపయోగములు:—ప్రమేహపిటిక శమించును.

2. ముద్గపర్ణ్యాదికషాయము - (వై-చిం-జ్వర.) మాత్ర:- 1 పలము.
ఉపయోగములు:—పిత్తజ్వరము శమించును.

# 154

# ముసలీకందః - నేలతాటిగడ్డ (క)

## భాషాంతర నామములు

హింది - కాళీమూసలీ. మలయాళం - నిలప్పన. కర్ణాటకం - నేలగడ్డ
ద్రావిడం - నెలప్పనైకిళంగు.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Amaryllideae

### కిత్తనార కుటుంబము

### నేలతాటిగడ్డ - Curculigo Orchioides

ఈకుటుంబపు మొక్కలన్నియు గుల్మములే. పెద్దచెట్లులేవు. ఆకులు సమరేఖ పత్రములు ప్రకాండము భూమిలోపలనే యుండును. పుష్పభాగములన్నియు నాల్కాక వలయమున మూడో, ఆరో గలవు. ఈకుటుంబమును ఉల్లికుటుంబమును మిక్కిలి పోలి యుండును. కాని ఉల్లికుటుంబపు మొక్కల యండాశయము ఉచ్చము వీని యండాశయము నీచము. ఇదియే భేదము.

## పర్యాయ పదములు

శ్లో॥ తాలమూలీ తు విద్వద్భిః ముసలీ పరికీర్తితా॥

తాలమూలి, ముసలి యనునవి ముసలీకంద నామములు.

## ముసలీకంద గుణములు

శ్లో॥ ముసలీ మధురా వృష్యా వీర్యోష్ణా బృంహణీ గురుః।
తిక్తా రసాయనీ హంతి గుదజాన్యనిలం తథా॥

నేలతాటిగడ్డ మధురరసమును, తిక్తానురసమును, గురుగుణమును, ఉష్ణ వీర్యమును గలిగియుండును. సద్యశ్శుక్రమును జేయును. బృంహణము, రసాయనము, వాతమును శమింపజేయును. అర్శోరోగమును బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—తాలమూలి, తాలపత్రిక, హేమపుష్పి, దీర్ఘకందిక.

(ఖ) గుణబోధకములు:—ముస (ష) లి, అర్శోఘ్ని.

(2) శబ్దార్థములు:—

తాలమూలి - తాటిచెట్టునకువలె నుండు మూలమునుగలది. తాలపత్రిక - తాటి యాకులవంటి యాకులనుగలది. హేమపుష్పి-బంగారురంగువంటి పుష్పము లనుగలది. దీర్ఘకందిక - పొడవగు కందిరూపమున నుండునది. ముషలి - వ్యాధులను బోగొట్టునది. అర్శోఘ్ని - మూలవ్యాధిని బోగొట్టునది.

(3) పరిచయబోధకలక్షణము:—

"ముషలీ తృణకాకందో మృదుసారాల్పపత్రికా।
పీతపుష్పా మహాపుష్పా దీర్ఘకందా చ పిచ్ఛిలా॥"

నేలతాటిగడ్డ తృణజాతి కందములలోనిది. ఇది మృదువైన సారమును గలిగియుండును. చిన్నవిగనుండు కొద్దిపాటి యాకులను గలిగియుండును. పుష్పములు పసుపుపచ్చని వర్ణముగలిగి అనేకముగా నుండును. కందము పొడవుగానుండును. పిచ్ఛిల గుణమును గలిగియుండును. (శి-ద.)

(4) భేదములు:—

ఇది శ్వేత - కృష్ణభేదముచే రెండు విధములుగానుండి తృణజాతి కంద ములలో నుత్పత్తిగలిగి వృష్యరసాయన ద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగా నెన్న బడుచున్నది. ఈ రెండువిధములగు భేదములు వైద్యక శబ్దసింధువునుబట్టియే దెలియుచున్నది. ఇతరత్ర అంతగా గానరావు. మరియు "శ్వేతా స్వల్పగుణా। అన్యారసాయనీ" (వై-శ-సి.) అని చెప్పబడుటచేతను, విశేషముగా కృష్ణ కందమే లభించు చుండుటచేతను ఇచట కృష్ణ కందమే గ్రహింపదగినది. ఈమొక్కలు విశేషముగా గుబురుగానుండి నీడగల ప్రదేశములందును, విశాలముగా వ్యాపించిన మామిడిచెట్ల క్రిందను నుత్పత్తి యగుచుండును. వర్షాకాలముయొక్క ఆరంభమున మేసు గర్జనమునుబట్టి ఒక్కసారిగా భూమినుండి మొలక లెత్తును. క్రమముగా తాటియాకులను బోలిన చిన్నచిన్న యాకులు నాలుగైదు నలువైపులకు విస్తరించును. వానిమధ్యనుండి సన్నని నాళములతో గూడి పచ్చనైనపువ్వులు అనేకముగా వికసించును. భూమిలోని

కందము క్రమేణ తాటిమూరువలె పొడవుగా వృద్ధిపొందును. భూమి క్షేత్రమునుబట్టి వీనికి సారమేర్పడు చుండును. నల్లటి నేలయందలి దైనచో మిగుల సారవంతములై కొంచెము లావుగా ఏర్పడును. ఇతర భూములందలివి సన్నముగానే ఉండును. వర్షాకాలాంతమునకు వీనిపైనుండు భాగమంతయు నశించును. గుర్తుపట్టి యీ కందములను గ్రహించు చుందురు. వీనిని పందులు భక్షించును. వైద్యమునందు వృష్య రసాయనములకుగా నుపయోగమును గలిగి యున్నది.

(5) విశేషగుణములు:—

పిచ్ఛిలగుణమును, శీతవీర్యమును గలిగియుండును. బలమును గలిగించును. కఫమును వృద్ధిపొందించును. పిత్తమును శమింపజేయును. దాహమును, శ్రమను బోగొట్టును. (రా-ని.,) మధురరసమును, మధురవిపాకమును గలిగియుండును. శరీరమునకు మృదుత్వమును గలిగించును. జాఠరాగ్నిని వృద్ధిపొందించును. వాతపిత్తములను శమింపజేయును. (గ-ని)

(6) ప్రయోగములు:—

1. కర్ణపాలీవర్ధనమునకై ముసలీప్రయోగము.

"ముసలీకందక్షోదో మాహిషనవనీత మిశ్రితో౽భ్యంగాత్।
వర్ధయతి కర్ణపాలీం సప్తాహం ధాన్యరాశిస్థః॥"

నేలతాటిగడ్డల చూర్ణమును గేదెవెన్నతో చక్కగానూరి జాగ్రత్తగా నేడుదినములు ధాన్యరాశియందుంచి పిమ్మట నభ్యంగముజేసిన కర్ణపాలీ వృద్ధిపొందును. (రాజ-మా.)

(7) యోగములు:—

1. ముసల్యాది కషాయము - (బ-రా-అసృగ్దర.) మాత్ర:—1పలము.

ఉపయోగములు:—అస్థిస్రావము, ప్రదరము, పైత్తిక, రక్తపిత్తము ఇవి శమించును.

2. ముసలీకందాదిచూర్ణము - (శార్ఙ్గధర-అ6.) మాత్ర—: $\frac{1}{4}$ తులము

ఉపయోగములు:—వాజీకరణమగును.

# 155

# ముస్తకం - సాధారణతుంగముస్త (క)

---

## భాషాంతర నామములు

హిందీ - మోథా. కర్ణాటకం - భద్రముస్టి. ద్రావిడం - కోరైక్కిళంగు.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Cyperaceae

తుంగ కుటుంబము

సాధారణతుంగముస్త - Cyperus rotundus

ఈ కుటుంబములోని మొక్కలు చిన్నగుల్మములు. అన్నియు గడ్డివలె నుండును. వీనియాకుల పాదపీఠము స్వాభావికముగ గొట్టమువలె నుండును. పుష్పములలో పుష్పకోశము, దళవలయము లేదు. తుషములుగలవు. వానిలోపల కింజల్కములు అండకోశము విడివిడిగానైనను కలసియైన నుండును. సాధారణముగ కింజల్కములు మూడు. మూడులోపుగా నుండును. అండాశయపుగది యొకటి. అం దొకటియే అండముండును. కీలముచివర రెండో మూడో చీలికలు గలవు.

## పర్యాయ పదములు

శ్లో॥ ముస్తకం న స్త్రియాం ముస్తం త్రిషు వారిద నామకం ॥

ముస్తకము, ముస్త, వారిదము అనునవి ముస్తక నామములు.

## ముస్తక గుణములు

శ్లో॥ ముస్తం హిమం కటుగ్రాహి తిక్తం దీపన పాచనం।
కషాయకఫపిత్తాస్ర తృట్ జ్వరారుచి జంతుజిత్ ॥

సాధారణతుంగముస్త కటురసమును, తిక్తకషాయానురసములను, శీతవీర్యమును గలిగి యుండును. మలమును నిరోధించును. జాఠరాగ్నిని వృద్ధి

బొందించును. ఆమమును పచింపజేయును. కఫపిత్తములను శమింపజేయును. రక్తదోషము, తృష్ణ, జ్వరము, అరుచి, కృమియను నీ వ్యాధులను బోగొట్టును.

## భద్రముస్తః—పాడవగు తుంగముస్త(ఖ)

శ్లో॥ కురువిందో ఉపరో భద్రముస్తో నాగరముస్తకః ॥

కురువిందము, భద్రముస్త, నాగరముస్తకము అనునవి భద్రముస్త నామములు.

## భద్రముస్త గుణములు

శ్లో॥ భద్రముస్తా కషాయా చ తిక్తా శీతా చ పాచనీ।
పిత్తజ్వరకఫఘ్నీ చ జ్ఞేయా సంగ్రాహిణీ చ సా ॥

పాడవుతుంగముస్త కషాయరసమును, తిక్తానురసమును, శీతవీర్యమును, గలిగి యుండును. ఆమమును పచింపజేయును. మలమును నిరోధించును. పిత్త కఫములను శమింపజేయును. జ్వరమును బోగొట్టును.

## వి శే షాం శ ము లు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(ముస్త) వారిద, (భద్రముస్త)- కురువింద, సుగంధి, గ్రంథిల, క్రోడేష్ట.

(ఖ) గుణబోధకములు:—(ముస్త) ముస్తక, హిమ, బల్య.

(2) శబ్దార్థములు:—

వారిద - మేఘమువలె నల్లని వర్ణముగలది. కురువింద - కురుదేశమున నుత్పన్నమగునది. సుగంధి - పరిమళము గలది. గ్రంథిల - గణుపులతో గూడియుండునది. క్రోడేష్ట - పందుల కిష్టమగునది. ముస్తక - దోషములను బోగొట్టునది. హిమ - శీతవీర్యముగలది. బల్య - బలమును గలిగించునది.

(3) భేదములు:—

ఇది స్థలజ - జలజభేదముచే రెండు విధములుగా నుండి కందములతో గూడిన తృణజాతులం దుత్పత్తిగలిగి, సుగంధద్రవ్యములలో జేరి సంగ్రాహక దీపనీయ పాచనీయ ద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగా గణింపబడుచున్నది. ఇందు

స్థూలజము - సాధారణముస్త, భద్రముస్త, నాగరముస్త యని మూడువిధములుగా నుండును. ఇందలి భద్రముస్త పొడవుగను, నాగరముస్త గుండ్రముగను నుండునట్లు దెలియగలదు. భావమిశ్రుని మతములో "కురువిందో ఉపరో భద్రముస్తో నాగరముస్తకః" యని రెండింటిని కలిపియే జెప్పుటవలన నీ రెంటికిని భేదము లేనట్లుగా దెలియగలదు కాని, "భద్రముస్తా కషాయాచ ఇత్యాది, తిక్తా నాగరముస్తా ఇత్యాది" అని రాజనిఘంటువునుబట్టి యీ రెండును వేర్వేరుగ నుండునని దెలియగలదు. ఇదియునుగాక నాగరముస్తకు చెప్పిన "చూడాల, చక్రల" అను పర్యాయపదములను బట్టి వరుసగా నది జుట్టుముడియాకృతిని, చక్రాకృతిని గలిగియుండునని యగుటచే నాగరముస్తలు గుండ్రనుగా నుండుననియు దెలియుచున్నది. దీనినిబట్టి భద్రముస్తలు దీర్ఘముగా నుండునని యూహింపదగినది. జలజముస్త కైవర్తముస్తయని చెప్పబడుచున్నది. దీని పర్యాయపదములోని "కుటన్నట, పేలవ, ప్లవ" యను శబ్దములను బట్టి యిది వరుసగా వంకరగా నుండుననియు, లోపట గట్టితనములేక యుండుననియు, నీటిపై తేలునంతటి లఘుత్వమును గలిగియుండుననియు దెలియగలదు.

మరియు "క్షుద్రముస్తా కశేరుకా" యను రాజనిఘంటువునుబట్టి క్షుద్రముస్తయనుమరియొక భేదమున్నట్లును దెలియుచున్నది. కాని "కశేరు ద్వివిధం మహద్రాజకశేరుకం । ముస్తాకృతి లఘుస్యాద్యత్తచ్చిచోడమితి స్మృతం"॥ అని భావమిశ్రుని వాక్యమును బట్టి కశేరుకము తుంగముస్తలవలె చిన్నకంద రూపమున నుండుననియు, నది ముస్తాభిన్న కందమనియును దెలియగలదు. ఇదియును గాక కశేరుకమును భావమిశ్రుడు కందశాకములలో గణించి యున్నాడు. ఇటులనే సుశ్రుతునిచేగూడ కేవలము కశేరుక శృంగాటకములే కందశాకములలో గణింపబడినవి. మరియు భావమిశ్ర సుశ్రుతులచే దీనికి మధురరసత్వము, గురుగుణత్వము మొదలగు గుణములచే బృంహణత్వమును, అధికశుక్రలత్వమును జెప్పబడినవి. తుంగముస్తలకు కటుతిక్త కషాయములచే లంఘనకరత్వము చెప్పబడినది. కావున ఈకారణములచే ముస్తాకశేరుకములకు సంబంధము లేదనియు, కశేరుకము పోలికలో ముస్తతో సమానముగనున్నను గుణభేదమును బట్టి తద్భిన్న (ముస్తాభిన్న) మగు ద్రవ్యమనియును గ్రహించుట యుక్తము.

తుంగముస్తలు ప్రతిచోటున నుత్పత్తి యగుచుండును. ఆయా భూమి భేదమునుబట్టి వీనియందుగల సారముగూడ భిన్నభిన్నముగ నేర్పడును.

భూమిలోపల సన్నని వేళ్ళతో గూడి చిన్న కందముండును. దానిని బట్టికొంచె మెత్తగా సన్నని నాళముండును. ఈ నాళమునంటి మూలాగ్రములందు చుట్టున సన్నముగను దీర్ఘముగను నుండు కొద్దిపాటి తృణములు అంటి యుండును. అగ్రభాగమునందు తృణములమధ్య దీర్ఘముగను మిగుల సన్నముగనుండు నాళమున కుచ్చువలె నంటియుండు పుష్పములు నాలుగైదుండును. ఇవి నలుపుపచ్చలకు వంగియుండును. స్థలజముస్తల కుండు నాళము మిగుల హ్రస్వముగానుండును. జలజముస్తలకుండు నాళము అతిదీర్ఘముగా నుండును. ఈ నాళములను గ్రహించియే తుంగచాపలను అల్లుదురు. ఈ యన్ని జాతుల కందములను పందులు అతిప్రేమతో భక్షించును. ఈ కందములను గ్రహించి యెండబెట్టి బజారులలో విక్రయింతురు. "అనూపదేశే యజ్జాతం ముస్తకం తత్ప్రశస్యతే । తత్రాపి మునిభిః ప్రోక్తం వరం నాగరముస్తకం॥" అని భావమిశ్రనిరూపణమును బట్టి యనూపదేశజముస్తయు, అంగను నాగరముస్త (భావమిశ్రమతమున భద్రముస్త) యును, శ్రేష్ఠములైనట్లుగా దెలియగలదు. మరియు "నూతనం గంధాఢ్యం పక్వం స్నిగ్ధం" అని భైషజ్యరత్నావళి వాక్యమును బట్టి క్రొత్తదిగను, అధికపరిమళము కలదిగ నుండు ముస్త శ్రేష్ఠమైనది యనియు దెలియుచున్నది.

ముస్తలు మిగుల పరిమళమునే గలిగి యుండును., ఇందుచేతనే యిది గంధవర్గమునందు జేర్చబడినది. "ముస్తకం తు మనాక్ క్షుణ్ణం కాంజికే త్రిదినోషితం । పంచపల్లవతోయేన భర్జయేచ్చాతపే తథా । ఆజశోభాంజన జైర్వా భావయేచ్చేతి శుధ్యతి॥" తుంగముస్తలను కొద్దిగా నలియగొట్టి కాంజికమునందు వేసి మూడుదినములూరబెట్టవలెను. పిమ్మట నిడుప బాణలియందుంచి కొద్దికొద్దిగా పంచపల్లవకషాయమును బోయుచు సన్నని మంటతో భర్జన చేయవలెను. పిమ్మట చూర్ణించి మేకమూత్రముతోను, మునగపట్ట రసముతోను భావన జేసి యెండబెట్టవలెను. ఇట్టుల జేసిన తుంగముస్తలు శుద్ధిబొందును అని భైషజ్యరత్నావళి నుండి దెలియుచున్నది. ఇందలి పంచపల్లవములనగా— "ఆమ్ర జంబూ కపిత్థానాం బీజపూరక బిల్వయోః । గంధకర్మణి సర్వత్ర పత్రాణి పంచపల్లవం॥" మామిడి, నేరేడు, వెలగ, మాదీఫలము, మారేడు, వీని చిగుళ్లు పంచపల్లవమని చెప్పబడును. ఇట్లు చెప్పబడుటంబట్టి యితరద్రవ్యములకు చేయు శుద్ధివలెగాక కేవలము దీనికి గంధగుణము హెచ్చుచేయుటకై

చేయబడునదిగా తెలియగలదు. కాని ఏవిధమగు సంస్కారమును చేయకయే దీనిని యోగములందు చేర్చుచున్నారు. "సంగ్రాహిక దీపనీయ పాచనీయానాం ముస్తం" (చ-సూ-అ-25) అని చరకాచార్యుడు ముస్తను సంగ్రాహిక దీపనీయ పాచనీయ ద్రవ్యములలో శ్రేష్ఠమైనదానినిగ పేర్కొనియుండెను. ఇందుకు తగినట్లుగానే అతీసారము, గ్రహణి, ప్రవాహిక, జ్వరము విసూచి మొదలగు అగ్నిమాంద్య, ఆమదోషములచే గలుగు వ్యాధులందు విరివిగా నుపయోగింపబడుచున్నది. మరియు నేత్రవ్యాధులందుకూడ ప్రయోగింపబడినట్లును తెలియగలదు.

(4) విశేషగుణములు:—

(క) ముస్త (సామాన్య) - తిక్తరసమును, కషాయానురసమును గలిగియుండును. అతిసారమును పోగొట్టును. (ధ-ని.) వాతమును శమింపజేయును. (రా-వ.)

(ఖ) నాగరముస్త - తిక్తరసమును, కటుకషాయానురసములను, శీతవీర్యమును గలిగియుండును. కఫపిత్తములను శమింపజేయును. జ్వరము, అతిసారము, అరుచి, తృష్ణ, దాహము, క్రిమి వీనిని పోగొట్టును. (రా-ని.)

(గ) కైవర్తముస్త (జలజ) - కషాయరసమును, లఘుగుణమును గలిగియుండును. సద్యశ్శుక్రమును జేయును. కఫమును శమింపజేయును. కాసను, శ్వాసను, అగ్నిమాంద్యమును పోగొట్టును. (రా-ని.)

(5) ప్రయోగములు:—

1. అతిసారమునందు ముస్తా ప్రయోగము.

"హ్రీబేర భద్రముస్తాని.........।
తిస్రః పేయాః విహితాః శ్లోకేష్వతిసారిణాం"॥

కురువేరు తుంగముస్తలు మొదలైనవాటితో సిద్ధముచేసిన ప్రమథ్య అతీసారరోగికి హితమగును. (చ-చి-అ 10)

2. మదాత్యయమునందు ముస్తా ప్రయోగము.

"జలం ముస్తైశ్శృతం వాపి దద్యాత్ దోషవిపాచనం।
ఏతదేవచ పానీయం సర్వత్రాపి మదాత్యయే"॥

తుంగముస్తలతో గాచిన జలమును మదాత్యయరోగికి కలిగిన తృష్ణా

ధీర్యమునం దిచ్చిన దోషపాచనమై తృష్ణ శమించును. మరియు నీ పానీయమే ఇతర దోషజములందు గూడా హితముగును. (చ-చి-అ 12

3. వమనమునందు ముస్తా ప్రయోగము.

"ముస్తాయుతాం కర్కాటకస్య శృంగీం" ॥

తుంగముస్తలు, కర్కాటకశృంగి వీని కషాయమును పానముజేసిన వమనము శమించును. (చ-చి-అ 22)

4. కాసరోగమునందు ముస్తా ప్రయోగము.

"పైత్తే సముస్తమరిచః సకఫే" ॥

తుంగముస్తలు, మిరియాలు వీని చూర్ణమును సేవించిన పిత్తజకఫజ కాసశమించును. (చ-చి-అ 22)

5. ఆమాతీసారమునందు ముస్తా ప్రయోగము.

"పయస్యర్ధోదకే ముస్తానాం వింశతిం త్రిగుణేఽంభసి ।
క్షీరావశిష్టం తత్పీతం హంత్యామం శూలమేవచ"॥

పాలను మూడురెట్లు జలమునుచేర్చి అందు ఇరువది తుంగముస్తలను కొద్దిగా నలియగొట్టి వేసి పాలు మిగులువరకు కాచి పానముజేసిన శూలతో గూడిన ఆమాతిసారము శమించును. (సు-ఉ-అ 40)

6. పక్వాతిసారమునందు ముస్తా ప్రయోగము.

"మూస్తం కషాయం పేయం వా ఏకం మధుసమాయుతం" ॥

కేవలము తుంగముస్తల కషాయమునందు తేనెజేర్చి పానముజేసిన పక్వాతీసారము శమించును. (సు-ఉ-అ 40)

7. విషూచికయందు ముస్తా ప్రయోగము.

"శృతం భద్రముస్తస్య వా" ॥

భద్రముస్తలకషాయమును విషూచికరోగికి కలిగిన తృష్ణయందు పానము జేసిన తృష్ణశమించును. (చ-స.)

8. అగ్నివిసర్పమునందు ముస్తా ప్రయోగము.

"సేచయేత్ । సితాం భసాం భోజజలైః" ॥

జలజతుంగముస్తల కషాయమును చక్కెరజేర్చిన జలమును ఒకటిగా కలిపి సేచనము జేసిన అగ్నివిసర్పము శమించును. (నా-చి-అ)

9. శుక్రమునందు ముస్తా ప్రయోగము.

"ఛాగమూత్రేణ సంఘృష్ట భద్రముస్తాంజనేన హి।
చిరకాలోద్భవం పుష్పం గకిత్రం చాపి నశ్యతి"॥

భద్రముస్తను మేకమూత్రముతో నూరి కంటికి అంజనమువేసిన చిరకాలజమగు పువ్వు (కంటిలోనిపువ్వు) నేత్రరోగము శమించును. (గ-ని.)

10 తిమిరమునందు ముస్తాప్రయోగము

"నిర్ఘృష్టా వా వారిణా భద్రముస్తా। అంధ్యం సద్యస్తైమిరం
హంతిపుంసా। మత్స్యగ్రాహం నేత్రయోరంజనేన"॥

భద్రముస్తను జలముతో నూరి యంజనము వేసిన వెంటనే తిమిరము శమించును. (గ-ని.)

(6) యోగములు:—

1. ఘనాదిశృతశీతకషాయము - (వా-జ్వర.) మాత్ర: 1 పలము.
ఉపయోగములు:— ఆమపాచన మగును. తృష్ణయు, జ్వరమును శమించును.

2. ముస్తకాద్యావటి - ముస్తకాదివటి - (భైషజ్య-అగ్నిమాంద్యం.) మాత్ర: 5 యవలు.

ఉపయోగములు:—అతిసారము, అజీర్ణము, విషూచి, అరుచి, అగ్నిమాంద్యము, గ్రహణి, కాసను ఇవి శమించును.

3. ముస్తకారిష్టము - (భైషజ్య-అగ్నిమాంద్య.) మాత్ర: 1 ఔన్సు.
ఉపయోగములు:—అజీర్ణము, అగ్నిమాంద్యము, విషూచి, గ్రహణి యివి శమించును.

4. భద్రముస్తాదిగుటిక - (భైషజ్య-ముఖరోగ.)
ఉపయోగములు:—ముఖమునందు ధరించినచో చలించు దంతములకు స్థిరత్వము కలుగును.

5. భద్రోత్కటాద్యవలేహము - (భైషజ్య - సూతిక) మాత్ర 1తులము.
ఉపయోగములు:— సంగ్రహగ్రహణి, సూతికారోగము, శూల, ఆనాహము, ఇవి శమించును. అగ్నిదీప్తి కలుగును.

6. భద్రోత్కటాది ఘృతము - (భైషజ్య - సూతిక) మాత్ర 1 తులము.
ఉపయోగములు:— సూతికారోగము, గ్రహణి, పాండు, అర్శస్సు, ఇవి శమించును. అగ్నిదీప్తి కలుగును. స్తన్యశోధకమగును.

7. ముస్తాదిక షాయము - (భైషజ్య-జ్వర) మాత్ర 1 పలము.
ఉపయోగములు - విషమజ్వరములను శమింపజేయును.

8. ముస్తాదిగణ కషాయము - (చ-ద-సన్నిపాతజ్వర.) మాత్ర 1 పలం
ఉపయోగములు:— పిత్తోత్తరసన్నిపాతజ్వరము శమించును.

(7) Actions and uses:—Diaphoretic, diuretic, demulcent, stimulent and galactogogue; given in fevers, dyspepsia, diarrhoea and cholera; also in urinary calculi and ammenorrhoea. As a galactogogue the fresh tubers are applied to the brests.

(R. N. Khory II P 632)

## స్వానుభవము

మాత్రలు:— 5 మొదలు 15 వరకు గింజలయెత్తు చూర్ణమును తేనెతో తీసికొనవలయును, లేక ¼ మొదలు 1 తులము ముస్తలు కషాయముకాచి తీసికొనవలయును; లేక ¼ తులము ఒకశేరు వేడినీళ్లలో వేసి రాత్రియంతయు నుంచి మరునాడు తీసుకొనునది. స్వేదజనకము మూత్రలము, లసీకావర్ధకము.

ఉపయోగములు:— పిత్తజ్వరములో అనగా ముఖ్యముగా దప్పిక, ఒడలిమంటలు, ప్రలాపము, పచ్చనికండ్లు మొదలగునవి జ్వరముతోగూడి యుండునపుడు ఇది మంచిది. విషూచివ్యాధిలో మూత్రమును హెచ్చుజేయుటకొరకు ఈయబడును. ఇదియు మరికొన్ని వస్తువులను కలిపి జేయబడు పానకము మూత్రలముగాను, జ్వరములలో దప్పికను తగ్గించుటకును ఈయబడుచున్నది. అందులో జేర్పబడు కషాయమే, షడంగకషాయము. తుంగముస్తలు, చందనము, శుంఠి, కురువేరు, పర్పాటకము, వట్టివేరు, ఇవి కలిసినది "ఘనచందన శుంఠ్యాంబు పర్పటోశీర సాధితం। శీతం తేభ్యో హితం తోయం పాచనం తృట్ జ్వరాపహమ్॥" ఆ. ల.] (వాగ్భట)

# 156

# మూర్వా - చా (సా) గ

---

## భాషాంతర నామములు

హిందీ-మూర్గా, మూర్వా, చురనహార, చూర్ణహార. మరాఠి - మోరవేల. గుజరాతి - మోరవేల్. మలయాళం - పెరుంకురుంప. కర్ణాటకం-మురహరసి. ద్రావిడం - పెరుంకురుంబై.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Ranunculaceae.

నాభికుటుంబము.

(ప్రథమభాగమున 31_వ పుట చూడుము.)

నామ - Clematis triloba.

## పర్యాయ పదములు

శ్లో॥ మూర్వా మధురసా దేవీ మోరటా తేజనీ స్రువా,
మధూలికా మధుశ్రేణీ గోకర్ణీ పీలుపర్ణ్యపి॥

మూర్వ, మధురస, దేవి, మోరట, తేజని, స్రువ, మధూలిక, మధుశ్రేణి, గోకర్ణి, పీలుపర్ణి యనునవి మూర్వానామములు.

## మూర్వా గుణములు

శ్లో॥ మూర్వా సరా గురుః స్వాద్వీ తిక్తా పిత్తాస్రమేహనుత్,
త్రిదోష తృష్ణా హృద్రోగ కండూ కుష్ఠ జ్వరాపహా॥

చాగ మధురరసమును, తిక్తరసమును, సర గురు గుణములను కలిగియుండును. త్రిదోషములను శమింపజేయును. రక్తపిత్తము, ప్రమేహము, తృష్ణ హృద్రోగము, కండు, కుష్ఠము, జ్వరము అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:— మూర్వా, మోరటు, స్రువ, మధుశ్రేణి,

గోకర్ణి., పీలుపర్ణి, (దృఢసూత్రిక, ధనుర్మాల, ధనుష్మిణ, పృథక్త్వచ, మధుస్రవ)
(ఖ) గుణబోధకములు:— మధురస, తేజని.

(2) శబ్దార్థములు:—

మూర్వా - మోరట - బంధనములకును, చుట్టబెట్టుటకును, అనుకూలమైన నారను గలిగిన పత్రములతో గూడి యుండునది. స్రవ - ఒకవిధమగు స్రావముతో గూడిన కందము (లేక) పత్రము గలది. మధుశ్రేణి - మధురమగు రసము పంక్తివలె స్రవించునది. గోకర్ణి - గోవుయొక్క కర్ణమువంటి పత్రములనుగలది. పీలుపర్ణి - పీలువృక్షముయొక్క పత్రములవంటి పత్రములనుగలది. దృఢసూత్రిక - దృఢమగు నారతో గూడిన పత్రములను గలది. ధనుర్మాల - ధనుష్మిణ - ధనస్సు కుపయోగించు నారతో గూడిన పత్రములను గలది. పృథక్త్వచ - లోపలి నారనుండి ప్రత్యేకముగా విడిపోవునట్టి పైతోలుతో గూడిన పత్రములనుగలది. మధుస్రవ - తేనెవంటి రసమును స్రవించునది. మధురస - మధురరసము గలిగియుండునది. తేజని - వ్యాధులనుండి రక్షించునది.

N. B:—ఇది కందజాతులలో నుత్పత్తియగునది. దీనియాకులు కిత్తనార మట్టలవలెనుండును. కాని యంతెడలెసరిగను, పెళుసుగను, వెడల్పుగను, పొడవుగను నుండక సన్నముగ పొట్టివిగనుండును. పైపదములనుబట్టి యీపత్రములు ముదిరినప్పుడు వీనినుండి నారను గ్రహించి, దానిని ధనస్సులకు గట్టుటకై యుపయోగింతురని దెలియగలదు. ఈ విషయమునే "మూర్వాచోరస్నాయుః యయా పూర్వదేశే గుణాన్ కుర్వంతి ధనుషాం" (సు-సూ-అ 22) అని శుశ్రుతవ్యాఖ్యానకారుడగు డల్హణాచార్యులుగూడనిరూపించియున్నారు. ఈ యాకులను మధ్య గోసినప్పుడు కలబందమట్టల నుండి వలెనొక విధమగు చిక్కని రసముగూడి స్రవించును. అయితే దీనికందమునకే ప్రయోగమున్నట్లు గానబడును. ఈ మొక్క సామాన్యముగ నెల్లచోటులందు నుత్పత్తియగును

(3) విశేషగుణములు:—

(క) ఉష్ణవీర్యమును గలిగి యుండును. ఛర్దిని, విషమును బోగొట్టును. (ధ-ని) తిక్తరసమును, కషాయానురసమును గలిగియుండును. (రా-ని) బృంహణము. బలమును గలిగించును. (రా-వ) కషాయరసమును, తిక్తమధురానురసము

లను, కటువిపాకమును, కలిగియుండును. ముఖశోష, రక్తదోషము, మేదోరోగము, భ్రమ, విషముజ్వరము, వీనిని పోగొట్టును. (ని-ర)

(ఖ) కంద గుణములు:— విశేషముగ క్రిమిరోగమును పోగొట్టును. అగ్నిరోగమును, విషదోషమును పోగొట్టును. (ని ర)

(4) ప్రయోగములు:—

1. పిత్తజ వమనమునందు మూర్వా ప్రయోగము.

"మూర్వా తథా తండుల ధావనేన"

చాగచూర్ణమును బియ్యపుకడుగుతో సేవించిన పిత్తజ వమనము శమించును. (చ-చి-అ-23)

2. నేత్రరోగమునందు మూర్వా ప్రయోగము.

"సౌవీరం సైంధవం తైలం మూర్వామూలం తథైవ చ।
కాంస్యపాత్రే విఘృష్టం స్యాదక్ష్ణోః శూలనివారణం"

సైంధవలవణమును, చాగమూలమును, సౌవీరాంజనమును మెత్తగా చూర్ణించి దీనిని కంచుపాత్రలో వేసి అందు తిలతైలముకలిపి బాగుగా చేతితో రుద్ది కండ్లకు అంజనము వేసిన నేత్రశూల వెంటనే శమించును. (శం-సే)

3. పాండురోగమునందు మూర్వా ప్రయోగము.

"మూర్వా హరిద్రా మలకం చ లిహ్యాత్।
సితం గవాం సప్తదినాని మూత్రే॥"

చాగ, పసుపు, ఉసిరికకాయ వీనిని మెత్తగా చూర్ణించి గోమూత్రము నందేడుదినములూరబెట్టి సేవించిన పాండురోగము శమించును. (సు-ఉ-అ-44)

(5) యోగములు:—

1. మూర్వాదిచూర్ణము (వా-ఉ-బాలరోగ) మాత్ర $\frac{1}{2}$ తులము.
ఉపయోగములు:— స్తన్యదోషము శమించును.

2. మూర్వాదిఘృతము-(భైషజ్య- పాండు, కామిలాది) మాత్ర 1తులం.
ఉపయోగములు:— పాండు, జ్వరము, విస్ఫోటకము, శోథ, అగ్నిమాంద్య, రక్తపిత్తము ఇవి శమించును.

———

# 157

# మూలకం—ముల్లంగి (చిన్నది) (క)

---

## భాషాంతర నామములు

హిందీ - మూలీ. మరాఠి - ముళా. గుజరాతి - ముళా. మలయాళం - ముళ్ళంగి. కర్ణాటకం - ముల్లంగి. ద్రావిడం - ముల్లంగి.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order—Crucifereae

ఆవ కుటుంబము

ముల్లంగి - Raphanus sativus (Eng. Radish)

ఆకులు:—ఒంటరిచేరిక. లఘుపత్రిములు, అన్నియాకులు నొకరీతిగలేవు. క్రిందుగానున్న యాకులు పెద్దవి. తొడిమలు పొడుగుగా నుండును. వీనిమీదను ముండు గలవు. పత్రములకు బెక్కుతమ్మెలు గలవు. పైయాకులు చిన్నవి. తమ్మెలుతక్కువ. విషమ రేఖపత్రిము. అంచున ఉంపపుపండ్లున్నవి.

పుష్పమంజరి:—గెలలు కొమ్మలచివరలనుండి పుట్టును.

పుష్పకోశము:—సంయుక్తము 4. తమ్మెలు వీడము.

దళవలయము:—ఆకర్షణపత్రిములు 4 అధశ్చిర యండాకారము పాదముకలదు. పచ్చగానుండును. వృంతము నంటియుండును.

కింజల్కములు:—6. కాడలు. ఆకర్షణపత్రిములకంటె పొడుగుగా నున్నవి. పుప్పొడితిత్తులు రెండుగదులు.

అండకోశము:—అండాశయము ఉచ్చము. రెండుగదులు. గింజలవరుస ఒక్కొక గదిలో ఒక్కొక్కటి గలదు. కుడ్యసంయోగము, కీలము గుంగ్రిముగాను పొట్టిగా నున్నది.

## పర్యాయ పదములు

శ్లో॥ శాలామర్కటకం విస్రిం శాలేయం మరుసంభవం,

చాణక్యమూలకం తీక్ష్ణం తథా మూలకపోతికా॥

శాలామర్కటకము, విస్రిము, శాలేయము, మరుసంభవము, చాణక్య మూలకము, తీక్ష్ణము, మూలకపోతిక యనునవి లఘుమూలక నామములు.

## లఘుమూలక గుణములు

శ్లో॥ లఘుమూలం కటూష్ణం స్యాద్రుచ్యం లఘు చ పాచనం।
దోషత్రయహరం స్వర్యం జ్వర శ్వాస వినాశనం।
నాసికా కంఠ రోగఘ్నం నయనామయనాశనం॥

చిన్నముల్లంగి కటురసమును, లఘుగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. ఆమమును పాకము జేయును. రుచిని బుట్టించును స్వరమును గలిగించును. త్రిదోషములను శమింపజేయును. జ్వరము, శ్వాసము, నాసా రోగము, కంఠరోగము, నేత్రరోగము అను నీవ్యాధులను బోగొట్టును.

## మహామూలకం - పెద్దముల్లంగి (ఖ)

శ్లో॥ నేపాలమూలకం చాన్యత్తద్భవేద్గజదంతవత్॥

నేపాలమూలకము, గజదంతవత్తు అనునవి మహామూలక నామములు.

## మహామూలక గుణములు

శ్లో॥ మహత్తదేవ రూక్షోష్ణం గురుదోష త్రయావహం।
స్నేహసిద్ధం తదేవ స్యాత్ దోషత్రయవినాశనం॥

పెద్దముల్లంగి రూక్ష గురుగుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. త్రిదోషములను వృద్ధి బొందించును. తైలముతో బాకముజేసిన త్రిదోషము లను శమింపజేయును.

## గాజరం - ఎర్రముల్లంగి (గ)

శ్లో॥ గాజరం గర్జరం ప్రోక్తం తథా నారంగవర్ణకం॥

గాజరము, గర్జరము, నారంగవర్ణకము అనునవి గాజర నామములు.

## గాజర గుణములు

శ్లో॥ గాజరం మధురం తీక్ష్ణం తిక్తోష్ణం దీపనం లఘు।
సంగ్రాహి రక్తపిత్తార్శో గ్రహణీ కఫవాతజిత్॥

ఎర్రముల్లంగి మధురరసమును, తిక్తరసమును, తీక్ష్ణ లఘుగుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును జాఠరాగ్నిని వృద్ధి బొందించును. మలములను

నిరోధించును. కఫవాతములను శమింపజేయును. రక్తపిత్తమును, అర్శోరోగమును, గ్రహణీ వ్యాధిని బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—(లఘుమూలక) - విస్రము. (దీర్ఘపత్రికము. కందమూలము.) (మహామూలక) - గజదంతవత్తు. (మహాకందము. దీర్ఘమూలకము. దీర్ఘకందము.) (రాజక) - నారంగవర్ణకము.

(ఖ) గుణబోధకములు:—(లఘుమూలక) - తీక్ష్ణము. మృత్క్షారము, (రాజక) - స్వాదుమూలకము.

(గ) ఉత్పత్తిబోధకములు:— (లఘుమూలక)-మరుసంభవము. (మహామూలక) - నేపాలమూలకము.

(2) శబ్దార్థములు:—

విస్రము - విస్రగంధమునుగలది. దీర్ఘపత్రికము_ పొడవుగనుండు పత్రములను గలది. కందమూలము - కందమే మూలముగా గలది. గజదంతవత్తు - ఏనుగుదంతమును ననుకరించునది. మహాకందము - పెద్దదిగానుండు కందమును గలది. దీర్ఘమూలము - దీర్ఘకందము - పొడవగు కందమునే మూలముగా గలది. నారంగవర్ణకము - బాగుగాపండిన నారింజపండువలె నెర్రగనుండునది. తీక్ష్ణము - తీక్ష్ణగుణమును గలది. మృత్క్షారము - మంటియందలి క్షారమునుగలది. స్వాదుమూలకము - మధురరసమును గలది. మరుసంభవము - చవిటిభూములం దుత్పన్న మగునది. నేపాలమూలకము - నేపాళదేశమున విరివిగా నుత్పన్నమగునది.

(3) భేదములు:—

ఇది చిన్న - పెద్ద భేదముచే గాని, శ్వేత - రక్త భేదముచే గాని రెండు విధములుగానుండి కందజాతులలో నుత్పత్తిగలిగి కందశాక వర్గమున గణింప బడుచున్నది. మరియు నిది చాణక్య - గృంజన - పిండ - శాల - గరగవులని యైదువిధములుగా రాజనిఘంట్వాదులందు వర్ణింప బడినది. అయితే నిందలి జాతులన్నియును భిన్నగుణములు గలవగుటచే భిన్నభిన్న కందములుగనే

తెలియగలదు. కాని వీనిలో బాలమూలకమనునది మూలక కందములను అతి బాల్యావస్థయందు వ్యవహరింప బడుటచే దీనినొక ప్రత్యేక భేదముగా గణించుట కవకాశము గానుపింపకున్నది. వ్యవహారమునందుగూడ తెల్లజాతి యందు చిన్నది. పెద్దదియును రెండువిధములుగను, కొంచెము ఎరుపుగలసిన పసుపువర్ణము గలదిగను, ఎర్రనివర్ణము గలదిగను ఇట్లు నాలుగు విధములుగ గానబడుచున్నది. తెల్లగ నుండునవి యేనుగు దంతమును బోలియుండును. అంత పెద్దది దీర్ఘముగ నుండును. మూడవది కొంచెము సన్నముగను, చిన్నదిగనుండును. నాలవది పిండాకృతి గలిగి గుండ్రముగ నుండును. కొందరు ఈ పిండాకృతి గలిగినది మూలకము గాదని చెప్పుదురు. అయితే నీ భేదములకు పైన చెప్పిన చాణక్యాది నామములు వరుసగా నాడబడుచున్నవో లేదో తెలియకున్నది. మరియు వీనికి చెప్పబడిన పర్యాయ పదములను బట్టి చూడగా వ్యవహారమునందు గానుపించు మూలక భేదములకును, గ్రంథనిర్దిష్టమగు మూలకభేదములకును కొంత వ్యత్యస్తమున్నట్లు తెలియగలదు. కావున నీ విషయము విమర్శపై నిశ్చయింప దగినది. వ్యవహారమునందీ మూలకజాతులను అనేక విధములుగ శాకాదిరూపమున గల్పించి భుజించుట గాననగును. వైద్యమునందు ఇవి శోఫాదివ్యాధులలో ప్రయోగింపబడుచున్నవి. ఇవి దక్షిణభారతమున నెక్కువ ప్రచారములో నున్నట్లు గానబడును.

(4) విశేషగుణములు:—

(క) మూలకము - తీక్ష్ణగురుగుణములను గలిగియుండును. మలబంధమును జేయును. త్రిదోషములను శమింపజేయును. ఆమమును బోగొట్టును. (ధ-ని.) జాఠరాగ్నిని వృద్ధిబొందించును. వాతమును శమింపజేయును. అర్శస్సును, గుల్మమును, హృద్రోగమును బోగొట్టును. (రా-ని.) స్నిగ్ధగుణమును గలిగియుండును. శ్లేష్మమును వృద్ధి బొందించును. (సు-సూ-అ 46.) స్వరమును గలిగించును. శ్వాసను, నేత్రరోగమును, పీనసమును బోగొట్టును. (మ-ని.)

(ఖ) బాలమూలకము - తిక్తరసమును, మధుర కటుకషాయరసములను, తీక్ష్ణగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. కంఠమునకు హితమైనది. బలమును, రుచిని గలిగించును. మూత్రదోషము, శ్వాస, అర్శస్సు, కాస, గుల్మము, క్షయము, నేత్రరోగము, నాభిశూల, మలవికృతి వీనిని

బోగొట్టును. (రా-ని.) లఘుగుణమును గలిగి యుండును. త్రిదోషములను శమింపజేయును. (సు-సూ-అ 46.)

(గ) వృద్ధమూలకము - ఉష్ణవీర్యమును గలిగి యుండును. శోఫను, దాహమును గలిగించును. పిత్తమును, రక్తమును దూషింపజేయును. (రా-ని.) త్రిదోషములను శమింపజేయును. (చ-సూ-అ 26.)

(ఘ) ఆమమూలకము - మలమును నిరోధించును. రుచిని బుట్టించును. కఫవాతములను శమింపజేయును. (రా-ని.)

(చ) శుష్కమూలకము - లఘుగుణమును గలిగి యుండును. త్రిదోషములను శమింపజేయును. విషమును బోగొట్టును. (ధ-ని.) శోఫను బోగొట్టును. (రా-వ.) కఫవాతములను శమింపజేయును. (చ-సూ-అ 26)

(ఛ) స్విన్నమూలకము - కటురసమును, స్నిగ్ధగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. కఫవాతములను శమింపజేయును. (ధ-ని) వాతమును శమింపజేయును. (చ-సు-అ 26.)

(జ) వేసవాకపక్వమూలకము - హృద్రోగమును, శూలను బోగొట్టును. (రా-ని.)

(ఝ) ఆహారమునకు పూర్వము భక్షింపబడిన మూలకము - వెంటనే పిత్తమును, రక్తమును దూషింపజేయును. దాహమును గలిగించును. (రా-ని.)

(ట) ఆహారముతో గూడ భక్షింపబడిన మూలకము - హితముగ నుండి బలమును గలిగించును. (రా-ని)

(ఠ) మూలకయూషము - నాసాస్రావమును, గలగ్రహమును, అరుచిని, పీనసమును, కాసను, కఫవ్యాధిని బోగొట్టును. (ద్ర-గు)

(డ) మూలకపుష్పము - కఫపిత్తములను శమింపజేయును. (రా-వ)

(ఢ) మూలకఫలము - కఫవాతములను శమింపజేయును. (రా-వ)

(ణ) మూలకపత్రము (అపక్వము) - కఫపిత్తములను వృద్ధిబొందించును. (భా-ప్ర)

(త) స్నేహపక్వమూలకపత్రము - త్రిదోషములను శమింపజేయును. (భా-ప్ర)

(థ) మూలనాళము (ఆమము) మలబంధమును గలిగించును. రుచిని బుట్టించును. కఫమును వృద్ధిబొందించును. వాతపిత్తములను శమింపజేయును. (భా-ప్ర)

(ద) మూలకనాల (శుష్క)ము- ఇది పచ్చినాళిగుణములను హెచ్చుగ కలిగియుండును. (భా-ప్ర)

(ధ) మూలకతైలము-కటురసమును, తీక్ష్ణలఘుసరగుణములను, ఉష్ణవీర్యమును, కటువిపాకమును కలిగి యుండును. వాతకఫములను శమింపజేయును. క్రిములను, కుష్ఠమును, ప్రమేహమును, శిరోరోగమును బోగొట్టును. సు,సూ,అ45

(న) చాణక్యమూలకము - కటురసమును, గురుగుణమును, ఉష్ణవీర్యమును కలిగి యుండును. రుచినిబుట్టించును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. మలాదులను నిరోధించును. కఫవాతములను శమింపజేయును. క్రిములను గుల్మమును బోగొట్టును. (రా-ని.) తిక్తరసమును, కటుకానురసమును కలిగి యుండును. (ధ-ని.)

(ప) పిండమూలకము - కటురసమును, ఉష్ణవీర్యమును కలిగియుండును. వాతమును శమింపజేయును. గుల్మమును బోగొట్టును. (రా-ని.)

(ఫ) గర్జరమూలకము-కొంచెము కటుకానురసమును కలిగియుండును. రుచిని బుట్టించును. కఫపిత్తములను శమింపజేయును. ఆధ్మానమును, శూలను, క్రిములను, దాహమును, తృష్ణను బోగొట్టును. (రా-ని.)

(5) ప్రయోగములు:—

1. శుష్కార్శస్సులందు మూలకప్రయోగము.

"శుష్కమూలక పిండైర్వా స్వేదయేత్ పోట్టలీకృతైః॥"

ఎండిన ముల్లంగి దుంపలను మెత్తగానూరి యుడికించి వస్త్రమునందు గట్టి సుఖోష్ణముగ స్వేదనము జేసిన శుష్కార్శస్సులు శమించును. (చ-చి-అ9.)

2. ప్రవాహికయందు మూలకప్రయోగము.

"తం మూలకానాం యూషేణ భోజయేత్॥"

ముల్లంగితో సిద్ధముజేసిన యూషమును జేర్చి యాహారమును దీసికొనిన ప్రవాహిక శమించును. (చ-చి-అ 10.)

3. గ్రంథివిసర్పమునందు మూలకప్రయోగము.

"సుఖోష్ణయా ప్రదిహ్యాద్వా శుష్కమూలక కల్కేన॥"

ఎండిన ముల్లంగి దుంపలను మెత్తగానూరి యుడికించి సుఖోష్ణముగ లేపనము జేసిన గ్రంథి విసర్పము శమించును. (చ-చి-అ 11.)

4. కఫజశోఫమునందు మూలకప్రయోగము.

"శస్తస్తథా మూలకతోయసేకః॥"

ముల్లంగి కషాయముతో సేకముజేసిన కఫజశోఫశమించును చ,చి,-17.

5. హిక్కా-శ్వాసలయందు మూలక ప్రయోగము.

"శుష్కమూలక యూషశ్చ హిక్కా-శ్వాస నివారణః॥"

ఎండుముల్లంగితో సిదముజేసిన యూషమును సేవించిన హిక్కయు, శ్వాసయును శమించును. (చ-చి-అ 21)

6. వాతకాసయందు మూలకప్రయోగము.

"మూలకం...శస్యతే వాతకాసే తు॥"

ముల్లంగి శాకమును భుజించిన వాతజకాస శమించును. (చ-చి-అ 22.)

7. కర్ణశూలయందు మూలకప్రయోగము.

"మూలకస్య చ స్వరసః కదుష్ణః కర్ణపూరణే శ్రేష్ఠః॥"

ముల్లంగిదుంప స్వరసమును వెచ్చజేసి సుఖోష్ణముగ కర్ణపూరణము జేసిన కర్ణశూల శమించును. (సు-ఉ-అ 21.)

8. కఫవాతజ జ్వరమునందు మూలకప్రయోగము.

"హ్రస్వమూలక యూషస్తు కఫవాతాత్మకే హితః॥"

చిన్నముల్లంగితో సిద్ధముజేసిన యూషమును సేవించిన కఫవాతజ జ్వరము శమించును. (చ-ద.)

9. సిధ్మకుష్ఠమునందు మూలకప్రయోగము.

"శకురిరసేన సుపిష్టం మూలకబీజం ప్రలేపతః సిధ్మం నాశయతి"॥

ముల్లంగివిత్తులను ఉత్తరేణురసముతో మెత్తగా నూరి లేపనము జేసిన సిధ్మకుష్ఠము శమించును. (చ-ద.)

10. శీతపిత్తమునందు మూలకప్రయోగము.

"శుష్కమూలకయూషేణ । భోజనం సర్వదా కార్యం"॥

ఎండుముల్లంగితో సిద్ధముజేసిన యూషమును సేవించుచుండిన శీతపిత్తము శమించును. (చ-ద.)

11. విషూచికయందు మూలకప్రయోగము.

"బాలమూలస్య తు క్వాథః పిప్పలీచూర్ణ సంయుతః ।
విషూచి నాశనః శ్రేష్ఠః జఠరాగ్ని వివర్ధనః"॥

లేతముల్లంగిదుంపల కషాయమునందు పిప్పళ్లచూర్ణమును జేర్చి సేవించిన విషూచిక శమించును. జఠరాగ్ని వృద్ధిబొందును. (భా-ప్ర.)

12. శోథయందు మూలకప్రయోగము.

"మూలకం చ తిలేనాశు సర్వశోథహరం పరం"॥

ముల్లంగిని తిలలతో జేర్చి సేవించిన సమస్తశోథలు శమించును. (గ-ని.)

(6) యోగములు:—

1. మూలకాదిక్షారతైలము - (చ-త్రిమర్మీయ.)

ఉపయోగములు:—కర్ణపూరణము జేసిన బాధిర్యము, కర్ణనాదము, కర్ణపూయము, కర్ణశూల యివి శమించును.

2. మూలకస్వరసాదిఘృతము - (చ-వాతరోగ.) మాత్ర:-1 తులము.

ఉపయోగములు:—సమస్త వాతరోగములు శమించును.

3. మూలకాదితైలము - (చ-వాతరోగ.)

ఉపయోగములు:-అభ్యంగము జేసిన సమస్త వాతరోగములుశమించును.

4. శుష్కమూలాదితైలము - బృహచ్ఛుష్కమూలాదితైలము - మహామూలాదితైలము - (భైషజ్య-శోథ.)

ఉపయోగములు:—పానాభ్యంగములుగ నుపయోగించిన శోఫ, ఉదరము, శ్వాస, వ్రణశోఫ, అక్షిశూల, కామిల, పాండు ఇవి శమించును.

(7) Actions and uses:—(మూలకం) The seeds and leaves are diuretic, laxetive and lithontriptic. The root is used as an edible vegetable. All parts of the plant are used in urinary diseases and in cases of gravel.

R. N. Khory II P 63.

———

# వనౌషధ విజ్ఞానము

## (ద్వితీయ భాగము)

## అకారాది సూచిక

---

## ఇ

## క

## ఘ







## చ

ఛ



జ

ఝ



ఞ



ట



డ



ఢ



త

## ధ

## న

మ

## ల

వ

శ

వనౌషధి విజ్ఞానము 2-వ భాగమున
అకారాది పదసూచీ
సమాప్తం.

---



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B199 |
| పుస్తకం పేరు | వనౌషధ విజ్ఞానము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 577 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rehana |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |